

# బాల వ్యాకరణ వికాసవివేచనము

- డా॥ అంబడిపూడి నాగభూషణం

MOHAN PUBLICATIONS

Mohanpublication.com

Granthanidhi.blogspot.in



కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,
రాజమహేంద్రవరం – 533 101.

# బాలవ్యాకరణ

# విన్యాసవివేచనము



అంబడిపూడి నాగభూషణం

# మంగళాశాసనము



ప్రౌఢవ్యాకరణవ్యాఖ్యానవిషయానుశీలనమును సమగ్రముగా నొనరించి తద్జ్ఞులమన్ననల నంది నాగార్జునవిశ్వవిద్యాలయము నుండి ఇటీవలనే డాక్టరేట్ "పట్టాభిషిక్తుడైన" యాచిరంజీవి అంబడిపూడి నాగభూషణుడు ప్రచురించుచున్న నాల్గవగ్రంథమిది. బాలవ్యాకరణ సూత్రులు నర్థదీపికయు సిద్ధముగా నున్నవి.

వీనిలో నేనొక్కగ్రంథమును పరిశీలనగా జూచినను-ఈతనికి వర్ణనాత్మకాంధ్రవ్యాకరణములనుగూర్చి మాటలాడు నధికారము పరిపూర్ణముగా గలదనుట స్ఫురించితీరును. సత్యమట్లుండ - కనిష్ఠపక్షము-వ్యాకరణవిషయమున "అఆలు" వచ్చుననుట కివి చాలకపోవు.

బాలవ్యాకరణమునకు వెలువడినవ్యాఖ్యలలో వికాస మిట వలిది. ఇందు - అప్పటప్పటికిన్ సమస్తపద మనుట, గీర్వాదు లన్నయుపదేశ మతీతభాషాలక్షణ (?) మనుట పూర్వోత్తరపదము లవిచక్షణత లేకపోవుట మున్నగుదోషము లనేక మున్నవి. వీనిలో పెక్కులధికప్రసంగసంజాతములు. స్వతంత్రించి పలికినచో నెల్ల నివి యావద్వాక్య మున్నవి. సంప్రదాయపరిజ్ఞానమునకు దూరముగా రచింపబడినయిట్టివ్యాఖ్యలనుండి విద్యార్థులను రక్షింపక యుపేక్షించి యూరకుండుట శక్తులకును పరిపాటియైపోయినది. దీనికి కారణము లనేకము. నిజమునకు నాగభూషణుడు నల్లు మిన్నకుండెడివాడే. కాని పీసనట్లుండ నీనిదోషము గూడ నన్యత్రపర్యస్తమైయున్నది. ప్రవేశికతో పాటు సీతారామాచార్యులవారిసింహావలోకనమును గూడ నొక్కపరి చూడుడు. ఈసంధుకుణాపర్వమును నేను నెఱుంగుదును. కావున నీవివేచనమును రెండితలు జాగరూకతతో సాక్షరము జదివితిని. లేనిదోషముల నారోపించుట గాని, గోరంతలు కొండంతలు చేయుట గాని యిందు కన్పించలేదు. వికాసముపట్ల నంతటిప్రయత్నము నక్కఱలేదు. మీద మిక్కిలి గుణములను గుణములుగా ప్రశంసించుటయు జరిగినది.

మఱియు చిరంజీవి "ఒరులేయవి యొనరించిన..." అను సూక్తి నెఱిఁగినవా డగుట వ్యక్తిధూషణకు దిగజాఱక, వాక్పారుష్యమునకు తా వీయక, కర్తను గూడ ప్రక్కను బెట్టి, విషయవివేచనమునకే పట్టము గట్టి, ఆయాదొసఁగులపట్ల నిది యచ్చుతప్పు కావచ్చు, నిది చారిత్రికదృష్టి కావచ్చు, దీనితాత్పర్య మిదియే కావచ్చు ననుచు తెలిపి క్రమముగా మనసహాయింపు లిచ్చుకొనుచు, మిగిలినదే విమర్శకు స్వీకరించుచు సంయమనముతో సాగించినపద్ధతి పెద్దల ప్రశంసలందదగ్గది.

దీనిలోనిలోటుపాట్లను చెప్ప ననుచున్నాడు కావున నీసుధీవిధేయుఁడను, నామనఃపూర్వకాభినందనములోఁడు రెండిటితో బోణీ కొట్టెదను.

1. మాంగడలో నుత్తరపదము గద్ద యనుటను నిరాకరించుపట్టున (పు. 162) నేకార్థీభావసామర్థ్యమును సమన్వయించి యుండవలసినది.

2. "భటువు" సందర్భమున (పుట-210) శబ్దస్వరూపమును చర్చింపకుంట లోటే. "ఉంగరమునందున్నది" అనుసందర్భమున కావ్యభాషలో తుకియాదిగా భటువు లేకున్నలేదు. అది తృతీయాది. బటువు. స్త్రీసమము. పంపవువంటిది. "ఇల పుత్త్రికమునకు అక్రమవృత్తి" అని కాన మునేల మానగదు.

3. క్రియాలు వెడలిల- ఇత్యాదుల విషయమున (పుట-288) సహజోబలుపిసఖన్యుయును నపయోగించుకొనకుండుటయు లోటే. ఇవి పూర్వకాయమునైనామాహాన్నమావలె నేక దేశసమానములు.

ఉపయుక్తగ్రంథసూచికను సంకేతవివరణముతో చాలించితగా నీయకుంట మఱియొక పెద్దలోటు. ఆంధ్రవ్యాకరణమున కృతిభారిపరిశ్రమలను సంకేతాక్షరదిష్టము లైనయాయాగ్రంథములు చదువరి స్ఫురించు గాక. ఒకప్పుడు స్ఫురించవును. కావున నట్టి దిచ్చుట యస్మదాదుల ననుగ్రహించుట. పైగా గ్రంథనామమునకు సంకేతముగా నక్షరములను స్వీకరించుటలో నవిలంఘ్యమును సర్వసమ్మతము నైన నియమ మొక్కటు లేదు గదా!

తెలుగువ్యాకరణబాలవ్యాకరణాదికాలము లందలిదోషముల నుద్ఘాటించుటతో పాటు సత్యమార్గమును సాకల్యముగా నావిష్కరించు

బాలవ్యాకరణ



# వికాసవివేచనము



ఆంబడిపూడి నాగభూషణం

శ్రీనుతపుణ్యమహారాష్ట్రయుగ్రేష్ఠుఁ డగుచుఁ
బరఁగుసంగమేశ్వరరావు బావగారుఁ,
చెల్లి సౌభాగ్యలక్ష్మిని జెందు నీయు
దతులితాత్మీయతాస్ఫూర్తి నంకితముఁగ.

నములు గాని కానవచ్చును. అ.ఆ.క.కా. ఇత్యాదులు (90) అన్నది బా.వి. ఆద్యక్షర శేషంబున కనుచో 'క్రాం' మొత్తము నంట యిట్లు సమన్వితమగుచున్నది. అంతిమాక్షరంబునకు లోపం బనుచో ఇం చించు కేత్యాదిస్థలములందును నిట్లు వ్యంజన మక్షరాంగ మని నజ్ఝల వారును స్పష్టపఱచిరి. (వ్యా సం.వ. ౩౩) అట్టివ్యుత్పత్తితోనే సూరియు వర్ణములను నిర్ణయించుసందర్భమున నెచ్చటను నక్షరశబ్దమును బ్రయో గించియుండలే దనవచ్చును. కాని తె.వ్యా.వి. ప్రథమప్రకరణమున అక్షర (వర్ణ) సమామ్నాయ మని యక్షరవర్ణశబ్దములను బర్యాయ ముగాఁ జూపుచో బా.వి.లోఁ జేర్పఁబడ్డపై యంశమును గూడఁ బ్రస్తావించిన బాగుండెడిది.

## అచ్చు :

ఇది యెట్లేర్పడునదో వివరించుచు 'అఇఉణ్' మొదలైన మాహేశ్వరసూత్రములను జూపించి 'ఇందు చివరివర్ణములు ఇత్సంజ్ఞక ములు (అచ్చు పొరపాటుగా నున్న 'నిర్వర్ణము' లని యుండఁ జాలు. వర్ణకము లని లేనిపోనిసందేహము గల్పింప నేల?) వీనిలో నే దేని నొకదానితో ఇత్సంజ్ఞకము కాని మఱొకవర్ణకమును జేర్చి యుచ్చ రించినదో అది యొకసంజ్ఞ యగును. దానికి ప్రత్యాహార మని పేరు(౪) అన్నది. 'ఆదిరన్త్యేన సహేతా' యనుపాణినీయమునభిప్రాయము వర్ణించుట యిం దుద్దిష్ట మనవచ్చును. కాని వివరణ మసమగ్రముగా నుండుట నవర్థకముగాఁ బరిణమించినది.

ఇత్తైనదాని నిత్తు గానిదానితోఁ గలిపినఁ బ్రత్యాహార మగు నన్న నెట్లు? 'అఇఉణ్' అనుదానిలో ణకార మిత్తు. ఋఌలు ఇత్తులు గావు. కావున వీనిని గలిపి ణ్ఋఌ-అనుసంజ్ఞ ఏర్పఱుచుకొన వచ్చునా? అఇఉణ్ అనుదానిలోనే అఇఉలు ఇత్తులు గావు. 'ణ'

సంజ్ఞలు అనుకృతిగా అచ్, హల్ అనుకృతిగాఁ బ్రత్యాహారము తెలుఁగున సిద్ధింపఁజేయుటకు వీలు లేమి నిట్లకారాదు లచ్చు లని, కకారాదులు హల్లు లని వివరించె నని బా.వి. అభిప్రాయ మైయుండ వచ్చును. అట్టిప్రత్యాహారములు తెలుఁగున సిద్ధింపఁజేయవలె నన సంస్కృతమున మాహేశ్వరసూత్రమార్గమునఁ దెలుఁగునఁ గల్పింప వలె నది యసహజమే గాక యనవసరము నన వచ్చును. అట్లు కృత్యానుకృతివ్యవహారమున కవసరము తెలుఁగున లేదు. అచ్, హల్ అను వాని కైన నవి యెల్ల రెండుసూత్రములుగాఁ జెప్పవలెనా? ఆ సంజ్ఞ లనుట నవి సంస్కృతమునుండియే స్వీకరింపఁబడుట స్పష్టము. సంస్కృతమున నివి సిద్ధించియే యున్నవి గానఁ దెలుఁగునఁ బ్రత్యేకముగా సిద్ధింపఁ జేయవలసినయవసరము లేదు. సంస్కృతమునుండియే గ్రహింపవచ్చును. ప్రత్యాహారమార్గమున నేర్పడిన నామసంజ్ఞలచే నేవి బోధింపఁబడు చున్నవో యాశబ్దములచే నవి, అట్టివి బోధింపఁబడుటకు వీలుగా సూరి తెలుఁగున కుచిత మగుమార్గములో నుపదిష్టశేషము చేసి పైవట్లు వివరించుట బాగున్నది. ఇందుఁ బ్రత్యాహారమార్గమునఁ దెలుఁగున వీనిని సిద్ధింపఁజేయుట క్లిష్టత యని కాక యట్టివ్యవస్థితి తెలుఁగునం బ్రయోజనవంతము గామి ననఁగా సంస్కృతానువాదముగా గ్రహింపఁగా నిటఁ జెప్పుట యనవసర మగుటంబట్టి సూరి పైరీతి వివరించె ననవచ్చును.

## విసర్గము :

ఉచ్చారణమునుబట్టి వర్ణములను విభజించుచో బా.వి. కంఠ్యములను 'అకఖగఘఙహా' అనునవి చూపినది. ఇందు విసర్గ ముచ్చారపాటునఁ బోయియుండవచ్చును. 'అకుహవిసర్జనీయానాం కంఠః' అని విసర్గమును గంఠము స్థానముగాఁ బల్కఁబడునదే. అయిన

గులే. అచ్చ తెనుఁ గనఁగా సంస్కృతసమము లైన తెలుఁగులు గాకుండఁ గేవలము తెనుఁ గన్నమాట. అచ్చ తెనుఁ గనుటలోనే సంస్కృతసమము గూడఁ దెనుఁగే యనునర్థము తేలుచున్నది.

ఏ మైనను లాక్షణికులదృష్టిలోను ఆంధ్రము తెలుఁగు తెనుఁ గన్నవి పర్యాయశబ్దములే కాని విభిన్నార్థకములు కావని గుర్తింపఁదగియున్నది.

అన లాంధ్ర మన్న 55 వర్ణములభాష యే యని నిర్ణయింప వచ్చునా? 'సంస్కృతపదేన పరిమిత మాంధ్రపద' మ్మనుచో ఆంధ్ర మనఁగా సంస్కృతసమేతర మనియే సందర్భమును బట్టి యర్థము చెప్పుకొనవలయుట (తె.వ్యా.వి.186) గమనార్హము.

**తెనుఁగువర్ణములు:**

తెనుఁగునకు వర్ణములు ముప్పదియాఱను లక్షణమునకుఁ జిం. మూలమును ద్వివిధాదిదు దేదోతోఽచోవక్రతమా చాప్యనుస్వారా చ- యని మొదలుగాఁ జూపినది బా.వి. ఇది ముద్రితచిం.గ్రంథములు కొన్నింట నిట్లు యున్నది. కాని యిప్పాఠమున గణభంగ మేర్పడియున్నది. వఝ్జలవారు తమవ్యాఖ్యలో 'వక్రతమావధాప్యనుస్వారా' యను పాఠమును జూపిరి. (వ్యా.సం.స. 37) కాని 'వక్రతమావనుస్వారా' యనుపాఠము వఝ్జలవారే సంస్కరించినబా.స. (వావిళ్ల) ప్రతులం దున్నది. ఇంకను నీపాఠ మప్పకవీయమునను గానవచ్చు. కావున నవి యాధారముగా వఝ్జలవారిపాఠము గ్రహింపకున్నను వక్రతమావనుస్వారా యనునప్ప. పాఠము చూపఁదగును.

**దంత్యచజలు:**

దంత్యచజలు వర్ణమాలలోఁ బరిగణింపఁబడుటను విమర్శించుచు "దన్త్యచజలు తాలవ్యచజలకు సవర్ణములుగా ముందు 'నిరూపితము'

వానిని ప్రత్యేకవర్ణములుగా నిటఁ జేర్పనట యనవసర" (7) మన్నది. ప్రత్యేకముగాఁ బరిగణింప నక్కఱ లే దనుటకు సావర్ణ్య మొకకారణము కాదు. చింతామణియును 'మిథస్సవర్ణాః' యని చెప్పఁబోవుచును 'కగచజయుగ' యని వర్ణనిర్దేశములో రెండింటిని జేర్కొనెను. సంస్కృతమునను ఋౣవర్ణయోర్మిథస్సావర్ణ్యం వాచ్య మ్మని ఋౣలకు సావర్ణ్యము చెప్పఁబడినది. అయినను నేదో యొకటినె చెప్పఁ జాలు ననునభిప్రాయ మటఁ గానరాదు. అయిన నిక్కడ సూరి తాలవ్యచజలు దంత్యచజలకు గ్రాహకము లగుట సావర్ణ్యము నకుఁ బ్రయోజనముగాఁ జెప్పెను గాఁబట్టి పరుషసరళస్థానాలలోవలెనే వర్ణమాలలోఁ గూడఁ దాలవ్యములను మాత్రమే చేర్చినను నవి దంత్యములకు గ్రాహకము లగుటద్వారాన దంత్యములపరిగణన మనవసర మవు నని భావించియుండును.

కాని తాలవ్యచజలకు భిన్నముగా దంత్యము లైన వున్న వన్నవిషయము ముందుగాఁ జెప్పియుండవలెను గదా. పిదప నవి సవర్ణము లనుటకు. దంత్యచజలను బృథగ్వర్ణములుగాఁ బరిగణింపవలసిన యవసరమును శాస్త్రీయముగా వ్యాఖ్యాతవారు నిరూపించిరి. అయినఁ బృథక్పరిగణన మక్కఱ లే దేమో యనుట కాధారము వేఱుగాఁ గాన్పించు. (సూ. బా. సూ.)

అన లిట్లు చెప్పుటలో బా. వి. తెనుఁగునకు వర్ణములు 34 అని చెప్పినఁ జాలు నని భావించినదా? ఋౣలసావర్ణ్యమును బ్రస్తా వించుచు నవి పృథగ్వర్ణములే యనునభిప్రాయమును వ్యక్తము చేసి దంత్యతాలవ్యములసావర్ణ్యము నట్టిదే యని సూచించుచు 'ఉచ్చా రణమునందు తౌల్యము లేకున్నను సవర్ణత్వము వ్యాకర్త కొన్ని ప్రయోజనములకై విధింపనగు'(10) నన్నది బా. వి. కాఁగా నీసవర్ణత

ప్రయోజనాంతరము నుద్దేశించి చెప్పఁబడిన దనియు సంత్యతాలవ్యములకుఁ జౌల్యము లే దనియు సముచితముగా బా.వి. నిర్ణయించినది. అనఁగాఁ దెలుఁగునకు వర్ణములు (34) అని చెప్పవలె ననునభిప్రాయము బా.వి.కి లే దనవచ్చు. ఇవి పృథగ్వర్ణములే కాని వర్ణమాలలోఁ బృథక్పరిగణన మనవసర మనుట వర్ణమాలాపరిగణనప్రయోజనమును దీర్చు నెట్లు? కాఁగా దంత్యచజలను లాక్షణికులు వర్ణమాలలో నిర్దేశించుట యుచితమే యని దీని స్పష్టము.

సవర్ణములుగాఁ జెప్పుటచే దంత్యములను బరిగణింప నక్కర లేదా? అఇఉణ్ణిత్యాదిమాహేశ్వరసూత్రములలో "తత్కాల (ఇద్వర్ణములకంటె) వర్ణములచే వానిసవర్ణములైనదీర్ఘాదులు గూడ గ్రహింపఁబడు" నని బా.సి. పేర్కొన్నది. సవర్ణము లగుటవలన గ్రహింపఁబడునా? అయిన నారి సంస్కృతప్రాకృతాంధ్రవర్ణమాలలలో దీర్ఘములు చూపుట గూడ ననవసరమే యగునా? దంత్యచజలు పేర్కొనుటొక్కటే యేల యనవసరము?

ఈసూత్రమునకువలె మాహేశ్వరసూత్రములకు వర్ణమాలానిర్ణయమే ప్రయోజనము గా దనుట స్పష్టమే. బా.వి. పైవివరణము ననుసరించిన వర్ణమాలలో హ్రస్వములుమాత్రమే పేర్కొని ఊకాలోఽజ్ఝ్రస్వదీర్ఘప్లుతః, అణుదిత్సవర్ణస్య చాప్రత్యయః యనులక్షణముల యభిప్రాయమును నవసర మగుమేర గ్రహించి వేఱుగా సూత్రింపవలెను. వర్ణనిర్దేశ మనునుద్దిష్టప్రయోజనమునుబట్టియు నట్లు చెప్పుట గౌరవమే కాని ప్రయోజనవంతము గాదని లాక్షణికమార్గమును గుర్తింపదగు.

**అనాంధ్రవర్ణములు:**

అచ్చాంధ్రమునందు లేనివర్ణములు సంస్కృతసమముల నుండియే కాని ప్రాకృతమునుండి రా వని ప్రాకృతసమములందు లే

'ఇద్ధరిత్రి' ఇత్యాదులను సమన్వయించినది. (522) అట్లైనచో 'అర్ఝున' అని యుంటయే పొరపాటు దీనికి ఒర్ఝు అనుదానితోఁ బ్రాస మెట్లు? ఇదియు ఒజ్ఝ అనియో యుండునా? ఇది ప్రాకృతసమ మైన వచ్చ తెనుఁగు. కాన వత్తుతోఁ గూడిన జకారము దంత్యము 'ఝ' కారము దంత్యమా? దంత్యజకారతాలవ్యఝకారముల సంయుక్తాక్షరము నె ట్లుచ్చరింపవలె. ఇట్టి ప్రయోగమును ప్రమాణీకరించి ఝకారమునకు దంత్యత చెప్పికొనుటయా? అనాంధ్రవర్ణములు ప్రాకృతమునుండి సంగ్రహించుట కిది యెంత యుపకరించును?

డంభ మన్నది తెనుఁగుకవులు ప్రయోగించిరి. దంభ మని యుండవలసియుండ డంభ మనుట తెలుఁగుకవుల స్వాతంత్ర్య మనక తప్పదు ఈ దంభము ప్రాకృతసమ మనుటకుఁ బ్రాకృతమున నెట్టి స్థల మున్నదా? తెనుఁగుననుగల డంభము ప్రాకృతసమ మని సూ.చి. పేర్కొనలేదు.

బా.వి. అనుబంధము దీనితో పాటు కావు తివర అనువానిని గూడఁ బ్రాకృతసమములుగనే చూపినది (414) వజ్ఝలవారు వీనిం గూర్చి విపులముగా బరామర్శించిరి. అది గ్రంథాంతరమునఁ బరామర్శింపఁబడుచున్నది.

కాఁగాఁ గవిప్రయోగముల ననుసరించి యనాంధ్రవర్ణములు ప్రాకృతమున నున్నవి యని ప్రాకృతసమములందు నిలుపుట లే దనియు నట్టివర్ణములు సంస్కృతసమములనుండియే చేరు ననియు లాక్షణికులు పేర్కొనుట సముచిత మని గుర్తింపఁదగును.

## స్థిరము :

'స్థిరము లనఁగా మార్పు చెందనివి. ద్రుతము మీఁది పరుషములు సరళము లగును. ఆసరళములను బరుషములను గావించుకొని

యర్థమును గ్రహింతుము. పరుషసరళములవలె మార్పు చెందనివర్ణములు స్థిరములు' అన్నది. బా.వి. తె.వ్యా.వి. కూడ (21) నిట్లే చెప్పినది.

ఇందులో సరళములకు మార్పు గల దనుట కాధార మేది? పరుషాలు సరళాలు కాఁగా సత్వము గ్రహించుటకొఱకై యాసరళములను బరుషములుగా మార్చుకొనుటయే సరళాలకుఁ గల్గుమార్పనసత్వము పొసఁగట్లుచున్నది. ఇటువంటిదానిని మార్పనుట సహజము గాదు. అదే నిజమైనఁ బరుషములు ప్రథమ మీఁద నున్న గసడదవ లగును అక్కడను సత్వము చేసికొనుపద్ధతి పైవిధముగనే యుండక తప్పదు గదా. అప్పుడు సరళలు మాత్రము స్థిరము లెట్లయిన వని సందేహము గల్గక తప్పదు.

ఆం.వ్యా.వి. (144) ఈవిధముగనే సందేహించినది. కాని దీనినిగుఱించి యింతకు ముందే పీఠికావ్యాఖ్య 'ఈపరిణామము పరుషములకువలె సార్వత్రికము కాకపోవుటచేతనే స్థిరములను గొన్నిమొదల మార్పులేకు లోనైనను నాయవి స్థిరము లనుట యుచితమే'(12) యున్నది. ఇది బాగుగనే యున్నది. రావణుఁడు గీవణుఁడు వంటి యుయు దైవస్థలములలో మార్పున్నను ప్రాచుర్యము ననుసరించి స్థిరముగా మార్పు లేకుండ నుండునవి స్థిరా లనుటలో దోషము లేదు. కాని పరుషాలు సరళాలుగా మారుటయే వర్ణింపఁబడినది. కాని సరళము లెట్లు మారును? చదువుకొనునప్పుడాదేశసరళములను బరుషములుగా మార్చుకొనుట యున్నది సరళముల మారుపాటును నిర్ణయింపఁజాలదు. శబ్దములో సహజముగా నున్నసరళవర్ణాలు (పరుషాలు సరళాలైనట్లుగా) మార్పుచెందుట యున్నదా యున్నది గుర్తించి వివరింపవలె.

శబ్దాలలోఁ గూడ యక్కజము మొదలైనచోట్లఁ దాలవ్యేతరస్వరములతోఁ గూడినచజలు తాలవ్యములుగా నుచ్చరింపఁబడుట గలదు. సూత్రాంధ్రవ్యాకరణములో సూరి 'అక్కజాదిషు' అని సూత్రించి యిందలితాలవ్యతను జేర్కొనెను. కాని యందులోఁ దాలవ్యముగాఁ జూపిన జడను బాలలో దంత్యముగాఁ జూపెను. ఏ మైనను శిష్టోచ్చారణమును నిరూపించుటయే వ్యాకర్తలకర్తవ్యము. కాని దానిని నియమించుటకు వీలు లేదు. ఇది పదాదియకారాదులవంటియంశముగా దని గుర్తింపఁదగును. అట్లు స్వీకరించుచో సూరి సూత్రాంధ్రమునఁ జెప్పిన యక్కజము, జడ మొ॥ వానిలోఁ దాలవ్యమే కలదనవలె.

అయినను సంస్కృతసమములవిషయమున భేదము చెప్పఁబడినది గదా. వ్యాకరణపరిజ్ఞాన మున్ననే కాని యది గుర్తింప వీలు లేదు. అట్టియుచ్చారణమును కనుగుణముగా దంత్యతాచిహ్నముంచుట యవసర మని నిర్ణయించుటలోఁ దప్పు లేదు. ఇది యెరసున్నకంటెఁ దీసిపోలేదు గదా. దంత్యచజ లెట్లును బృథగ్వర్ణములుగా నంగీకరింపక తప్పనప్పుడు తాలవ్యచజలతో నభిన్నముగాఁ జూపిన వానిపృథక్త్వము వ్యక్త మవుటకు మాత్ర మెట్లు? కాని దంత్యతాచిహ్నము నుంచకపోవుటయే ప్రసిద్ధి. అయినను నట దంత్యముగా నుచ్చరించుటయు స్పష్టమే. అందుకే చిహ్న మపేక్షితమైన దేమో. కాని యంతమాత్రమున గుర్తు చదా దని చెప్పుట సాహస మగు నేమో.

చింతామణిలో లిపికి సంబంధించినకారికలు ప్రక్షిప్తా లనుకొన్నను నప్పకవికిఁ బూర్వమే యీకారికలు వ్రాయఁబడియుండు నని తప్పదు. 'దన్త్యచజా గురలోచ బిన్దుయుతౌ' అని యఘుకేఫఁకార

ములకువలె దంత్యచజలకుఁ గూడఁ (తాలవ్యచజలకుఁ) బైని బిందు వుంచుట యనుభేదము చెప్పఁబడియున్నది. తాలవ్యచజలకు భిన్నముగా దంత్యతను గుర్తింపఁజేయుచిహ్న మొక్కటి యవసర మనునభిప్రాయ మప్పకవికి **ముందే గుర్తింపఁబడిన** దనుట స్పష్టము. కాని యది యుపేక్షింపఁబడినది. దానిని స్వీకరించినఁ బాఠకునకు సౌలభ్య మధిక మనవచ్చును. లక్షణానుగుణముగ నట్లు దంత్యతాచిహ్నము నిల్పిన నాపిదపటివారికి తడఁబాటున కవకాశ ముండదు కదా.

**సావర్ణ్య ప్రయోజనము :**

దంత్యతాలవ్యచజల కున్నసావర్ణ్యతకుఁ బ్రయోజనమును ఛందోవిషయములో ముడి పెట్టుట యుక్తము గా దని తె.వ్యా.వి. పేర్కొనుట యుక్తముగా నున్నది. కాని ఈసంజ్ఞకు వ్యాకరణ ప్రయోజనము నూహించినవాఁడు చిన్నయసూరియే యనఁదగును. (70) అనుట సంగతముగా లేదు. కవిశిరోభూషణములో 'సూత్రద్వయే సవర్ణాద్యభ్యాతే దంతిజౌ చజౌ సా సంజ్ఞైవ తయో స్తేన నాన్యా సంజ్ఞా ప్రవర్తతే'- యనుశ్లోక మున్నది. ఇది యథర్వణునిదిగా నహోబలుఁడు చెప్పలేదు. అహోబలుఁడే రచించె ననుకొన్నను పైసవర్ణతాప్రయోజనమును మొదటగాఁ గనిపెట్టినవాఁడు (వికృతి వివేకకర్త గా కున్నను) చిన్నయ కాఁబోఁడు. అయినను నహోబలుఁడు నంతకు ముందు లాక్షణికులు నదే విధముగాఁ జెప్పుటవలనఁ గావచ్చుఁ గొందఱు తెరువాతివ్యాఖ్యాతలును నిట యతిప్రాసలనే వివరించుట జరిగినది.

యతిప్రాసమైత్రి ప్రయోజన మని బాలసరస్వత్యాదులు భ్రాంతిపడి రని రమణీయము పేర్కొన్నది (157) దీనినిబట్టి బాలసరస్వతి యట్లే భావించె ననవలసియున్నది. తె.వ్యా.వి. ఈయభి

ప్రాయమును స్పష్టముగాఁ జెప్పినది (70) కాని దీనికిఁ దగినయాధారము బా.స.లోఁ గానరాదు. సాధర్మ్యమునుబట్టి యవలలకు యతిప్రాసమైత్రి నుదాహరించెనే కాని బా.స. పినిసవర్ణతకుఁ బ్రయోజనమది యని చెప్పలేదు. 'చక్కఁదనము లోకజయవైభవమును, రాచవాడు వడసి రాచరించి, చెలువ నద్రికన్య సేవించువారికి జూడఁ గన్గొననసాధ్య మొద్ది! (10 పుట. ఆం.సా.ప. వావిళ్ల. 15) అని చూపిన పద్యము దంత్యములు, తాలవ్యములతోను దాలవ్యము దంత్యముతోను గూడియుండు నని చెప్పుటయే యుద్దేశింపఁబడినట్లు పద్యమందలి 3,4 పాదాలు స్పష్టము చేయుచున్నవి. కాఁగా స్పష్టముగాఁ జెప్పకపోఁగా తెలక సైత్వములు నుండుటకు నుదాహరణముగా నిచ్చిన పద్యమునుబట్టి వాని ప్రాముఖ్యమునకై యతిప్రాసస్థలములను జూపినంతమాత్రమున బాలసరస్వతి సవర్ణతకుఁ బ్రయోజనము యతిప్రాసమైత్రియే యని భ్రమపడె ననుట సమంజసము కాదు గదా. అయిననాతఁడు వరుసగసవర్ణసంజ్ఞాల సిద్ధించుట యనునట్టి ప్రయోజనమును జెప్పలేదు. ఒకతీరుగా సవర్ణతకుఁ బ్రయోజనము నిర్దేశింపలే దనుటయే నొప్పను. లక్ష్య 'ఋద్వర్ణానాం వ్యాఘ్రస్వరద్రకః' అన్నదానికి మాత్రమే సంబంధించిన దైయున్నట్లు చెప్పఁ గొప్పను. కాని యివి పది తప్ప మిగిలినహల్లులు స్థిరము లనుటలో దంత్యచజలు స్థిరములయ్యెడి ప్రమాద మేర్పడిన దనిమాత్ర మంగీకరింపక తప్పదు.

అప్పకవిసైత మీసవర్ణతకు యతిప్రాసమైత్రియే ప్రయోజన మని స్పష్టముగాఁ జెప్పలేదు. ఇంక 'నిసిఁ దెలియ కున్న విశ్రమభంగంబు దోఁచెరి కావ్యముల దోష మొదవు (అప్ప. 2-117) అనుటలోను చలము మాని కుడువు చట్టి కేశవ (119) యని యుదాహరించుటలోను సవర్ణతకుఁ బ్రయోజనము యతిప్రాసమైత్రి యని

చెప్పినట్లు భావించుట కవకాశము చాలదు. ఇంక చైవులనాకిరిచాయ మగఁడు, చక్కెరబొమ్మకున్ మార్మలయు చైవుల ననుకృతిదోషము గల్గు నని హెచ్చరించుటయే యవ్వాక్యముల నుద్దేశ మనఁదగు.

ఇంక నిట నప్పకవి చూపినయతిప్రాసప్రయోగములనుబట్టి యహోబలుఁడే భ్రాంతిపడి యతిప్రాసమైత్రియే సవర్ణతకుఁ బ్రయోజనముగఁ జెప్పె నేమో.

తె.వ్యా.వి. బాలసరస్వతీయాప్పకవీయములతో పాటు వాసుదేవవృత్తియు ననుసరించి యహోబలుఁడట్లు చెప్పె నన్నది. 'దన్త్యస్య చాద్యభాషా తాలవ్యస్య చ అన్యోన్యం యతిప్రాసయోః సావర్ణ్యం భవతి' యను వాసుదేవవచనముఁబట్టి (70) చూచిన నహోబలు నభిప్రాయమున కిది మూలముగాఁ జెప్పవచ్చును. కాని ఆం.వ్యా.వి. గ్రంథస్థోదాహరణములనుబట్టి వాసుదేవవృత్తి కవిశిరోభూషణము నకుఁ దరువాతి దని (437) నిశ్చయించినది. దీనివలనఁ తె.వ్యా.వి. అక్కడక్కడ అహోబలపతి వాసుదేవవృత్తి ననుసరించె ననుట (7) సరి గా దనవలసియుండును.

ఏ మైనను సవర్ణతకు యతిప్రాసలమైత్రి ప్రయోజన మనుట లోనిభ్రాంతికి మూల మహోబలుఁడో యితరుఁడో యగు నని గుర్తింపఁదగును. (దీనితో పాటు) 'సూత్రప్రాయ' శ్లోకమును దానై రచించె నన్న నహోబలుని కీవిషయమునఁ బ్రత్యేకస్థానము తప్పదు. బాలసరస్వత్యప్పకవులుమాత్ర మట్లు స్పష్టము చేయలే దనియు నా వ్రాఁతలమూలమున నితరులే యట్లు భ్రమించియుండుట కవకాశము గల దనిమాత్రమే చెప్పఁదగియున్నది.

సవర్ణతవలన దంత్యచకారము పరుష మగుటయు దంత్యజకారము సరళ మగుటయు మాత్రమే ప్రయోజనముగా

భావింపరాదు. సూరివివరణమునుబట్టి తాలవ్యచజల కేయేకార్యములు విధింపఁబడినవో యవి యెల్ల దంత్యచజలకు వచ్చుట ప్రయోజనము. ఇట్లు విధింపఁబడినపరుషసరళసంజ్ఞలు దంత్యచజలకుఁ గల్గుట యన్నది యట్టివానిలో నొకటియే. ప్రథమమీఁదిపరుషములకు గసడదవలు బహుళంబుగా నగు ననులక్షణముతోఁ దాలవ్యచకారమునకు విహితమగు సకారము దంత్యచకారమునకు నగును. అతఁడు + చనియె - అతఁడు సనియె. అయ్యది యీసవర్ణతవలననే గదా సిద్ధించునది. ఇట్లు యథావకాశముగా నాయైకార్యములు తాలవ చజలకు విహితములైనవి దంత్యములకు నగుట గ్రహింపఁదగును.

**అనునాసికము – బిందువు:**

బా.వి. 'దన్త్య' అని మొదలుగా నిట ననునాసికమును వ్రాయుట విశేషము. 4 సూత్రము శ్లోకములోన సూరి పఙ్క్తి యని వ్రాయుటనుగూర్చి 'పఙ్క్తి' అనుపదమును పంక్తి అనియు తెలుఁగున వ్రాయనగును. ఙకారము తద్వర్గాక్షరములకుఁ బూర్వమందే యుండును (ర) అన్నది. ఇటుఁ గకారమునకుఁ బూర్వము ఙకారమున్నది పఙ్క్తిలో. ఙకార ము దున దిటువంటిచోట్లనె. కాఁబట్టి సూరి యది చూపె నని వివరణాభిప్రాయము గుర్తింపవచ్చు. ఇతే మిత్యాదిగాఁ గోశములు స్వతంత్రముగాఁ ఙకార ముంటను జూపుచున్నవి కాని యట్టిది తెనుఁగునఁ గావ్యములలోఁ బ్రయుక్తము లైన దేమో చూడవలె. ఇంతకును బైని పఙ్క్తి యనుచోటఁ బంక్తి యనియు వ్రాయఁగ నగుటలో పఙ్క్తి యని వర్గానునాసికముతో వ్రాయుటయు నొప్పు ననునభిప్రాయ మేర్పడినది. బహుశః అందువలనే 'దన్త్య' యని యనునాసికమును వ్రాసియుండవచ్చును. నిజమునకుఁ దెలుఁగున ననుస్వారము వ్రాయుట నియతము చేయవలసినయవసర

అనుకరణాదిసందర్భముల సంస్కృతము నట్లే తెలుఁగున వ్రాయునపు డిట్లువర్గానునాసికము వ్రాయవలయును. అలఙ్కార యనె. మొ॥ సంస్కృతసమముగాఁ దెలుఁగైన మాత్ర మనుస్వారమే యుంచవలయును. అట్లని లక్షణము చెప్పఁబడలేదు. కాని చెప్పుట యవసరము.

## ద్రు త ము - మీఁ ద స్వ ర ము :

చింతామణికిని చిన్నయమతమునకును భేదమును నిరూపించుచు "న్-ను, ని చింతామణినిరూపణము. ను-న్, ని చిన్నయసూరినిరూపణము. క్రొత్తగా స్వరమును జేర్చుటకన్న ఉన్నస్వరమును లోపింపఁజేయుట లాఘవము కావచ్చును. (15) అన్నది బా.వి. ఇట్లనుటనుబట్టి పొల్లునకారమే ద్రుత మన్నచింతామణి దానిపైని క్రొత్తగా స్వరమును జేర్చిన దని చెప్పిన ట్లయినది. కాని చింతామణిలో నెక్కడఁ గాని ద్రుతముమీఁదస్వరము చేరుటను జెప్పినజాడ గానరాదు. బా.వి. తనవివరణమున కాధారము చూపినదియుఁ గాదు.

కాని యూపైని ద్రుతప్రకృతికముల కచ్చు పరమైన-ఉత్వ సంధి ప్రవర్తిల్లును. అది గౌరవ మగును (16) అన్నది కాఁబట్టి ద్రుతము పొల్లునకారమే యనవలయును. సిద్ధాంత మేమియో స్పష్టము గాదు. ఉత్వసహితమే యనుట యెట్లు? ఇత్వసహితము గూడ వచ్చితిని + అనెను, ఉండెడిని + అతఁడు అనుస్థలములలో నిత్వము ద్రుతము గాదా? అక్కడఁ గ్రియాపదంబులం దిత్తునకు ననుసూత్రమునచే సంధి వికల్పముగా రావలె. సంధి రానిపక్షమున యడాగమము వచ్చి వచ్చితిని యనె ననునీతిగా నవరూపములు గూడఁ గావలసివచ్చును. ఉత్వసంధియొక్క గౌరవము నంగీకరించినను నిత్వసంధియొక్క వస్థము నంగీకరించుట యెట్లు? అయిన బా.వి. సంధి లేకపోవుటయే కావింప

యడాగమము రా దని యిక్కడనే చెప్పినది. వత్తున్ వచ్చెదన్ అనువిధముగాఁ బొల్లునకార మున్న యడాగమము రానిమాట నిజమే. కాని వచ్చితివి + అనెను అను-చో స్వరముకంటె స్వరము పర మగుట గలదు గావున సంధి లేనప్పుడు యడాగమము రాక తప్పు టెట్లు?

ఇంతేకాను నుత్వసంధి చేసిన గౌరవ మగును గాఁబట్టి మాన వలె నని యభిప్రాయమా? పొల్లుగా నుండునా? గౌరవమో లాఘవమో తరువాతిసంగతి గాని యసలు సంధి వచ్చుట కవకాశ మేది? ఇఁకారాదులకుఁ దప్ప ద్రుతప్రకృతికములకు సంధి లేదని సంధి సిద్ధము గాఁగా వచ్చును + అతేఁ డని యున్నప్పు డుత్వమునకు మాత్రము సంధి చేయు టెట్లు?

## ద్రుతప్రకృతికాలు:

ద్రుతప్రకృతికా లేవో చెప్పుచున్న సూరివివరణమును 7 అంశాలుగాఁ జూపినది. బా.వి. i. నామవాచకములు క్రియలు (iiv) సర్వనామములు (vi) అవ్యయములు (vii) అనువానిలో నేవి ద్రుతప్రకృతికములో పైనిరూపణమునుబట్టి గ్రహింపవలయును. (16. బా.వి) అందులో మొదటిదిగలను 'ప్రథమాకయిపట్టినొక్కతరములయినదిభక్తు' లన్నది. ఇది 'నామవాచకము'లకుఁ బరిమితము చేయుట యెట్లు? vi. నేనుతానుపదము లన్నది. నన్నున్, నాచేతన్ నాకొఱకున్ అనునవి లగునవి మొదటియంశముచేత ద్రుతప్రకృతికములు గావా? సూరి యట్లే యుదాహరించెనే. వానిన్ మనలన్ ఇత్యాదులసంగతి యేమి? కావున నిది 'నామవాచకములకే' పరిమితము చేయరాదు. రెండునుండి మైదువఱ కున్నవి క్రియ లనియు నేడవ దవ్యయములలో నేవి ద్రు.ప.లో చెప్పుచున్న దనియుఁ

కళ యనుసంజ్ఞ యంతసార్థకము కాదు. (17) అని బా.వి. పేర్కొనుటలో ద్రుతప్రకృతిక మనుసంజ్ఞ గొంతెయు సార్థక మను నభిప్రాయము స్పష్టము. అది సమంజసము కాదు. (చూ.ద్రు.) మొదటనే కళ యన్నది రూఢసంజ్ఞగా బా.వి. కైకొన్నది. (1 పుట.)

## ఖండబిందువు - పూర్ణము :

హ్రస్వముమీఁదిఖండబిందువునకు (సంజ్ఞా. 14) అనుసూత్ర వివరణములో 'సూత్రమునందు పదాదియందలి హ్రస్వమా? అనాది యందలి హ్రస్వమా? పేర్కొనకున్నను లక్ష్యములనుబట్టి అనాది యందలి హ్రస్వముమీఁదిఖండబిందువే యని సమన్వయ మగును. పదాదిహ్రస్వముపై ఖండబిందు వుండ దని ముందు వివరింపఁబడును (సంధి. 22) అన్నది బా.వి. (18) ఇదే యభిప్రాయము తె.వ్యా.వి.లో 'పదాదియందు కానిఖండబిందువు పూర్ణబిందువు కూడ కావచ్చును. (67) అని యున్నది. ఆదిలోనా యనాదిలోనా యన్నప్రశ్న పుట్టుటయే యనవసరము. అది పైవివరణమునుబట్టియే స్పష్టము. లక్ష్యములనుబట్టియే యైన ననాదియం దని చెప్పుట దేనికి? పదాదిని హ్రస్వముమీఁదిఖండము పూర్ణము గా దనుటకా? అట్లు చెప్పుట యవసరమా? పదాదిహ్రస్వముమీఁద ఖండబిందు వుండ దని తరువాత బా.వి. చెప్పినదే కద. తదనుసారముగాఁ బదాదిహ్రస్వముపై ఖండబిందువే లేనట్టియపుడు దానికిఁ బూర్ణము రా దని చెప్పుట యసందర్భము కాదా? అనఁగా ననాదియందే గాక శబ్దమునం దెచ్చట నున్న దైనను ఖండము పూర్ణ మవు నని చెప్పుదము. ఇబ్బంది యే మున్నది? పదాదిహ్రస్వముమీఁదఁ గూడ రావలసి వచ్చునేమో యనుట కట ఖండబిందు వున్నఁ గదా.

అనఁగా వ్యవస్థ చేయుట విభాషాపదమునకే గాని వైకల్పికమునకుఁ గూడ నన్నమాట. వైకల్పికశబ్దమునకు వ్యవస్థ చేయుట బాల.లో నింకొకచోట నవసర మేమో పరిశీలింపవలసియున్నది. వైకల్పిక మన్నది 'విభాషా'శబ్దమునకుఁ బర్యాయమే కదా. సంస్కృతవ్యాకరణములందు నిట్టివిభాషాపర్యాయశబ్దములకు వ్యవస్థ చేయుట లేక పోలేదు.

పాణినీయమున 'శాచ్ఛోరన్యతరస్యామ్' (7-4-41) అనుచో అన్యతరస్యా మనుపదము ప్రయుక్తము. దానివృత్తిలో శితః శాతః వ్యవస్థితవిభాషాత్వాత్ వ్రతవిషయే శ్యతేర్నిత్యమ్. సంశితం వ్రతమ్ సంశితో బ్రాహ్మణః వ్రతవిషయకయత్నవానిత్యర్థః అని చెప్పఁబడినది. ఇట వికల్పార్థక మైనయన్యతరస్యా మనుదానికి వ్యవస్థ చేయఁబడుట స్పష్టము.

వా ల్యపి (6-4-35) అనుదాత్తోపదేశానాం వనతితనోత్యాదీనా మనునాసికలోపో వా స్యాల్ల్యపి. వ్యవస్థితవిభాషేయమ్. తేన మాన్తానాం వా. నాన్తానాం వనాదీనాం చ నిత్యమ్. ఆగత్య ఆగమ్య. ప్రణత్య ప్రణమ్య. ప్రహత్య ప్రనుత్య. ఇట వాశబ్దమునకే వ్యవస్థ చేయఁబడుట స్పష్టమే కదా. వా శబ్దమునకు వ్యవస్థ చేసియుట వ్యవస్థితవిభాష యని వ్యవహరింపఁబడుట గమనార్హము.

ఇట్లు సంస్కృతవ్యాకరణమున విభాషార్థక మగు 'వా'ఇత్యాదులకు వ్యవస్థ చేయుట యుండుట ననుసరించి యిట్టిది సంస్కృతసంప్రదాయసిద్ధ మగుటచేతనే వాశబ్దమునకు నహోబలుఁడు వ్యవస్థ చేయుట గమనింపవచ్చును. వా.౭౬ః – అనుసూత్రవివరణమున పౌన్నాను... వంటలక్క ఇత్యాదీనాం సంధే రేవ సుందరత్వాద్వ్యవస్థితవిభాషయా సంధే ర్నిత్యత్వం జ్ఞేయ (కవిశి. 277) మ్మనెను. కాఁగా విభాషకుఁ

పర్యాయములై వికల్పార్థకము లగుశబ్దములకుఁ బ్రవృత్త్యప్రవృత్తులను వ్యవస్థ చేసికొనుట సంస్కృతసంప్రదాయానుసారముగాఁ దెలుఁగు లాక్షణికులు వివరించి రని గ్రహింపవచ్చును. అనఁగా ప్రవృత్త్యప్రవృత్తులను నియమింపవలయునో లక్షణమున విభాషాపదమే యుండవలె నని తెలుపరా దనియుఁ బర్యాయములకును వ్యవస్థ చేయఁదగు ననియు గుర్తింపఁదగును. తెనుఁగున బ్రాయఁబడుచో వా అన్యతరస్యా మనునవి ప్రయుక్తములు గా వీలు లేమి వికల్పము ప్రయుక్తమైన దానికి వ్యవస్థ చేసికొనుట విరుద్ధము గానేరదు గదా.

కాఁగా వ్యవస్థచేయుట యవసర మనవలెనే కాని యట్టి యవసర ముండుచో విభాష (అన్యతరస్యాం వా) అనుదానికిఁ బర్యాయ మయిన వైకల్పికశబ్దమునకు వ్యవస్థ చేసికొనుటలో నిబ్బంది లేదు. కావున వ్యవస్థ చేయవలసియున్నది గావున విభాష యని చెప్పఁదగు నన నక్కఱ లేదు. వాక్యార్థక మగు వైకల్పికశబ్దమునకే వ్యవస్థ చేసికొన్నను నది సంప్రదాయవిరుద్ధ మనుటకు వీలులేదు గాన.

అని యింతకును నియమింపవలసియున్న దేమి? అనఁటి - అనంట్లు అనుచో సంయోగము పూర్ణమునం దున్నపూర్ణబిందువు కను ఖండబిందువు రా దనియా! అసలు పూర్ణమునకు ఖండ మెట్లు వచ్చును? ప్రస్తుతసూత్రముచే నారి ఖండమునకుఁ బూర్ణమును గదా సాధించియున్నాఁడు. అట్టిచో నిల 'నంట్లు' అనుచోఁ బూర్ణమునకు ఖండము గాకుండరా దనుటలో ననౌచిత్యము లెట్లు గుర్తింపవచ్చును.

1. పూర్ణమునకు ఖండము విహితము గాకుండఁగాఁ బ్రాప్తింపక యుండుటఁ బూర్ణమునకు ఖండము రాకుండఁ జేయవలయు ననుట నొకటి. 2. పోనీ యెట్లో యట్లు చేయవలయు నన్న (విభాషా పద. మునకు) వ్యవస్థ చేయవలెనే మని? పూర్ణమునకు ఖండము రా

దని. ఇది సూత్రోక్తము గాని నిత్యకార్య మనవలె. విభాషాస్థలమున నిత్యకార్యమును వ్యవస్థ చేయుట లాక్షణికసంప్రదాయముగాఁ గానరాదు. అయినను జరుగు కార్యమును నిత్యకార్యముగాఁ జెప్ప వచ్చును గాని లేనిదాని నట్లు చెప్పు టెట్లు? 3. పోనీ యట్లే చేసి నను ప్రస్తుతసూత్రము హ్రస్వముమీఁద ననుటచేఁ దేంట్లు మొద లైనదీర్ఘముమీఁది స్థలములలో సంయోగపూర్వమున ఖండ ముండ వచ్చు నని చెప్పకచెప్పెను. 4. పూర్ణమునకు ఖండము రా దనుటకు మొదట నట్టఁ బూర్ణము సిద్ధమై యుండవలయును గదా. (సాధ్య ఖండమునకుఁ బూర్ణము చేయు స్థితి మిక్కిలి యుండును. ఇది లేదు.) అనంట్లు అనుచోఁ బూర్ణము నుండ దన్నదా! అయిన అనంటి అని యేకత్వమున నుండవలె. కాని పూర్ణమునకు ఖండము నిషేధక ఖండమునకుఁ బూర్ణము విధించుట పొసఁగ దన్నమాట. (బా వి. 18)

కాఁగా వ్యవస్థ చేయఁదగిన యావశ్యకము లే దని యెసనుం జనముగాఁ జేర్చె నని వారికి దెల్పెను. ఇట్లు గాక హ్రస్వముమీఁద ఖండబిందువు సంయుక్తపరక మైనచోఁ బూర్ణబిందువు నిత్యముగా నగు నని వ్యవస్థ చేయవలెనా? అట్లయినఁ దీర్ఘముమీఁద నెట్లు? దీర్ఘముమీఁద సామాన్యములలో ఖండబిందువు పూర్ణబిందు వగుటకు సూత్రమున నాధారము లేదు గదా. కావున నియమము వ్యవస్థ చేయుట సర్వత్ర ప్రయోజనవంతము గా దనక తప్పదు.

ఇక లిఖితయుక్తము వ్యవస్థ చేయవలసినయవసర మున్నదా యన్నది ముఖ్యవిషయము.

ఖండబిందువు హ్రస్వముపైనిమాత్రమే వికల్పముగాఁ బూర్ణ మగును. కాని సంయుక్తపరక మైనపుడు హ్రస్వదీర్ఘములు రెండింటిపై నిత్యముగాఁ బూర్ణ మగును. అందుకే గదా. 'సమాసపదంబులందు

సంయోగంబు పరం బగునప్డు ఖండబిందునకుం బూర్ణం బగు' నని సూరి ప్రత్యేకవిధానము చేసెను. ఆవిధానము ననుసరించియే సంయుక్తపరకత్వమున ఖండబిందురూప ముండ దని స్పష్ట మవుచుండఁగా నాయర్థము సూత్రమునందు నియమించుకొనవలసినయవసర మేమి? అట్లు నియమించుచో నాయర్థ మిటనే సిద్ధించుచుండఁగా 'సమానపదంబులం' దనుసూత్రము వ్యర్థమే కదా. ఉత్తరశేషమున కయినను గాగమద్రుతమునకు సంశ్లేషము లే దని సూరి విభాషను నియమించెను. మఱల సంశ్లేషము లే దని సూత్రించెనా? ఇట నట్లు వ్యవస్థీకరించుచో సంయోగపరకతయందలిపూర్ణవిధానముఁ బ్రత్యేకముగాఁ జేయ నేల? సంప్రదాయసిద్ధముగా నర్థము నియమించుకొనుటవలనిప్రయోజనము సూత్రము వేఱొకటి వ్యర్థ మగుట యన్నమాట. కాఁగా నిట్టివ్యవస్థ యుక్తికి నంగీలచే నది యసమంజసము.

ఇక్కడనే తె.వ్యా.కి. 'పూర్ణబిందువుపైనే సంయోగముండును'(88) అని పేర్కొన్నది. పైన అనవలె నని, పైన అనుట వ్యాకరణసమ్మతము కా దని బా.వి. (150) స్పష్టము చేసె. ఇట నచ్చుపొరపా టనుకొందము. పూర్ణబిందువుపైనే సంయోగ ముండు ననుట స్వరూపవర్ణనముగా స్పష్టతకుఁ జెప్పిన నుచితమే. అవియు వ్యవస్థ చేయఁదగినయంశమే యనుచో నసమంజసమే.

ఇట బా.వి. 'ఇది సిద్ధాంతము దీనిఆధారములో పూర్ణబిందువు సాధింపఁబడినది కావున నిది సాధ్యపూర్ణము. ఇట్టిసాధ్యపూర్ణము హ్రస్వముమీఁదనే యేర్పడును గాని దీర్ఘముమీఁద నేర్పడదు. పైసూత్రము నిషేధమును గావించుచున్నది (18) యన్నది. ఇట్లనుటలోఁ బ్రస్తుతసూత్రముచే సిద్ధాంతమునకే పూర్ణబిందు వవు నని బా.వి. తలఁచినట్లు స్పష్ట మగుచున్నది.

నిట సిద్ధముగాఁ జూపిరి. అట ఖండబిందు వెట్లు చేరినదో (చేరకున్న మగటి + ఇమి మగఁటిమి యెట్లగు) వివరింపరైరి.

యథాప్రయోగ బుగ గ్రాహ్యంబు లనుచో మగసిరియొక్క భావమునందు మగఁటిమి యను పదమును ప్రయోగానుసారముగా నిటఁ బ్రత్యయాదు లేవో వ్యాకరణముచే సాధింప శక్యము లే దని సూరి తలంచెనా? అట్లగుచో నది సిద్ధమై ప్రస్తుతసూత్రస్థముఁ జూపుట యొప్పును. కాని యిపుడు మగ(ని)+టిమిక్, మగటి ఇమి ఇత్యాదిగా నిరూపించుటకు వీలు లే దనవలయును. కాని యథాప్రయోగముగా గ్రహింపఁదగు నన్నఁ బ్రత్యయాదినిరూపణ మవసరము లే దనుట యొప్పునా? చెలికారము ఇత్యాదుల నిట సూరి చూపె. చెలికార మన్నదానిలో 'ము' ప్రథమైకవచన మనుట స్పష్టము. ఇయ్యది యింకను బరిశీలించి నిర్ణయింపఁదగినదే. ఇప్పటికి సూరి దీని నిటఁ జూపకున్న నుచిత మని తోఁచుచున్నది.

అయ్యవజ్ఝలవారును ఈ 14 సూత్రము కేవలము సిద్ధబిందువిషయకమే యనుట (112) విచార్యము. ఇట నుదాహరించినవి సిద్ధఖండము లని చెప్పియుఁ జేటికావాక్యము లుద్ధరించుటచేఁ జేటికాభిప్రాయమే తె.వ్యా.వి.కిని గల దని స్పష్ట మగుచున్నది. అది సరి గాదు. సూత్రమునందు ఖండబిందువున కని సామాన్యముగాఁ జెప్పఁబడినదే కాని సిద్ధఖండమున కనలేదు. కావున సాధ్యఖండమునకు నవకాశము గల్గినఁ బూర్ణబిందువు రావచ్చును. దానికి సూత్రము విరోధింపదు. కాని సాధ్యస్థలముల ఖండపూర్ణబిందువులు రెండు నున్నపుడు రెంటిని శాస్త్రము విధించునే కాని ఖండమును జెప్పి దానికిఁ బూర్ణమును జేయుట లేదు. అది యనవసరగౌరవము గదా. రాము + డు(జ్) అనుచో జిత్వమువలన ఖండపూర్ణములు రెండు

నవును. కావున సాధ్యఖండమునకుఁ బూర్ణము నిటుఁ జేయవలసిన యవసరము సాధారణముగా నుండదు కాని యొకానొకచో నుండ వచ్చును. మానార్థమున నెడుప్రత్యయము విహితము. ఇట్లే ఇఁడి. ఇందు ఖండ మున్నది. ఇది సాధ్యఖండమే యనక తప్పదు గదా. 'మానెండు, పిలిచిండి జుత్తెంటు' అనుకీతిరూపములకయి సాధ్యఖండము నకుఁ బూర్ణము నీసూత్రముచేఁ జేయవలసియున్నది. కాఁగా నిట సిద్ధఖండమునకే పూర్ణము విధింపఁబడిన దని నిరాధారముగా నిర్ణ యింపరాదు. యథావకాశముగా సాధ్యఖండమునకును బూర్ణబిందువు చేయవచ్చును. అది లక్ష్యానుగుణమే.

ఇట్లేర్పడినపూర్ణము సాధ్య మనుట సముచితమే. ఇట్టి సాధ్యపూర్ణము దీర్ఘములమీఁద నేర్పడ దని పైసూత్రము నిషే ధించుచున్న దనుట యనవసరము ప్రస్తుతసూత్రము ప్రాప్తము మీఁదిఖండబిందువునకే పూర్ణవిధానము జెప్పుచున్నది. కావున దీర్ఘము మీఁద నున్నఖండమునకుఁ బూర్ణబిందు వగుట కీసూత్రముచే వీలు లేదు. అట్లు చెప్పఁబడినా మొకటి వేఱ లేదు. పూర్ణబిందు విట్లు ప్రాప్తింపకయె ప్రాప్తమును నిషేధ మేల? పైసూత్రము నిషే ధించిన (దీర్ఘముమీఁది) తావులు వేఱు.

'ఇట్టిసాధ్యపూర్ణ' మనుటలో ఖండబిందువునకుఁ జేయఁబడిన పూర్ణబిందు వనియే ప్రకరణానుగుణముగా బా.వి. అభిప్రాయము స్పష్టము. సాధ్యపూర్ణ మిట్టిది గాకయుఁ గలదు. నాముందు, మాసెం గలుగు లక్ష్యముల నున్నపూర్ణబిందువు ఖండమునకుఁ జేయఁబడినది కాదు. అట్టిసాధ్యపూర్ణమునే పైసూత్రము దీర్ఘముమీఁద వారించు చున్నది. దీర్ఘముపైని ఖండమునకుఁ బూర్ణప్రాప్తి లేమి నట్టిదానిని పైసూత్రము నిషేధింపదు. అట్టియవసరము లేమి.

**దీర్ఘము మీఁద :**

దీర్ఘముమీఁద సాధ్యపూర్ణము తో నను సూత్రమునర్థమును వివరించుచు బా.వి. 'దీర్ఘముమీఁద నున్నసిద్ధ ముగు ఖండబిందువును సాధ్యపూర్ణము చేయరా (18) దన్నది. కేవలప్రయోగవ్యాఖ్యయు నిట్లు భావించిన ట్లున్నది (38) అయిన నీసూత్రము వ్యర్థమే. నిషేధము ప్రాప్తిపూర్వకము కావలెను గదా. దీర్ఘముమీఁద నుండు సిద్ధఖండము పూర్ణముగా ననుటకు నస లెక్కడ ఖండమునకుఁ బూర్ణము ప్రాప్తించు చున్నదా? హ్రస్వముమీఁదనే చెప్పుచున్నది. కాఁబట్టి దాని ననుసరించి దీర్ఘముమీఁద నున్నఖండమునకుఁ బూర్ణము ప్రాప్తింపదు. కాఁబట్టి ఖండబిందు వట్లె యుండును. దానిపూర్ణమును రా దని చెప్పు నసూత్రము వ్యర్థము కాదా? ఎక్కడ నేఁ బ్రయోజన మున్నదా! దీనివలన నింకెక్కడ నయినను దీర్ఘముమీఁదఁ బూర్ణము ప్రాప్తించి నను వారించుటలో నీనిషేధము పర్యవసించును (అనఁగా ఇత్యాదులతే కాని) తేంట్లు ఇత్యాదుల నసాధువులు చేయఁగలదు. వఁగి యేఁగి యనుచోట సంధి లేనిపద్ధతి నిట స్మరింపఁదగును.

చింతామణిలక్షణమును మూలముగా సమన్వయించు ప్రయత్నమువలన నిక్కడ నీపొరపాటు గల్గియుండవచ్చు. ఇంతకు ముందు సూత్రమునొద్దనే బా.వి. దీర్ఘముమీఁదిఖండమునకుఁ బూర్ణము వచ్చుటను దరువాతిసూత్రము నిషేధించుచున్నట్లు పేర్కొన్నది.

సూత్రార్థమును జెప్పుచున్న బా.వి. వాక్యము గూడ సముచితముగాఁ గానరాదు. దీర్ఘముమీఁద నున్నసిద్ధఖండమును సాధ్యపూర్ణము చేయరా దనఁగా (దీర్ఘముమీఁద నున్నను హ్రస్వముమీఁద నున్నను సాధ్యఖండమునకుఁ బూర్ణము సాధింపరాదు గదా. బా.వి. వివరణమునుబట్టి) నర్థ మేమి? సిద్ధపూర్ణము చేసికొనుట

యుండదు గదా. చేసిన దెల్ల సాధ్యమే యగును గాఁబట్టి, ఖండము నకుఁ బూర్ణము చేయుచుండ నది సాధ్యమే యగుచుండ సాధ్య పూర్ణము లే దనుట దేనికి? ఇంతకుముందు సూత్రమున సూరి ఖండ బిందువునకుఁ బూర్ణబిందువు వచ్చు ననాఁడు గాని సాధ్యపూర్ణము వచ్చు ననాఁడా? బా.వి. చెప్పఁదలఁచుకొన్న యభిప్రాయ మొక వేళ సూత్రకర్తకే యున్న 'దీర్ఘముమీఁదఁ బూర్ణము గా'దని మాత్రమే చెప్పియుండెడివాఁ డనియు నట్లులే చెప్పవలె ననియు గ్రహింప వలెను. ఆయుక్తి మనవసరము గాఁబట్టి యట్లు చెప్పవలె ననుకొనఁడు.

పూర్వసూత్రమునొద్ద సాధ్యసాధక వక్ష చేసి యనాది ప్రాప్త మని నిర్ణయము చేయుటకు లక్ష్యములు ప్రధానాధారముగా భావించిన బా.వి. ప్రస్తుతసూత్రమునొద్ద తద్యుక్తమును లక్ష్యములలో సమన్వ యింపకపోవుట గమనింపవచ్చును. సూరి యిక్కడ దీర్ఘములమీఁదఁ జూపినఖండబిందు వొక్కటియు సిద్ధము గాదు. వాఁడు పేఁడు, రాఁడు లేఁడు, కాఁబోలు కాఁబట్టి, గోఁగులు రేఁగులు. ఇందలిఖండము లన్నియు సాధ్యములే కదా. సిద్ధఖండమునకుఁ బూర్ణము రా దన్నప్పు డాసిద్ధ ఖండ మట్లు యుండుట చూపవలెఁ గాఁబట్టి చీఁకటి, పేఁపు, కూఁతు రనురీతిసిద్ధఖండస్థలముల నీవలె. లక్ష్యముల ననుసరించియు బా.వి. చేసినయుక్తము సూత్రానుగుణము కా దని స్పష్టము.

బా.వి. ఇంతకుముందు సూత్రమునొద్ద 'దీర్ఘముపై సిద్ధఖండ బిందువు- వాఁడు పేఁడు, వీఁకి' (20) అని చూపినది. ఇందు వీఁక యను చోట నున్నది సిద్ధఖండమే. అపఁడువలోవలె. కాని వాఁడు పేఁడు అను-చోట్ల నున్నది సాధ్యము గదా. తత్వమునకు ఫలితముగా బిందువు వ్యాకరణముచేత సిద్ధించినది. కాఁబట్టి యది సాధ్యమే కాని సిద్ధము కాదు. ఇది సిద్ధబిందు వని పొరపడుటవలననే యిట దీర్ఘముమీఁది

ఖండము పూర్ణముగా దని బా.వి. భావించియున్న దేమో. ప్రకృతి సిద్ధమైయున్నదే సిద్ధబిందువు. ప్రత్యయాదికముచేత వ్యాకరణము వలన నది సాధ్య మగును.

ఇట్టి (సాధ్య) బిందువే సాధారణముగా దీర్ఘముమీఁద నిషేధింపఁబడిన దని సూత్రాభిప్రాయము ప్రసిద్ధమే. అందుకే మీఁగడ ఇత్యాదులలో ఖండముమాత్రమే యున్నది. సాధ్యపూర్ణ మని సామాన్యముగా సూత్రము చెప్పుచుండఁగా బా.వి. సిద్ధఖండమును సాధ్యపూర్ణము చేయరా దని చెప్పియు మీఁగడ ఇత్యాదులలోఁ బూర్ణబిందువు నీసూత్రముచేతనే వివరించుట జరిగినది. అక్కడ ద్రుతమునకుఁ గదా బిందువు వచ్చినది. ఇక్కడ నిషేధించినది ఖండబిందువున కగునది. కాఁగా ద్రుతమునకు కగుదాని కభ్యంతర మేమి? ఖండమున కగుదానికే గాక యితరవిధమున నగుపూర్ణమునకును నిట్టి నిషేధము విధించిన సరిపోయెడిది. అట్లు చెప్పకుంటవలన ఖండమునకుఁ గాక యితరమున కగుపూర్ణము దీర్ఘముపై నుండవచ్చు నని యర్థము వచ్చును. మీఁగడ, క్రేఁగాలు ఇత్యాదులు సాధువులు కానవలెను. దానిని వారింప నిం కొకవిధి లేదు గదా. ఇట్లు దీర్ఘము మీఁద సాధ్యపూర్ణ ముండున వకాశ ముండఁగా బా.వి. "దీర్ఘముమీఁద ఖండబిందువుమాత్రమే యుండవలె"నని (20) స్వవచోవిరుద్ధముగఁ జెప్పినదనవలె.

దీనినిబట్టి దీర్ఘాక్షరము మీఁద నుండెడి యరసున్న అరసున్న గానే యుండును. నిండుసున్న గాదు. వాఁడు పేఁడు అనురీతి తెలుఁగువ్యాకరణకర్తలవ్రాతలను బురస్కరించుకొని యీసూత్రము చెప్పె (౪2) నని తె.వ్యా.వి. చెప్పుట సూరిప్రణాళికకు భిన్న మైన దని గుర్తింపవలెను.

దీర్ఘముమీఁద సాధ్యపూర్ణము లేదనుటచేత దీర్ఘముమీఁద సిద్ధపూర్ణ మున్నదని చెప్ప వలసియున్నది. వ్యాకరణము ప్రసక్తి యున్న సాధ్యపూర్ణమునుగుఱించి ప్రసంగించుటయే యవసరము. అయినప్పటికి నదే సమయములో సిద్ధబిందువు కూడ లేనిపక్షమున 'దీర్ఘముమీఁదఁ బూర్ణము లే'దని సాధారణముగాఁ జెప్పనవును గదా. మూఁగడ ఇత్యాదులలో సాధ్యపూర్ణము వారింపఁబడుటయే కాక సిద్ధపూర్ణము గూడ దీర్ఘముమీఁద నుండ దనువిశేషార్థము కూడ సిద్ధించును గదా. కాఁగా సాధ్యపూర్ణము లేదనుటవలన సిద్ధపూర్ణమయినచో దీర్ఘముమీఁద నుండవచ్చు నని గ్రహింపవచ్చును. కాంచు మొదలగున విట్టివి. ఎక్కడ ఖండబిందువుతో రూపాంతర ముండదో యక్కడిపూర్ణము సిద్ధ మనవచ్చును సామాన్యముగా హ్రస్వముమీఁద నైన దీర్ఘముమీఁద నైనను. బంతి, కాంచు అను చోట్ల బఁతి కాఁచు అనురీతి నుండదు గదా. వాంచు మొ॥ చీఁకటి ఇత్యాదుల నరసున్న గలచోట్లఁ బూర్ణబిందువుతో రూపాంతరము లేదు.

దీర్ఘముపై సిద్ధపూర్ణబిందువునకు బా.వి. కాంత శాంతి యన్న వుదాహరించినది. కనియుండు దీర్ఘముపై బిందు వుండుట సంస్కృతమునందలిదే. ఇంకను సంస్కృతమున శాస్త్రా వాస్తి యని యనునాసిక ముండఁ దెలుఁగున నట ననుస్వారము వ్రాయుట సంప్రదాయము గాన బిందు వవును. దీనిని వ్యాకరణము సాధింపలేదు. అట్లయిన నిది సాధ్యపూర్ణమే యగును. లక్షణగ్రంథము లిట్లు పదాద్యంతమునకుఁ బూర్ణబిందు వగుట విధించినదే బా గుండెడిది. వది నో మైనను మిగిలినయున్న బిందువులకు నాచ్ఛికములకుఁ జెందినవే చూపిన బా.వి. యిటఁ గూడ సంస్కృతీయమును గాక యాచ్ఛికరూపమునే యిచ్చిన బా గుండెడిది. రాముఁడు అనుచో నది సంస్కృతసము

## బిందుస్థితి :



సంస్కృతసమేతరశబ్దాలలో పరుషసరళములకుమాత్రమే ముందు బిందు వుండు నని సంజ్ఞా 16 సూత్రము చెప్పుచున్నది. బాలవ్యాకరణములో నాసూత్ర మనేకసందర్భములలో వర్తించు ననుచు బా.వి. (నానాం డనుదానితో పాటు) పండ్లు కాండ్లు అనుచోట స్థిరపరకబిందువు లేదు గాబట్టి డాను శాదేశము లే దనువిషయమును ప్రస్తావించినది. కాని యిక్కడ వైరుధ్యము గుర్తింపవలసియున్నది. నాండు+నాం డనుచోట సంశ్లేషాక్షరము లోపించినపిదప బిందువునకు స్థిరము పర మైనది గాబట్టి బిందు వుండరాదు గాన లోపించినది. అదే విధముగా పండ్లు కాండ్లనుచోట్లను డాను శాదేశము రావలసినదే. వచ్చినపిదప స్థిరపరకబిందు వుండరాదు గాన లోపింపవలసినదే. పండ్లు అని కాదు గాని పళ్లు అని యగును. అంతే గాని శాదేశము లే దను టెట్లు? నానాం డనుచో సంశ్లేషాక్షరము లోపించిన బిందువు స్థిరపరకము కావున లోపము రా వలెనా? ఇట శాదేశము రా వనుటకు? అటు లోపము చేసి స్థిరపరకత చే బిందువు లోపింపజేయుటగా నిట స్థిరపరకత సంభవించు నని శాదేశము రా దనుట యెట్లు? ఇందుకే నాండు అని ప్రత్యేకముగా నిర్దేశించుటచే లోపము చేయకతప్పదు గావున నట్లు చేయవలసివచ్చిన దనుకొనుటకు వీలు లేదు. తీగ తీవ, నాండెము నాణెము అనుచో నవ్వాని ననుసరించి కార్యము విధింపబడలేదు గదా. ఈ వైరుధ్యము నాలుగసూరియభిప్రాయ మేమో పరిశీలనార్హము.

తె.వ్యా.వి. పద్యాంతసానుమునందును సమాసమునందును బిందువు లే దని పూర్వాహ్ణాంతసూత్రము (99) అని చెప్పి 'అపరాన్తే సమాసే చ శబ్దే నో బిన్దురిష్యతే' ... సమరవిధికిం గరుణానిధికిన్

(6)

(కరుణాంబుధికిన్ అని పాఠము) 'సమాసే కేంఽదమ్మి' యనునహోబలుని పంక్తుల నుద్ధరించినది. 'నో బిన్దురిష్యతే' యనుచోట బిందువు లే దని యర్థము చేయుట కవకాశము లేకపోలేదు. కాని యహోబలపంక్తుల నుద్ధరించునప్పు డ ట్లర్థము చేయరాదు. 'సమాసే కేంఽదమ్మి' అను సందర్భాన సమాసములో బిందు వున్న దని యహోబలుఁడు చెప్పుచున్నాఁడు. తె.వ్యా.వి. లే దని యర్థము చేయుచుఁ బై యహో. పంక్తుల నుద్ధరించుట స్వవచనములకుఁ బ్రమాణ మగు టెట్లు? విరుద్ధము గదా. శబ్దే-నః. బిందుర్విష్యతే. నః - నకారస్య యని యర్థము చేసి బిందువు వచ్చు నని యహో. అర్థము చేసెను. అందువలననే అపరాంతమున ననఁగాఁ బద్యసమాప్తియందుఁ గారికచే బిందువు విధింపఁబడినట్లు కాఁగా నది యెక్కడ నుండదు గాఁబట్టి 'అపరాన్తః పద్యసమాప్తిః తత్ర స్థితస్య బిన్దుః తస్య న ప్రయోగప్రసిద్ధిః (కవిశి. 318) అన్నాఁడు. పద్యావసానములో బిందువు లే దన, బిందువు లేమి ప్రయోగప్రసిద్ధము గా దనుట విరుద్ధము కాదా?

పద్యావసానములో బిందువు లే దనులక్షణమునకు లక్ష్యముగా తె.వ్యా.వి. 'కరుణానిధికిన్' అని చూపినది. కాని యహోబలుఁడు 'కరుణాంబుధికిన్' అనుదీని నీకారికకు నుదాహరింపలేదు. 'పద్యభేదావసానేషు శిష్టతా నస్య కథ్యతే' యనుకారిక కుదాహరించినాఁడు.

బిందువు తద్వర్గపంచమాక్షరములకుఁ బ్రతినిధి యని అది తెలుఁగున వ్యంజనమే కాని స్వరము కా దని దీనివలన తెలియును అన్నది (21) బా.వి. పరుషసరళములకుముందే యుండు ననుటచే న ట్లూహింపఁబడుట స్పష్టము. వర్గపంచమాక్షరములకు బదులుగా వ్రాయఁబడున దగుట నీయది వ్యంజన మన్నమాట. కాని వర్గపంచ

మాక్షరములలోను గానములు దెలుఁగున నున్నవి. కాని సూరి దీనిని స్వరములలోనే చేర్చెనే. చిం. కర్తృప్రభృతులు నిట్లే కదా. నిజమునకు వ్యంజనముగాఁ జెప్పిన రాముఁడు ఇత్యాదుల సంధ్యాదిప్రసక్తి లేక పోవుట యను ప్రయోజనమే కల్గు నని తోఁచు. దీనింగూర్చి నిశిత ముగఁ బరిశీలించి నిర్ణయింపవలసియున్నది. అయ్యది వ్యంజనమునకుఁ బ్రతినిధిగా నిల్చుచున్నది గాన నది వ్యంజనమే యని నిర్ణయించుట మాత్రము విచార్యమే.

పరిస్థితలక్షణముచే స్థిరపరకబిందుస్థలమున నాశబ్దము సంస్కృతసమ మని గుర్తింపఁదగు నని బా.వి. పేర్కొను టుచితముగా నున్నది. 'పరుషసరళములకు ముందు బిందు వున్న ఆచ్ఛికమా? సంస్కృతసమమా? నిర్ణయింపఁజాలము. (21) అనుట విశేషము. స్థిరపరకబిందుస్థలమునవలెఁ బరుషసరళపరకబిందుస్థలమున నాశబ్దమును వెంటనే సంస్కృతసమమో యాచ్ఛికమో గుర్తింప నవకాశము లేదనియే యభిప్రాయము. అంతమాత్రమున నెట్లును నిర్ణయింపలేము అని తలంపరాదు. అచ్చతెనుఁగునం దున్న వర్ణములు సంస్కృతసమములందును జాలవఱ కున్నవి గాదా. ఆవర్ణము లచ్చతెనుఁగునను గల వని యవి సంస్కృతసమమో యాచ్ఛికమో నిర్ణయింపఁ జాలమా! ప్రకృతినిబట్టి సంస్కృతానుగుణముగా నది సంస్కృతసమమో తద్భిన్నమో గుర్తింపవచ్చునే.

శబ్దముసంబంధివర్ణములనుబట్టి గుర్తింపలే మనిమాత్రమే బా.వి. అభిప్రాయమై యుండును. నిర్ణయింపవలసివచ్చుచో మాత్రము వర్ణస్థితిమాత్రమే ప్రమాణముగాఁ జేసికొనరాదు గదా.

## వు వూ వొ వో :

అప్పకవికి లభించిన చింతామణిప్రతిలో ప్రథమాస్థానే (యు) పదాదియం దుండ వలెను. వువూవొవోలవిషయము పేర్కొనఁబడ

లేవు....ఉ,ఊ ఒఓలతోఁ గూడిన తెనుఁగుపదములుండ వనియు సూరి నిరూపించె(23)ననుటలో ఋౠఌౡలు లేవనియు సూరి విశేష ముగాఁ జెప్పిన ట్లభిప్రాయ మేర్పడినది. కాని బా.వి. అటనే యంతకు ముందు క్వచిదపి నస్త ఋదోతౌ వంతేష్వభవన్త్యవికృతిశబ్దాదౌ (అప్ప. ఆం.చిం. II - (13) అని యప్ప. చిం.లో ఋౠఌౡలు లే వని చెప్పు లక్షణమును దాని కప్ప. వివరణము సమర్ధించియే యున్నది. ఇటుఁ గేవలము తద్విరుద్ధముగా వ్రాయుట ప్రామాదికముగా గుర్తింపఁ దగును.

**ణ కా ర ము :**

"పదాదిని ణకార ముండ దని అప్పకవీయములో నిచిన్తామణి పేర్కొన్నది. ళకారము గూడ నుండదు గదా (24) యని బా.వి. అ శ్లేషవర్ణము లెట నెట నుండునో యుండవో భాషాశాస్త్రజ్ఞులు నిరూపించుచున్నా రనియు నందుచే భాషాగ్రహణము సుకర మగు ననియుఁ బేర్కొన్నది. దీని నిట్టియంశములను సూరియు నిరూపింపవలసిన దనునభిప్రాయము వ్యక్త మగుచున్నది. అప్ప. చిం.తో పాటు వి.పి. కూడ 'వికృత్యాదౌ భవే న్నణః' అని పేర్కొనెను. సూరియు వికృతిపదాది ణమ ళలు లేమి నాం.శ.శా.లోఁ బేర్కొనెను. శ. ల. సం.లో సంయుక్తాక్షరముల విశేషములను వివరించెను. కాని యట్లు చెప్పుట యనవసర మని గుర్తించుటచేతనే బాల.లో దాని నుపేక్షించె నది యుచితము. ఉచ్చారణమునం దేర్పడిన దోసఁగును వారించుటకో అకే చిం. అద్యః క్రియాసు అని సూత్రించుటయు సూరి యకారమును ఋౠఌౡలును లే వనుటయు జరిగినది. పదాదిని ణకారము ళకారము మొ॥ లే వని చెప్పవలసినయవసర మేర్పడినపుడే శబ్దశాస్త్రము చెప్పవలసియున్నది. అట్టియవసరము లేదు. శబ్దమునం దేయేవర్ణము

లెట నెట నుండునో నిరూపించుట శబ్దశాస్త్రమునకు నవసరము గా దనుట శబ్దశాస్త్రము లన్నింటినిబట్టి గుర్తింపవచ్చును. (సూ. బా. సా.)

## లఘ్వలఘువులు :

యరలవలకు లఘ్వలఘుభేదమును తెలుఁగులాక్షణికులు చేర్కొనిరి. చింతామణి వీనిని లఘువు అలఘువు నని పేరుకొనుట సమంజసము గా దనియు మూలములో లఘుప్రయత్నతర మని యున్నది గాఁబట్టి యట్లే చెప్పవలె ననియు బా.వి. తెలిపినది. అనఁగాఁ జింతామణి యలఘువుగాఁ జెప్పినదానిని లఘుప్రయత్నతర మని చెప్పవలయు ననియు బా.వి. అభిప్రాయము స్పష్టము. కాని తె.వ్యా.వి. 29 పుటలో వివరణము గమనించిన నది యసమంజస మని స్పష్ట మగును. 'లఘువకారలఘుయకారములు శాకటాయన మతమునం దాదేశము లగు నని యీ (వ్యోర్లఘుప్రయత్నతరశ్శాకటాయనస్య) సూత్రార్థము' (29) అనియుఁ బిదప వ్యాఖ్యానికలో 'అన్యమతమునం దీయకారవకారములు అలఘూచ్చారణములు' అనియు (29) అన్నది. 'లఘూచ్చారణే స్థానకరణశైథిల్యం జాయతే' యనుకాశికావృత్తి, మే లైనది యనుచు లఘూచ్చారణమునకు వ్యతిరేకముగా గురూచ్చారణ మనుటకన్న అలఘూచ్చారణ మనుటే స్పష్ట మనియు తె.వ్యా.వి. (29) పేర్కొన్నది.

ఈలఘ్వలఘువులనుగూర్చి కొన్ని వివాదములను బా.వి. ప్రస్తావించినది.

ఆగమముగా వచ్చినయకారము లఘు వన్న సందర్భ మెక్కడ ఇత్యాదులను లఘువులే కావలె. అక్కడ లఘ్వలఘుభేదము చెప్పక పోవుటను గూర్చినసందేహ మొకటి. కాని యదాగమయకారము లఘు వనుటలో నాగమముగా వచ్చిన దెల్ల లఘువే యని సామా

న్యముగా నిర్ణయించుట యెట్లు? ఉచ్చారణమునందు లఘుత్వ **మున్న** నాగమమే యేల? తద్భిన్నము**మాత్రము** లఘు వని చెప్ప వలదా?

లఘూచ్చారణ మాగమముగా వచ్చినయకారమునందుఁ గలదు గాన నది లఘు వని నిర్ణయించెను. **కాఁగా** రుక్కు ఇత్యాదులు నాగమములు గాన లఘువు లని చెప్పవలె ననుట విచార్యము. ఇంక నందు లఘూచ్చారణము గలిమి **గు**ర్తించి యుండుటవలన నవి లఘువు లని చెప్పవలసియున్న దన్న నొప్పను.

'యడాగమ మన్నపు డాగమము లఘు వైనది కాఁబట్టి వకారమువిషయమున నా**దే**శముగా వచ్చినది లఘు వని చెప్పుట యన్యాయ్య మనుటయు సమంజసముగా లేదు. వాఁడు, వంకాయ యనుచోట్ల నున్నవకారమునకంటె నిద్ర వోయె ననుచోట నున్న **వకారము** లఘూచ్చారణము గలిగియున్న దనుట విరుద్ధమా? లఘూచ్చారణము గలిగినదానిని లఘు వని చెప్పక య**కా**రము విషయమున నాగమము లఘు వన్నాము గాఁబట్టి యితరవర్ణాల విష**య**ము లోను నాగమమే లఘు వనవలె ననుట న్యాయ్యమా?

'మాప్రాఁవు' అనువిశేషముగా నాగమముగా వచ్చిన వకారము లఘు వగుట న్యాయ మున్నది. బా.**వి.** ఇది శాబ్దికసంప్రదాయము **కాదు. మా**ప్రా రనురీతిరూపాలు లక్షణవిరుద్ధాలు గాఁబట్టి గ్రామ్యములు. **మా** + ఊరు అని యుండఁ నాగమ మవునది యకారము **మా**యూరు వకారము నాగమముగాఁ జెప్ప**కుం**డఁగనే యాగమవకారము లఘు వనున వకాశము లాక్షణికుల కేది?

లోకవ్యవహారమును మాత్రము దృష్టియందుంచుకొని బా.వి. ఇట్లు నిర్ణయించిన **దేమో** అయినను 'మాప్రారు' అనుచోట

వకార మాగమ మనుట యెట్లు? మా + ఊరు మావూ రని యైనదా? లాక్షణికులు తెలుఁగుమాటలకు మొదట వువూవోవోలు లే వన్నను వుండు, వూరు అనువిధముగా జనవ్యవహారములో విన్పించును. మావూ రన్నదియుఁ గావ్యవ్యవహారమున లేదు గదా. అట్టియప్పుడు మావూ రనుచోట మా + ఊరు అని యుండుటయు వకార మగు ననియుఁ జెప్ప టెట్లు? అనఁగాఁ బక్షాంతరమున నైనను మావూ రనుచోట నున్న వకారము శబ్దగతమే యగును గాని యాగమము గా నేరదు. ఆగమ మనవలె నన్న 'ఊరు' అని యుండవలె ముందు. వ్యవహారమునుబట్టియే నిర్ణయించిన నట్లుండునా? ఇది లాక్షణికమార్గమును గాక వ్యావహారికమును గాక పోయినది. మావూ రనుచోటనే వకారము లఘువుగా నుచ్చరింపఁబడు ననియు వూ రనువిధముగా నున్నప్పు డట్లు గా దనియుఁ జెప్పుట కవకాశ మున్నదా?

వకార మాగమముగా వచ్చుట నంగీకరించుట లేదు గాఁబట్టి యది యాదేశమునకుఁ దలింపఁబడిన దన్నది బా.వి. (27) అనఁగా న్యాయ్యముగా నాగమవకారమే లఘు వనవలెఁ గాని వకారాగమము నంగీకరింప లేదు గాన లఘుత్వ మన్నది యెక్కడనో యొకచోట నిరూపింపవలెను గాఁబట్టి యాదేశవకారము నిజమునకు లఘూచ్చారణము కలిగినది గాకున్నను (సంహితలో వచ్చినది గాన) దానిని లఘు వనిరి కాని యట్లనరా దని బా.వి. అభిప్రాయ మన్నమాట. వాఁడు నిద్ర వోయె ననుచోట్ల వకారములు సమాన మైనయూనికతో నుచ్చారణము గల్గియున్న వనుట యనుభవమునకు మాన్యముగా నున్నట్లు గుర్తింపవచ్చును.

చిగురు చివురు ఇత్యాదులలో గకారమున కైనవకారము కూడ లఘువే యని యుచ్చారణము ననుసరించి కొందఱు గుర్తించిరి.

లఘ్వలఘుయకారములను నిరూపించునపో యడాగమయకారము లఘు వనుచు బా.వి. పైరీతిని గాక పదమునం దవయవముగా నున్నయకారము అలఘువు. కాయ పోయు మాయ. (25) అన్నది. యడాగమముకంటె వే ఱయి శబ్దావయవము గాక యున్నయకారమే మగును? భుజియించు అనుచోటియకారము యడాగమయకారము. ఇది శబ్దావయవము యగునా! పోయెను ఆయెను అనుచో పగలకు యకార మాదేశ మైనది. ఇది యేమి?

ఇట్లే వకారమువిషయమునను. వాదేశము లఘు వని పదగత మలఘు వని (26) చెప్పినది. చిగురు చివురు అనుచో వకారము గకారమున కాదేశ మైనది. ఇది శబ్దమున సహజముగా నున్నది కాదు గదా. వాదేశము గాదు గాన లఘువు గాదు. శబ్దావయవము గాదు గాన నలఘువు గాదు. లఘ్వలఘువులకంటె భిన్నమై యవలును వర్ణాంతరములుగా వేఱుగా నున్నవా? శకారమువలె సూరి వీని నేల వేఱుగాఁ బరిగణింపఁడు?

శబ్దమున సహజముగా లేకున్నను నిట్టివి శబ్దావయవములే యందురా? హరి యతఁ డనుచో నతఁ డన్నదే శబ్దము. పోయె ననుచో నట్లు గాక యకార మవయవమే కదా. ఇట్లే నిద్ర వోయె, పవలు. కాని యడాగమము పరస్వరమునకు విధింపఁగాఁ బరస్వరమున కవయవమే యగును గదా. అట్లు బా.వి. సూచి వివరించినది. (పుట. 32క) అది పదావయవము గాకుండు టెట్లు? ఇట్లే నిద్ర వోయె నిత్యాదులందును.

ఇట్టిసందేహములకుఁ దావు లేకుండునట్లుగా సూరి చెప్పిన దాని సమార్గములోనే వివరింపఁదగును.

యడాగమయకారము లఘువు కాఁగాఁ దద్భిన్న మైన యకారము శబ్దమున సహజముగా నున్నను నాగమ మైనను నాదేశ

ప్రాంతమున బాలసరస్వతివివరణము కొంతకారణ మైయుండును. బా.స. 'ఏషా తయోర్వికృతి' యనుసూత్రమునివరణమున 'ఈలాగుననే ప్రాకృతభేదము లైనశౌరసేన్యాదిభాషలును బహిర్దేశప్రత్యేకము లుగాఁ దద్భవతత్సమము లౌను.' (పుట. 7. ఆం.సా.ప.) అన్నది. దీని నింకను ప్రాకృతమునందలి తత్సమతద్భవదేశ్యభేదము లనుబట్టి విస్తరించి యహోబలుఁడు వివరించినట్లు గమనింపవచ్చును.

## దేశ్యము - ప్రవాహము :

'చింతామణి ప్రవాహిని దేశ్య' యనుదానిగూర్చి బా.వి. దీనిని చిన్తామణికర్త ప్రవాహముతోఁ బోల్చినాఁడు. ప్రవాహమునం దనేకభాషాప్రవాహములు జే(చే)రి దానిని మహాప్రవాహ మొనర్చి నట్లు దేశభాషయం దనేకభాషాపదములు చేరి ఆభాషను పెంపొందింపఁజేయునే కాని దానిని నడుగంటఁజేయ (లేర) వన్నది.

అహో. 'నిత్యోఽనన్యాదృశో లోకః ప్రవాహః సోఽస్యాస్తీతి ప్రవాహినీ దేశ్యా. లోకవ్యవహారవేద్యేతియావత్ (కవిశి.) అని 'సిద్ధిర్లోకాద్పృశ్యా, లోకోఽనన్యాదృశశ్చ నిత్యశ్చ' యను చిం.లక్షణములను సమన్వయించుచు నర్థము చేసెను, జనులు గలది జనుల వ్యవహారము గలది జనులవ్యవహారమునుండి తెలియఁదగినది దేశ్యము. ఇది లాక్షణికమార్గము.

ప్రవాహ - పుం. ప్ర+వహ+ఘఞ్. ప్రవృత్తౌ జల స్రోతసి వ్యవహారే (శబ్దస్తో) అని ప్రవాహశబ్దమునకు వ్యవహారమనియు నర్థము. వ్యవహారము గలది వ్యవహారైకవేద్య మైనది దేశ్యము. తత్సమతద్భవములు సంస్కృతప్రాకృతముల మూలముగాఁ గలిగి తెలియఁదగి యుండ నట్టియాధారము వేఱుగా లేక జనవ్యవహారమునుబట్టిమాత్రమే తెలియఁదగినది దేశ్య మనుట స్పష్టమే.

**కవిల :**

కపిలగడ్డము మొద లయినస్థలములందు 'కవిల' అను (ప్రౌఢ వ్యాకర్త సృష్టించిన) పాఠము సమంజస మనుచు బా.వి. అందుకు హేతువు లిట్లు చెప్పుచున్నది. 1. ఇతరత్ర అట్టిప్రాస (పవప్రాస) నన్నయ కవితలో లేనికారణము చేతను, 2. కపిలశబ్దభవము కవిలశబ్దముండుటచేతను, 3. అనేకతాళపత్రప్రతులలో కవిలశబ్దమే కాన వచ్చుటచేతను. సూరి చూపిన ఈయుదాహరణపదములు గ్రామ్యములుగా కనుపట్టును. (41.)

ఈయంశము లేవియుఁ గవిలను నిర్ణయింపఁజాలవు. పవ ప్రాసము మఱి యెక్కడను నన్నయ ప్రయోగింపలేదు గాఁబట్టి కపిల పాఠ మంగీకారయోగ్యము గా నున్న నట్టికారణముచేతనే కవిల పాఠము నంగీకారయోగ్యము గాదు. కవిలశబ్దము నెక్కడఁ గాక మఱి యెక్కడ నేని నన్నయ ప్రయోగించెనా? మఱి యేరు గాని ప్రయోగించిరా? కాఁగాఁ గవిల పాఠాంగీకారమునకు నాధారము లేదు.

కపిలశబ్దభవముగాఁ గవిలశబ్దమున్న దనుటయు సరి కాదు. కవిలశబ్దము వ్యస్తముగాఁ గాని సమస్తమై కాని కవిప్రయుక్తమై యెచ్చటను గానరాదు. కవిలశబ్దమున్న దనుట కింక నాధార మేమి? కవిలశబ్దమును జూపుకోశములును నట నీనన్నయప్రయోగమునే చూపినవి గాని మఱియొండు చూపలేవు. వివాదగ్రస్తమైయున్నదీని ననుసరించి నిర్ణయించుట యెట్లు గుదురును? అసలు తెలుఁగులోఁ గవిలశబ్దము ప్రౌఢవ్యాకర్త సృష్టి యేమో యనిపించును. (చూ. త్రి. శే.)

ఇంకఁ బ్రధానమైనది యనేకతాళపత్రప్రతులలోఁ 'గవిల' యన్న పాఠమే యున్న దన్నది. సూరి 'కపిల' పాఠమును జూపుచోఁ దాళపత్రప్రతులను బరిశీలించఁడా. నన్నయప్రయోగమును లక్షణ విరుద్ధముగా నెన్నవలసినచోట సూరి కేవల మేదో ప్రతి నాధారము చేసికొని సాహసించె ననలేము. అవుఁ గాక. భారతిసంశోధితముద్రణము 'తాళపత్రప్రతు లన్నియు, శేషప్రతులలో కపిలగడ్డము అను పాఠమునే గ్రహించినవి' (245) యని పేర్కొన్నది. కావునఁ బ్రాచుర్యము ననుసరించియే సూరి 'కపిల' పాఠమును స్వీకరించియుండు ననవచ్చును. గవురుగడ్డము కపిలజడలును కపిలకన్నులు అన్ని నన్నయ ప్రయోగించె నేమో యని సంశోధితముద్రణ మూహించినది. (245.)

# సంధిపరిచ్ఛేదము

*

## సంధి:

అచ్చు, హల్లు అనునవి యొకదాని కొకటి పరముగా నుండుసంహితాసందర్భములలో 'అచ్చునకచ్చు పరముగా నున్నప్పటి సన్నివేశమునకే ప్రాముఖ్య మిచ్చి (సూరి) సంధిని నిర్వచించినట్లు (42) బా.వి. అభిప్రాయపడినది.

కాని సంధిపరిచ్ఛేద మందుచోట నున్న సంధివిషయమును సూరి యిట్లు నిర్వచనము చేసె ననుటకు వీలు లేదు. పూర్వాపరస్వరంబుల కనుగీతిసంధివివరణము 'ఉత్తున కచ్చు పరంబగునప్పుడు సంధి యగు' ననుసూత్రమ్రాకింద జేయబడినది. అనఁగా నిది యామొదటి సూత్రమందలిసంధిశబ్దమునకర్థమే. కాని సంధిపరిచ్ఛేద మందుచోటిసంధి శబ్దము యొక్క యర్థము గానేరదు. ఆచ్ఛికపరిచ్ఛేదారంభములో నాచ్ఛిక మన నేమియో సూత్రించినట్లుగనే సంధిపరిచ్ఛేద మందుచోటి సంధిశబ్దమునే చెప్పఁదలఁచుకొన్న నీనిర్వచనమును మొదటిసూత్రము తరువాతఁ గాకుండ మొదటిసూత్రముగనె (వివరణముగ నేని) చెప్పి యుండెడివాఁ డనవచ్చును. అనఁగా మొదటిసూత్రమందలిసంధిపదమునకు వివరణముగఁ జెప్పఁదలఁచుటచేతనే యాసూత్రమునకుఁ బిదప వివరణముగాఁ జూపెను. అనఁగా సంధిపరిచ్ఛేద మందుచోటిసంధి శబ్దమునర్థమును (కారకాదులకువలె) సంస్కృతానుసారముగా గ్రహింప వలసినదే.

ఇది మొదటిసూత్రములోనిసంధిపదమునకు వివరణముగా భావింపకపోవుటచేతనే బా.వి. ఇంకొకచోట నిట్లన్నది. 'సంధిసి

నిర్వచించెను గాన ఉత్తునకు సంధి నిత్యము, ఇత్తునకు సంధి వైకల్పిక మని పేర్కొనుటలో పొరపు గలదు. స్పష్టతకై సూరి యిట్లు వచించి యుండును. (45) సంధిని నిర్వచించినపిదప సూత్రమునందు సంధి పదము మాత్ర మేల? ఉత్తున కగు, అత్తునకు బహుళము ఇత్తునకు వైకల్పిక మని చెప్పిన నింకను బోధ పడును గదా. ఏ మైనను బోధపడుటకై 'సంధి' పదమును దగ్గింపవలె నని బా. వి. భావింప లేదు. ఇంకఁ దగ్గించిన దేమి? అచ్చు పరం బగునప్పుడు, అగు అను నది. ఇం దగు నన్నది యంతగాఁ బట్టించుకొనఁ దక్కఱ లేనిది. బా.వి. కూడ నట్లే తలఁచిన దనవచ్చు. సంధి నిర్వచించెను గాన నను దానికిని 'అగు' నన్నది తగ్గింపవచ్చు నన్నదానికి కారణకార్యసంబంధము లేదు గదా. ఇంకఁ దగ్గిన దే మన అచ్చు పరం బగునప్పు డన్నది. సూరి కూడఁ బిదప నత్తునకు సంధి బహుళముగా నగు ననెనే కాని యత్తున కచ్చు పరం బగునప్పుడు సంధి బహుళముగా నగు ననలేదు. అట్లే యిత్వసంధిసూత్రములలోను నిబంధనములు లేవు. పొరపుగనే సూరియుఁ జెప్పెను. కావున నత్వేత్వసంధిలక్షణములను బా.వి. ఇటుఁ బ్రస్తావించుట యనవసరము.

ఇందు మొదటిసూత్రమును విడచిన నిత్యసంధిని జెప్పుచున్న మొదటి 11 సూత్రములలో మఱల 11. సూత్రములోనే స్వరము పరముగా నుండుట ప్రస్తావింపబడినది. అంత్యవగాగమంబులం దప్ప నపదాదిస్వరంబు పరం బగునపు డనుచోట స్వరపరకత్వము చెప్పకుండ నంత్యవగాగమంబులు దప్ప నపదంబు పరం బగునపు డన్నఁ జాలు ననిపించుచున్నది. ప్రయోజన మే దే నుద్దిష్ట మేమో పరిశీలింపవలసియున్నది. యడాగమస్థలమునఁ బరస్వరంబున కనుటం గూర్చి పైని స్పష్ట మగు.

ఇఁక మొదటిసూత్రము 'ఉత్తునకు సంధి నిత్య' మనుట పోదు పని బా.వి. అగు నన్న నిత్యమే కాఁబట్టి సంధి యగు నను చోట సంధి నిత్య మనవలె ననుటలో స్పష్టతయే కాని పోదుపో యింకొకటో ప్రయోజన మున్న దనుకొన వీలు లేదు. కాఁబట్టి 'నిత్య' మని సవరించుట యనవసరమే. తె.వ్యా.వి.లో చి.సూ. 'ఉత్తున కచ్చుపరం బగునప్పుడు సంధి నిత్య'మని (379) యుపదేశించె ననుటలో నవధారణచిహ్నముం దున్నది సూత్రము కాక సూత్రార్థ మయి యుండదు. సూరి యీసూత్రమున 'నిత్య' మనలేదు గదా. కాఁగా నీసూత్రములో 'అచ్చు పరం బగునపు' డనునది యనవసర మని సారాంశ మైనది. కారణము - సంధి నిర్వచించెను గావున. నిర్వచించెను గాన ననుటకు నీసూత్రమునకు ముందే సంధి నిర్వచించుట జరిగిపోయినదా? అయినను నిర్వచింపఁబోవుచున్నాఁడు గావునఁ జెప్పనక్కఱ లే దనవచ్చును.

సంధిపరిచ్ఛేద మని ప్రారంభించి ఉత్తునకు సంధి నిత్య మని సూత్రించి పూర్వపరస్వరంబుల కేకత్వాదిగా సంధిని వివరింపఁగా సంధిపరిచ్ఛేద మనుచోటసంధిశబ్దమునకుఁ బరస్పరైకాదేశరూప మగునదియే యర్థ మగును. అప్పుడు కుట్టుసురు చిగురుటాకు ఇత్యాదుల వర్ణవికారములను సంధులుగాఁ జెప్పుటకు వీలు లేదు. సంధి యన నేమియో చెప్పి నగమునకుఁ బైఁగా నట్టి సంధులు గానివానినే యాపరిచ్ఛేదములో నిరూపింపఁగా నాపే పరి చ్ఛేదమున కెంతవఱకు సార్థక మగును.

ఈవివరణము నట్లుంచి చూతము. ఇక్కడఁ జెప్పిన యాగమాదేశాదులు కూడ సంధ్యధ్యాయవిహితము లయి సంధికార్యములే యయియున్నవి. అట్టిమొదటి 11 సూత్రములలో సంధి (తుది

హలంతమా యున్నది ముఖ్యము. వారు వోయిరి వా ర్వోయిరి ప్రాచేను గలువలు అదియును గ్గాక. మొ॥ ఇట్టిచోట్ల అచ్చు + హల్లు, హల్లు + హల్లు అనుసన్నివేశములుగాఁ జెప్ప వీలు లేదు. ఇట్టివే పుంప్వాదేశాదిస్థలములు.

ఇట్లు పరిశీలింపఁగా హల్లు + అచ్చు, హల్లు + హల్లు అను స్థలములును నట వర్ణవికారాను లగుసంధికార్యములును తెలుఁగున లేవు 'స్తోఃశ్చునాశ్చుః' అనురీతిగా నున్నసంస్కృతహల్సంధులతోఁ బోల్చి చూచినఁ దెలుఁగులో హల్సంధు లసలు లే వనియే చెప్పవలసి యున్నది గదా. అందుకే తెలుఁగున హల్సంధిప్రకరణ మనునది యేర్పరుట కవకాశము లేకుండఁబోయిన దని గుర్తింపవచ్చును.

ఇట్లే అచ్చు + హల్లు అను సన్నివేశమును గానరాదు. వాఁడు గొట్టె నిత్యాదులలో అచ్చు + హల్లు అనునది యూహింప వీలు లేదని పైని స్పష్టము.

గసడదవాదేశవిధానమునకు ముందు శా.వి. ఈపైని 'వ్యంజనసంధు లారంభ మగును' (61) అన్నది. అనఁగా గసడదవాదేశాలు వ్యంజనసంధు లన్నమాట. వ్యంజనములకుఁ జెందినసంధి యనుచోఁ బూర్వపరవర్ణములు రెండును వ్యంజనములే కా నక్కఱ లేదా? వాఁడు + కొట్టె అనుచోటఁ బూర్వస్థలమున వ్యంజనము లేదె. ప్రథమాంతే మయినఁ జాలు. అది హలంతము కా నక్కఱ లేదు. వ్యంజనములకుఁ (పరుషములకుఁ) జెప్పఁబడిన వగుట దీనిని వ్యంజనసంధి యనెనా? అయిన నది యకిత్పరములు యుత్తునకు లోపము చెప్పెను గదా. అది స్వరసంధి కాదా? అయిన దానిని దరువాత నెక్కడనో చెప్పె నేమి? 11. సూత్రవివరణములో 'ఇంతటితో స్వరసంధులు సమాప్త (58) మని శా.వి. ఎట్లు చెప్పినది?

అన్నది బా.వి. ఐ ఔలకు రూపాంతరము లున్నమాత్రమునఁ బదాది శబ్దములను జూపుటలోఁ దగనిది యేమియో యందులో నసామంజస్యము స్పష్టముగాఁ జెప్పియుండవలసినది. వినుము + ఔర - విను వౌర యని రూపె ననుకొందము. అవుర యనురూపమును గలదు గావున నౌకారపరకతలో సంధి గల దనుటకు విను వౌర యన్నది యుదాహరణము గాకుండఁ బోవునా? సందేహ మున్నదా? పోనీ రూపాంతర మున్నదాని నిచ్చిన సందేహము గల్గును గానఁ దగ దని భావించునెడల నట్టిరూపాంతరము లేనిదానికే చూపఁదగును గదా. ఐశ్వర్యము ఔజ్జ్వల్యమువంటిసంస్కృతసమము నిచ్చినను జరగెడిది కాదా?

అచ్చు లన్నింటిని జూపవలె ననుకొనుట యనవసరమే యనుకొన్నవి, ఔలను జూపకపోవుటయే తెలివి యగును.

లక్ష్యములను గూర్చియే యింక వివేచనము. "లక్ష్యములలో పూర్వపదము లన్నియు కళలు. ఇవి ద్రుతప్రకృతికము లైనచో నిత్యసంధి వికల్ప మగును. అది పైసూత్రమున నిరూపితము" (45) శబ్దశాస్త్రములోఁ బూర్వపద మనఁగా సమాసమున నాద్యవయవము. పై వివరణములోఁ బూర్వపదశబ్దము లక్ష్యములోఁ గాకుండ మొదటి పద మనునర్థమునఁ బ్రయుక్తము. రాముఁ డతఁ డిత్యాదులు సమాసములు గావు గదా.

'ఇవి ద్రుతప్రకృతికము లైన'-అన్నచ్ఛోటియివి యనుదాని కర్థ మేమి? రాముఁడు ఇత్యాదికళలు ద్రుతప్రకృతికము లైన - అనవలె. అనఁగాఁ షష్ఠ్యర్థకనుశబ్దము చేరి 'రాముఁడు(ను)న్' అని యున్న నాకళయే ద్రుతప్రకృతిక మయిన దన్నమాట. దీనికి సంధి వికల్పముగా వచ్చునా? వచ్చు నని మీఁదిసూత్రము నిరూపించునా?

పైఁగాఁ బ్రథమేతరవిభక్తిశత్రర్థచువర్ణములందలముననే తరువాతిసూత్రము వైకల్పికసంధిని జెప్పుచున్నది. కాన ద్రుతప్రకృతికముల కెల్ల సామాన్యముగా వికల్పసంధి యనుట కొప్పదు. వచ్చెన్+ఎవఁడు వచ్చె నెవఁ డిత్యాదులఁ దరువాతిసూత్రముచే వికల్పముగ నైనను సంధివచ్చునా ?

## ద్రు త పూ ర్వే కా ర సం ధి :

ప్రథమేతరవిభక్తిశత్రర్థచువర్ణంబులందున్న యుకారమునకు సంధి వైకల్పికముగా నగు' నని సూరి. దీనికి చింతామణిలో 'అనాదిషు విభక్తిష్వాలో వా' యనుసూత్రము నొక్క దానిని మాత్రము చూపుటయే కాక బా.వి. 'ప్రథమావ్యతిరిక్తైనవిభక్తు లందు ఉత్తునకు సంధి వికల్ప' మని ప్రథమాచార్యుండు చెప్పెనంగా సూరి శత్రర్థమునందు చువర్ణకమును గూడఁ జేర్చె (46) నని వివరించినది. శత్రర్థకచువర్ణమును జేర్చుట విశేష మనియు దీనికిఁ జింతామణిలో మూలము లే దనియు బా.వి. అభిప్రాయము స్పష్టము. కాని యది సరి గాదు. చింతామణి 'చోర్వా స్యా ద్వర్తమానవిహితస్య'యని శత్రర్థకచువర్ణమునందును సంధిని జెప్పియున్నది. అనఁగా నీసూరిసూత్రమునకు అనాదిషు, చోర్వా-యనుసూత్రములు రెండును మూలములుగాఁ జూపఁదగినవి. చింతామణిలో రెండుసూత్రాలలో నున్న యంశముల నొక్కచోఁ జేర్చెనే **కాని** సూరి విశేషించి చెప్పినది లే దిట.

ఇచ్చోటిద్రుతాంతములను జేర్కొని 'వీనికి సంధి యెల్ల వికల్పముగా వచ్చునో నిరూపిత (46) మన్నది బా.వి. ఇవి ద్రుతప్రకృతికము లైనచో నిత్యసంధి వికల్ప మగును. అని పైసూత్రమున నిరూపితము' (45) అనుటయే యానిరూపణము గావలెను. అందలి క్రమ మెట్టిదో యింతకు ముందే స్పష్టము.

వ్యత్యాసాన్వితాలతో లక్షణమున కెట్టిసంబంధమును లేదు. అందు కొఱకే సూరి రెండుదాహరణము లిచ్చియున్న దని యనవసరము నింకను నన్యత్ర యునర్థకము నగు నని నిశ్చయింపక తప్పదు. శత్రర్థక చువర్ణమునకు రెండులక్ష్యములు చూపుటకంటె ప్రత్యయమును, స్వాతంత్ర్యము నైనయందులకు రెంటికి లక్ష్యములు చూపిన బా గుండెడి దనిపించు. చిన్నయసూరి కేవలము విశేషస్పష్టితో నిట్లు చేసె నేమో పరిశీలింపఁదగును.

ఇక్కడ సంధిలోనికొన్ని విశేషములను బా.వి. ప్రస్తా వించినది.

ఇట ద్విత్వయుక్తము లయిన ఉదంతద్వితీయావిభక్తులే గ్రహింపవలయును. కాని లుప్తద్విత్వద్వితీయోకారమును గైకొన రాదు. అనఁగా ననున్ + అడిగె ననడిగె, గురువున్ అర్థించె గురు వర్థించె అని రూపము లుండవు (47) న నడిగె ననుకొనురూపములు లేనిమాట వాస్తవమే. ద్వితీయాంతాలలోఁ గొన్ని గ్రహించి కొన్ని గ్రహింపరా దనుటకు సాధారణ మేమియో స్పష్టము గాదు. లుప్త ద్విత్వద్వితీయోకారము గైకొనరా దని సూత్రమందు దేనివలనైనఁ జెప్పఁబడి యున్నదా? లక్ష్యాలనుబట్టి మాత్రమె యట్లు నిర్ణ యింపవలెనా? లక్షణముతో సమన్వయించుకొమ్మని బా.వి. (47) చెప్పినది. కాని యీనిర్ణయమునకు లక్షణము సమన్వయము కుదురు చుట లేదు.

అట్లుఁ గాక. ద్విత్వయుక్తములనే గ్రహింతము. ఋత్వి క్కున్ + అడిగె ఋత్విక్కడిగె, ఇంద్రజిత్తున్ + అనిపె - ఇంద్రజి త్తనిపె ననువిధముగా సంధి చేయనగునా? అనఁగా ద్విత్వయుక్త స్థలాలలోఁ గూడ నన్నింట సంధి లే దని గ్రహింపవలె. లుప్త

మును లేదు. కావున ననున్ అడిగె ననురీతి నుండుటకే యవకాశము లేమి నిట్టివాని నిట గైకొనవలెనా కూడదా యనుప్రశ్న పుట్టునవకాశమే లేదు. అనఁగా బా.వి. వివరణములో 'లుప్తద్విత్వద్వితీయాకారమును గైకొనరా' దనునంశము నిరవకాశ మై వ్యర్థ మగుచున్న దన్నమాట. ఈయంశములో విశేష మిదియే.

బా.వి. పొరబడినది కాని నిజమున బా.449 సూత్ర మచ్చు పర మయిన ద్విత్వలోపము చేయరా దని చెప్పుట లేదు. 'జడ్డక్కారంబుతోఁ బదాదిస్వరంబు గూడినచో జడ్డకు లోపంబు లే' దనఁగా సంధివలనఁ బూర్వపరస్వరములకుఁ బరస్వర మేకాదేశ మగుట ద్వారాఁ బరస్వరముతో జడ్డక్కారము గూడినప్పుడు (అట్లు + ఎత్తె- అట్ ట్ + ఎ) జడ్డకు లోపము రా దని యర్థము. వైకల్పికసంధిసందర్భాలలో సంధి లేమియుఁ గలదు గదా. సంధి చేయనియట్టిసందర్భమున జడ్డక్కారముతోఁ బదాదిస్వరము కూడుట యనునది యుండదు. కాఁబట్టి యక్కడ జడ్డకు లోపము వచ్చుట లక్షణానుగుణమే. అనఁగా నిక్కడ ననన్+అడిగె నని యుండు నవకాశ మున్నది. కాని యది సంధి లేనప్పుడే. అనఁగా సంధి లేనిపక్షమున నన్న నడిగె నను నడిగె నని రెండురూపము లుండును. సంధి యయినపక్షమున నన్నడిగె నని మాత్రమే యుండును.

కాఁగా నిట బా.వి. అచ్చు పర మైన ద్విత్వలోపము చేయరా దనుటచేత ననున్ + అడిగె నని యుండుటకే యవకాశము నశించినది. దీనివలన 'నన్నడిగె' ననునిష్టరూపమే కాక నను నడిగె ననునిష్టరూపము సైతము లక్షణవిరుద్ధముగాఁ బరిణమించినది.

ఇఁక గురువున్ + అర్థించె ననుస్థలము. ఇది 'లుప్తద్విత్వద్వితీయాకారము' కాకపోవుటచేత బా.వి.వివరణ మిట నిష్ప్రయో

నిర్ణయింపరాదు. వివ లగ్నిదీప్తులు తా లొప్పగిన్ మొ॥ వానివలె లక్షణముచే సిద్ధింపనియట్టి ప్రయోగములను విశిష్టస్థలములుగా గుర్తింప వగును. సంధి యదునుగఁ గానవచ్చుటను జెప్పఁ వగునే కాని యరుదైన ప్రయోగములనుబట్టి భాషాసామాన్యముగా లక్షణము నిర్ణయింపరాదు.

## సంధి - ద్రుతలోపము :

ఈ ద్రుతప్రకృతికాంతము సంధిలో ద్రుత మెట్లు లోపించును? బా.వి. 'అచాం సంధౌ ద్రుతోఽవృత్త్యాః క్వచిద్దోఽపి చ భవేత్సదా' యను ఆం.శ. లక్షణముచే రెండచ్చులు సంధిల్లినప్పుడు వానినడుమ నున్న ద్రుత మొకసారి లోపించుననియు నొకసారి లోపింపదనియు ననఁగా వికల్పముగా లోపించుననియుఁ జెప్పుచున్నది. (46) కాని యీవైకల్పికలోపప్రసంగ మసంగతము. సంధి జరుగుసందర్భములో ద్రుతము నిత్యముగా లోపించును. సంధి లేకపోయిన నది లోపింపదు. వ్యాఖ్యాతా కీయంశమును స్పష్టముగా నిరూపించిరి. (వ్యా.సం. సూ. 206)

సంధిల్లినప్పుడే లోపము వికల్ప మన్నచో నన్నన్ + అడిగె ననుచోట ద్రుతము లోపించి నన్నడిగె నని యగును. ద్రుతము లోపింపనిపక్షములో సంధి యెట్లు? ఈసందేహమును వారించుటకుఁ గావచ్చు బా.వి. ఇట్లు వివరించినది. 'ద్రుతము లోపింపకున్నచో సంధి కలిగినట్లు కాదు. ద్రుతమునకు నచ్చు పరమగుచో అక్షర మేర్పడును. కాన నది సంధి యనిపించుకొనదు. హల్లు + అచ్చు అనునాగ్వయాంశ మిట నను వర్తింపదు.' (46)

ద్రుతము లోపింపకపోయిన సంధి కలిగినట్లు కాదనఁగా నర్థ మేమి? సంధిల్లినప్పుడు ద్రుతము వికల్పముగా లోపించు నన్నప్పుడు

లోపింపనిస్థితి సంధిగల్గుటలో లేదా? సంధి కలిగిన ట్లుండుట అట్లుండక నుండుటకు శబ్దశాస్త్రమునఁ బ్రమాణ మెంతవఱకు? ఏ మయినను సంధి కలిగిన ట్లుండవలె నన్న ద్రుతము లోపింపవలె నన్నమాట. అనఁగా ద్రుతము లోపించినదే సంధి. సంధి జరుగునప్పుడు ద్రుతము లోపించి తీరవలయును. సంధిలో ద్రుతము వికల్పముగాఁ గాక నిత్యము గనే లోపించు నని స్పష్టము. మఱి వైకల్పికలోపవివరణము సమన్వయించు టెట్లు?

'ద్రుతమున కచ్చు పర మగుచో నక్షర మేర్పడును' అను వాక్యమునకు ద్రుతము లోపింపకుండ నిలిచియున్న నది పై నుండు నచ్చుతోఁ గలియు నని యది యక్షర మగు నని యర్థము గ్రహింప వలసియున్నది. అనఁగా ద్రుతము లోపింపకున్నఁ బూర్వపరస్వరము లకుఁ బరస్వర మేకాదేశ మగుట యుండదు. కాన నిది సంధి కలిగి నట్లు కా దని యర్థ మేమో. ద్రుతము మీఁదియచ్చుతోఁ గలిసి యట్టి యక్షర మేర్పడు ననుట కొంతవఱకు యుక్తమే. 'కాఁబట్టి సంధి కా' దను టేమి? అక్షర మేర్పడును గాన సంధి యనరాదా? సంధి యైనస్థలమున నక్షర మేర్పడదా?

కాఁగా సంధి యైనచోట (ద్రుతము లోపింప) ద్రుతపూర్వ స్వరమునకును బరస్వరమునకును బరస్వర మేకాదేశ మగుచుండ సంధి లేనిచోట ద్రుతము లోపింపక మీఁదియచ్చుతోఁ గలియుచున్నది. కాఁబట్టి సంధి జరుగునప్పుడు ద్రుతము తప్పక లోపించు ననియు, సంధి జరుగనప్పు డసలు లోపింప దనియుఁ గారికార్థము స్పష్టము. అది ద్రుతమునకు లోపము వికల్పముగాఁ జెప్పిన దని చెప్పరాదు. వైకల్పికలోప మన్న సంధి వచ్చినను రాకున్నను ద్రుతము వికల్పక ముగా లోపింపవలసియుండును. న న్నడిగె, నన్నున్ అడిగె నన్నవి

సంధి యగునప్పటి రూపములు. నన్ను (యు) అడిగె, నన్ను నడిగె ననునవి సంధి రానిరూపము లనవలసియుండును.

వి.వి.లక్షణమునభిప్రాయము పైరీతి దనుట సమంజసము గా దని స్పష్టమే. దీనికి వజ్ఝలవారు స్పష్టము చేసినయర్థము గ్రాహ్యము. (వ్యా. సం. న. 208)

అయినఁ బ్రస్తుత మగు బాలవ్యాకరణమునందును సంధి యగునపుడు ద్రుతము లోపించుట వి.వి. ద్వారాననే సాధింపవలసి యున్నదా? ఇట్టిలక్షణమును సూరి చెప్పలేదు గదా. అను క్రొత్తలక్షణము నుంచవచ్చు. వి.వి.ప్రకారము ద్రుతలోపము చేసి బాలవ్యాకరణసూత్రము ననుసరించి సంధి చేసికొనవలయు నని సూరి కూడ ననుకొనెనా! అది సముచితము గాఁ గనఁబడదు.

పూర్వపరస్వరాలకుఁ బరస్వర మేకాదేశ మగుట యను సంధిని సూరి విధించియున్నాఁడు. వానికి నడుమ ద్రుత ముండఁగా నట్టిసంధి యెట్లు గుదురును? విధానము స్పష్టము గావలసినదే యగునా! అనఁగా సంధివిధానసామర్థ్యముచేతనే ద్రుత మిందు లోపించు నని సూరిమతమును గుర్తింపఁదగును. సంధి వికల్ప మగుటచేతను సంధి లేనపుడు ప్రకృతిసిద్ధ విగ్రహ మగుచుండేని యపుడు ద్రుతము లోపింపదు. నన్ను నడిగె.

కాఁబట్టి బాలప్రక్రియానంతర్గమును వి.వి.కొక ప్రస్తావన మక్కఱ లేదు. బా.వి. ఇక్కడఁ జేసిన వివరణము కొంతవఱకు వి.వి.అభిప్రాయవర్ణనము. కాని దీనికి బాలప్రక్రియలో స్థానము లేదని, ఉండ రా దని గ్రహింపవలెను.

సంధిని వివరించుచు సందులో నాలుగవవిధమును 'హల్లునకచ్చు పర మగునప్పు' డని (12) బా.వి. వ్రాసినది. ద్రుతము పైనుండు

సూరి కూడ వర్ణకముగానే వ్యవహరించియున్నాఁడు. కాని దువర్ణ మును మాత్రము 'లాట్టురు ఞు పరం బగునపుడు దుగాగమం బగు'నని యోగముగాఁ జెప్పియున్నాఁడు. దుశ్కు ధాతువుల కాగము మువ్వు టచేఁ దవనయవమయి తెద్దుణాములో నుండు. కాని నీవు వర్ణమునందు విశేషముగా నర్థవత్త్వము నూహించుట యెట్లు? వర్ణక మన్న చింతా మణి యర్థవంత మైనదిగాఁ జెప్పఁగా సూరి దాని సార్థకహితముగ విధిం చెనా? చింతామణియందలివిశేషము సూరిమతమున నెట్లు సిద్ధించు నీదుక్కునకు?

చింతామణియం దైనను ప్రత్యయము వర్ణక మని చెప్ప నీనలముననే కాక తద్గ్రంథాంతర్వ్యాఖ్యఁ ననుసరించియు వర్ణక మన సార్థవంత మైనవర్ణ మని నిర్ణయింప వీలు లేదు.

# యడాగమం

[ప్రి. పిహెచ్.డి.కి సెమినార్ పేపరుగా నాగార్జునవిశ్వవిద్యా లయమునకు సమర్పింపఁబడి తదాజ్ఞచే నామోదింపఁబడి 'భారతి' పత్రికలో ముద్రణమునకుఁ దిరస్కరింపఁబడినవ్యాసము.]

తెలుఁగువ్యాకరణాల్లో బాలవ్యాకరణం ప్రసిద్ధం అనే విషయం అందరికీ స్పష్టం. నన్నయ వ్రాసివున్నాఁ డనేభావం కానప్పు, చింతామణికి ప్రాముఖ్యం కలిగిస్తే ఆధునిక మైనబాలవ్యాకరణాని కింతటిప్రసిద్ధికి కారణం రచనాప్రణాళికా, విషయగౌరవం అంటుం టారు. ఇది యథార్థం అనడంలో అభిప్రాయభేదం అక్కర్లేదు. అం దుకే చింతామణికి తర్వాత బాలవ్యాకరణానికి వ్యాఖ్యలు బాగా విస్తరించాయి. ఇంకా వడుస్తున్నాయి.

వ్యాఖ్యాతలు తమతమ బుద్ధివైభవాన్ని అనుసరించి, సూత్ర కర్త అభిప్రాయాన్ని బహుముఖంగా పరిశీలించి ఔచిత్యాదులను నిర్ణయిస్తుంటారు. అల్పాక్షరత్వాదిగా[1] సూత్రానికి చెప్పబడ్డ ఆయా లక్షణాలు సూత్రంలో అక్షరగౌరవాన్ని తగ్గించి అర్థగౌరవాన్ని పెంచుతాయి. అసందిగ్ధతాదులైన ఇతరలక్షణాలు సరిపడినప్పుడు అనవసరమైన అక్షరాధిక్యం రచనలో లోపమే అవుతుంది. దీన్నిబట్టి ఆయా సూత్రాల వ్యాఖ్యానసమయంలో సూత్రంలో పదాలు వ్యర్థమని తొలగించడం గాని లేదా సూత్రం మొత్తం ప్రత్యాఖ్యానం చేయడం గాని లేదా సూత్రం మార్పు ప్రతిపాదించడంగాని కనిపిస్తుంది. ఈ పద్ధతి సంస్కృతంలో కానవస్తూనే వుంది. ఇకోऽసవర్ణే శాకల్యస్య హ్రస్వశ్చ[2] అనే సూత్రంలో చకారం ప్రత్యాఖ్యాతం కాగా, న బహువ్రీహౌ[3] అనే సూత్రం మొత్తం ప్రత్యాఖ్యాతం అయింది. ఉపసర్గాదనోత్పరః[4] అనే సూత్రాన్ని ఉపసర్గాద్బహులమ్ అని సవరించడం జరిగింది. తెలుగు వ్యాకరణం సమీపకాలికత్వాదిలక్షణాల వల్ల పూర్తి ప్రామాణికబుద్ధికి అవకాశం తగ్గిపోవడంవల్ల ఈ సవరణమార్గాన్ని వ్యాఖ్యాతలు పెక్కురనుసరించడం కానవస్తున్నది. సూరిసూత్రాలు

---

1 అల్పాక్షరమసందిగ్ధం సారవద్విశ్వతోముఖమ్
అస్తోభమనవద్యం చ సూత్రం సూత్రవిదో విదుః (శబ్దస్తో.)

2 6-1-27. హ్రస్వవిధిసామర్థ్యాదేవ ప్రకృతిభావే సిద్ధే చకారోऽనుకర్షణార్థశ్చకారో న కర్తవ్యః ఇతి భాష్యే స్థితమ్.

3 1-1-29. భాష్యకారస్తు త్వకత్పితృకః మకత్పితృకః ఇతిరూపే ఇష్టాపత్తిం కృత్వా ఏతత్సూత్రం ప్రత్యాచఖ్యౌ.

4. 8-4-18 తద్ జ్ఞాత్వా భాష్యకార ఆహ ఉపసర్గాద్బహులమ్. (వైయాకరణ సిద్ధాంతకౌముది. భట్టోజీవృత్తి.)

పాణినీయలక్షణాలవలె మార్పు చేయడానికి సాధారణంగా అవకాశాలే లేవు. అటువంటివాటిలో యడాగమవిధానం గురించి పరిశీలిద్దాం.

'సంధి లేనిచోట స్వరంబుకంటెం బరంబగు నస్వరంబునకు యడాగమం బగు' అనేసూత్రంలో బాలవ్యాకరణం యడాగమాన్ని విధించింది. పూర్వపరస్వరాలకు పరస్వరం ఏకాదేశం కావటం అనే సంధి జరగనప్పుడు స్వరంకంటె పరంగా ఉన్న స్వరానికి యడాగమం వస్తుం దని ఈసూత్రం స్పష్టం చేస్తున్నది.

దీన్ని గురించి వికాసవ్యాఖ్యానం "సంధి లేనిచో యడాగమం బగు - అనీతి సూత్రమును సంక్షేపింపవచ్చును (48) అని సూత్రానికి సవరణం ప్రతిపాదించింది. ఈ వ్యాఖ్య అభిప్రాయం ప్రకారం సూరిసూత్రంలో 'స్వరంబుకంటెం బరం బగునస్వరంబునకు' అనేమాటలు అనవసరం. అంటే ఆపదాలు తొలగించినప్పటికీ సూత్రం ఆ అర్థాన్ని ఇవ్వగల దని తాత్పర్యం.

కాని అది సంభవంగా కనబడటం లేదు.

సంధి లేనిచోట యడాగమం వస్తుం దన్నారు. ఆ యడాగమం దేనికి వస్తుందో ఇందులో చెప్పబడలేదు. దీనిని గురించి 'టకారము ఇత్సంజ్ఞ (48) అని వికాసమూ, టకారము ఇత్సంజ్ఞ అని యందురు. (74) అని సర్వ. వ్యాఖ్య పల్కొన్నాయి. కాని టకారము ఇత్సంజ్ఞకము అని గాని టకారము ఇత్తు అని గాని పల్కడం సముచితం. టకారమే ఇత్సంజ్ఞ కాదు. ఇత్సంజ్ఞ గలది అంటే ఇత్తు అవుతుంది. (తె.వ్యా.వి. ఇంకా విశేషంగా 'యట్ + ఆగమము' నందు యట్ టిత్సంజ్ఞ అన్నది.)

టిత్త్వంవల్ల - 'ఆద్యన్తౌటకితౌ' యకారము పరపదాదియందాగమముగాఁ జేరు నన్నది వికాసం. (48) పరస్వరంబున, కనేసూరి

ప్రత్యేకంగా ఒకలక్షణం చెప్పలేదు. ఉదాహరణసామగ్ర్యాన్ని ఆశ్రయించాలి. బాల.లో) ఇ.దులో కూడా ఒకనకారం లోపించగా నన్న్యనడిగె అని కావాలి. విభక్తి కాగముంగా వచ్చినవర్ణం ప్రథమే అవుతుంది కాబట్టి అందులో నకారానికి ప్రథమత్వం ఉంటుంది. కాబట్టి స్థిరపరకత్వంలో (యడాగముయకారమే ఇక్కడస్థిరం) ఆ ప్రథమం లోపిస్తే నయు నడిగె అనేరూపం కూడా అవుతుంది. ప్రామాణికమయిన-నన్ను నడిగె అనేరూపం ఈవ్యాఖ్యానంలో ఇట్లే వికాసం పొందింది.

పూర్వస్థితాలైన రెండుసూత్రాలనుబట్టి కూడా ఇది పరస్వరానికి వచ్చేఅవకాశం లేదు. ఉత్వైన కిమ్ము పరం బగునపుడు అనేరీతిగా అచ్చు పరంగా వుండడమే చెప్పబడింది. కాని 'పరంగా ఉన్నయచ్చుకు' అని స్పష్టంగా కార్యం విధింపబడ్లేదు. కాబట్టి ప్రత్యేకంగా చెప్పకుండా యీయడాగమం పరంగా ఉన్నస్వరానికే వస్తుందని చెప్పడానికవకాశం లేదు. దేనికి వస్తుందో చెప్పకపోవడం వల్ల ప్రకరణానుగుణంగా ఉత్వానికి మాత్రమే చేయవలసివస్తున్నది. అయితే మేనయత్త ఇత్యాది ఉకారేతరస్వరసంధ్యభావస్థలాల్లో ఈ యడాగమసూత్రానికి ప్రసక్తి లేదు గాబట్టి మేనఅత్త వంటి అపరూపాలు కాకుండా సంహితం సంరక్షించాల్సినవిషయమే కానీ మేనయత్త అనేరీతిరూపాలు కాకుండా పోతున్నా యనేబాధ మాత్రం తప్పదు గదా.

టీకాకారులైన బాలవ్యాకర్త చెప్పిన యట్లు ఇట్లు ఇయట్లు అనేమూడాగమాల్లోనూ ఈయట్టే మొట్టమొదట చెప్పాడు. దేనికనేవిషయం లేకుండా ఆగమాన్ని చెప్పడంవల్ల పైరీతిగా అవస్థ ఏర్పడుతున్నా యనేది స్పష్టం.

కాబట్టి సూత్రంలో 'పరంబయిన స్వరంబునకు' అనేమాట ఉండాల్సిందే. అది లేనట్లయితే, దానియాగి, దీనిమొవ్వ ఇత్యాదిగా కవిప్రయుక్తమైనవివిధస్వరాలకు ముందుకూడా యడాగమం సాధించడం సంభవమవుతుంది.

స్వరంబుకంటె అనే పదం కూడా సూత్రంలో అనవసరమనేయిది వికాసవ్యాఖ్య అభిప్రాయం. సంధి అంటేనే పూర్వపరస్వరాలకు పరస్వరం ఏకాదేశం కావడం గదా. సంధి లేనిచోట అనడంచేత ఆపూర్వపరస్వరాలు అట్లాగే ఉంటాయి కాబట్టి పూర్వంలో స్వరం ఉండాలనే విషయం చెప్పక్కర్లేదని వికాసం అభిప్రాయపడి ఉండవచ్చు. ఉండవచ్చనుకోవడం దేనికంటే సూరి సూత్రాన్ని యిలా సంక్షేపించవచ్చునన్నదే కాని అలా చేయడం వల్ల లాభమేమిటో సూరి చెప్పిందాన్ని చెప్పినట్లుగానే ఉంచితే వచ్చే నష్టమేమిటో వికాసం ప్రకాశం చేయలేదు.

'స్వరంబుకంటె' అనేపదం ప్రయోజనవంతమే అని అంతకుముందెప్పుడో ప్రకాశికావ్యాఖ్య స్పష్టం చేయడం జరిగింది. ద్రుతప్రకృతికంబులు నకారాంతంబులు గావున సంధి యడంతంబులకు కళలకే (బా.వ్య. 20 పుట) ఇట్లాగే పెక్కు లితరవ్యాఖ్యలు (పేటిక 47 పు॥) కూడా ఈపదంప్రయోజనం స్పష్టం చేశాయి ముందూ వెనుకా. కాగా ద్రుతపూర్వస్వరాలకు సంధి రానిసందర్భంలో యడాగమం రాకుండా వుంటానికిగాను 'స్వరంబుకంటె' అనవలసివచ్చిందన్నమాట. నన్నున్ + అడిగె అనేటిస్థలాల్లో సంధి రానప్పుడు స్వరం ద్రుతానికే పర మయింది కాని స్వరంకంటె పరంగా లేదు. కాబట్టి అక్కడ యడాగమం ప్రసక్తి వారింపబడింది. ఇక్కడ సంధి విధానాన్నిబట్టి పూర్వపరస్వరాలకు మధ్యలో వున్నద్రుతం పోయిం

యు అమ్మ అనేచోట సంధి యెట్లా? అంటే అపదాదిస్వరసంధి చేయనున్నది. ఇక్కడ అది కుదరదు. అమ్మ అపదం కాదు గదా. ఇంక అత్వసంధిసూత్రంలో ఉన్న బహుళపదంచేత యడాగమంలో సంధి నిత్యమనాలి. ఇందులో ప్రక్రియాగౌరవం తప్ప ప్రయోజనం ఉందా? తెలుగువ్యాకరణాలపై సంస్కృతప్రాకృతవ్యాకరణాల ప్రభావం (పుట 14,15) ఇది ప్రక్రియాగౌరవమే అని స్పష్టం చేసింది.

అయితే పేటికే టుగాగమాదిసందర్భాలలో హల్లులనే ఆగమంగా చేయడం గమనించవచ్చు.

కొంతవరకు కీపేటికా ప్రభావంచేతనే కావచ్చును పర్వస్వం సైతం 'య' వర్ణాన్నే ఆగమంగా చేసి "యడాగమము గల్గి మీ + యిల్లు-మీయిల్లు అని యగును. ఆగమయకారంబునత్వంబునకు సంధి నిత్యము. ప్రయోగసామర్థ్యమువలన ఈనియమమును పాటింపగా పై రూపము లేర్పడును (74) అన్నది.

యట్టులోనిఅకారానికి నిత్యసంధి చేయడానికి ప్రత్యేకమయినప్రమాణం ఏదీ లేదు గాబట్టి ప్రయోగసామర్థ్యంచేత ఈ నియమాన్ని పాటించాలన్నమాట. కానీ ప్రయోగసామర్థ్యాన్నిబట్టి యడాగమాన్నే పాటిస్తే ఈవిధానంగూడా అనవసరమే అవుతుంది గదా అనిపిస్తుంది-లేకపోతే పై రూపాలు కావు అనే మాట నిజమే. కాని రూపాన్ని లక్షణం సాధించడం ప్రారంభించినప్పుడు సముచితంగా సాధించాలి కాని సగం చెప్పి మిగిలినదాన్ని ప్రయోగాల్నిబట్టి గ్రహించమంటే చెప్పినఈసగంమాత్రం ప్రయోగాలను బట్టే యెందుకు గ్రహించకూడదూ అనేఅనుమానం రావడం కూడా సహజమే.

దీనికంటె ప్రయోగసామర్థ్యాన్నిబట్టి యిక్కడ ఆగమంగా వచ్చేదే యకార మని చెప్పుకొంటే సంధిచేసే శ్రమయినా తప్పుతుంది.

మాయ + అమ్మ మాయమ్మ అనే విధంగా పినివినికిడిలో సంధి ఐన స్ఫూర్తి కలగడం లేదు. రాముఁ డతఁడు ఇత్యాదుల్లోవలె పూర్వ స్వరస్ఫూర్తి (కొంచెమైనా) లేదు. దీనిఁబట్టి ఆగమం యకారపు పొల్లే అని ఉచ్చారణ కూడా స్పష్టం చేస్తుం దనవచ్చు.

కాగా ఇక్కడ సర్వస్వం మీాయు + ఇల్లు మీాయిల్లు అనే రీతిగా సంధి చేసినదానికి చూపిన ప్రమాణం సరిగా లే దని చెప్పవలసి వుంది. పేటికకంటె భిన్నగా ఈసర్వస్వం టుగాగమాన్ని సైతం స్వరసహితంగా చూపించి ఉత్వసంధి చేయడం ఇంకా విశేషం. ఇట్లా అన్నిచోట్లా ఆగమాన్ని స్వరసహితంగానే చూపిస్తున్నప్పటికీ 'గుణ + ఇయ్ ఇంచు (384) అని యడాగమాన్ని మాత్రం స్వరవిరహితం గానే చూపించకతప్పలేదు. సూరిగారే గుణ ఇయ్ ఇంచు అనే తీరుగా ఉకారరహితంగా చూపించారు గదా మరి. ఇక్కడ సర్వస్వం తాను అనుసరిస్తూవచ్చినపద్ధతినిబట్టి స్వరసహితంగా చూపిస్తే సూరివాక్యాలకే విరుద్ధం అవుతుంది. అంటే ఆగమం ఎప్పుడూ స్వర సహితంగానే రావాలి. అని నియమించడానికి వీలు లేకుండా పోయింది. అదిగూడా లక్షణకర్తయే ఐనసూరివచనాలనుబట్టి మిగిలినచోట్ల సూరి ఆగమస్వరూపాన్ని విడిగా చూపించ లేదు. (దుగాగమాదుల్లో లక్ష్యాల్లోనే ఆగమం స్వరసహితం అని స్పష్టం అవుతుంది.) కాబట్టి ఆగమం ఎక్కడైనా స్వరసహితంగానే రావాలి అని నియమించు కొన్నా ఇక్కడ వైరుధ్యం లేదు. కాని సూరి స్పష్టంగా ప్రదర్శించిన చోట మాత్రం ఆనియమం చెల్లదు.

నిజాని కిక్కడ సూరి 'ఇయ్' అని చూపించాడు గాబట్టి సరిపోయింది కానీ లేకపోతే యీవ్యాఖ్య గుణ + ఇయు ఇంచు అనేవిధంగా ఆగమాన్ని స్వరసహితంగానే చూపించి అపదాదిస్వర

సంధి చేసి వుండేదే అని మిగిలిన టుగాద్యాగమస్థలాలు స్పష్టం చేస్తున్నాయి.

సూరి ఇయుడాగమస్థలంలో ఆగమాన్ని 'ఇయ్' అని ఎలా చూపించాడో అదే పద్ధతిలో టుగాగమాదుల్లో మనం పొల్లు ఎందుకు గ్రహించకూడదు?

ఇయుడాగమాన్ని ఇయ్ అనేవిధంగా చూపడంచేత (తెలుగులో విశేషంగా) టిత్తులైన ఆగమాలైనా కనీసం స్వరసహితంగా వస్తాయి అని నియమించడానికి వీలు లేకుండా పోయింది.

పేటిక ఆగమవర్ణంలో నిస్వరం ఎక్కడ ఉచ్చారణకోసం ఉన్నదో ఎక్కడ కాదో నిర్ణయించడం శ్రమ కాబట్టి నిర్దిష్టస్వరసహితంగానే చేయాలన్నాడు. అంటే ఆగమంగా చెప్పినదాన్లో అచ్చు నియతంగా నిల్చి తీరాలి అనే నియమం లేదని స్పష్టం చేసినట్లయింది.* కాకపోతే గుర్తించడం శ్రమ కాబట్టి అనిచోట్లా నిర్దిష్టస్వరంతోనే చేయాలని సిద్ధాంతం చేయడం జరిగిందన్నమాట.

---

* పాణినీయంలో రుగ్రికౌ చ లుకి (7-4-91) అనేచోట (వరివృత్తితి) రివర్ణం ఇత్వంతో ఆగమంగా వచ్చింది. "ఇష్ఠస్య యిట్చ" (6-4-159) అనే సూత్రంభాష్యంలో "కిమయం యిశబ్దః ఆహోస్విద్యకారః. కిం చాతః యది లోపోఽప్యనువర్తతే తతో యిశబ్దః, అథ నివృత్తం తతో యకారః" అని వున్నది. బహోర్లోపో భూ చ బహోః (6-4-158) అనే పూర్వసూత్రంనుంచి లోపః అనేది అనువర్తిస్తే (భూ + ష్ఠ) యివర్ణం ఆగమం అవుతుం దని (భూ + యిష్ఠ) అనువర్తించకపోతే ఇవర్ణం లోపించకుండా భూ + ఇష్ఠ అని వుండే యకారంమాత్రం ఆగమం (భూ + య్ + ఇష్ఠ) అవుతుం దని చెప్పబడింది. దీనినిబట్టికూడా ఆగమంలో నిర్దేశింపబడ్డస్వరం తప్పకుండా ఆగమం కావలసినఅవసరం లే దని స్పష్టం అవుతున్నది. యమరమనమాతాంసక్చ (7-2-72) అనేచోట అకారం ఉచ్చారణార్థమే. భువో వుగ్లుఙ్లిటోః (6-4-88) అనే చోట ఉకారం ఉచ్చారణార్థం ఇట్లా ఇతరస్థలాల్లో గమనించవచ్చు.

అయితే శ్రమ అవుతుంది గదా అని అట్లా నిర్ణయించడం మానేస్తే మాయ + అమ్మ అన్నపుడు సంధి యెట్లా? కఱకుటమ్మ ఇత్యాదుల్లో మళ్లీ ఉత్వసంధి. ఇట్లా ఆగమం చేసింతర్వాత ఐనా శ్రమ తప్పడం లేదు గదా. ఆ శ్రమేదో ముందే పడి నిర్ణయం చేస్తే మిగిలినవాళ్లకి ఆమాత్రం శ్రమ కూడా ఉండదు. ఇయడాగమం విషయంలో ఇప్పుడు మన కేముంది శ్రమ.

లక్ష్యానుగుణంగానే ఆగమంలో స్వరం ఉచ్చారణార్హమో కాదో నిర్ణయించడం ఉచితం. ఈవిషయాన్ని సూరిగారిమాటల్నిబట్టే మనం గ్రహించవచ్చు. దుక్కు ఎముక్కు ముక్కు పుక్కు - ఇత్యాద్యాగమాల్లో సూరి వండుదురు వండెదను వృక్షములు ధేనువులు ఇత్యాదిగా స్వరసహితంగానే ఆగమం చేసి చూపించాడు. అంటే అక్కడ ఆగమంలో స్వరం ఉచ్చారణార్హం చేర్చింది కా దన్నమాట. ఇక్కడ ఆగమాల్లో స్వరం నిల్చి ఉన్నది గదా అని అన్నిచోట్ల స్వరం నిల్పవలసిందేనా? అంటే ఇయుట్టులో 'ఇయ్' అనే సాధించాడు. కాబట్టి అట్లా ఆగమంలో స్వరం నిల్చి ఉండాలనేనియమం లేదని స్పష్టం. ఎందుకని? వండుదురు అన్నచోట లక్ష్యాల్లో 'దు' ఉంది. భుజియించు అన్నపుడు 'ఇయు' నిల్వలేదు. కాబట్టి 'ఇయ్' అనేదే ఆగమం. ఆదేవిధంగా మాయమ్మ ఇత్యాది లక్ష్యాలనుబట్టి యడాగమంలో కూడా అకారం ఉచ్చారణార్హంకాదనే అని నిర్ణయించడం ఉత్తమం.

యడాగమం అత్వసహితంగానే వస్తుందని సూరి భావించి ఉన్నట్లైతే అక్కడ సంధి చేయడానికి తగిన లక్షణం ఏర్పాటు చేసి ఉండేవాడే అసలులో వైరుధ్యం లేదు.

అయితే ఎకారాగమం, లడాగమం, నగాగమం ఇత్యాదుల్లో అకారం ఉచ్చారణార్హం కాదనీ యడాగమంలోమాత్రమే అకారం

ఉచ్చారణార్థ మనీ యెట్లా చెప్పవచ్చును? అని అనుమానించటానికి కూడా వీలు లేదు.

దుగాగమాల్లో ఉకారం నిల్చి ఉండగా ఇయుడాగమంలో ఉచ్చారణార్థం గా లేదా?

ఇంక చెప్పినను రాములను రామునకు ఇత్యాదిగా ఆ ఆగమాల్లో అత్వం నిలిచి ఉంటున్నది. కానీ యడాగమంలో ఉన్న అత్వం ఎక్కడైనా నిలిచి ఉంటున్నదా? అట్టి లక్ష్యాలేవైనా ఉన్నాయా? మాయ (య?) అమ్మ అనే రూపాలు ఎక్కడ చూపించగలము. అంటే 'య' అనే అక్షరాన్ని ఆగమం చేసినా అకారం ఎక్కడా నిలవటం లేదు గాబట్టి ఏదో ఒక మార్గంలో యడాగమత్వానికి సంధి నిత్యం గావస్తుందీ అని చెప్పాలి.

ఇదే విధంగా టుగాగమం రుగాగమం నుగాగమం మొదలైనస్థలాల్లో కూడ ఉత్వం నిలువదు. కాబట్టి లక్ష్యానుగుణంగా వాటిల్లో ఉన్న ఉకారం సైతం యడాగమంలో అకారం లాగానే ఉచ్చారణార్థం కూర్పబడింది అని గ్రహించవచ్చును.

ఇంకా మిగిలిన వ్యాఖ్యాతలు పెక్కుమంది యడాగమంలో అకారం ఉచ్చారణార్థమే అని నిర్ద్వంద్వంగా స్పష్టం చేసిఉన్నారు కూడ. 'యట్' అను దానిలోని యకారము మీది అకార ముచ్చారణార్థకము (వ్యా. సం. స. 217) అని వజ్ఝలవారు స్పష్టంచేశారు. కొన్ని వ్యాఖ్యానాల్లోనే చెప్పివుండటం గమనించవచ్చు.

కాగా సూరి చెప్పిన ఈ యడాగమవిధానం మిక్కిలి సమంజసంగా ఉందని దీని నింకా అల్పాక్షరంగా చేస్తే సంధిగతాది దోషాలేర్పడతాయనీ గుర్తించవచ్చు. యకారాన్ని ఆగమంగా విధిస్తున్న ఈ సూత్రం నిర్దుష్టం. అవశ్యగ్రాహ్యం.

## టిత్తు - కిత్తు :

ఈయాగమమందలి విశేషమును తె.వ్యా.వి. ఇట్లు చెప్పినది. 'ఆగము' మెప్పుడును సంధిని వారించుటకే వచ్చును గాని చినగా. దీనికిఁ గలమహత్తరతారతమ్యమును జూపించుచు టిత్కిత్సంజ్ఞల నేర్పఱచెను. అదియుఁ గాక యడాగమేతరంబులు కదాచిత్తుగా వచ్చునవి. యడాగమమును టిత్సంజ్ఞచే తక్కిన యాగమములనుండి వేఱుపఱచుటలో సూరిపాండితి 'సాన్యతో దర్శనీయము' - అనఁగాఁ గిత్తులుగాఁ జెప్పిన యాగమములు సార్వత్రికములు గా వన్నమాట. వేదరాలు గుణవంతురా లనుచో విధింపఁబడిన 'రు' కిత్తే. కాని యిది నిత్యముగానే యగుచున్నది. అన లాగమము సార్వత్రిక మగుట టిత్త్వమునకును, కాకుండుట కిత్త్వమునకును ప్రయోజనములుగాఁ జెప్పుట, లేక టిత్కిత్త్వములవలన నాయర్థమును సిద్ధించుట కాధారము (తెలుఁగు వ్యాకరణములందును) నాద్య వ్యాకరణములందుండి చూపినఁ జక్కగా నుండెడిది.

యడాగమ మనుటవలన ఆ + యన్నము ఇత్యాదులలో ద్రుతికము మీఁది హల్లునకు ద్విత్వము వచ్చుట ప్రయోజనముగా (టిత్త్వమువలనఁ బరపదాద్యవయవ మగుట గావున) ఇచ్చటి టిత్ప్రయోజన విశేషమును ఘం. స్పష్టము చేసినది.

## యశ్రుతి - యడాగమము :

తె.వ్యా.వి. ప్ర అ. అచ్చునకుఁ బర మైన యచ్చును యశ్రుతిగాఁ జేర్కొనుటచే యడాగమప్రసక్తి లేదు. సంధి లే దని చెప్పుచు యడాగమమును విధించుటయు నొకరీతి సంధి గావించినట్లే యగును. ఆగమమును విధించుట ప్రకృతిభావమునకు విరుద్ధము. ప్రకృతిభావము

కూడ పంచసంధులను నొకటిగానే పరిగణింపఁబడును గదా (398) యున్నది. ఆగమముగాఁ జెప్పిన సంధి యవు ననినఁ బ్రకృతిభావ మనవలెనా? ప్రకృతిభావమును సంధియే యైనదే. సంధి కాకుండ వలె నన్న యడాగమము చెప్పక ప్రకృతిభావ మనియు ననక యే మనవలెను? ప్రకృతిభావమును సంధి యని గుర్తించినపుడు సూరి ప్రకృతిభావ మనక యాగము మని యని విచారించుటవలనఁ బ్రయోజన మేమి? అనఁగ యడాగమము సంధికార్యము గా నన నేల? సూరి యతఁడు నిత్యమో నిత్యాదులం దున్న యకారవకారములు సంధివశంబున వచ్చినవి కాని పూర్వసిద్ధంబులు గా వని సూరి దీనిని సంధికార్యముగా స్పష్టము చేసియున్నాఁడు. సంధి లే కనుచు సంధి కార్యము చెప్పుట యేమి? అని తె.వ్యా.వి. ఆక్షేపణ. కాని యెల్లయెడల సూరి సంధిపదమును బరస్వరాదేశరూప మైనయర్థము లోనె ప్రయోగించె నని వివరించిన తె.వ్యా.వి. (399) ఇచ్చట సంధి పదమున కాయర్థము గాక విడచి సామాన్యార్థము గైకొనుట సక్రమ ముగాఁ గనిపింపదు.

సంధికార్యము గాఁబున నాగము మని చెప్పకుండ యశ్రుతి యని చెప్పినచింతామణికారుల యుక్తి మనుట కూడ యుక్తముగా లేదు. యశ్రుతి యన్న నంగా శ్రుతిలోమాత్రమే యకార ముండును గాని లేఖనమం దుండ దని తె.వ్యా.వి. అభిప్రాయము. పైఁగా 'యశ్రుతిత్వం సంహితాయాం బాలవ్యాకరణకారస్య' మ్మను నహోబలపతివచనమునకు సంహితలో అప్పు యకారముగానే కనిపించు నని ప్ర. ఆ.ని సంప్రదాయమునే యనుసరించె (400) నని యాయభిప్రాయమే యహోబలునికిఁ గూడ నున్నట్లు చెప్పుట జరిగినది. కాని యహో. లెస్స యగు రో యావి యిత్యాదిగా యకారమును జూపెనే

కాని తెన్న అగు, రాఁ ఈవి, అనుకృతిగా నుంచి యకారము కనఁబడకుండ వినఁబడుటమాత్రమే జరుగు నని చెప్పినతావు లేదు. అయిన లఘుయకారము వినఁబడుటయో కాని తెలుఁగునఁ గనఁబడ దన్నమాట.

తె.వ్యా.వి. ప్రకారమైనను తెన్న అగు నని యుండి యకారము వినఁబడవలె నంటే. అప్పు డాగమరూపమైనసంధి కూడ లేదు గాఁబట్టి యిది ప్రకృతిభావమే యగు నని తె.వ్యా.వి. అభిప్రాయము. మూలమునందలిభావమును పరిశోధించుచు అప్పకవి ప్రకృతిభావ మని చెప్పినట్లు తె.వ్యా.వి. చేర్చున్నది. (399) యకారము నాగమము చేయుచునే యప్పకవి ప్రకృతిభావ మనెను భేదము గుర్తింపఁబడున దెట్లు? అసలు మూలమున దీనిని ప్రకృతిభావ మని చెప్పుట గానరాదు. పోనీ మూలాభిప్రాయము ప్రకృతిభావ మని మన మూహించుకొందము. అయిన బాధ యేమి? ప్రకృతిభావము కూడఁ బంచసంధులలో నొక టనునభిప్రాయమును తె.వ్యా.వి. స్పష్టము చేసినదే కద. కాఁబట్టి యశ్రుతి యనుటచేత యకారము వినఁబడు నని వారి అతఁ డని యుండునే కాని యకారము కనఁబడు ననియు వారి యతఁ డని యుండ దనియుఁ జెప్పుటవలనఁ బ్రయోజన మేమియు లే దన్నమాట. కాఁగా సంధి లేనియిచ్చోటఁ బ్రకృతిభావ మున్న దన్నను నది యొకరకము సంధి యయి సంధి లేనిచోటఁ బ్రకృతిభావ మను సంధి యుండుట తప్పుట లేదు. కాఁబట్టి ప్ర.అ. చూపినదానిని తొలి నాఁటివ్యాకర్త లంగీకరింపక మార్గాంతర (388) మవలంబించుటవలన నష్ట మేమియు లేదు. అసలు యకారము నాగమముగాఁ జెప్పుట మార్గాంతర మగునా? చింతామణిమార్గమే యని గుర్తింపవచ్చును.

యశ్రుతి వచ్చు ననఁగా యకారమాగమముగాఁ జేరదని చెప్పుట కుదురునా? 'ప్రాణాత్ప్రాణో లఘు ర్య స్సాన్త్ర త్స హల్ప్రాచ్చ భవేత్ క్వచి' త్తనువి.వి.వచనములో యశ్రుతి కాక యకారమే చెప్పఁబడినది.

బహుళము:

ప్రవృత్తి, అప్రవృత్తి విభాష, అన్యకార్యము అనునాల్గింటిలో ఏమూఁడింటి నైన నిరూపింపఁగల్గినపుడే దీని నుపయోగించు టుచిత (50) మన్నది బా.వి. కాని యే నైన రెండింటి నుద్దేశించి యైనను బహుళశబ్దము నుపయోగించుటలో ననౌచిత్యము లే దన వచ్చు. సూరి చరిత్రాదులమువర్ణకమునకు లోపమును బహుళముగా విధించియున్నాఁడు. అచట నన్యకార్యము గానరాదు. విభాషను, ప్రవృత్తిని సూరి ప్రదర్శించియున్నాఁడు. ఆకార్యమును చరిత్రాదులు అని కొన్నిశబ్దముల కుపదేశించుటచేత నక్కడ నప్రవృత్తి యుండదు. వనము ఇత్యాదులలో ములోపము లేదు. కాని యట్టివానిని చరిత్రాదులలోఁ జేర్పరాదు గదా. ఇఁక నప్రవృత్తి యెక్కడ? ప్రవృత్తి విభాష యన్నవి రెండే యక్కడ బహుళశబ్దమునకుఁ బ్రయోజనము లవుచున్నవి. అట బహుళశబ్దము నుపయోగించు టుచితము కా దనక తప్పదా?

త్వసంధి - అప్రవృత్తి:

స్త్రీవాచకతత్సమసంబోధనాంతములకు సంధి లే దని సూరి చెప్పుటనుగురించి బా.వి. ఇట్లు వివరించినది. 'అమ్మచ్చెను అని సంధి గావించినచో అమ్మ + ఇచ్చెను, అమ్మి + ఇచ్చెను, అమ్మ+ ఇచ్చెను-వైవిధ్యమున కవకాశ మిచ్చును గాన నిట్టిసంధి నిషేధింపఁబడినది (సం.) కాని యిది యథార్థముగాఁ గానరాదు. సందేహము

గలుగునట్లున్న సంధి మానుట యన్నది శాస్త్రానుగుణము గాదు. పచ్చాకు అనుచోట పచ్చి + ఆకు, పచ్చ + ఆకు అని విభాగింప వీలున్నది. కాఁబట్టి సంధి చేయుట తప్పుగలదా? వెల + ఆలు వెలాలు అని సంధి చేసిన నట వైవిధ్యమున కవకాశము గలుగు ననియే సంధి వారింపఁబడినదా? ఇట్లే దూతితఁడు. మొ॥ వచ్చిచ్చె ననుకేతిసంధి యేల నిషేధింపఁబడినది? కావున వైరుధ్యమున కవకాశము గలదు అనుకారణముతో సంధి నిషిద్ధమైన దనుట కుదురదు. ఇంకఁ గవిప్రయోగములలో సంధి లేదు గావున లక్ష్యానుగుణముగా సంధి నిషేధింపఁబడిన దనుటయే సమంజసము. కవు లట్లు ప్రయోగించుట కేది కారణమో శబ్దశాస్త్ర మూహింపఁ బని లేదు. అతివ్యాప్త్యవ్యాప్త్యాదిదోషరహితముగా నిట్లు నిర్ణయించుట కవకాశమును లే దనవచ్చు.

ఆతరువాత నథర్వణుఁడు కుత్రచిత్తని సంస్కృతసమాచ్ఛనకు (అకారమునకును) సంధిని జెప్పెను. ఐనను దానికిఁ బూర్వకావ్యాలలోఁ బ్రయోగము లే దనుటను (తె వ్యా.వి. 429) బరిశీలించిన - కవిప్రయోగాలలో సంధి లేకపోవుటయే యీసంధి నిషేధమునకు మూల మని గుర్తింపవచ్చును. కవు లేల సంధి చేయలే దన్నది చారిత్రకాంశ మైనఁ గావచ్చును దానితో నీనిషేధమునకు సంబంధము లేదు.

బా.వి. 'సంస్కృతసమశబ్దముల స్వరూపమును యథాతథముగ పోషించుటకును నీసంధి నిషేధింపఁబడెను' (౬౦) అనుటయు నట్లే యసంగతము. ఇట సముచ్చయార్థకము పూర్వోక్తమగు వైవిధ్యమును సంగ్రహించును. కాని దూతితఁ డనుచో వైవిధ్య మెట్టిదో నిరూపింపఁబడ లేదు. అది యిట్లుండఁగా సంస్కృతసమస్వరూపము యథా

తథముగ నుంచుటకు సంధి నిషేధించె ననుట యెట్లు? వ్యాకర్త చేయవలసినపనియా యిది? ఆశబ్దములరూపు నిలుపుటకై కవులు సంధి చేయకయె ప్రయోగించిరి (కాన సంధి నిషిద్ధమాయె) అనుట యే సుచితము గాని యందులకై వ్యాకర్త శాసనము చేసె ననుట యొప్పదు. లాక్షణికుడు శబ్దస్వరూప మె ట్లున్నదో చెప్పును గాని యె ట్లుండవలెనో నియమించునా! అట్లు నియమించినట్లు కన్పట్టిన నంత్రకుముం ద ట్లుండుటయె కారణము గదా. సంస్కృతసమముల స్వరూపమె యథాతథముగ నేల పోషింపవలయును? ఆచ్ఛికశబ్ద స్వరూపము వికృత మైనను నేల యిబ్బంది యుండ దిత్యాదిసందే హములకు సమాధాన మేమి?

పిదప 'సంబోధనాంతములకుమాత్రము ఈసంధికి ప్రయోగములు కానరావు. సంబోధనస్వరూపమె యపుడు తారుమారగును' (51) అన్నది బా.వి. కాని యిట్టిసంధిని వజ్ఝలవారు చూపిరి. (తె.వ్యా.వి. 427)

ఇట్టివే పాల యలుక, సీవే యీాపని, సీవ యీాపని ఇత్యాదులు అప్రవృత్తికి నిదర్శనములు (51) అన్నది బా.వి. ఇందు సీవే యీాపని యనుచో నత్వసంధి కప్రవృత్తి యనరాదు. అట నత్వమే లేదు గదా. అద్భినాచ్చుప్రసక్తి యిట నేల? సీవ యీాపని యనుదానియర్థముగా సీవే యీాపని యన్నది చూపవచ్చును. బా.వి. చూపినక్రమమునుబట్టి యట్టియుద్దేశము బా.వి.కు లే దని గుర్తింపవచ్చు. కాఁగా నిట నప్రవృత్తిసందర్భమున, సీవే యీాపని యన్నది చూపుట సంగతము గా దని స్పష్టము.

'సంస్కృతీయాకారసంధికి స.సా.సం. తామరసనేత్ర లిండ్లు' ననుదాని నిచ్చుటను జేర్కొన్న తె.వ్యా.వి. అటువంటివే గ్.ప్ర.

వేరొక్కన్న దనుచు రాజులొద్ద ము॥, భారతప్రయోగములు గూడఁ జూపినది. అనఁగా నీయవి సంస్కృతీయాకారసంధు లనియే తె.వ్యా.వి. కూడ నభిప్రాయపడిన దని స్పష్ట మగుచున్నది. నన్న యాదో నేసియున్నచో సంస్కృతీయాకారసంధి ప్రాచీనకృతులందు న్యూగ్ర్య మనియు, నాధునికకృతులందును నొకానొకచోఁ గనఁబడుచున్న దనియు సూరి చెప్పుట లక్ష్యవిరుద్ధ మని నిర్ణయింపవలసినదే యగును.

కాని యచ్చటియకారము సంస్కృతీయ మన వీలు లేదు. సంస్కృతీయ మనఁగా సంస్కృతసమములకుఁ జెందిన దని యభిప్రాయ మేమో. రాముఁడు ఇత్యాదుల నత్వము సంస్కృతీయము యగునా? రాజుల, తామరసనేత్రల అనుకీర్తిస్థలములలోనియత్తు లడాగమమునకుఁ జెందినది. లడాగమము సంస్కృతము కాదు గదా. అనఁగా సంస్కృతీయ మనుచో సంస్కృతసమములకు సంబంధించిన దని కాక సంస్కృతమునకు సంబంధించిన దనియే గ్రహింపవలె. అప్పుడే సంస్కృతీయాకారమునకు సంధినిషేధమును బిదపఁ జెప్పినసూరివివరణమును సరిపడునుఁ అహోబలుఁ డిట స్థానివద్భావప్రసంగము చేయుట గనునార్హ మైయున్నది. రాముఁ డనుకీర్తిస్థలముల నత్తును సంస్కృతీయ మైన "కుత్రచి త్సంస్కృతీయోఽపి ప్రాణోఽస్వత్ర చ్యుతో భవే" త్తని దానికిని సంధ యగు దని చెప్పవలసినయావశ్యకము తప్పదు.

వా౭తెః. మొదలైనచిం. వి.వి.లప్రస్తావనలో తె.వ్యా.వి. "వావికల్పవిభాషలే కాక సంస్కృతమునఁ గీయర్థమునందు అన్యతరస్యాం ఉభయథా, ఏకేషాం" అనియు వాడుదురు. తెనుఁగున నీవాడుక కని పింప" (4౨౮) దన్నది. తెనుఁగున నాటలోఁ జిం, వి.వి. లనుగూడఁ దె వ్యా.వి. ఉద్దేశించిన దేమో (వాశబ్ద మైనను సంస్కృతమం దున్ననే ప్రయుక్త మగును గదా.) అట్టియుద్దేశ మున్న నది సరి కాదు. ఏ

దంతతా చ నామ్నా మన్వంతరస్య మియాన్తానామ్, చరితాదికశబ్దానాం రూపం తూథయథా భవే త్తని చిం., వి వి.లు ప్రయోగించుట కలదు. టాదవిభక్తౌ నిర్ణేత్యేకే యనుచో 'ఏకే' యని గలదు. తెనుఁగున వ్రాయఁబడినవ్యాకరణములందు లే దన్న నట్టిశబ్దములఁవాడుక తెలుఁగులోఁ గుదురునది కా దనుట విస్పష్టము.

**ఏమ్యాదులు :**

ఇక్కడియణాదేశమునుగుఱించి బా.వి. 'తెలుఁగుపదములకట్లు సంస్కృతసంధులు కావించుటలో గ్రామ్యత్వమే కాక పొసఁగ. అచ్చులు లోపింపక నిల్చియుండుట మొదలగుగుణములు గలవు'(52) అన్నది. ఏమి+ఆది అనుచోటఁ దెలుఁగుసంధి చేసిన నేమాదు లని పూర్వపరస్వరాలకుఁ బరస్వర మేకాదేశము గావచ్చును. తెలుఁగు సంధిలోఁ గూడ నిక్కడ నచ్చు లోపించుట యన్నది శాస్త్రము ప్రకారము లేదు. సంస్కృతసంధిలో నికారమునకు యకార మగుట ద్వారాన నిత్తు గనఁబడుట లేదు గదా. నిజమునకు నచ్చు నిలిచి యుండుట యనుగుణము సాధింపవలె నన్న సంధి చేయక యడాగమముతోఁ దెలుఁగుసంధికార్యములోనే 'ఏమియాదు' లనుట యొప్పును. అయినను గ్రామ్యత్వముకొఱకో, యచ్చు నిలిపి యుంచవలె ననియో తెలుఁగున సంస్కృతసంధికార్యములు చేసెద మన్న నది సమంజస మగునా?

ఏమి యను తెలుఁగుశబ్దమును సంస్కృతములోని కనుకరించుటచేత నది సంస్కృతమే యయినది గావున (ఆదిశబ్దముతో సమాసము సంస్కృతముననే చేయఁగా) నట సంస్కృతసంధియే చేయవలె. 'ఏమ్యాది' యన్నసిద్ధసమాసమే తెలుఁగునఁ బ్రాతిపదికముగా నిల్చును. గ్రామ్యత్వము మున్నగునవి యక్కడ లే దనుకొన్నను

నిట సంస్కృతసంధి చేయకతప్పదు. సంస్కృత మగుట సంస్కృత సంధి యైన దనుట సమంజసము. ఇది యాకృతిగణం బిత్యాదుల పోదుపు వెం॥ కావలె నన్నను సంస్కృతసంధి చేయవచ్చునా ?

ఆకృతిగణమునకు నియతగణము వ్యతిరేక మనుబా.వి.అభి ప్రాయము (52) విశేషము.

ఏమ్యాదులకు సంధి వికల్ప మనుటను తె.వ్యా.వి. సమ్మతింపలేకపోయినది. "ఈసంధిసందర్భమున చి.సూ. విశాలమార్గము ననుసరింపకపోవుట కొఱత యనియే యనిపించును. వైకల్పిక మనక వ్యవస్థితవిభాషగా వచించిన కొంత మేలుగా నుండెడిది' (414) వ్యవస్థిత విభాషగాఁ జెప్పవలె ననుట యుచితము గాదు. విభాషగాఁ జెప్పిన నావిభాషకే యాయాయర్థములను వ్యవస్థ చేసికొనుట సంప్రదాయము కదా. కాఁబట్టి విభాషగాఁ జెప్పఁదగు నన్నఁ జాలును. విభాష, వికల్పము పర్యాయములే. కావున నవసర మైనయర్థము వికల్పమునకే నియమించుకోవచ్చును గదా. అపుడు విభాషాపదము సాధింపఁగల్గిన ప్రయోజనము వైకల్పికశబ్దము కూడ సాధింపఁగలదు. కాఁబట్టి యర్థ విశేషముకొఱ కైన విభాష యని చెప్పనక్కఱ లేదు. (చూ. వ్యాస్యము మీఁది ఖండము.)

ఇంక నసలు సూరిలక్షణములోఁ గొఱత యేమి? చింతామణి తదాదులకు వైకల్పికసంధిని, గిమాదులకుఁ బ్రాయికసంధిని జెప్పఁగా సూరి యారెంటిని గలిపి వైకల్పిక మనుటయా? కాని తదాదులకుఁ గిమాదులకు సంధిలోని పైభేదము నన్నయభారతములో (కూడ నిశ్చయించుటకు వీలు లేదని గ్రంథాంతరమున స్పష్ట మగును) మాత్రమే యనియుఁ దరువాతికవిప్రయోగములలో నన్నింట వికల్ప మనియు వజ్ఝలవారు చెప్పుటను తె.వ్యా.వి. (418) గుర్తించియే

యున్నది. కాఁబట్టి సూరి యాక్షేపమును జూప నక్కఱ లేదు. (కాన నది కొఱత యన లేము.)

కొందఱు కిమాదులకు సంధి బహుళ మని చెప్పి ప్రవృత్త్యాదులను జూపిరి. బహుళ మనక పోవుటవలన సూత్రలక్షణము సంకుచిత మైన దని తె.వ్యా.వి. అభిప్రాయము గావచ్చును. కాని యదియు యుక్తము గాదు.

ఇత్తునకు సంధి నిత్యముగా వచ్చుస్థలము లున్నవా? మగనాలు (తె.వ్యా.వి. 411) అనుస్థలములో మగనివాం ప్రమనీతి రూపము లున్నవి కదా. (412) అందుకే సు వ్యా. (పుట 50) మగనా లనుచోట సంధి వికల్ప మన్నది. "కంచంత" అనుచోట నిత్యమా. (కంచియంత యన్నది నష్టమా? అంతశబ్దపరకత్వమున సంధి యిటఁ గూడ నిత్యము గామి స్పష్టము.) ఆర్యాద్యర్థకపరకస్థలములలోని సంధి విశేషారంభము కలది. కావున నిట 'నిత్యప్రవృత్తిఁ' జూప నవకాశము లేదు. ఆం. కౌ. (77 అంకము) (కొన్ని వ్యాకృతులు) 'కిమాదేర్బహుళ'మ్మని సూత్రించి తింటి నన్నము, కంటి నచ్యుతు ఇత్యాదిస్థలేషు బహుళగ్రహణసామర్థ్యాన్నసంధి' యని వివరించుట గాన వచ్చు. తె.వ్యా.వి దీని నంగీకరించుచు 'ప్రవృత్తిపక్షకన్న అప్రవృత్తిపక్ష నివిషయము బలీయము గాన బహుళగ్రహణ ముచితమే యగు (414) నన్నది. దీనినిబట్టి యప్రవృత్తికొఱకే 'వ్యవస్థితవిభాష' యవసర మని భావించినట్లు స్పష్ట మగుచున్నది. బలీయమే యన్నను ప్రవృత్తిస్థలా లొకటియో రెండో చూపవలసినది. ఏ మైనఁ గొఱత యప్రవృత్తిని సాధింప లేకపోవుటయే యన్నమాట. కాని యప్రవృత్తి నిక్కడ సాధింపవలసిన యవసరమే లేదు. ఏమ్యాది యాకృతిగణము. అనఁగా సంధి గన్పించునట్టియిట్టి స్థలములను ప్రయోగానుగుణముగా

నేమ్యాదులలోఁ జేర్చుకొనవలెను. అంతే కాని 'ఆకారమునుబట్టి' (బా.వి. 52) ఇవంతము లైనశబ్దము లెల్ల నేమ్యాదులలోఁ జేరు ననరాదు. సంధి లేనిస్థలముల నేమ్యాదులలోఁ జేర్చుకొను టెట్లు కుదురును. ఏమ్యాదులలో లేనిశబ్దమునందలి యిత్తునకు సంధి ప్రాప్తి చుటయే యుండదు. కాఁగా నేమ్యాదిగణితము గాకపోవుటవలన నీలక్షణస్థలమున నప్రవృత్తి చెప్పనక్కఱయవసర మేది? పైఁగా నప్రవృత్తిఁగా వా.వృ. చూపిన (తెవ్యావి కూడ నంగీకరించిన దేమో) అనఁగ రెండి యతఁ డనుచోటిసంశ్రభావమును బా. వ్యాకరణము 'క్త్వార్థం బైనయిత్తునకు సంధి లే' దనుసూత్రముతోఁ బ్రత్యేకముగా నిషేధించియే యున్నది. 'క్త్వార్థేఽ న భవేత్సదా' యనునంటిలక్షణము లేకున్న వ్యాకృతిలో నటువంటిసమన్వయ మనవసరము గావచ్చునేమో కాని సూరివ్యాకరణమునఁ గాదు. కంటి నంబుజాక్షు, తింటి నన్న మనుకృతిస్థలములలో కంటిన్, తింటిన్, అనునవి ద్రుతప్రకృతికాలు కాఁబట్టి (క్రియాపదంబులం దిత్తున కని ప్రాప్తమైనసంధి) 'యుష్మదాదులకుఁ దప్ప ద్రుతప్రకృతికములకు సంధి లే' దనులక్షణముచే సంధినిషేధము నందుచున్నవి.

మొత్తముమీఁద 'అప్రవృత్తి' యను దానియవసర మిట లేమి దానికయి వ్యవస్థ (అంగీకరించి యభాషయు) అనవసరము

బహుళముంపలివిభాషాస్థలములు 'వైకల్పిక...'తో సాధింపఁబడియున్నవి. ఇట నన్యకార్యము నెవ్వరును బ్రస్తావింపలేదు.

కాఁబట్టి యేమ్యాదిసంధిని సూరి బహుళ మని గాని 'వ్యవస్థిత' విభాషగాఁ గాని చెప్పనక్కఱ లేదు. సూరి వైకల్పిక మనుట సముచితమే. అం దెట్టికొఱతయు లే దని గ్రహింపఁదగును. బా.వి.లో నిట్టిప్రస్తావనము లేకుంట యుచితముగా నున్నది.

(14)

## క్రియాపదేకారసంధి:

క్రియాపదంబులం దిత్తునకు సంధి చెప్పినసూరి యక్కడ నన్నియుఁ గళలే చూపెను. దానిఁగూర్చి శా.వి. 'క్రియాపదములం దని సామాన్యముగాఁ జేర్కొన్నను లక్ష్యములనుబట్టి ప్రథమపురుష భూతార్థకబహువచనక్రియలు ఉత్తమపురుషభూతార్థకబహువచనక్రియలే గ్రహింపవలసియున్న దనుచు (52) ద్రుతప్రకృతికాలను 9 సూత్రముక్రిందనే పరిగణింపవలె నన్నది. మధ్యమపురుషక్రియల నేల గ్రహింపలేదు? వీనిని 7 సూత్రముక్రిందనే పరిగణింపవలయు నన్నమాట.

ఈయభిప్రాయము సరి కాదు. క్రియాపదంబులం దని సామాన్యముగాఁ జెప్పుటచేతఁ బ్రథమమధ్యమోత్తమపురుషక్రియాపదము లన్నియు గ్రహింపఁబడవలసిన దే. అప్పుడు మధ్యమపురుష క్రియేకారమునకుఁ గూడఁ బ్రస్తుతసూత్రముచే సంధి వికల్పముగా రావలసియే యున్నది. కాని యీ (వికల్ప) విధిని బాధించి తరువాతి సూత్రము నిత్యసంధిని సాధించుచున్నది. కాన సూరి యిట మధ్యమ క్రియలను జూపలేదు.

అట్లే కళలనే గ్రహింపవలె ననుటయు నొప్పదు. ద్రుత ప్రకృతికాలైనను సరే యీసూత్రముప్రకారము సంధి రావలసినదే. వచ్చితిన్+అని మొద లగుచోట్ల నీసూత్రము ననుసరించి సంధి రావలసియే యున్నది. కాని యిఁకాదులకుఁ దప్ప ననుసూత్రముచే సంధి నిషిద్ధమైనది గావున సంధి రా దంతియ. నిషేధము ప్రాప్తి పూర్వకమే కావలయును గదా. ద్రుతప్రకృతికాలకు సంధి నిషేధించుటవలన నుత్వాదులసంధులు ద్రుతప్రకృతికములకు నవుట స్పష్టమే యవుచున్నది.

కాబట్టి మధ్యమపురుషక్రియలయెడ, ద్రుతప్రకృతికాల యెడ నీసూత్రము ప్రవర్తించుటలో బాధ గలదు. కావున వాని నిక్కడఁ జూపకుండ నాయుష్మంతముఁ జూపెను సూరి. కాని యంత మాత్రముచేత వాని నిటుఁ బరిగణింపరా దనుట సరి కాదు. ఈసూత్రము ప్రకారము వైకల్పికసంధి వానికిఁ బ్రాప్తించుచునే యున్నది.

భూతార్థకక్రియ లని బా.వి. స్పష్టతకొఱకై చెప్పిన దేమో కాని యట్లు నిశ్చయించుటయుఁ గుదురదు. క్రియాపదంబులం దని సామాన్యముగాఁ జెప్పామిచేత భూతార్థకములందే యని నియమించు టెట్లు? క్రియాపదములం దింతటను లైన విధ్యర్థమునం దున్న ప్పటికి నిట సంగ్రహింపఁబడక తప్పదు. వర్తమానార్థకక్రియల విధంత ములు లేవి నవి యిటఁ జేరకున్న నంతియ. 'ఉండెడిన్' అనునది (తద్ధర్మార్థక) లాడంతక్రియాపదము. ఇత్వ మున్నది. కాన నీసూత్రముచే నిత్తునకు సంధి రావలసినదే వికల్పముగా. అయినను నిది ద్రుతప్రకృతిక మగుటచేత నిటఁ బ్రాప్తమైనసంధి నీకారిసూత్రము నిషేధించినది. కాని సంధి రాలేదు. నిజము నకుఁ గ్రియాపదముల నిత్తు నకు సంధి జరిగియున్నతావులు భూతార్థకములందే గానఁబడవచ్చు. కాని యంతమాత్రమునఁ బ్రాప్తియే భూతార్థకములందుమాత్రమే యనరాదు. అందులకే సూరి యీకారిసూత్రమునొద్ద యథాక్రమముగా నుత్వమున కత్వమునకుఁ పిదప నిత్వసంధ్యభావమునకు ఉండెడిన్ + అతఁడు ఉండెడి నతఁ డని చూపెను. (ప్రయోగములు ద్రుతప్రకృతి కాలకుఁ జెప్పవు. సంధి గల్గనలాతే యెన్ముఖములలోఁ జేర్పవలె. అట్లు కిపష్టిని బలెంప దానికి సంధి తప్పదు వికల్పముగా.) క్రియాపదంబులం దనులక్షణముచేఁ బ్రాప్తమైనసంధి యుటు నిషిద్ధమైనట్లు తాత్పర్యము స్పష్టము. కావునఁ దద్ధర్మార్థకక్రియాపదములలోను నీసూత్రముచే సంధిప్రాప్తిని గుర్తింపక తప్పదు.

[ప్రథమపురుష భూతార్థకబహువచనక్రియ లిత్యాదిస్థలముల (బా.వి. 52,53) భూతార్థకప్రథమపురుషబహువచనక్రియ లిత్యాదిగాఁ జెప్పు టుచిత మని తోఁచు.]

క్రియాపదంబులం దిత్తునకు సంధి బహుళ మన్నచోఁ ప్రథమోత్తమపురుషలయందు వికల్పముగను మధ్యమపురుషయందు నిత్యముగను సంధి యగుట గ్రహింపవచ్చును. స్పష్టార్థము వింగడించినట్లు బా.వి. పేర్కొన్నది. (53) స్పష్టార్థ మనుట యనవసర మనుటకుఁ బర్యాయము గాకున్న నది యుచితమే. క్రియాపదములలో నెచ్చట సంధి వికల్పమో యెచ్చట నిత్యమో స్పష్టముగా నిర్ణయించి చెప్పుట కవకాశ ముండఁగా బహుళ మని యస్పష్టముగాఁ జెప్పనేల? అట్లే లక్షణము చేయుచో వ్యాకరణప్రయోజనమే భగ్నము కాఁగలదు. ప్రథమమీఁదిపదములకు గసడదవలు బహుళంబుగా నగు ననుచో బహుళపదమును బ్రయోగించియుఁ దెనుఁగులమీఁది సాంస్కృతికపదములకు గసడదవలు రా వని సూరి ప్రత్యేకముగా లక్షణము చేయుటను గమనింపఁదగియున్నది. భాషకు లక్షణము చేయుచున్నపుడు సాధ్యమైనంతవఱకు దానిని సమగ్రముగను స్పష్టముగను నిరూపింపఁదగును కాని లాఘవమున కాసపడి లక్షణప్రయోజనమును భగ్నము చేయరాదు గదా.

## క్త్వార్థము :

క్త్వార్థమునం దగు 'ఇ' ప్రత్యయ మంతమం దున్నవానిం గూర్చి బా.వి. 'వీనిని భూతార్థకాసమాపకక్రియలందు (53,144) అన్నది. ఇట్లే 'క్త్వ్యంతము వ్యతిరేకభూతార్థకాసమాపకక్రియ' (44) 'ఇ ప్రత్యయాంతావ్యయంబునకు సంధియుఁ జూపబడి' ననుసూత్రవివరణములోఁ బ్రౌఢవ్యాకర్త కూడ 'భూతకాలికాసమాపకక్రియయొక్క' మొదలుగాఁ

జెప్పెను. ప్రౌ. వ్యా. సంధి. 2 సూ. 'భూతకాలికాసమాపకక్రియ యనరాదు. దానిని బోధించునది భూతార్థక మనవలయు'(536) నన్నది తె.వ్యా.వి. నిజమునకు **క్త్వార్థము** భూతార్థకమే **యనుట** కవకాశము చాలదు. వాఁడు వచ్చి వెళ్ళఁగలఁడు, నిన్నుఁ గొట్టి చంపఁగలఁ డిత్యాదులలో వచ్చుట, కొట్టుట యనువ్యాపారములు భూతకాలికములు గావు గదా. అనేకవ్యాపారములలోఁ బూర్వకాలికమైనదానికి క్త్వాప్రత్యయ మగు. కాని యాపూర్వకాలికవ్యాపారము భూతమే యై యుండఁబని లేదు. 'క్త్వా' యనునది భూతార్థమునందే యుండు ననుటకు సంస్కృతమునను నాధారము లేదు.

## సావకాశ నిరవకాశములు :

నిరవకాశమైన ప్రథమేతరవిభక్తిసంధి సావకాశమైన యిఁకారాది విధిని బాధించు నని సూరి పేర్కొనెను. ఇఁకారాదివిధి సావకాశ మెట్లయ్యెనో **వివరించుచు** బా.వి. 'ఈసూత్ర మెన్నియుపవాదముల కైన నవకాశ మిచ్చును. అందుకే ఇది సావకాశసూత్రము (55) అన్నది. అపవాదముల కవకాశ మీయఁగలుగుటయే సావకాశత్వ మని యభిప్రాయ**ము**. దాని విధానము వర్తించుటకవకాశము గల్గియుండుట (యనఁగా లక్ష్యము లుండుట) సావకాశత్వ మనియు నట్టియవకాశము లేకపోవుట నిరవకాశత యనియుఁ జెప్పఁదగును. దాని నిట్లు గమనింపవచ్చును.

ద్రుతప్రకృతిక**ముల** కిఁకారాదిసూత్రము సంధిని నిషేధించుచున్నది. ప్రథమేతరవిభక్తిసూత్రము కొన్నింటికి సంధిని జెప్పుచున్నది. దేని ననుసరింపవలె? ఉదాహరణమునకు నన్నున్ + అడిగె అని యున్నది. నన్నున్ అన్నది (ఇఁకారాదిభిన్న) ద్రుతప్రకృతికము. కాఁబట్టి యిఁకారాదిసూత్రముచేత సంధి వచ్చుటకు వీలు లేదు. ఐనను ప్రథమే

తరవిభక్తిసూత్రముచేత సంధి రావలసియున్నది. సంధి చేయవలెనా? ఇకారాదిలక్షణమునకుఁ బ్రాధాన్య మిచ్చిన సంధి రాదు. కాని యప్పుడు ప్రథమేతరవిభక్తివిధి ప్రవర్తించుట కవకాశము లేకుండఁ బోవును. దాని లక్ష్యస్థానము లన్నియు నికారాదిభిన్నద్రుతప్రకృతికములే కదా. ఇట్లు ప్రవర్తింపఁదగినచోటే యుండమిఁ బ్రథమేతరవిభక్తివిధి నిరవకాశ మగుచున్నది.

ప్రథమేతరవిభక్తివిధికిఁ బ్రాధాన్య మిచ్చిన నిట సంధి వచ్చును. మఱి ఇకారాదిలక్షణము సంగతి. అనఁగా వచ్చున్ + ఇపు డను రీతిస్థలముల నది ప్రవర్తించుట కవకాశము గలదు. అనఁగా నది సావకాశ మైనది. వజ్ఝలవారు దీనిసావకాశత్వము నిట్లు నిరూపించిరి. (వ్యా.సం.స. 248)

అపవాదములకు అవకాశము కలిమి లేమి యనువివరణము సారాంశముగా గుర్తింపనగు నేమో కాని సావకాశనిరవకాశములను వజ్ఝలవారు నిరూపించినతీ రుచితము నున్నది.

‘ఇకారాదులు, ప్రథమేతరవిభక్తులు శత్రర్థచువర్ణము ఆనంతర్యార్థకము కిమస్తి ఇవి సావకాశములు’ అని బా.వి. (55) పేర్కొన్నది. ‘ప్రథమేతరవిభక్తి’ విధి నిరవకాశము. ఏమర్థ్యాదులలోఁ గిమస్తి పఠనము నిరవకాశ మనుకొనిగాఁ జెప్పుట సమంజసము.

ఇందులో నికారాదులను పేర్కొనుట సంగతము గాదు. ద్రుతప్రకృతికలకు సంధి లేదనుసివిధానమే ‘ఇకారాదులకుఁ దప్ప’ ననుచుండఁగా ఇకారాదులను వేఱు చేసి చూపుట యనవసరము. ద్రుతప్రకృతికాలలో వేనికి సంధి వచ్చునో చెప్పుట యభిప్రాయ మైన నట్లు చెప్పవచ్చు. కాని యివి నిరవకాశము లనుచు నికారాదులను బ్రస్తావించు టెట్లు? ఇకారాదివిధి సావకాశ మని సూరిగారే చెప్ప

చున్నారు గదా. లక్షణమునను గాక లక్ష్యమునను దృష్టియుం దుంచు కొని నిరవకాశము అని బా.వి. పేర్కొన్నది అది పద్ధతి గాదు.

అనంతరార్థకము ప్రసక్తి యనవసరము. ప్రథమేతరవిభక్తి విధిలో సూరి యానంతరార్థకమును బ్రస్తావింపనే లేదు. కాబట్టి దానికి నిఁకాదిసూత్రముచేత సంధినిషేధమే వర్తించును. దీనిసంధిని బా.వి. విశేషముగా నితరగ్రంథములనుండి ప్రస్తావించినది. అది సూరి సమ్మతము గాదు.

## ఆమ్రేడితము :

'ఆదరార్థమునందో త్వరితార్థమునందో అత్యంతార్థమునందో పదము లామ్రేడింపఁబడును' (58) అన్నది బా.వి. దీనినిబట్టి ఆదరము త్వరితము అత్యంతము ననుమూఁ డర్థములందుమాత్రమే శబ్దములకు ద్విరుక్తి గల్గు నని యర్థ మగుచున్నది. కాని దీని నట్లు నియమించుట కవకాశము లేదు. కొన్ని ద్విరుక్తిస్థలములను బ్రతిపాదించిన ప్రౌఢ. 'త్వరితానాదరార్థంబులు రెంట నగు' నని పోపామ్మనియుఁ జూపెను. అనాదరార్థమందలి ద్విరుక్తి కిట నవకాశ మేది? ప్రౌఢ.లోనే ద్విరుక్తి స్థలములు సమగ్రముగ నిరూపింపఁబడలే దని తెలియవచ్చును. (చూ.త్రి.శే.)

## ఆమ్రేడితస్వరపరకసంధి :

అచ్చున కామ్రేడితంబు పరం బగునప్పుడు సంధి తఱుచుగ నగు ననుబాల.సూత్రమునకు వి.వి.లో మూలముగా 'అచోఽచి కృత్రిమల్లోపో బహుళం స్యాత్ప్రయోగతః' యనుదానిని జూపినది బా.వి. (56) కాని పయిసూత్రమునకు మూలముగా 'అప్రాతాఽనా మజాదీనాం ద్విరుక్తా వన్త్యలోపితా' యనుదానిం జూపవలయును. (తె.వ్యా.వి. 415) అచోఽచి యనుదానిలో నామ్రేడితప్రస్తావనమే లేదు. (బా.వి.

56) అప్రమత్తానా మ్మనుచోట 'ద్విరుక్తా' యని విస్పష్టముగాఁ జెప్పఁబడియున్నది. బహుళిపదమును లేదు. (సూరిచెప్పినది విశేష మగు నప్పుడు) అచోటఁచి యనుదాని కీయర్థము నెవ్వరును జెప్పలేదు. (గ్రంథాంతరమున నాయర్థము పరిశీలింపఁబడును.)

ఈసంధిని సూరి 'తఱుచుగా' వచ్చు ననుటలో విశేషమును బా.వి. ఇట్లు వివరించెను. 'ఇది నిత్యముగా జరుగవలసినసంధి (తెలుఁగులో ననుస్వారము వ్రాయుటయే యిట్టిచోటల శాస్త్రానుగుణ మగు పద్ధతి. శాస్త్రము నట్లు నియమించుచున్నను. కాని బా.వి. అనేకస్థలములలో వర్గానునాసికమును నిలిపినది.) యే సైనను పద్యాదులలోని వికల్పరూపములకై యిట్టి ద్విరుక్తకకారసంధిని నిషేధించుటకు సూరి 'తఱుచుగా' నని చేర్చెను (56) పద్యాదులలో సంధి వికల్ప మనుచునే వైకల్పికసంధి యున్న దనుమనే యిది నిత్యముగా జరుగ వలసినసంధి యనాలు నేమి? చాలచోట్ల నిత్యముగా వచ్చుచున్నను గొన్నిచోట్ల వికల్పముగా మాత్రమే కనఁబడుచుండుటను సాధించుటకుఁ దఱుచు అన్నట్లు సూరిగారు స్పష్టము చేసెను. కాని నిత్యముగా జరుగ వలసిన దనుట నిరాధారము.

ద్విరుక్తకకారసంధిని నిషేధించుటకై యిట్టి 'తఱుచు' అనె ననుట యసంగతము. సూరియే పంగిపోంగి యనుచో ద్విత్వం బగుట సంధి లేదని సంధి లేకపోవుటకుఁ గారణము ద్విత్వ మగుట యని స్పష్టము చేసినాఁడు. 'ద్విత్వం బగుట' యను హేతుప్రదర్శనమువలన 'ద్విత్వం బగునప్పుడు సంధి లే'దనుసూత్రముప్రకారము సంధి లే దని గదా యర్థము సిద్ధించునది. అది సక్రమము 'తఱుచు'వలన రా దనుపొరపాటు సూరి నూడఁ బడియున్న పంగిపోంగి యనుచోటఁ గూడఁ దఱుచు చనుటవలననే సంధి లే దని చెప్పినాఁడు గాని 'ద్విత్వం బగుట' అను హేతువును జూపెడివాఁడు గాదు.

అహోబలుఁడు ఆడియాడి ఇత్యాదిగా నామ్రేడితపరకత్వము న సంధ్యభావమును దోష మనుటను గూర్చి క.మం.కర్త 'ఆద్యస్యామ్రేడితేఽన్త్య లోపశ్చ' యనుదాహరించకారంబుచే క్త్వార్థకసంధివిరహిత రూపములు సాధువు లని తోఁచుచున్న దని సముచితముగా నన్వయించె' (417) నన్నది తె.వ్యా.వి. క.మం. అభిప్రాయము సముచిత మనుట సరి కాదు. దీనివలన నేమియేమి యనుచోవలె నక్కడ సంధి విరహితరూపము లున్నఁ గాని తఱుమగా క్త్వార్థకేకారమునకు నామ్రేడితపరకతలో సంధి రావలసినదే యని యభిప్రాయము కలుగును. 'వికల్ప మన్నను; అది లక్ష్యవిరుద్ధ మనుట విస్పష్టమే. క్త్వార్థేతో న భవేత్సదా' యని వి.వి. 'సదా' యనియు నన్నదే. అయినఁ జింతామణి క్త్వార్థకేకారమునకు సంధినిషేధము ప్రత్యేకముగాఁ జేయ లేదు గాఁబట్టి ప్రాప్తించుచుండ (కిమాదులలోఁ గాని, తదాదులలోఁ గాని క్త్వార్థకేకారము బరిగణింపఁబడ్డ దానికి 'సంధిర్న' యని నిషేధము వర్తించుఁ గాన వచ్చెనని కాదు. కాని ఆమ్రేడితపరకస్థలము సందలివిశేషారంభముచే (ఎట్టెట్టా యనుచోవలె) క్త్వార్థకేకారము నకు సంధి ప్రాప్తించు ననవలయుఁ గావున) చశబ్దముచేత సంధి రాదని చెప్పుకొనుట యుచితము యగు. ఇది చిం. పక్షమునసే కాని యట్టిసంధిని ప్రత్యేకముగా నిషేధించినవి.వి లోఁ గాని బా.లోఁ గాని కుదురదు.

క.మం. 'అచో౽చి క్త్రేచిల్లోప' యనుకారికను గూడ నామ్రేడితస్థలములందె యన్వయించి బహుళ మనుటచే నేఁగి యేఁగి ఇత్యాదుల లేదు. ఏమి యేమి ఇత్యాదుల వికల్ప మనెను. చి.సూ. ఇప్పట్లు క.మం.నే యనుసరించినాఁడేమో (418) యన్నాఁడు. తె.వ్యా. వి. బహుశః ఈఅభిప్రాయముతోనే బా వి. పై వివరణము చేసియుండ

కాక పరము దున్నవి యుపపదము లైనం జాలు (గాని పూర్వశబ్ద మొకపేశఁ బదము గా కున్నను) ననియు దీనికి నపదాది స్వరసంధి యను ప్రసిద్ధి యందువలననే సముచిత మనియుఁ జెప్పఁదలఁచిన నదియు గ్రాహ్య మనలేము. (అట్టియెడలఁ బూర్వశబ్దము పద మగుటం గూర్చి ప్రస్తావించుటయే యనవసరము.)

అట్టియెడల నపదాదిస్వరసంధి యనుటకంటె 'నపదాదిస్వర పరకసంధి' యను టుచిత మని చెప్పవచ్చును. సంధి పూర్వస్వరము నకుఁ గదా విధించుట జరుగుచున్నది. ఇక్కడను నంతె. పూర్వాపర స్వరాలకుఁ బరస్వర మేకాదేశ మగుట సంధి యని నిరూపించు నప్పుడు పరస్వరానకు సంధి వచ్చు నన్నను భేదము లేకపోవచ్చు. కాని పూర్వస్వరమునకు సంధి చెప్పుట జరుగుచున్నది గాఁబట్టి తదనుగుణముగా 'నపదాదిస్వరపరకసంధి' యనఁదగు, ఉత్వసంధి, ఇత్వసంధి యనుచోఁ బూర్వస్వరమునుబట్టి పేరు పెట్టుకొనుటలో సౌలభ్య ముండఁగా నిటఁ బరస్థలమునుబట్టి చెప్పుటలో నుద్దిష్టార్థము స్పష్ట మగుట కవకాశము కలిమి నపదాదిస్వరపరకసంధి యనుట యొప్పు వచ్చును. అయినను నీసంధి కొకపేరు పెట్టుకొని పిల్చుకొన నెంచుట స్పష్టతకుఁ గావచ్చును.

**ఆంద్వవగాగమములు :**

దీనిని విభాగించుచు బా.పి. 'అందు + అవక్ అంద్వవ (క్) యణాదేశసంధి. అవక్ + ఆగమములు అవగాగమములు (57) అని చూపుట స్పష్టతకొఱకే యనఁదగు. అయిన నట్లు చూపుటలోఁ గ్రమము గానరాదు. అందు అనునది సప్తమీప్రత్యయమే కాని యాగమము కాదు. అవ యొక్కటె యాగమము. తె.వ్యా.వి.లో అందు, అవ అనుఆగమములకు (408) అని యందును గూడ నాగ

ముముగాఁ జెప్పుట గమనింపవచ్చును. కాని యిది పొరపా టనుట స్పష్టము. కావున అవక్ + ఆగమ అవగాగము, అందు అవగాగమ అంత్వవగాగము (అంత్వవగాగమా) (అప్పుడీ తెలుఁగునఁ బ్రాతి పదికముగా నిల్వ) ప్రథమాబహువచనముతో అంత్వవగాగమము లని యైన దని నిరూపించుట సక్రమముగా నుండును. అవక్ + ఆగమము అనుచో రెండవశబ్దమును దత్సమముగాఁ జూచుట స్పష్టతకొఱకే కావచ్చును. కాని యది శాస్త్రానుగుణము గాదు. కొందఱు భ్రాంతితో తల్లి + తండ్రులు అని విభజింతురు అది మహాప్రమాదము (66) అన్న బా.వి. వచనము లిచ్చట సమన్వయించు ననవచ్చు.

అవ అనుపూరణార్థకప్రత్యయము (51) అనుటలో బా.వి. పొరపడియుండును. అంత్వవగాగమంబు లని సూత్రము చెప్పుచుండఁగా అవ ప్రత్యయ మెట్లయినది? 'సంఖ్యకుం బూరణార్థంబునం దవగాగమంబగు' నని సూరి దీని నాగమముగానే విధించియున్నాఁడు. "సుహాగేఽవస్తు సర్వదా" యనుటలో వి.వి.లో అవను బ్రత్యయముగాఁ జెప్పినఁ జెప్పవచ్చు. కాని యిక్కడ వి వి. అభిప్రాయమును వివరించుట లేదు గదా బా.వి.

ఇవి పరముగా నున్నప్పుడు సంధి యెట్లు? అందు పరముగా నున్న నత్తునకు వికల్ప మిత్తునకు లేదు. అవ పర మైన నిత్తునకు వికల్పము. అంత్వవలు పర మగుచో నుత్తునకు నిత్యము. ఇతరాచ్చుల కసలు లేదు. బా.వి. ఈయంశమును స్పష్టము చేసియున్నది. వీని సంధినిగూర్చి వివరించుచు సూరి 'యథాసంభవముగా గ్రహించునది' యన్నాఁడు. దీనినిబట్టి యింతకుముందు చెప్పిన లక్షణములనుబట్టి యత్వేత్వాదులకు సంధ్వనపరకతలో సంధి యగు నని గ్రహింపవలెను. (పదపరకతయందువలె)

## ద్విరుక్తటకారము:

అసలకు ద్విరుక్తటకార మగు ననఁగా హల్మాత్రములకే చేసి కుట్ + ఉ + ఉయు అని వ్రాసినది బా.వి. (58) అనఁగా ద్విరుక్త టకారము చేసిన యనంతర ముత్వసంధి చేయవలయు నన్నమాట. కాని యిది ప్రయోజనము లేని ప్రక్రియాగౌరవము కాఁబట్టి అసల కనఁగా అసలకు ససవ్వరములకుఁ (అచ్చులకు) జేయు టొప్పును (సూ.2) (చూ. ప్రౌ. శే.)

"ఇది స్వరమునకు స్వరము పర మగుసంధిగా కన్పించినను పరస్వర మేకాదేశము కాక అసలకు ద్విరుక్తటకార మాదేశ మగుటయు ఆతేను నాతిస్వరసంధి ప్రవర్తిల్లుటనుబట్టి యిది అటు వ్యంజన సంధులకును ఇటు స్వరసంధులకు మధ్య నొప్పుచున్న" దన్నది బా.వి. (58) దీనినిబట్టి కొన్ని యంశములు గుర్తింపనగును. స్వరమునకు స్వరము పరమైనమాత్రమున స్వరసంధి కాదు. పరస్వర మేకాదేశ మయినపుడే స్వరసంధి యగునట. 'ఆతేను నాతి స్వరసంధి ప్రవర్తిల్లుటనుబట్టి' యనుటలోఁ గూడ నీయంశమె స్పష్టము. అయిన వ్యంజనసంధి యన నేమి? ద్విరుక్తటకారము వ్యంజన మాదేశ మగుటయు స్వరసంధియు రెండును గలవు గావున నిది మొదటి 11 సూత్రముల స్వరసంధులకును దను వాతిగసడదవాదేశాదివ్యంజనసంధులకు నడుమ నొప్పిన దన్నమాట. అనఁగా (వ్యంజనములకు) వ్యంజన మాదేశమైన దట వ్యంజనసంధియా? స్వరములకు (పర) స్వర మాదేశమైన స్వరసంధియు వ్యంజనములకు (పరైన) వ్యంజన మాదేశమైన వ్యంజనసంధియు ననఁదగునా? అట్లయిన మువర్ణకము నకు బుంపులు చెప్పినచోట స్వరవ్యంజనములకు స్వరవ్యంజనము లాదేశము లైనవి గదా. అదియు సిట్ల మధ్యలోఁ జెప్పక వ్యంజన

సంధులలో నేల చెప్పె? వ్యంజన సూగము మైనను వ్యంజనసంధి యగునా? పూర్వపరస్వరంబుల కన్నట్లుగా (స్వరసంధిని) సూరి వ్యంజనసంధిని నిర్వచింపలేదు. వ్యంజనసంధులనుగూడ నిరూపించు చున్న బా.వి. అది యేమో స్పష్టము చేయవలసియున్నది. సూరి లక్షణము ననుసరించిస్వరసంధిని గ్రహింపఁగా నట్లు నిరూపింపకుంటను బట్టి సూరిమతమునఁ దెలుఁగున వ్యంజనసంధి యున్నది గుమరకుండగా దానిని దెచ్చి వివరించుటలో సంతయు వివాదాస్పద మగుచున్నది. బా.వి.లో వ్యంజనసంధి యెట్లున్నదో పైని జూడఁగలము.

ఈసూత్రరచనలోఁ గొన్నిలోపములు గల వని బా.వి. వాని నిట్లు ప్రస్తావించినది.

కుఱు చిఱు ఇత్యాదులు స్వతంత్ర మైనశబ్దాలు కావు కాఁబట్టి కుఱుచ ఇత్యాదిగా నిర్దేశించి యంతిమాక్షరలోపము చెప్ప వలసియున్న దన్నది మొదటిది. (60) తె.వ్యా.వి. (477)లోఁ గూడ నీయభిప్రాయ మగపడును.

కుఱుచ, చిఱుత ఇత్యాదిగా నున్నశబ్దాలకు సమాసమున నంతిమాక్షరలోపము గలుగుచున్నది. కాని యది యచ్పరకమలలో మాత్రమే యవునది గాదు. కుఱుఁగాఁపు, చిఱుచాప మొ॥, కాఁబట్టి వీనిలో నంతిమాక్షరలోపమును సమాసమున సామాన్యముగా విధింప వలెను. ద్విరుక్తటకారమువలె నంతిమాక్షరలోపమును నచ్పరకమ యందుమాత్రమె యగునెడల సూరి యిటనే చెప్పియుండెడివాఁడని వచ్చును. కాఁగా నీయంతిమాక్షరలోపమును నిటఁ జెప్పరాదు. సమాసపరిచ్ఛేదమునఁ జెప్పనగును. కొన్నివ్యాఖ్యానములు నిక్క-లాదిసూత్రము నాశ్రయించినవి. ఆచ్ఛికసమాసములం దఱుచుగనన్న లోపాదివికారము లనుచుఁ బ్రౌఢవ్యాకర్త చెప్పినలక్షణము నిక్క-.

లాదిసూత్రమునకు వ్యాఖ్యానప్రాయముగా వజ్ఝలవారు మొ॥ గుర్తించియున్నారు. కాన నట్లు చేయుట యొప్పు.

కుఱుచ ఇత్యాదిగా నిర్దేశింపకుండఁ గుఱు ఇత్యాదిగాఁ జూపుట చేత—నంతిమాక్షరలోపము వచ్చినవే గ్రహింపవలయు నిట. అట్టి లోపము సమాసమున జరుగునది గాఁబట్టి యీాద్విరుక్తటకార కార్యము సమాసములలో వర్తించు నని సూచించినట్లే యైనది. 'దీని ననుసరించి యీాయాదేశము వృత్తియందు జరుగు నని స్పష్టపఱచుట యుచిత'(475) మని తె.వ్యా.వి. విశేషముగాఁ జెప్పినది. అది కుఱ్ఱాది నిర్దేశముచేతనే సిద్ధింపఁగాఁ బ్రత్యేకముగాఁ జెప్పుట యనవసర మనియుఁ జెప్పిన సిద్ధాంతానువాదమె యగు ననియు గ్రహింపఁదగును. ఇంక సమాసాలలో కుఱు ఇత్యాదిరూపములతో నీశబ్దములుండును గావునను నట్టిరూపమున నున్నవానినే యిట గ్రహింపవలసియున్నది గావునను వాని నట్లు నిర్దేశించుట లోపము గా దనియు నవసర మనియు గుర్తింపవలెను.

ఇంక రెండవలోపము కడుశబ్దము ద్రుతాంతము గావున 'కడున్' అని చూపవలసియుండఁగా 'కడు' అనియే చూపుట (60) యన్నది బా.వి. ద్రుతాంతమునే నిర్దేశించిన నెట్లుండవలెను? కుఱు చిఱుకడున్నిడుశబ్దము లనియా? ఇది సమాస మగుట స్పష్టమే. ఇట్టి చోట్ల ద్రుతప్రకృతికము లయ్యును ద్రుతవిరహితములుగాఁ జూపఁబడుట యితరస్థలములందును గమనింపవచ్చును. ఎల్లశబ్దంబు ద్రుతాంతంబయినయవ్యయం బనుచో ఎల్లశబ్ద మనఁగా ఎల్లన్ అనుశబ్దమె కదా. అట్లుపోలెబలెవలెశబ్దంబు లివార్థకంబులు, పోలెబలెలు పరంబు లగుచో (ప్రౌఢ. సమా 38) మొ న్నగుస్థలములు స్మరింపఁదగును. పోలెబలెవలెలు ద్రు.ప్ర.లే కదా. అట్లే యిట సమాసమధ్యమున కడు అని

చూపినంతమాత్రమున నయ్యది ద్రు.ప్ర.కా దని భావింప నక్కఱ లేదు గదా.

ఇంకను కడుఁ ఇత్యాదినిర్దేశము ననుసరించి యీకార్యము సమాసాలలో జరుగున దని స్పష్టము గదా. 'కడున్' అనునది ద్రుతాంతమై యైనను సమాసము చేయుటలో 'సమాసంబునయందు ద్రుతంబునకు లోపం బగు' ననుసూత్రముచే నట ద్రుతము లోపించును. అనఁగా సమాసములో నంతిమాక్షరము లోపించినను ఇత్యాదులను చేర్కొన్నట్లే యిక్కడ సమాసమందు ద్రుతము లోపింపఁగా నున్న 'కడు' అనుదానిని సూరి చేర్కొనె నన్నమాట. ఇందులో దోష మేమియు లేదు. ఇంకను నిక్కార్యము సమాస మయిననే యగును గాని సమాసము గాకున్నఁ గా దనువిషయము విశేషముగాఁ జెప్పిన ట్లగుచున్నది.

ఇది సమాసములలో నగునదిగా నిట గుర్తింపకపోవుటచేతఁ గాఁబోలును బా.వి. ఇం కొకలోపమును ప్రస్తావించినది. "నన్నయ కడుఁనలుక యిత్యాదిగాఁ బ్రయోగించియున్నాఁడు గావున నీద్విరుక్తటకారము కడుశబ్దమునకు నిత్యము గాదు. ఈయనిత్యత గూడ స్పష్టమగుటకొఱకై సూత్రమునఁ దఱచుగా నగు నని చేర్కొని సవరింపవలె" నని (60) మూఁడవలోపమును జెప్పినది. వజ్ఝలవారు కూడ మొదట నిట్లే పొరపడినను బిదప సవరించుకొనిరి (బా సూ.) కడుఁనలుక ఇత్యాదులలో ద్రుతము గనఁబడుచున్న దనఁగా నది లోపింపలేదు. సమాసమైన లోపింపకతప్పదు గాన నిది సమాసము గాదు. ద్విరుక్తటకార మగునది సమాసమునందే యని స్పష్టము గదా. అనఁగా నిట సమాసము గాకపోవుటచేత, కడు అనునాకారములో నుండక 'కడున్' అని యుండుటచే, ద్విరుక్తటకారముప్రాప్తియే లేదు. కడు

నలుక అనునది వ్యస్తరూప మిం నిట్లే యుండు, కట్టలుక యన్నది సమాస మట నట్లే యుండును. సమాస సైం ద్రమతము లోపించి కడు + అలుక యని యుండ నిట ద్విరుక్తటకార మనిత్య మన్న క డలుక యనియే కావలె. కాఁగాఁ గడుశబ్దమున నీద్విరుక్తటకారము నిత్యము గా దని నిరూపింపవలె నన్నఁ గ డలుక యనుప్రయోగమును జూపవలెను గాని కడు నలుక యన్నది కాదు. కాఁగా నిటను ద్విరుక్తటకారము నిత్యమె. కుఱ్ఱాదుల కనిత్య మని బా.వి. కూడఁ జెప్పలేదు. కాఁగా నీవాని కన్నింటికి నిత్యమే కావునఁ 'దఱుచుగా' నని చెప్ప నక్కఱ లేదు. చెప్పిన నది ప్రయోజనవంతము గాక పోఁగా ననర్థక మగు నని గుర్తింపవలయును. కావున సూరి యీయాదేశమును నిత్యముగాఁ జెప్పుటలోఁ బొరపా టున్న దని తె.వ్యా.పి. (478) భావించుట పొరపా టని స్పష్ట మగుచున్నది.

సూత్రము లోపరహితమే. కాని అడల కనక ఉడుల కన్న సంకను స్పష్టముగా నుండెడి దనిపించు. విశేషవృష్టి యే మేని గల దేమో పరిశీలింపవలెను లేసిలోపములను జూచి ఇట్టిలోపములున్నను ఈసూత్రవిషయము నన్నయాధర్వణములందు స్పష్టముగా నిరూపితము గానిది. చిన్నయయు పల్లితను చిన్నినిదర్శ (61) మనఁట చానఁగొట్టి చెవులు మూయుటవలెఁ గొంతసయముగా నున్నది.

## ఆదేశము :

'ప్ర.ఆ. ఈసంజ్ఞ నేలకో యుపయోగింపలేదు. తత్స్థానమునందు స్యాత్ స్యుః భవేత్ మున్నగుసాధారణపదములనే వాడెను' (430) నన్నది తె.వ్యా.వి. అట్టియవసరము గల్గకపోవుటయే దానికిఁ గారణము. 'పరుషాణాం గసడదావాః స్యుః' ఇత్యాదిగాఁ జెప్పినప్పుడు షష్ఠ్యంతనిర్దేశమువలన విధింపఁబడినగసడదవ లాపరుష

ములయొక్క స్థానమున వచ్చును. కావున మఱల నాదేశశబ్దము ప్రయోగింప నేల? అటఁ బ్రయోగించినను నది వ్యర్థమే యగును. అట్టిసందర్భములో సూరి కూడఁ 'బహువచనములకు' గసడదవ లగు నిత్యాదిగనే గదా చెప్పియున్నాఁడు. ఇట్లు స్థాననిర్దేశము స్పష్టము చేయవలసి లేనిస్థలములయందే యాదేశశబ్దప్రయోగ మవసర మగును. 'ఆదేశాః కేవలా శ్చైషాం భావోఽభావః ప్రయోగతః' మొదలగుచోట్ల వి.వి. ప్రభృతులప్రయోగ మట్టిది.

## గసడదవాదేశము :

'దీనికి గడసదవాదేశసంధి యని ప్రసిద్ధి. వీనిని సరళము (గజడదబలు) లని వ్యవహరింపరాదు. వీనియుచ్చారణమునందుఁ గించి దానునాసిక్య ముండును (61) అన్నది బా.వి. ప్రసిద్ధివిషయము వేఱు. సూరిప్రభృతులు అట్లు వ్యవహరింపలేదు. 'వాఁడు గొట్టె' ననుచో గాదేశ మయ్యె ననుట యుచితము కాని గసడదవాదేశము వచ్చె నని గాని గసడదవాదేశసంధి వచ్చె నని కాని యనుట సమంజసము గా దనక తప్పదు. లాక్షణికవ్యవహార మట్లు లేదు.

గసడదవలను సరళము లనరా దని బా.వి. నిర్ణయించినది. గజడదబలు సరళ లని బా.వి. ఇక్కడనే చూపినది. గసడదవలలో సవలు స్థిరాలే కాని సరళము లెట్లును గావు గాఁబట్టి వానిని సరళము లనము. సరళము లైనవర్ణము లింక గడదలు మూఁడు. వీనిని కూడ సరళము లనరా దన్నమాట. బా.వి. సరళము లైనగడదలకు నీయాదేశము లైనగడదలకు నేదో భేదము చూపినది. కాని యది యంత తేలికగా స్పష్ట మగునది గాదు. కాని సూరిమాత్ర మీగడదలను సరళము లనుటను విరోధింపలేదు. క్రియా 115 సూత్రమునొద్ద తెన్ను గను తెన్నగాను ఇత్యాదిగాఁ జూపించుచు 'ఇట సరళంబు నిత్యం'

బన్నాఁడు. అక్కడ ప్రథమమీఁదికకారమె గకార మైనది. ప్రథమ మీఁది కటతల కైనగడదవలనే సూరి సరళ మనె నన్నమాటయె. సూరి సరళ మనుట సమర్థనీయము కా దని (367,62) బా వి. అక్కడఁ జెప్పుచున్నది. ఇది నిరాధారము. ఈగడదవలు వర్ణమాలలో నిర్దేశించి నవే కాని వేఱు గావు. వానికి సరళము లనుసంజ్ఞను సూరి నిర్దేశించెనే కదా. తద్భిన్నముగా నానునాసిక్య మంతయో యింతయో యుండి యున్న వీనిని ప్రత్యేకవర్ణములుగాఁ జెప్పవలసియుండును. యరలవలను లఘ్వలఘువులుగాఁ జెప్పవేసినట్లు గసడదవలను (కించిత్) అను నాసికము లనియు నననునాసికము లనియు విభాగింపవలదా? శాబ్దికు లెవ్వరుఁ జెప్పనియీయంశ మిందలివిశేషము.

తె.వ్యా.వి పరుషముల కాదేశముగా వచ్చినసరళములను బరిణతసరళము లనవచ్చు ననుచు వీనికి సహజసరళములకు నుచ్చారణ మునం దీషద్భేద ముండిన నుండవచ్చును. కాని తెనుఁగువ్యాకర్తలు లఘ్వలఘుభేదములను గుర్తించియు నిట్టివాని కీతిభేదమును జేర్కొన రైరి. (430) యున్నది. తె వ్యా వి. కూడా భేద ముండిన నుండవచ్చు ననుకొన్నది. కాని యాభేద మేమియో యటుఁ జెప్పలేదు సరి గదా భేదము గల దని గాని నిశ్చయముగాఁ జెప్పలేదు. తెలుఁగువ్యాకర్త లాభేదమును నిరూపింపలేదని యూత్రము నిశ్చయించినది. అసలు లఘ్వలఘుభేదనిరూపణమే శబ్దశాస్త్రమున సనాతనమా యనుట విచార్యము.

పూచెఁ గలువ యనువాక్యమున పై గకార మాదేశ మైనది. వాఁడు గొట్టె ననుచోఁ బ్రథమమీఁది నకారము గళ పైని గకారము గకార మైనది. ఇవి రెండును సమానములే యగునా? కించిదానునాసిక్య మీరెంట సమానమా? లేక యిటును భేదము

గలదా ? భేద మున్న దేమో యుచ్చారణమున స్పష్టము గాదు. ఝానము - జాజము, ఇత్యాదులందును బరిణామము గలదు. పరిణత సరళము లనుకల్పనమువలనఁ బ్రయోజనమును స్పష్టము చేయ వలసినది.

గసడదవాదేశస్థలములనుగూర్చి పేర్కొనుచు బా. వి. 'ప్రథమావిభక్తియం దున్నపదములమీఁదను దానితోఁ దుల్యము లగు నిత్యైకవచనాంతము లైనయవ్యయములమీఁదను కళ లగుక్రియాపదములమీఁదను నున్నకచటతపలు బహుళముగా గసడదవ లగు' (62) నన్నది. ఇందులో 1,2. విషయాలు సూరిసూత్రవివరణము స్పష్టము చేయుచున్నది. నడుమఁ బ్రథమాంతతుల్యము లైననిత్యైకవచనాంతము లైనయవ్యయము లేవి? అప్పుడు ఇత్యాదులు అని బా.వి. అభిప్రాయము గుర్తింప వచ్చును. కాని సూరి వీనిని ప్రత్యేకముగాఁ బ్రస్తావింప లేదు. ప్రథమమీఁద నని సూత్రించినవాఁడు నాఁడు గొట్టెనిత్యాదులలోనే యప్పుడు సనియె నన్నది చూపినాఁడు. అది ప్రథమాంతమె కదా. ప్రథమాంతమె యని సూరి వివరణములో స్పష్టము చేసినాఁడు. అది ప్రథమాంతమె యైయుండఁగాఁ బ్రథమాంతతుల్య మనుట యెట్లు? అన్న అమ్మ ఇత్యాదులవలె నిది స్త్రీసమము. ఇది ప్రథమాంతమే. ప్రథమాంతతుల్యము లనుచో నీయవి ప్రథమాంతములు గా వలసియుండును. కాఁబట్టి ప్రథమాంతాలను, కళలైనక్రియాపదములను, రెంటిని పేర్కొన్నఁజాలును నడుమఁ జెప్పిన యంశ మనవసరము.

నిత్యైకవచనాంతా లైనయవ్యయా లన్నది తె.వ్యా.వి. సూరి నిత్యైకవచనాంతా లనినాఁడు. అవ్యయా లనుట విశేషము. 'యదా తదా అనునవ్యయములు ప్రథమాంతములు' (62) అనుటలో

బా.వి. తెలుఁగులో అప్పుడిత్యాదులు అవ్యయాలనుకొన్న దేమో. సంస్కృతములో యదా, తదా, ఇదానీం, అనునవి యవ్యయములే. కాని తదర్థకము లైన అప్పుడు మొ॥ తెలుఁగుశబ్దాలు అవ్యయాలు కావు. ఇవి నానావిభక్తికశబ్దములు. ఇప్పటినుండి, అప్పటికొఱకు, ఎప్పటికి అప్పటన్ - ఇత్యాదిగా నాయాయర్థములం దత్తద్విభక్త్యంత రూపము లున్నవీని నవ్యయము లనుట యసమంజసము కదా. నిత్యైకవచనాంతము లనుటలోనె యివి యవ్యయములు గా వను విషయము తెలియుచున్నది. అవ్యయము లయిన నేవిభక్తివచనము లును గనిపింపవు గదా. అవ్యయము లన్నపుడు నిత్యైకవచనాంతము లను టెట్లు? అవి యెపుడు బహువచనము గూడ నుండునవ్యయము లుండునా? నిత్యైకవచనాంతము లనుటచేత వీనికి నేవిభక్తిలో నైనను నేకవచనాంతరూప ముండును గాని బహువచనాంతత లే దని యర్థము. అనఁగా నితరవిభక్తులును యథాసంభవముగాఁ జేరు ననియు నైన నేకవచనాలే చేరు ననియు నిత్యైకవచనాంతము లనుపదము తెలుపుచుండుటతో నివి యవ్యయములు గా వనువిషయము స్పష్టము. కాఁబట్టి యప్పుడిత్యాదుల నవ్యయము లనుట పొరపాటు. అవి గాక యితరములను గుఱించి యిటఁ బ్రస్తావనయే లేదు. నిత్యైకవచనాంత ములప్రసక్తి యప్పుడిత్యాదులవిషయములోనే గదా యిక్కడ జరిగినది. ఏ మైన నవ్యయము లనునప్పుడు నిత్యైకవచనాంతము లనుప్రసక్తి యనవసరము.

తె వ్యా.వి. 'నిత్యైకవచనాంతంబు లనఁగా ప్రథమావిభక్తి నిత్యైకవచనాంతంబు లనియె తాత్పర్య' (449) మని వివరించినది. అదియు సరి గాదు. 'అప్పటికిన్' అని సూరియే స్థలాంతరమునఁ జూపియున్నాఁడు గదా. ఏవిభక్తిలో నైనను నేకవచనమే యుండు నని

గ్రహింపఁదగు. ప్రథమ యయిననే పై పరుషములు గసడదవ లగును గావున నిచ్చటఁ బ్రథమైకవచనాంతమును సూరి చూపెను. నిత్యైకవచనాంతతానిరూపణము సందర్భానుసారముగా వచ్చినప్రత్యేకమయినయంశము. యదా తదా అనువివరణములోని ప్రథమాసందర్భమునకు దీనితో **ముడి** వెట్టరాదు.

ఈయాదేశము బహుళ మన్నాఁడు సూరి. **న్యాయ్యముగను** ఇత్యాదులే కాకుండ తెల్లవాఁడు ఇత్యాదులును బ్రవృత్తికి **లక్ష్యము** లన్నారు వజ్ఝలవారు.

అప్రవృత్తికి 14 సూత్రోదాహరణములు (62) అని గ్రహింపవలె నని భావించినది బా.వి. ఇది సరి కాదు. వాఁడు కంసారి ఇత్యాదుల గసడదవాదేశాభావమును 14 సూత్రము ప్రత్యేకముగా సాధించుచుండఁగా నీసూత్రములోనిబహుళశబ్దము చేత సంగ్రహించుట యసంగతము. అనఁగా వాఁడు + కంసారి యని యుండఁగా ప్రథమమీఁది - అనుసూత్రము చేత రావలసిన గాదేశము ఈసూత్రములోనిబహుళశబ్దము చేత రా దని చెప్పిన నీయుదాహరణము లన్నియు నీసూత్రమునొక్కనే సిద్ధించుచున్నవి. ఇంక 14 సూత్ర**ము** దేనికి? వ్యర్థ మగు నన్నమాట. స్త్రీవాచకతత్సమసంబోధనాంతములకు **సంధి** లే దనునంశమును బ్రత్యేకముగా సూత్రించినాఁడా? 14 సూత్రమునకు లక్ష్యములు గానివానినే యిక్కడ నప్రవృత్తికి లక్ష్యములుగా స్వీకరించుట సమంజసము. అయిన 14 సూత్రలక్ష్యములను నిక్కడనే గ్రహించిన నాసూత్రము చెప్పకుండనే సరిపోవునుగదా యనవచ్చు. ఆలక్షణము నియతముగాఁ గనఁబడుచుండుటను బురస్కరించుకొని స్పష్టముగా సూరి ప్రత్యేకించి చెప్పియుండవచ్చును. త్వార్థకేకారసంధివలె నిదియు నరుదుగాఁ గనఁబడినను నాదేశ**ము** లేకపోవుటలోనిప్రాచుర్యము ననుసరించి యాలక్షణమును స్పష్టము

చేసె నన్నమాట. అంతియ కాని యీయాదేశము చేసిన శబ్దార్థములలో భ్రాంతియో మఱి యేదియో కలుగు నని నిషేధించె ననుట (బా.వి. 64) శాస్త్రీయము గాదు.

**నిత్యత :**

"ఈసంధి (గసడదవాదేశము) నన్నయభాషలో అనేక సందర్భములలో నిత్యముగనే జరిగెను. అందుకే వికృతివివేకమునందు పరుషా వా స్వరూపేణ... కలదు. ప్రథమా అనఁగా విభక్తి కాక్వర్థకము, సంబోధనార్థకము అవ్యయము కర్మధారయసమాసార్థము అచేతనార్థము మున్నగువానికి పరమందలిపరుషములు గసడదవ లగు నని శృంగారభూషణుఁడు చెప్పినట్లు కలదు. ఇట్లు నిత్యముగాఁ గల్గునీయాదేశమును క్రమముగా బహుళముగా నిర్దేశించుటకు కారణము ప్రయోగములందలివైవిధ్యమే.' (63) అన్నది బా.వి. దీనినిబట్టి పరుషా వా స్వరూపేణ భవన్తి ప్రథమాన్తోపస్థితా యన్నది గసడదవాదేశమును జెప్పుచున్న దని బా.వి. తలఁచినట్లు స్పష్ట మగుచున్నది. పరుషాః స్వరూపేణ వా భవన్తి యని యీకారిక పరుషములు వికల్పముగా స్వస్వరూపముతో నుండు నని చెప్పుచున్నది. గసడదవా స్స్యుః అనుచింతామణిలక్షణ మీయాదేశమును నిత్యముగాఁ జెప్పుచుండఁగా నీకారిక పరుషము లట్లే యుండుట యనఁగా గసడదవలు కాకుండుటను వికల్పముగాఁ జెప్పుచున్నది. అట్టియెడల బా.వి. ఈకారిక గసడదవలను జెప్పుచున్నట్లు పేర్కొనుట యసంగతము. ఇంకను బా.వి. నన్నయ యనేకసందర్భములలో నిత్యముగాఁ బ్రయోగించె ననియు నందుకే వికృతివివేక మిట్లు పేర్కొన్న దనియు మొదలుగాఁ జెప్పుటనుబట్టి యీకారిక గసడదవాదేశము విధించున దనిమాత్రమే కాక నిత్యముగా నైతము చెప్పుచున్న దనియుఁ దలఁ

చుట గమనింపవచ్చును. కారికయందలి 'వా' శబ్దమును బా.వి. పట్టించు కొనలేదన్నమాట. నన్నయ నిత్యముగా నాదేశమును బ్రయో గించినసందర్భము లివి యని బా.వి. చెప్పుచున్నది. ఈకారికచేత నిక్కడనే యాదేశము వికల్పముగా నహోబలుఁడు వ్యాఖ్యానించి యున్నాఁడు. (కవిశి. 305) అది యట్లుండ నిందుఁ జేర్కొనఁబడని సందర్భములలో నన్నయ యాదేశము ననిత్యముగాఁ బ్రయోగించె నని యర్థ మగుచున్నది. వాఁడు గొట్టె నిత్యాదుల నన్నయయు వికల్పముగనే చేసెనా? ఇది కవిశి. ప్రభృతివ్యాఖ్యలకుఁ గేవలము విరుద్ధార్థ మనుట స్పష్టమే. (వ్యా.సం.న. 261)

కారికార్థవివరణమున నింకను బా.వి.లో ననౌచిత్యములు గుర్తింపవలసియున్నవి.

'ప్రథమా అనగా విభక్తి' యనుటలో విభక్తి యనఁగాఁ 'ప్రథమావిభక్తి' యని గ్రహింతము. ప్రథమా-విభక్తి కాక్వర్థము మున్నగువానికి పరమందలి–అనుటనుబట్టి ప్రథమాన్తోపస్థితాః అన్నది కూడ కాకొ ఇత్యాదులవలెఁ బ్రత్యేకముగా వ్యాఖ్యానించినట్లు తెలియవలెను. అక్కడఁ దప్పఁ 'ప్రథమా' యన్నపద మిందింకొకచో లేదు గదా. (క.మం.32) కాకుస్వరమువీఁడను... ఉన్నటు వంటిపదములు ప్రథమావిభక్తిమీఁద నిల్చిన వైనను వికల్పముగా స్వరూపముతో నిల్చున నగుచున్న దని (వ్యా.సం.న.261) వజ్ఝల వారు నిరూపించినతీరు సముచితమైయున్నది. 'కర్మధారయసమా సార్థము–మున్నగువానికి పరమందలి' – అన్న బా.వి.లో కర్మధారయ సమాసార్థమునకుఁ బరముగా నుండుట యన్నదెట్లో స్పష్ట మగుట లేదు. 'కర్మధారయమందు' (వ్యా.సం.న. 261) అనియె చెప్పఁదగును. 'కాక్వర్థకము సంబోధనార్థకము' అన్నట్లుగాఁ గాక బా.వి. అచేత నార్థ మనియె పేర్కొన్నను (63) తదర్థక మగుశబ్దమునె గ్రహింప వలయును. మూలమున అచేతనార్థకే యని యుంటయు స్పష్టమె.

## గసడదవాదేశాభావము :

తె.వ్యా.వి. నన్నయకుఁ బూర్వమందలి ప్రాచీనశాసనములను బరికించిన ఆచ్ఛికములమీఁదిసాంస్కృతికములకు సాంస్కృతికముల మీఁదిసాంస్కృతికములకు నిట్టియాదేశ మున్నసాక్ష్యములు లభించును. ఇట్లు ప్రాచీనకాలముననే యీయాదేశము సాంస్కృతికముల మీఁదిసాంస్కృతికములకుఁ గూడ నట నటఁ బొడఁగట్టుచుండుటను బట్టి పై చింతామణికారికలోనివికృతిశబ్దము ఆంధ్రభాషాపరముగా నుప యుక్త మని అందులో సాంస్కృతికములకు మాత్ర మిట్టినిషేధ ముద్దేశింపఁబడియుండె నని యూహింపఁదగును. (463,464) అన్నది. ఇందులోఁ గార్యకారణభావము గుదురక వైరుధ్య మేర్పడుచున్నది. సాంస్కృతికపరుషాలకు గసడదవాదేశము నన్నయకుఁ బూర్వ మున్న పుడు దాని నంగీకరింపవలెఁ గాని నిషేధించుట దేనికి? నిషేధించుటకు నాదేశ ముండుట కారణ మెట్లగును? సాంస్కృతికపరుషాలు గసడదవ లగుట యచ్చతెనుఁగులపైని సంస్కృతసమములపైని రెండింట జరుగుచున్నది. వికృతికి నాంధ్ర మనునర్థము (సంస్కృతసమ సమేతరభాష మొత్తమన్నమాట) చేసిన నెట్లు? రెండింటిపైని నిషేధము చెప్పుటకా? వికృతిశబ్దమున కచ్చతెనుఁ గనియే బా.వి. అర్థము చేసినది. (63) ఇంకను బ్రయోగము లున్నపు డపార్థము కలుగు నేమో యని (యాదేశముచేసిన) లే దని నివారించుట యుక్తమమే యగును.

ఇట వి.వి. వచనములయెడను బా.వి. వివాదములకు నెల వైనది. 'కేచిదాద్యస్య వో న స్యాన్న చ ప్రాసే యతౌ తు వా' యని చూపి "కొందఱు సంస్కృతసంబంధ మైనపకారమునకు వకారము కాదు. ప్రాసమందును కాదు. యతియందుండుపకారమునకు వికల్పముగా వకారము వచ్చు ననిరి" (65) యన్నది. ఇది క.మం.

ననుసరించినపాఠమును వివరణము నైయున్నది. (క.మం.33) కాని కవిశి. నుండి 'కేచిదాద్యస్య పో వస్యా'త్తని కారికాపాఠము. అహో. 'ఆద్యస్యపః సంస్కృతసంబంధినః పకారస్యేత్యర్థః' (కశివి. 306)అని యీపదళమున కర్థము చేసెను. బా.వి.లోఁ గూడ 'పో న స్యా'త్తన్నదే యద్దిష్టపాఠ మేమో. 'వో' యన్న దచ్చుపొరపాటు గావలె. కాని యందు ఆద్యస్య పః న స్యాత్ అని పకారమునకు వకారము గా దని ముందే చెప్పఁబడఁగా ప్రాసే చ న యని ప్రాసయందును లే దని విశేషించి చెప్ప నేల? లే దని మొదలే చెప్పఁ గాన నెట నే మున్నచో విశేషారంభ మొప్పును. అనఁగా కేచిదాద్యస్య పో న స్యాత్ యతౌ తు వా యన్నదే చాలు. న చ ప్రాసే యనుట పునరుక్తియే. క.మం. ననుసరించి వో న స్యా త్తని ముద్రితపాఠమె బా.వి. ఉద్దేశించిన దనవలె. అట్టియప్పుడును నైయనౌచిత్య మట్లుండును. పైఁగా నః అనుదానింబట్టి పకారస్య యన్న దూహ్య మనవలె. పః పకారస్య యనుదానికంటె నిది కొంతయస్పష్టము. కవిశి. ననుసరించి పో వ స్యా త్తని విధానముగా గ్రహించిన న చ ప్రాసే యనునది సార్థక మగును. అస్పష్టతయు నుండదు. "సంస్కృతీయమైనపకారమునకు వకార మగును. ప్రాసయందుఁ గాదు. యతియందు వికల్ప" మని కారికార్థ ముచితముగాఁ జెప్పఁదగును.

"కేచి ద్ద్వయో ర్వికల్పత్వం యతౌ సర్వత్ర కేచన — కొందఱు సంస్కృతాంధ్రములయం దుండుపకారవకారములకు యతియందును ప్రాసయందును వైకల్పికత్వమును జేర్కొనిరి." (65) అని బా.వి. కారికలో 'యతే' అన్నది యచ్చుపొరపాటు. 'యతౌ' యని యుండవలె. సర్వత్ర అనుదానికి సంస్కృతాంధ్రము లనియు ద్వయోః అనఁగా యతిప్రాసలు రెంట ననియు బా.వి. వివరణము. (క.మం.33) అట్టియెడల యతౌ యనుపదళమున కన్వయ మెట్లు?

ఇట క.మం. 'కొందఱు యతిప్రాసములయం దుందుపకార మునకు వకారము వికల్పముగా వచ్చు ననిరి. కొందఱు యతియందు సంస్కృతాంధ్రశబ్దములయం దుంపుపకారమునకు వకారము వికల్పముగా వచ్చు ననిరి. (33) యని పేర్కొన్నది. యతిప్రాసములందు వికల్ప మని సంస్కృతాంధ్రవివక్ష లేక సామాన్యముగాఁ జెప్పిన పూర్వార్థముచేతనె యతియందు సంస్కృతాంధ్రముల పకారమునకు వికల్పముగనె వకారము సిద్ధించుచుండ యతౌ సర్వత్ర కేచన యను తరువాతి భాగము కేవలము వ్యర్థమె కదా. అది తెలిసియు బా.వి. క.మం. చెప్పినయర్థమును మార్చిన దని తలఁచినప్పటికిఁ బైని పేర్కొన్నట్లు యతౌ యనుశబ్ద మం దన్వయింప నేరదు. కాఁగా క.మం. చెప్పినయర్థము గాని పైని బా.వి. చేసినయర్థము గాని సమంజసములు గా వనక తప్పదు. బా.వి. వివరణ ముచితము కాదు. పైని గొందఱు ప్రాసలో లే దని యతియందు వికల్ప మని చెప్పఁగా నిట నింకఁ గొందఱు "యతిప్రాసలు రెంట వికల్ప మనఁగా (కేచిద్ద్వయోర్వికల్పత్వమ్) మఱి కొందఱు యతియందుమాత్రము సార్వత్రికమని (యతౌ సర్వత్ర కేచన) చెప్పి" రని (వ్యా.సం.స.261) గ్రహించుట సక్రమ మైయున్నది.

"వికృతాః పరుషా శ్చ స్యు స్సన్తి ఆద్యపదాదిగాః న వో గసదడా స్సేఽపి పరుషాః ప్రథమాహితాత్ - తెలుఁగుపదాది కచటతపలు వికల్పముగా గసడదవ లగును. రాముఁడు వలికెను పలికెను."(క.మం 34, బా.వి 65) ఈకారికపూర్వార్థమును వ్యాఖ్యలవారు వికృతా శ్చ పరుషా శ్చ స్యు స్సన్తి ఆద్యపదిగాః అనిచూపి తెలుఁగులపైని సాంస్కృతికపరుషములకు గసడదవ లగు ననిరి. (వ్యా.సం.స 261) కాని వి.వి.గ్రంథమునకు మూల మైనకవిశిలోఁ గారిక వ్యాఖ్యలవారు పేర్కొన్నట్లు గానరాదు. ఇంకను సహాళో. "వికృతాః—ఇత్యర్థవిశేషా

మందు నున్నవియు నగుసంస్కృతశబ్దాదికచటతపలు గసడదవలు గావు. రామనామము పాపహరము. అతఁడు కంజదళాక్షుఁడు మొ॥ (65) అన్నది బా.వి. (ఈయర్థముమాత్రము క.మం.కంటె భిన్నము.) ప్రథమమీఁది వని కారిక వేఱ చెప్పుట స్పష్టతకే యనవలె. ప్రథమేతరాంతముపైఁ దెలుఁగుపదాదిపరుషములు కేని గసడదవలు రావు గదా. ప్రథమమీఁద నున్నసాంస్కృతికపరుషములు సమాసమందు యుండవలెనా? అందుకే పాపహర మనుసమాస ముదాహరింపఁబడిన దన్నమాట. అట్లు గాక అది + తథ్య మని యున్న ననుకొందము. ప్రథమమీఁద నున్నను సంస్కృతశబ్దాదే యున్నను నీపరుషములు సమాసమునం దున్నవి కావు. కావున గసడదవలు రావన్న నన్న మాట. ఇది పథ్య మన్నప్పు డొప్పినయాదేశము నాఁడు కంసారి యనుచోఁ ద ప్పగుట వింతయే యనక తప్పదు. ఇదే యర్థము కారికాకర్త యుద్దేశించిన నది యసంగత మనక తప్పదు (క.మం. కూడ దీనియర్థవివరణము నఁ బ్రమాదపడినది. ఆవిషయము గ్రంథాంతరమునఁ జర్చింపఁబడు.)

వి.వి.లక్షణమునకు నాధారమైన కారికవిది. ననుసరించి 'వికృతాః పరుషా శ్చ స్యు స్సుస్థి తే ఆద్యపదాదిగాః అన్న దొకయంశము కాఁగా న వో గసడదా స్సంఽపి పరుషాః ప్రథమాహితాత్ స్యు శ్చినాన్నదేవ తన్మాత్రే వినా ద్వంద్వం మతే హరేః (హరే ర్మతే' యని క.మం.పాఠము.) యన్న దిం కొకయంశము. కాఁగా దీనికి వజ్ఝలవారు పేర్కొన్న యర్థమునను గలతపఁబాటు గ్రంథాంతరమునఁ జూడఁదగు. "సమాసమునం దైనఁ బ్రథమయనుటకుఁ దగినశబ్దము కంటెఁ బర మైనప్పటికిని బై పరుషములు గసడదవలు కావు. అందువలన ద్వంద్వమునఁ దప్ప నితరస్థలముల వ్యస్తతలోనే గసడదవ

లగును' అని దీనియర్థమును గుర్తింపఁదగు నని యిప్పటికి నిర్ణయించుకొన్నను.

క.మం. ననుసరించియుఁ గొంత విలక్షణముగను వి.వి.లక్ష్యములను బా.వి. చేసినయర్థము సముచితముగాఁ గానరా దనక తప్పదు.

## ద్వంద్వము :

ద్వంద్వంబునం బదంబుపయి పరుషములకు గసడదవ లగు ననుటం గూర్చి బా.వి. "ఇది నిత్య మగుటచే దేశమైనను కొన్ని లక్ష్యములు శ్రుతిహితములు కావు. అట్టిచోట్లను ప్రాసములలోను ఈయాదేశము చేయక మానియుండవచ్చును" (66) అన్నది. ఈ చెప్పినతీరునుబట్టి పై కారణములచేతఁ గసడదలు మాని రని కవిప్రయోగములను వర్ణించుట గాక పై కారణములచేత నిత్యమైనను నీయాదేశమును మానుకొనవచ్చు నని శాస్త్రము ననుజ్ఞ యిచ్చుట తోఁచుచున్నది. అది యుక్తమైన సమంజసము కాదు. శ్రుతిహితము కాదని శాస్త్రము చెప్పినదానిని జేయ మాను టెట్లు? అట్టిది చారిత్రక వ్యాకరణముల నొప్పు నేమో కాని యిటఁ గుదురదు. శ్రుతిహిత మయ్యును గవిప్రయుక్తము కానిదానిని, వ్యాకరణ మనుమతింపనిదానిని నాపాదించు టెట్లు? ఇట్లే ప్రాసలందు మానవచ్చు ననుటయు.

స్పష్టతకొఱకుఁ గావచ్చును, గాని యిట బా.వి. 'పూర్వోత్తరపదము లేకవచనములం దుండవలెను. సమాసము బహువచనాంతము గావలయును.' (66) అన్నది. తల్లిదండ్రు లనుచోట నింతియ. కాని టక్కుటెక్కు లిత్యాదిస్థలములలో టక్కులు + టెక్కులు అని చూపిన నిబ్బంది లేదు. ఆలును బిడ్డలును ఇత్యాదు లిట్లు. కాలుసేయి ఇత్యాదు లరుదు.

**పరుషాలకు సరళాలు:**

'ద్రుతప్రకృతికముమీఁదిపరుషములకు సరళము లగు' నను సూత్రమునకు మూలమును జూపుచో శా.వి.లో "పరుషాద్ద్రుతప్రకృతికాత్సరళాస్స్యుః (66) అని యుండుటలో పొరపా టచ్చునకు సంబంధించినదా? పరుషా ద్రుతప్రకృతికాత్సరళాస్స్యుః అని యుండవలె.

మీఁదున్ క్షేమమె ఇత్యాదులందు సరళాదేశము లే దనియు నీవిషయనిరూపణములోఁ ప్రాచీనవ్యాకర్తలు శ్రద్ధ వహింపలే దనియుఁ గొన్నిసంయుక్తాక్షరము లాదియందుఁ గలపదములలో ప్రవృత్తి ననుసరించున దనునారాయణీయమువివరణమును తె.వ్యా.వి. (418) అనువదించినది. సూరి బాలవ్యాకరణములోఁ జెప్పలేదు గాని సూత్రాంధ్రములో 'న పరుషాణాం ఖరి వికారః' అనియు, నెటువంటి సంయుక్తములోనిపరుషములకు సరళములు గావో స్పష్టముగా నిర్ణయించినాఁడు.

**కందోయి:**

దీనినిగూర్చి వివాదములు చాల యున్నవి. శా.వి. చాలఁ సులువుగాఁ దేల్చినది. '(కన్) ఇందలినకారము ద్రుతము కాదు... బిందువు నిరూపింపఁదగియుండుటనుబట్టి ద్రుతమువంటి దనఁదగు (70) నన్నది. ఆపిదప నిం కొకచోటఁ గూడ 'కన్ + దోయి, సమాసము. నకారము ద్రుతతుల్యము' (74) అన్నది. ద్రుతతుల్యము లనువాని ప్రసక్తి సూరి గాని యితరులు గాని చేసినట్లు గానరాదు. ద్రుతము నకు బిందువు గానంబడియెడి నని చెప్పి కన్ + దోయి, కందోయి యనియు 'ద్రుతమునకు లోపము లే' దని కన్దోయి యనియు సూరి చూపు చుండఁగా నది ద్రుతమే యనుట యుచితము గాని నిరాధారమైనతుల్యతాకల్పనము సమంజసమా?

బా.వి. ఇదే విధ మింటూనను మన్వయము స్థలాంతరమునఁ గూడఁ జేసినది. 'కొన్ని యెడల ద్రుతంబుమీఁద నకారంబు గానంబడియెడి' ననుచోట నకార మనుటలోఁ బ్రయోజనమును వివరించుచు "దీనిని ద్రుత మన్నచో దీనికి స్వత్వ ముండునా యుండదా? అను చర్చ. అందుచే దీనిని నకార మనిమాత్రమె సూరి చెప్పెను. అది ద్రుతమే యనక నకార మనుటచే ద్రుతలక్షణము కొంత కలది యగు" (77) నన్నది. ద్రుతంబుమీఁది ద్రుతమునకు స్వత్వంబు లే దని సూరి ఆం.శ.శా.లోఁ జెప్పియున్నాఁడు. కాని బా.లో. బ్రస్తావింప లేదు దాని నక్కడనుండి గ్రహింపవలెనా? 'నకారంబు'ను జెప్పను గాన దానిస్వత్వమును అదియు నున్ గాక యుని పొల్లునకారముతోనె యుండుటవలన స్వత్వనిషేధ మనవసరము లే దని బా.లో. స్వత్వనిషేధము చేయ మానియుండును

అది యట్లుండ ద్రుత మనక నకార మనుటచేత ద్రుతలక్షణము కొంత కలది యవ్వ ననుట గుణముగనది గాదు. ద్రుత మనఁ గూడ ననుద్దేశముతోనే నకార మని యున్నపక్షమున నందు ద్రుతలక్షణ మెంతమాత్రము నుండుటకు వీలు లేదు. (పూర్వపదాంత్య పకారంబు నకారం బగు నన్న ప్రౌఢలక్షణమున నకారమున నందు ద్రుతలక్షణ మెం తేని యున్నదా?.)

ద్రుతలక్షణము కొంత యుండు నన నెంత? బింద్వాది ద్రుతకార్యము లవును గదా. కొంతే ద్రుతలక్షణ మున్న దని ద్రుతకార్యములు కొంతవఱకె వచ్చి మఱి కొంత యాగిపోవుట లేదే. బిందుసంశ్లేష లవును గాని స్వత్వము గా దని, ద్రుతకార్యములు కొన్ని వచ్చిన నొకటి వచ్చుట లేదు గాన ద్రుతలక్షణము సమగ్రముగా లే దనవలయునా? స్వత్వ మొక్కటి లేనప్పుడు ఆం.శ.శా.లోవలె దాని

సిక్కడ నిషేధించుకొనుట యుక్తము గాని యీకొంతద్రుతలక్షణ మనుపపత్తి యుక్తము గాదు. బిందుద్వ్యాదులలోనే యేదో యొకటి స్థలాంతరములలో రా దని చెప్పిన నది లక్ష్యవిరుద్ధ మగుఁ గాని లక్షణ విరుద్ధము గాదు. కొంతలక్షణముచే స్వత్వమే రా దనునియమ మేమున్నది? కాఁబట్టి రానిది స్వత్వ మొక్కటే యయి యది యానకారమునకు నియత మయినపుడు దానిని స్పష్టముగాఁ జెప్పుటయే (విధించుటయే) యుచితము.

అన లిక్కడ స్వత్వమాత్రము రాదని చెప్పవలెనా? ద్రుత మున్న స్వత్వ మగు నేమో యని నకార మని చెప్పెనా? ఈనకారము పూర్తిగా ద్రుతమే యనుకొందము. అప్పుడు స్వత్వ మయిన నిబ్బంది యేమి? విధింపఁబడిన దే నకారము కాఁబట్టి స్వత్వస్థితి పొల్లునకారములో నుండుటయే యగును. అదియునన్ గాక యన్నది స్వత్వ మన్నమాట. అదియును న్గాక యనుసంశ్లేష మంగీకరింపఁబడఁగా అదియున్ గాక యనుస్వత్వ మంగీకరించుటలో భేద మేమి? అనఁగా స్వత్వము నవు నన్న నిబ్బంది లేదు. బిందుసంశ్లేష స్వత్వము లనుద్రుతకార్యము లన్నియు వచ్చునప్పుడు నకారమున ద్రుతలక్షణము సమగ్రముగనే కల దని బా.వి. పద్ధతిలో నైనఁ జెప్పవచ్చును.

ఎప్పుడీనకారమున కొకటి యైన ద్రుతకార్య మగపడుచున్నదో యప్పుడు దీనిని ద్రుత మనక తప్పదు. (ద్రుతము గాకయుఁ దత్కార్యము సిద్ధించుటకు లక్షణమున నెట్టియాధారమును లేదు గదా.) ద్రుతకార్యాలలో నే దైన వచ్చుట యిష్టము లేకున్న దానిని ప్రత్యేకముగాఁ జెప్పుకొనవలసిన దే. తాను నేనుల ద్రుతమునకు సంశ్లేషము లే దనలేదా? అట మాత్రము ద్రుతలక్షణము కొంత

మాత్రమె యున్న దన్నఁ జాలదా? సూరి తాను నేనులు ద్రుత ప్రకృతిక తుల్యము లని చెప్పియు బాల.లో నవి ద్రుత ప్రకృతికములే యని చెప్పుట గమనార్హము. కాఁగా ద్రుతతుల్యము లనియు, ద్రుతలక్షణము కొంతయే యున్న నకారా లనియు వికటకాలకల్పనలు శాస్త్రిసమ్మతములు గావు సంగీకారయోగ్యములు గా వని చెప్పకతప్పదు.

కాఁగా 'కన్'లో నకారము ద్రుతతుల్య మనుట యొప్పదు. కందోయి యనురూపముంగూర్చి గ్రంథాంతరమునఁ బరామర్శింపఁ బడియె. (మా.ప్ర.) ఇక్కడ ద్రుతమునకు సమాసములో రావలసిన లోపము నలుయుక్ చుఁడుసూత్రము వారించిన దని బా.వి. (74) స్పష్టము చేసినది. తదనంతరము సరళపరకత్వముచేతఁ గూడ ద్రుత లోపము ప్రాప్తించును. దానిని గూడ నలుయుక్ — సూత్రమె వారించును.

అ ది యు ను నా క :

"అదియును + కాక - ద్రుతముపై పరుషము సరళము కాఁగా అదియును గాక - ద్రుతముపై నకారము (72) అనుకృతిగా బా.వి. వినిప్రక్రియ నడపినది. ఇక్కడ దినంబును + పోలె సరళాదేశము దినంబునుబోలె దినంబునుంబోలె. (73) ఇది సరి కాదు. ద్రుతముపై నకారము గానవచ్చుటలమునఁ జైనున్న సరళాదేశమునకు నిమిత్తము ద్రుతముపై నైననకారముగనె చెప్పవలెను గాని యంతకుముందటి ద్రుతము కాదు. దినంబునుంబోలె ననుచో ద్రుతముపై నైననకారమునకు బిందు వయినదే కదా. ద్రుతమునకుఁ జెప్పినబిందు పినకారమున కయినపు డిది ద్రుతమె యనవలసియుండఁగా నీద్రుతముపై పరుషమును సరళము చేయఁజాలదా? కావుంబడినిండి ననుట ననుసరించి యట్టిది కనఁబడినప్పుడే యట్టివాటనే యీవిధి వర్తించుచున్నది.

కాన నట ద్రుతముపై నకారమును జేసి పిదపనె దానికి బైనున్న పదములకు సరళములు చేయుట న్యాయము.

**నాలుగేన్బాఁడి కుఱ్ఱఁడు :**

తానుసేనులలో ద్రుతమునకు సంశ్లేషము నిషేధించుటను సమర్థించుచు బా.వి. 'దీర్ఘముమీఁది ద్రుతము లోపించుటయే సులభము. సంశ్లేషము పూర్ణబిందువు తుల్యములు. దీర్ఘమున కిఁకను దైర్ఘ్యము గల్గించును (75) అన్నది. పే.వ్యా., సు.ప్ర.లు ఈయభిప్రాయమునే వ్యక్తీకరింపఁగా దీనిని గా పలుకుట సాధ్యము చాల దనుచు తె.వ్యా.వి. కూడ 'ఇంతకంటె సంశ్లేషనిషేధమునకు నిమిత్తము కానరాదు' (462) అన్నది. తానుసేనులపై సంశ్లేషనిషేధమునకు నిమిత్తము పైని జెప్పినదే యయిన దీర్ఘముమీఁది ద్రుతమునకు సంశ్లేషము లేదని చెప్పవలసియుండఁగా సూరి తానుసేనులకు రెంటికే యెందుకుఁ జెప్పె ననువానికి సమాధానము చెప్పవలసియున్నది. దీర్ఘముమీఁది (సాధ్య) పూర్ణమును వారించినట్లుగా దీర్ఘముమీఁది ద్రుతమునకు సంశ్లేషమును వారించుట జరుగలేదు. పైఁగాఁ దానుసేనులవిషయములో నీసంశ్లేషనిషేధము ప్రస్తావించుటనుబట్టి యితరసందర్భములలో దీర్ఘముమీఁది సంశ్లేష ముండవచ్చునని యర్థము స్పష్టమగుచున్నది.

వజ్ఝలవారు దీర్ఘముమీఁది సంశ్లేష ముండవచ్చుననుచు 'నాలుగేన్బాఁడి' యని చూపఁగా తె.వ్యా.వి. 'నాలుగేన్ పాఁడి అని కొన్నిప్రతులలో గలదు. ఏన్ (అయిదు) పాదాంతమున నుండుటచే నిట సంహితారహితముగ భావించి సరళాదేశము చేయకయే చూపఁబడె' (462) నన్నది. నాలుగేన్బాఁడి యనియే ముద్రితప్రతు లందుఁ గానవచ్చుచున్నది. నాలుగేన్బాఁడి యనునది పాదాంతముగ

నైనఁ జూపఁబడలేదు. భారతసంశోధితముద్రణమునను. వజ్ఝలవారి పాఠము గ్రాహ్యము గాదని నిర్ణయింపవచ్చును.

నాలుగేన్ పాండి అనుదానిని తె.వ్యా.వి. సమన్వయించిన తీరును సరిగా లేదు. నాలుగేను అనుచోట ఏనుశబ్దము (అయిదు) అని గుర్తించినఁ "బాదాంతమున నుండుటచే సంహితావిరహితముగ భావించి సరళాదేశము చేయుటలే"దనుట యనవసరము. పైని సరళాదేశము రావలయు నన్న ముండటికి యేను ప్రత్యక్షకృతికము గావలయును. తాను నేనులకు భిన్నమైన యీయేను (ప్రథమాంత మగుట చేతఁ) గళదో యప్పుడు గాని ప్రత్యక్షకృతిక మెట్లగునది? ఇది ప్రథమాప్రకృతికము కాదు గాఁబట్టి పైని సరళాదేశము ప్రసక్తి లేదు. పాదావసానములోఁ గాదు, పాదమధ్యమునందె యైనను నాలుగే న్పాండి యనియో, నాలుగేన్ పాండు యనియో సరళాదేశము లేకుండ వలసినదే.

పాదాంతములో ఏను-ఏన్- అగుట యదు దైనప్రయోగమె యనవలెను. ఇక్కడి యేనులోని యుత్వమునకు 'పదాంతంబు లయి యసంయుక్తంబు లయిన నకారంబులయుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు' ననుసూత్రముప్రకారము లోపము రావలె. కాని యిక్కడ సూరి ఇందు నకుల కుత్వలోపంబు ప్రాయికంబుగా హల్పరకంబులకుఁ జూపట్టుచున్నాఁడు. ప్రాయిక మన్నాఁ డిక్కడ నదు దై యనవానపరకతలో లోపించిన దందుమా? హల్పరకతలో లోపించిన దనఁగా లోపము వచ్చుటలోనిహల్పరకత ప్రతికావ్యసందర్భములో నే యగును? హల్పరకత యున్నది. సంహిత లేదనవలెనా? కాఁగా హల్పరకతలో నుత్వలోపము రాఁగా ప్రత్యక్షకృతికము కాక పోవుటచేత సరళాదేశము లేదని గుర్తించుట సముంజసము. అవసాన

నరకతలో సత్వలోపము చెప్పిన ప్రౌఢవ్యాకర్త లురువర్ణకములకే చెప్పెను. అవసానమున ద్రుతము కాని సువర్ణమునం దుల్లోప మింకెచ్చట నే నున్న దేమో వెదకవలె.

అయిన వ్యాఖ్యలవారిమతమున నింకొకబాధ యున్నది. ఏను శబ్ద మిది ప్రథమాంతము, కళ, భారతములలో గసడదవాదేశము నిత్య మని వారు భావించుటచేత ఏన్వాఁడు యని కావలసియున్నది. కళలలోఁ గూడ స్వరలోపానంతరము నకారము ద్రుతమే యను నభిప్రాయము గలిగినవారు గావుటచేత ఏను-కళ, ఏన్ ద్రు.ప్ర. కాఁబట్టి సరళాదేశము రాక తప్పదు. ఇట్టి వ్యత్యాసము లేమి సరళాదేశము రా దనువ్యాఖ్యలవారి సమన్వయము సరి గాదు. (మా.ప్ర.కా.) కాఁగా వారిమతములో నేని నయినను, నేను అయినను నొకటె యైనది. కాని యేనేఁ గర్త మిత్యాదుల ననుసరించి ఏని ద్రు.ప్ర. అనుకొన్న ఏన్ వాఁడు కుదరదు. ఏను అనియే గ్రహింపవలయును.

## సామాసికద్రుతలోపము:

'సమాసంబునయందు ద్రుతంబునకు లోపం బగు'-ననుసూత్రమును వివరించుచు బా.వి. 'పూర్వపదము ద్రుతప్రకృతిక మై ఉత్తరపదములతో సమసించునప్పుడు పూర్వపదాంతద్రుతము లోపించు (75) నన్నది.

ఉత్తరపదముతో, సమసించునప్పు డనుట సరి కాదు. ఉత్తరపద మనఁగా సమాసచరమావయవ మని శాబ్దికులనిర్ణయము. అనఁగా సమాస మయినపిదపఁ గంపలిచివరిపదమున కుత్తరపద మనువ్యవహారము సముచిత మగును. సమసింపకముందు దాని నుత్తరపద మనుటకు వీలు లేదు గాఁబట్టి 'యుత్తరపదముతో సమసించుట' యన్నది విరుద్ధము.

సూత్రతాత్పర్యాభిప్రాయమును గా దని స్పష్టము. స్థలాంతరములలోను నిట్టి పొరపాటు గలదు. తె.వ్యా.వి. 463, 464. పుటలు.

## ఎల్లన్ శిష్యులన్ :

ఎల్లన్ అనుదానికి నసమాసములో విశేష్యమునకు ముందు ప్రయోగము లే దన్నాఁడు సూరి. శ్రీనాథుఁడు ఎల్లన్ శిష్యులన్ అని ప్రయోగించెను. ఇక్కడ నసమాసములో విశేష్యమునకు ముందు ప్రయోగ మున్నది. కాఁబట్టి 'విశేష్యమునకు ముందు సామాన్యముగా ప్రయోగ ముండ దా దని సవరించుకొనవలెను' (78) అని బా.వి. సవరణము ప్రతిపాదించినది. ఇటువంటిదొకటి యగు ప్రయోగములకుఁ బ్రాముఖ్య మిచ్చిన సామాన్యముగా సను దశము దాదాపుగా సన్నివిధానములలోను సవసర మేమో యనిపించును. అయిన నిక్కడ ఎల్లన్ అన్నది విశేష్యము, శిష్యులన్ అన్నది విశేషణము నని చెప్పవచ్చును. (చూ.త్రి.శే.)

## నుగాగమము :

సంధి 25 సూత్రము ప్రకారము వచ్చిన నుగాగమమును గూర్చి వివరించుచు బా.వి. 'ను'లోని 'ఉ' కూడ ఉచ్చారణసౌకర్యమునకే కావున 'ఉన్' లోపింపఁగా పొల్లునకారమె పూర్వపదాంతమునందుఁ జేరు' (78) నన్నది. నుగాగమములో నకారపుఁబొల్లె మిగులును దనుట సమంజసము గాదు. పొల్లే యాగముముగా వచ్చిన దానిస్వత్వస్థితి కూడఁ బొల్లుగనే యుండును గదా. చిగురు నైదు వనునది సంశ్లేష మయినఁ జిగురున్ గైదు వనునది స్వత్వ మనవలసి యున్నది. ఈ రెంటికి వ్రాఁతలో నేకొంచెమో తప్ప భేదము లే దన్నది స్పష్టము. కాని సూరి సమాసములో స్వత్వమును బ్రత్యేక

రత్వంబొల్లే వచ్చినను స్వత్వము సహాపములో నుండు నని యట్టి స్వత్వము లేదు గాన నంద ప్రాతిలక్షణము కొంతదో యని బా.వ. తలంచి యుండవచ్చు. (అట్లయినను స్వత్వమును నిషేధించుకొనవలసినదే కాని ప్రతిలక్షణము కొంత యనుపద్ధతి సరి గాదు.) పొల్లుసకారము స్వత్వస్థితి 'సు' అగుట యెట్లో వివరించిన బాగుండెడిది. కాఁగా బా.వ. ఇంతకు ముందు ప్రతికార్యములనుగూర్చి వివరించుచు స్వత్వమును గూర్చి యిట్లన్నది. 'ప్రకృతికి ధ్వానము అనఁగా సహజ స్థితి. ఎట్టి మార్పును జెందకుండుట గూడ నొకమార్పే. దీనినే స్వత్వమందురు. అనఁగా ప్రకృతముయొక్క సహజస్థితి.' (౭౭) ఈ వివరణము బహుస్పష్టముగా నున్నది. మార్పు లేకపోవుట సహజస్థితి స్వత్వమయిన నది గూడ నొకమార్పే యనుట యెట్లు? అయినను స్వత్వము నిట నుదాహరణముగాఁ జూపుట సరి కాదు. ఘ్రాతను గలుప నున్నపుడు ప్రకృతము సుస్వాహాపములో నున్నది కాఁబట్టి స్వత్వము 'సు' కావచ్చు. రావణుఁడు + చంపెను అనుచోట రావణుని చంపె నని 'సి' గదా స్వత్వము. ఇఁక వికారము లేకుండ సహజస్థితిలో నుండుట స్వత్వమను వివరణము ననుసరించఁగా నికృష్ట నుగాగమముచే వచ్చినది సకారపుఁబొల్లు. అయిన దాని సహజస్థితి పొల్లుగా నుండుటయే కదా. 'ను' ఎట్లగు? సకారము సవర్ణముగా మారిన దనఁగా నది ప్రకృతము వికృత మగుటయే యగును గాని సహజస్థితి యనుట యెట్లు? పొల్లుసకారము సవర్ణముగా మారుట స్వత్వ మన్న నవికారస్థితి మున్నగా బా.వ. ఇంతకుముందు చేసిన వివరణము విరుద్ధమే.

మార్పు లేకుంట గూడ నొక మార్పే యన్నను స్-అనుపది కొంతమారితే 'సు' అయిన దంపము. అయిన నా యొక మార్పు ఉత్వములోఁ గూడుట యనునిశ్చయ మెట్లు? 'స'గా మారిన నదియు నొక

సూరి బా.ల.లో చెప్పలేదు. శ.ల.సం.లో ద్వితీయ కనుప్రయుక్త మనెను. అప్లే ప్రౌఢవ్యాకర్త ద్వితీయ కనుప్రయుక్తము చేసెను. (మా. త్రి. శే.)

తెనుగు విషయము. తద్ధితవృత్తిలోను సమాసాలలోఁ జెప్పినస్వత్వవిశేషము వర్తింపకతప్పదు. అనంతగుణవాచకములకు విశేషముగా (ఔప సూ.స్థలమునకంటె) నుగాగమ మవుచున్న దన్న యుద్దేశముతో దీనిని వేఱుగాఁ జెప్పె ననవచ్చును.

**నుక్కు - బిందువు:**

బా.వి. అట నటఁ జారిత్రకదృష్టితో వివరించుటవలన నటఁ గొన్నింట శబ్దశాస్త్రమున సందేహముల కవకాశము గల్గినది. "ఈ నకారము మీఁద నున్న పదములను సరళములుగా మార్చఁగా, ఆ సరళము తనకు ముందున్న నకారమును తనవర్గపంచమాక్షరముగా మార్చును. ఆ పంచమాక్షరము స్థానమున బిందువు క్రాంతలో నేర్పడినది. ఆ పంచమాక్షరము దేల్చి పలుకఁగా దానికిఁ బ్రతినిధిగా ఖండబిందు వుంచ నగును" (78) ఈ విషయము సూత్రవివరణములోఁ గలియుటతో శాబ్దికులయభిప్రాయము నింతే యను నేమో యనిపించునవకాశ మున్నది. బిందు వేర్పడిన దనుదానితో వైయాకరణులకు సంబంధము లేదు. కాఁబట్టి వారు సరాసరిగా ద్రుతమునకు బిందువు విధించిరి. వ్యాకరణములపద్ధతి నింతకు ముందు బా.వి. ప్రస్తావించినది కూడ. (68) కాని యిక్కడ సూత్రాభిప్రాయము తోనె కలియుటవలనఁ గొంత యిబ్బంది. చరిత్రను వేఱు చేసి చెప్పకొనుట సందేహాస్పదము గాకుండును. చినుగుడైన వితొర్కదని జూపుట లాక్షణికసంప్రదాయము కాదు గదా.

ఇటనే 'సరళములకుఁ బూర్వ మున్న ద్రుతము లోపించును. లేదా వర్గపంచమాక్షర మై బిందు వగును' (78) అన్నది బా.వి. కాని యింతకు ముందు 'ఇట' (సరళస్థిరపరకతలో) ద్రుతము వర్గపంచమాక్షరముగా మారును. మారినప్పుడే లేఖనమునం దది బిందు వగును - వచ్చె న్గోవులు -' (68) అనియుఁ దరువాత 'తొలి రెండు లక్ష్యములు (వచ్చెం ధాత్రీపతి, పాడెం గంధర్వుఁడు - అని పూర్ణానుస్వారము వచ్చుట యున్నమాట.) ఛందోనియమనిర్బంధమునకు సంబంధించినవి' (70) యనియుఁ జెప్పుటలో సరళస్థిరపరకతలో ద్రుతము వర్గపంచమముగా మారు ననియు ఛందోనిర్బంధమువలన బిందువు వ్రాయుట జరిగిన దనియు (అందుకే?) అది యరుదుగా నుండు ననియు బా.వి. అభిప్రాయ మగుచున్నది. మఱి యిక్కడ లోపించు ననియు లోపింప కున్న వర్గపంచమాక్షర మై బిందు వవు నని సామాన్యముగాఁ జెప్పుచున్నది. (సరళాలవిషయమున నైనను) వైరుధ్యము పరిహరింపఁబడలేదు. కాని సరళస్థిర (వర్గయుక్) పరకతలో ఖండబిందు వుండదు గదా. బిందువు తేలిపోయిన ఖండము వ్రాయవలయును. అందు కని 'ఈవర్గపంచమాక్షరమును దేల్చి పలుకుట జరుగదు. కావున ఖండబిందువు రాదు' (78) అని బా.వి. స్పష్టము చేసినది.

## నలుగడలు :

బా.ల. ప్రథమముద్రణమునను నలుఁగడాదుల ప్రయోగమందు లేదం ద్రసి ఖండబిందు వున్నది గాని ఇచట నున్నది సూరిసమ్మత మని బా.వి. (70) చెప్పుచున్నది. కాని యది ముద్రణప్రమాదమే యని వజ్ఝలవారు వివరించిరి. (వ్యా.సం.చ. 346) నలుఁగడాద్యాదులు లేవు కాఁబట్టి యట్టివానిని సూరి సాధించుచున్నాఁ డనుట సమంజసము గా దేమో. పైఁగా బా.వి. చేర్చుచున్నట్లు నలువడి, అణువక,

ఇరువది యిత్యాదులలో నుగాగమము లేదు గదా. ఇక్కడ బా.వి. 'ఇట్టివలుగడాదులు కొన్ని సంఖ్యావాచకము' (78) అను వాక్యము వివరణాపేక్ష కలిగియున్నది. నలుగడ యనునది నలువది మొదలగు సంఖ్యావాచకములవంటిదే యని నుగాగమము లేదనియుఁ జెప్పుట యభిప్రాయ మేమో. 'నలుగడ' అనుసమాసము మొత్తము సంఖ్యావాచకము కాదు గదా. అచ్చుపొరపా టేమైన నున్న దేమో. ఇట్లే తరువాతఁ గూడ 'గవనవుంముఁ' నని బిందు వుండునా? వర్గయుక్పరుషములపరము లగునప్పుడే బిందువు (19 సూ.) సరళస్థిరములు పర మగునపుడు లోపసంశ్లేషము లే. (79) యనుటలోఁ గూడ నచ్చుపొరపా టేమో. వర్గయుక్పరుషపంక్తిలో బిందువు (పూర్ణము) అంగీకృతము కాఁబట్టి చివరివాక్యారంభములో సరళస్థిరము లను చోట బా.వి. (సరళ) వర్గయుగ్భిన్నస్థిరాలు అని చెప్పిన బాగుండెడిది.

## తలఁబ్రాలు :

దీనిని బా.వి. తలన్ + ప్రాలు అని విభజించినది. (0) కాని తలను + ప్రా లని విభజించుట యుచిత మనిపించును. 'సమాసంబులందు' అనుసూత్రముచేత నిక్కడను ద్విత్వము నిషిద్ధ మవుచున్నది. సప్తమ్యర్థమున ద్వితీయలో నువర్ణము గదా వచ్చినది. దానికి స్వరలోపము చేసి చూపవలసియుండదు గాని యవకాశము గాని యిక్కడ లేవు. నకారపుఁబోల్లు నామాపిన దానిద్విత్వము 'ను'వర్ణముతో నుండు నవకాశము లే దని గుర్తించితిమి. కాని ఇక్కడ ద్విత్వనిషేధము ప్రసక్తి లే దనవలసివచ్చును. బా.వి. ఇట్టి ద్విత్వనిషేధమునుగూర్చి ప్రస్తావించనే లేదు. పైఁగా 'సమాసంబులందు ద్రుతంబునకు ద్విత్వము లే' దను సూత్రమునొద్ద 'విధానసామర్థ్యము చేత లోపించ దనుట.

మీఁదిసూత్రములలో నుగాగమము విధింపఁబడును. ద్రుతము లోపింపనిచో దానిస్వత్వరూపమును గూడఁ జూపవలయు.' (79) అనుటను బట్టి చూచిన నుగాగమవిధానస్థలములలోనే సమాసాలలో స్వత్వము పై సూత్రముప్రకారము నిషిద్ధ మవు నని బా.వి. తలఁచిన దేమో యనిపించును. కాని విధానసామర్థ్యముచేత లోపింపనిద్రుతమునకే కాకుండ తలను + ప్రా లనురీతిసమాసములలోనిసహజద్రుతమునకుఁ గూడ సంధి ౨౬ సూత్రము స్వత్వమును వారించుచున్నదని గుర్తింపవలె.

నిజమునకు విధానసామర్థ్యముచే లోపింపనిద్రుతముల నే యుద్దేశించియున్నయెడల నీసూత్రమే యనవసర మనవచ్చు. విధానస్థలములందు నుక్కే విధింపఁబడినది. అట నుక్కులో నుకార ముచ్చారణార్థ మనుకొన్నఁ బొల్లే యాగము మగును. ఆగమము పొల్లయిన 'ను' స్వత్వనిషేధమే యనవసరము. తలను + ప్రా లనురీతి స్థలములం దున్న నువర్ణ ముండకె తప్పదు. అట స్వరలోపమునకు నవకాశ మెట్లును లేదు. కావున నట స్వత్వస్థితి ను,ని అనురీతి నుండ వలసియవసర మున్నది. (తలన్ప్రాలు ఒడిని ప్రాలు.) కావున నట్టి సహజద్రుతస్థలములయెడనె స్వత్వనిషేధ మత్యవసరము. తడసు గుణముగా (చిగురున్ గైదు వనురీతిని నిషేధింపఁబడినట్లు గాక) చిగురు నుగైదు వనురీతిని నిషిద్ధ మగును. కాన నుగాగమము నుత్వవిశిష్ట ముగనె యట్టియెడలఁ జేయవలెను. వక్ష్యమాణవిధిచే స్వత్వము లే దని సంధి 25 సూత్రము కడ సూరి వివరించుట విస్పష్టమే కద.

## క ర్మ ధా ర య ము - టు క్కు :

కర్మధారయ మన నేమో వివరించుచు బా.వి. 'సమాన మైనవిభక్తి గలసమాసములు కర్మధారయములు' (80) అన్నది. దీని యభిప్రాయ మేమి? రెండుసమాసములు సమానముగా నొకవిభక్తి

యుంత నుండుఁ గలిగి యున్న, నా రెండుసమాసములను, గలిపి కర్మధారయ మనవలయునా? లేక యొక్కొక్కదాని గర్మధారయ మనవలయునా? 'విశేషణంబునకు విశేష్యంబుతోడ సమాసంబు కర్మధారయం' బనుసూరివివరణమును జెప్పిన సరిపోయెడిది. కర్మధారయమును వివరించుచున్నది. గావున సమానాధికరణ మనుదానిని వివరింపఁదలఁచినను సమానవిభక్తి గలసమాసము కర్మధారయ మనునది యస్పష్టముగానే యుండును. సమాసపరిచ్ఛేదములో 'తుల్య మగు విభక్తి సమానాధికరణము. పూర్వోత్తరపదములు ప్రథమావిభక్త్యంతము లుండును. తెల్లగుఱ్ఱము (255) (తె.వ్యా.వి.580) అని చెప్పెను. తల్లియును, తండ్రియును, అన్నపుడు సమానమైనవిభక్తి (ప్రథమ) కలిగి యున్నది. దీనిని సమానాధికరణ మనవచ్చునా? తెల్లగుఱ్ఱము మనుచోట తెల్లని యనుపూర్వపదార్థమును గుఱ్ఱము అను నుత్తరపదార్థము నన్నవి రెండును నొకేగుఱ్ఱము నాశ్రయించియున్నవి. సమానమైన యధికరణ మగుటచేత నిది సమానాధికరణమైనది. తల్లిదండ్రు లనునప్పు డధికరణము మారుచున్నది గదా. సమానాధికరణ మనుదానిని బా.వి. ఇంకను స్పష్టముగాఁ జెప్పఁబూనిన సత్యము తగ్గెడి దేమో.

ఆధారో ఽధికరణ మని పాణినీయము. చిగురు టాకన్నచో ఆ సపదములకు చిగురునకును గూడ నాశ్రయము ఆకే కావున చిగురు ఆకు అనుపదములు సమసించి సమానాధికరణము లగుచున్న (494) వను తె.వ్యా.వి.వివరణము సమంజసముగా నున్నది. సమానాధికరణమును వివరింపవలసినచోట బా.వి.లోఁ గూడ నిట్లు చెప్పఁదగు. కావున నీ తె.వ్యా.వి.వివరణము సూచింపఁబడినది.

కర్మధారయంబులం దుత్తునకు (సంధి 28) అనుసూత్రముత్తునకే టుగాగమము చెప్పుచున్నది. అయినను బా.వి. ఉత్తునకే కాక తదితరాచ్చులు కొన్నింటి కచ్చు పర మగునపుడును (ఇది స్పష్టతకే, యుత్తున కైన నచ్చుపర మగునపుడే కదా టుగాగమ మగు నది.) టుగాగమ మగు (81) నన్నది. దుక్కిటెద్దు తేనెటీగ యిత్యాదులలో నుద్భవాచ్చునకు సీటుగాగమము కల్పించు చున్నమాట నిజమే. కాని యది సూత్రముప్రకారము సాధ్యము గాదు. కర్మధారయంబులం దన్నప్పటిబహువచనము గూడ నీయర్థమును సాధింపలేదు. అటువంటప్పుడు 'టుగాగమ మగు' నని సూత్రముప్రకారము ప్రాప్తించుచున్నట్లుగా బా.వి. చెప్పుట విశేషము. టుగాగమము గల దనియో కనిపించుచున్న దనియో చెప్పిన సరి పోయెడిది.

## పేర్వాదులు :

పేర్వాదులకు టుగాగమము విభాషగా సంధి 29. సూత్రము చెప్పుచున్నది. పేర్వాదులనుగూర్చి బా.వి. ఇది యాకృతిగణము. ఇవి రేఫాంతములు. పేర్వాదులు రేఫాంతములు. (81) అని పేర్కొన్నది. అనఁగా రేఫాంతములకు (పేర్వాదులకు) మాత్రమె టుక్కు విభాష. కాన రేఫాంతము గాకున్న టుక్కు విభాషగా వచ్చునవకాశము లే దను సిద్ధాంతము. (రేఫాంతతను బురస్కరించుకొని చారిత్రక మైనసమన్వయము గూడఁ జేసినది. బా.వి.) కాని పూవమ్ము (హరి 7-56) పూవడిపపుఁజోదు (సీలా 1-108) తప్పడుగుల (హరి. పూ. 5-193, 198.) అనుకృతిగా నితరములపైఁ గూడఁ గలదు. సూరి పుంపులపై టుక్కు నిత్య మని భావించె ననవచ్చు. కాని పుంపులపై టుగభావము గనఁబడుచునే యున్నది. ఇల్లటపల్లుఁడు (రామా. 3-44) క్రపసంటులచెంతన్ (య. 4-26) పట్టపేనుఁగు (కళా. 8-37.)

**పే దా దు లు :**

దీనినిగూర్చి బా.వి. 'గొడ్డుశబ్దము వక్క ఈగణము లోని శబ్దములు చాలవఱకు అజంతములే. వియ్యము + ఆలు వియ్యపురాలు కూడ ఉదంతము (82) గొడ్డు అజంతము గాకపోదు. గొడ్డురాలు అయిన తరువాత నుత్వలోపములో గొడ్రాలు అగును. కాని యిది సహజముగా హలంతము గాదు గదా. గొడ్డు అని నిర్దేశించినది బా.వి. కూడ. కాని యజంతము అనునది యచ్చుతప్పేమో. గొడ్డు తప్ప పేదాదులు చాలవఱకు అదంతములు అని బా.వి. అభిప్రాయము గావచ్చును.

**జ వ రా లు :**

ఇందులో పూర్వశబ్దము జవ్వని అని యీ సందర్భములో దానికి జవ యాదేశముగా వచ్చిన దనియు సూరి చెప్పియున్నాడు. దీనిం గూర్చి బా.వి. 'కాని జవశబ్దమును విశేషముగా గ్రహించుచో జవ యైన స్త్రీ జవరా లనందగు (82) నన్నది బా.వి. కాని జవ యైనయా లని విభాగించుటకు జవ యను శబ్దమసలు తెలుగులో నున్నదా?

పట్టాభిరామపండితీయము యువశబ్దభవముగా జవను జూపుట సరిగా నని తద్భవ మైన జవ కావలె ననుచు 'యువాన - జోవ్వ - జోవ జవ - అయిన దని తలంపవచ్చు' నని తె.వ్యా.వి. (401) తద్భవ మగువిధ మూహించినది. కాని తద్భవములు వ్యవహారస్థ మయిన శబ్దములనుండి యేర్పడుట సహజము. వ్యవహారములో బదములుండును గాని పదైకదేశముండవు గదా. యువ యని వ్యవహారమున్న దదియే క్రమముగా జవగా మారిన దనుకొనవచ్చు. కాని యూశబ్ద

నొక్కుడిది! యువ జొవ జవ యని యైన దన్నఁగొంతేని సమ్మత కవకాశ మున్న దేమో కాని తె.వ్యా.వి.చూపినమార్గము సరిగా లేదు. యువశబ్దభవము జవ (82) అని బా.వి.లోఁ జెప్పుట గమనింపవచ్చు. యూవని (యవ్వని) జవ్వని యని యైన తీరు గమనార్హము. ఏ దెల్లున్నను 'జవ' యని వ్యస్తముగా నెంతిమాత్రి ముసు దెలుఁగును లేదు గావున నది తద్భవముగా నేర్పడిన దను విచార మనవసరము శబ్దశాస్త్రమున.

అసలు జవయనుశబ్ద మున్నఁ గదా దాని కాలుతోనో మఱి దేనితోనో సమాసము చేయుటకు? 'బోఁడి' యనుశబ్దము లేదనియే కదా సూరి దాని నేమున కాదేశము చేసెను. కావున 'జవ' నాదేశించుట యిట సముంజసమే యవుచున్నది. అహోబలుఁడు జవ్వన + ఆలు అని విభాగించినాఁడు. అది సముంజసము గా దని జవ్వని యనునదే (ధర్మి యైన) విశేషణ మనియుఁ జెప్పుట సముంజస మనుసూరిసవరణము యుక్తము.

**విధవరాలు:**

ధీరాదులకువలె 'ఒకవిధవశబ్దమునకుమాత్రము అత్వమున కుత్వము గలుగ' దన్నది (83) బా.వి. అనఁగా విధవరా లనియే యుండు నన్నమాట. అసలు దీని కాలుశబ్దముతో సమాస మైన రూపములు కవిప్రయుక్తము లయియున్న వేమో వెదుకవలయును. విధవరా లనివ్యవహారములో నున్నది.

ధీరత్వము గలస్త్రీ ధీరురాలు (83) ధీరాత్వము గలస్త్రీ ధీరురాలు. ధీరయైనయాలు ధీరురాలు.

## ఉదంతద్ధర్మార్థక విశేషణము :

అనఁగా "ధాతువులు గాని, ఎడుగాగమముతోఁ గూడిన ధాతువులు గాని" (84) అని బా.వి. వివరించినది. సూరి చూపిన చేయు + (అతఁడు) అనునది ధాతు వనియు, చేసెడు (అతఁడు) అన్నది యెడుగాగమఘటిత మనియు నభిప్రాయ మున్నమాట. ఇది యసంగతము. ఇవి ధాతుజవిశేషణములు గదా. 'తృవర్ణకార్థంబునం దెడియెడువన్నియు నగు' నని యిట 'ఎడు' ప్రత్యయ మైనది. ఇది యాగమము కాదు. బా.వి. (315) ఈవిషయము స్పష్టము చేసినది. 'వానికి లోపంబు బహుళంబుగా నగు' ననుదానిచే నెడియెడు ప్రత్యయములు లోపింపఁగా నున్నరూపము చేయు - అన్నది. ఇది ధాతువు గాదు. బా.వి. ఆ తరువాతఁ గూడ 'ఎడియెడు ప్రత్యయములకు లోపము గల్గినను కేవలధాతువే విశేషణముగా వ్యవహృతము' (316) అన్నది. ఎడియెడులకు లోప మైన నది కేవలధాతు వనుట యసంగతము. సుప్రత్యయము చేసి లోపింపఁజేసినను స్త్రీసమాసాలు ప్రాతిపదికలే యగునా? అయిన నక్కడ సులోప మేల? ఇక్కడ నెడియెడులోప మేల? వికల్పముగా విధింపఁ జాలదా? (ధాతుత్వము పోయి) ప్రాతిపదికత్వము కలుగుట యను ప్రయోజనము శబ్దశాస్త్రానుగుణముగ సిద్ధింపుటకే యెడియెడులు చేసి లోపింపఁ జేయుట జరుగుచున్న దని గ్రహింపవలయును.

## షష్ఠీసమాసము - నువ్వు :

షష్ఠీసమాసమునం దుకారఋకారముల కచ్చు పర మగునప్పుడు సూరి నుగాగమము చెప్పియున్నాఁడు. షష్ఠ్యా ఉతోఽచి నుమ్నే యనుసూత్రము ననుసరించి బా.వి. 'మూఁడిందు ఋకారాంతశబ్దములు చేర్చఁబడలేదు. సూరి వీనిని గూడ చేర్చినాఁడు (85)

డున్నది. పయి సూత్రములో చింతామణి యుత్వమునకే సమాగమము చెప్పినది. కాని తరువాత 'తాంవృభౌ రమేశసహా' యను సూత్రములో బాలవ్యాకర్త ఋకారాంతములై నిల్చినశబ్దముల కితరశబ్దములతో సమాసమైనకార్యము లగు నన్నది. ఈశబ్దమునకు ద్వితీయాదివిభక్తులలో నిత్యమును, షష్ఠీపరకతలో నవర్ణమువలె షష్ఠీసమాసములం దిట్లు సమాగమమును ఋకారాంతములకు వచ్చును. నవిత్రన ట్లనురీతి రూపములు చింతామణిసాధ్యములే. సూరిప్రణాళిక భిన్నము, గాన నుకారముతో పాటు ఋకారాగమును గూడ జేర్చి స్పష్టము చేసినాడు.

మాతౄనాజ్ఞ, పితౄనానతివంటిరూపములు దోషములు (85) అని బా. వి. స్పష్టము చేయుట యుచితముగా నున్నది. అట్టి రూపములు దుష్టము లని కాని, యింకొకరకముగాం గాని దోషగ్రస్తతను (ధర్మిగాం) బేర్కొనవలసినది.

రాజ + ఆజ్ఞ - రాజాజ్ఞ ఇదిసిద్ధసమాసరూపము. తెలుగు వ్యాకరణమునం దిట్టివి నిరూపితములు కావు (85) అన్నది. బా.వి. స్పష్టతకై నం జైనట్లు విభాగించి చూపవచ్చును. ఇట్టివానిని దెలుగు వ్యాకరణము నిరూపింపలే దనియు నిరూపింపవలె ననియు నభిప్రాయపడిన నది యసంగత మగును. ఇందు రాజాజ్ఞా యన్నది ప్రాతిపదికగాం దెలుగునం జేరును. అది సంస్కృతమున నెట్లేర్పడినదో వివరించుట తెలుగువ్యాకరణమున కవసర మగు నెట్లు? రాము అన్నది ప్రాతిపదిక మనుచో నీప్రాతిపదిక యెట్లేర్పడినదో తెలుగు వ్యాకరణము నిరూపింపలే దని విచారింతుమా? భార్గవ ఇత్యాదు లిట్లే కదా. రాజాజ్ఞా యనురీతివానిని నిరూపింపబూనిన సంస్కృతమందలి సమాసవిషయములును కృత్తద్ధితవిషయములు గూడ సంధులతోం జెప్పవలసియుండును. అది యట్లుండంగా సంస్కృతమునుండి

తెలుఁగులోనికిఁ బ్రాతిపదికను గ్రహించునప్పుడు ప్రాతిపదిక మేల్చేర్పడినదో నిరూపించుట తెలుఁగువ్యాకరణమున కవసరము గాదని గుర్తింపవలెను. ఆధునికు లెవరే నట్లు నిరూపించిన నయ్యది వ్యుత్పత్తికై చేయునదే కాని శబ్దశాస్త్రమున కేమియు నవసరము గాదని తెలుఁపరాదు.

## ప్రాఁతాదులు :

ఇక్కడ బా.వి. 'ప్రాఁతాదులు ఆకృతిగణము. క్రొత్తశబ్దము కూడ ప్రాఁతాదులలోనిదే. 69 సూత్రములోని పదములు కూడ నీగణములోనివే' (87) యున్నది. అనఁగా 'సస్యంబులకు నీరింతి' మనుచోటఁ జూపఁబడిన పది, తొమ్మిది, ఇత్యాదు లున్నవి. ప్రాఁతాదులలోని నన్నమాట 'అన్యంబు' లనుమాట కర్థ మేమిటి? అక్కడ బా.వి. 'ప్రాఁతాదులకే కాక యితరము లగుకొన్ని పదములకును -' (91) అని వివరించినది. అనఁగా నాసూత్రమ్మునందుఁ జూపినవి (అటువంటి కొన్ని) ప్రాఁతాదులలోనివి కావని స్పష్టమే కదా. మరి యక్కడ 69 సూత్రములోని పదములు కూడ నిందులోనివే యనుటలో నర్థమేమి? ఇది చారిత్రికమైన సున్నయొ మార్గ మేమో యనుకొనుట కవకాశమును లేదు.

## మీఁగడ :

దీనిని సూరి మీఁద + కడ యని విభాగించుట సరి గాదనుచు బా.వి. 'కడ అనఁగా త్రెట్టు అనునర్థము గానరాదు. ఇది మీఁద గట్టినగట్టు యని తోఁచును. మీఁగడ్డ అని ద్విత్వలోపమును (ప్రకీర్ణ ర) విభాషగా గావింపనగును' (వ్యవస్థితము) అన్నది. అనఁగా మీఁగడ్డ యనుచోట ద్విత్వమునకు లోపము నిత్యముగా వచ్చునని

నియమించుకొనవలె నన్నమాట. మీఁగడ్డ యని యుండదు గదా యీ యర్థమున. గడ్డ యనుదానికి గడ యను రూపాంతరము లేదు గావున నీసమాసముననే జడ్డలోపము నిత్య మనవలె. (మీఁగ డున్నది) దాఁకంటె జడ్డలోపము సర్వకార్యముగా నిచ్చుటనే (ప్రాంతాదిసూత్రసందర్భముననే) సమన్వయించుకొనుటలో లాఘవ మున్న దనిపించును.

గడ్డశబ్దముతోఁ గూర్చిన మీఁగడ కిట్టి నరసున్న కవకాశ ముండదు. తొలియచ్చుమీఁది పగుల నఱసున్న కును లోపించును గదా. అది యుంచుకొనవలె నన్న నిత్యలోపములలోనిది గాన నీ సూచ్ఛికసమాసము వర్ణలోప మైనట్లు చెప్పుకొనుట యనవసరము

అసలు గడ్డతో మాత్ర మర్థము సరిగా సమన్వయించునా? మీఁద నుండు తెట్టను 'గడ్డ'గాఁ జెప్పుట కూడఁ గేవల ముచిత మన వీలు లేదు. అట్లు యైనను మీఁదు + కడ - యనుపక్షమున 'కడ' యనుదానికి హద్దు అనునర్థములో పాలకు మీఁద నుండుహద్దు అను నర్థముతో నర్థము గుదురు పడునవకాశము లేకపోలేదు. అర్థ భేదోఽపి చ క్వచి త్తసూవి.వి.లక్షణమున కిది లక్ష్యముగాఁ జెప్పుదురు.

## మీఁదు ప్రభృతులు:

చెన్ను (చెందొవ, చెంగలువ, చెంగావి యిత్యాదులు) కెంపు (కెందామర) మున్నగునవి కొన్ని సమాసములలో మీఁదుప్రభృతులలోని వగు నేమో పరిశీలించి గ్రహింపవలసియున్నది. (బా.వి.89) చెలువంపు మేనును జెన్ను మొగంబు నై (భార.ద్రో. 2-323) కెంజని కెంపుఁదమ్మిలో (పాం. 2-28) అనురీతిప్రయోగము లరుదుగఁ గాన వచ్చును. మీఁదు ప్రభృతు లన నిట సూత్రోదాహృతులలో మీఁదుశబ్దము మొదలుగాఁ జూపఁబడిన వని యర్థము చేయరా దన వచ్చును. పైఁగా నిత్యలోప మీమూఁటనే యనరాదు గదా.

## క్రోష్ట్రాదులు:

క్రోష్టృశబ్దము ప్రాంతాలలోనిదే. క్రోష్టృకుమాత్ర మాన్యతరశేషమునకుఁ బైని కొన్ని యెడల నుగాగమమును కొన్ని యెడల మీఁదిహల్లునకు ద్విత్వమును సూరి చెప్పియున్నాఁడు. క్రోష్టృశబ్ద మొక్కదానికే యట్లు చెప్పుట బాగుగ లేదనుచు తె.వ్యా.వి. 'క్రోష్ట్రాదు లనునొకగణము నేర్పఱచినచోఁ బహుషేతరములు పర మైన మీఁదిహల్లునకు ద్విత్వము గావించుకొనుట సుకర మయ్యెడిది. నేత్రాది నన్నడుము నమ్మది నెవ్వడీత్యాదులలోని నెఱను నివ్వెఱాదులలోనినిండుశబ్దమును నీగణములోఁ జేర్చిన సముచితముగా నుండెడిది. (492, 495)' యున్నది. ఇది సమంజసమా? సూరి తెలిపిన ప్రాంతాలలోఁ గ్రోష్టృశబ్దమునకుఁ దప్ప నితరముల కీకార్యము లేదు. బహుళ్వాది యనుచోట ద్విత్వము కనిపించుచున్నను దానిని బహుళశబ్దముతో సాధించుకొనవలసినదే కాని క్రోష్ట్రాదులలోఁ జేర్చుటకు లేదు. ఎక్రొమ్మి ఇత్యాదుల ప్రసక్తి తప్పదు గదా. ఇంక నన్యములలోనుండి తేవలె. అందుకే తె.వ్యా.వి. కూడ నిండు, నెఱ, యనువాని నిచ్చినది. నన్నడాములనుబట్టి నెఱి కూడఁ జేర్పవలెనా? అయినఁ గ్రోష్టృశబ్దమునకు లుప్తశేషమునకు నేయే మార్పులు వచ్చుచున్నవో యవి యన్నియు నిండు, నెఱలకు వచ్చునా? క్రోష్ట్రాదులలోఁ జేర్చినఁ బహుషేతరపరకత్వములో ద్విత్వము సుకర మయ్యెడి ననుచు తె.వ్యా.వి. నేత్రాది మాపినది. ఇక్కడఁ బర మైనది షష్ఠయే. అయినఁ గ్రోష్టృశబ్దవిధానములోఁ బర మైనపరుషేతరములకు ద్విత్వము మాత్రమె కాదు గదా చెప్పినది. కొన్నియెడల నుగాగమమును గొన్నియెడల మీఁది హల్లునకు ద్విత్వమును జెప్పియున్నది. నిండు,

నెఱి, అనువానికిఁ బరుషపరకత్వములోఁ గొన్నియెడల నుగాగమ మును గొన్నియెడల మీఁదిహల్లునకు ద్విత్వమును నున్నవా? అనఁగా నసలు లోపము వచ్చినఁ గదా యనవచ్చు. అందుకే సూరి యన్నములు - లోపనుగాగమంబులును లోపద్విత్వములును - అని లోపమును గూడఁ బ్రత్యేకముగాఁ బ్రస్తావింపవలసివచ్చినది. మీఁదిహల్లునకు ద్విత్వముకొఱకు వీనిని గలిపి క్రొత్తాదు లన్న విపి యున్నయుఁ బ్రాంతాదులలోఁ జేరియుండవలసివచ్చెను. అప్పుడు లుప్త శేషమునకుఁ బరుషేతరములు పరముగా నున్న ద్విత్వము నిత్యముగా వచ్చునా? పరుషాలు పరముగా నున్న నుగాగమము వచ్చుచున్నదా? అసలు ప్రాంతాదులకువలెఁ దొలియచ్చు మీఁదివర్ణములకు లోపము సాధారణముగాఁ గనఁబడుచున్నదా? ఆయాశబ్దములకు నాయాశబ్దములు పరముగా నున్ననే లోపము గూడ. అనఁగా నితరములు పరముగా నున్న లోపమును లేదు. ప్రాంతాదుల కీనియమ మున్నదా? లేనప్పుడు క్రొత్తాదు లనుపేరితో వీనిని బ్రాంతాదులలోఁ జేర్చుట కుదురునా?

అయినఁ బ్రాంతాదిసూత్రములో బహుళపద మున్నది గదా. దానిచేత లోపమును వారించుకొనవచ్చు ననవచ్చు. అనఁగా నెక్కడ వారింపవలె. అన్యంబుల కనుసూత్రముప్రకార మాయాశబ్దాల కేయేకార్యాలు చెప్పినాఁడో (దానికిఁగూడ) వానికంటె నితర మైనయేశబ్దము పరముగా నున్న లోపము రా దని చెప్పవలె. (క్రొత్తాదు లని యొకగణము చేసిన మఱిఁ గ్రొత్తశబ్దమున కొక్కదాని కీనియమము లే దన్నమాట. క్రొత్తశబ్దముయొక్క యీప్రత్యేకత స్పష్టముగా నుండఁగా నన్యములలోఁ గ్రొత్తాదులు కల్పింపవలె ననుటెట్లు గుదురును?) దీనికంటె నెక్కడెక్కడ లోపాదులు గనఁబడు

చున్నవో యక్కడ దక్కడ మాత్రమే వానిని గుర్తించుచు నన్యంబులుగాఁ జెప్పుటయే సముచితము కాదా? కాఁబట్టి వింటు నెఱ యను వానితోఁ గ్రొత్తాగమకల్పనము సరి కాదు. నెఱ వింటు అనువానికి లుప్తశేషములకుఁ బహువచనత్వములో నెక్కడ నైన నుగాగమము కనఁబడిన యెడల వీనిని గ్రొత్తాదులుగాఁ జెప్పవచ్చు ననునభిప్రాయము పరిశీలనార్హ మగుచున్నది. ఏల యన నచ్ఛరకతలోఁ గ్రొత్తశబ్దమునకుఁ గూడ నీలోపము గనఁబడుట లేదు గదా. వింటు, నెఱ, నెఱి, అనువింకేవి నైనను జేర్చి క్రొత్తాదులను నొకగణ మేర్పాటు చేసియున్న సూరి యనుసరించిన ప్రణాళిక భగ్న మయ్యెడి దనుట స్పష్టము.

కెంపు + మోవి కెమ్మోవి వంటివి బా.వ్యా. ననుసరించి సాధించుటలో సౌకర్యము కానరా (492) దన్నది. తె.వ్యా.వి. అనఁగాఁ గెంపును గూడఁ గూడఁ గ్రొత్తతోఁ గూర్పవలెనా? అయిన క్రొ(త్త)శబ్దమునకుఁ బహువచనత్వములో నుగాగమమును జెప్పలేనట్లు ద్విత్వము కెంపు కార్యము లాచోట్ల వచ్చును. కెంపును గలిపిన వీనికి బహువచనమున నెక్కడ నయినను ద్విత్వమున్నదా?

తె.వ్యా.వి. ఇక్కడనే యీ లోపమును బ్రస్తావించినది. "ఔత్వనుపదములు పర మగునపుడు సకృత్తుగాఁ గాననగునుగాగమప్రాప్తిని చి.సూ. చెప్పుటలేదు." ఆకొంత దీర్చి ప్రౌ.వ్యా. నుగాగమమును జెప్పినది. "ప్రౌఢవ్యాకర్త బా.లో కొంత తీర్చుటకుఁ బూనుకొన్నాఁడో లేక చిం.వి.వి లక్షణములో కొంత తీర్చుదమనుకొన్నాఁడో యది వేఱుసంగతి. తత్సమపరకతలో నుగాగమము చెప్పవలసియుండఁగా సూరి చెప్పలేదనుట కుదురదు.

సూరి 'లుప్తశేషంబులకుఁ బరుషంబులు పరంబు లగునపుడు నుగాగమం బగు నన్నాఁడు గాని తత్సమేతరపరుషంబుల కన లేదే. సాంస్కృతికపరుషాలు పరమైన నక్కు వచ్చుట కిబ్బంది యేమి? నుక్కొక్కటియా?; కొన్నారాచములు, నెమ్మన మిత్యాద్యములో ద్విత్వము విషయ మేమి? అది చెప్పకపోయిన యిబ్బంది లేదన్న నుక్కున కొక్కదానికే యీయిబ్బంది యెట్లు వచ్చినది?

సాంస్కృతికపరుషపరకత్వములో నుక్కు సకృత్తుగాఁ గనఁబడు ననఁగాఁ దఱచుగా నుక్కు లే దన్నమాట. అనఁగా లుప్తశేషమునకుఁ బైని సాంస్కృతికపరుష మున్న నుక్కరుదుగా వచ్చు నన్నఁ దఱచుగా నాసాంస్కృతికపరుష మక్కట యుండు ననవలె. అట్టిప్రయోగము లున్నవా? సకృత్తయిన నుగాగమము గాదు. తొలియచ్చుమీఁదివర్ణములు లోపించుటయే యగు నని చెప్పవలె. అట్లే మీఁదిహల్లునకు ద్విత్వస్థలమునను. మిశ్రసమాసములోఁ దొలియచ్చుమీఁదివర్ణములకు లోప మగుట సకృత్తయినను మాసాత్రమునందలిబహుళశబ్దముచేత సాధ్యమే. ఏలయనఁ నాకార్యము నాచ్ఛికసమాసములయందు మాత్రమే వచ్చు ననలేము గదా సూరి. మిశ్రాలలోఁ బ్రాప్తింపక తప్పదు. అయిన నది యరుదుగా మాత్రమే కవిప్రయోగములం గాన నవుట నాయర్థమును బహుళశబ్దముచే సాధింపఁ దగును.

బా. వి. నెమ్మది అనఁగా మెల్లగా నని యర్థము. ఇం దర్థవిపరిణామ (92) మనుటలో నెమ్మ యనుదానికి 'మెల్లగా' నన్నది మాత్రమే యర్థ మనునభిప్రాయము గలుగుచున్నది. కాని నిండుహృదయ మిత్యాదిగా నర్థము లున్నవి అర్థవిపరిణామము నైతేను గల దని సముచ్చయార్థకమును జేర్చి యుండిన బాగుండెడిది. నిండుహృదయ మనుచోట్లన నర్థవిపరిణామము లేదు గదా.

## అప్పటప్పటికిన్ - సమాసమా? :

అప్పటికిన్ + అప్పటికిన్ అనుకృతిస్థలముల నామ్రేడితపరకత్వమున విభక్తిలోపము చెప్పఁబడినది. ఇక్కడ బా.వి. 'విభక్తిలోప మగుటచే పదములు సమస్తము లగుచున్న' (౪౩) వన్నది. సమాసమైన దన్నమాట. ఇది యెటువంటి సమాసము? సమాసమే యయిన విభక్తిలోపము ప్రత్యేకముగాఁ జెప్ప నేల? సమాసములో విభక్తిలోపము సాధారణముగనే చెప్పఁబడినది గదా. లోపము బహుళ మగుటకో అక్కై చెప్పె నందమా? విభక్తిలోపము లేని 'అప్పటి కప్పటికిన్' అనురూపము గూడ సమాసమే యవునా? విభక్తిలోప మగుటచేఁ గదా సమాసము లన్నది. సమాసము గా దన్న సమాస మైనప్పుడు విభక్తిలోప మెట్లును వచ్చును గదా. అనఁగా అప్పటప్పటికిన్ అనునది సమాసము గాను, అప్పటి కప్పటికిన్ అన్నది వ్యస్తరూపముగాను (వ్యస్తతలో విభక్తిలోప ముండదు గదా) సమన్వయించుకొన్న మఱి యీవిధానము దేనికి? ఇంచించుకేత్యాదులనే ప్రత్యేకముగాఁ జెప్పవచ్చు, లేదా నిక్కలాపు లుండనే యున్నవి.

అసలు అప్పటప్పటికిన్ అనునది గూడ సమాస మనవచ్చునా? అప్పటికిన్ అనుదానికి మీఁదిపదముతో సమాస మెట్లు? దీనిని విధించు శాస్త్రి మిటుఁ గానరాదు. అప్పటికప్పుడు అన్నది సమాసమై ప్రాతిపదిక మై విభక్తుల నందునా? లేక అప్పటప్పటికిన్ అన్నది (సమాసమై) ప్రాతిపదిక మగునా? సమాసము యొక్క లక్షణము విభక్తిలోప మగుటమాత్రమె యను టెట్లు?

సమాస మైన విభక్తి లోపింపవచ్చును గాని (నీయంపలి కరుణా) విభక్తిలోపించిన నది సమాసమే యనుట వింతయే మఱి.

ఆమ్రేడితపరకతలో సంధి, యెట్లో ఆమ్రేడితపరకతలో ద్విరుక్తటకారాదు లెట్లో యామ్రేడితపరకతలో విభక్తిలోపము నట్లు. ఇవి సమాసము లనుటకు శాస్త్రమున నాధారము లేదు.

విభక్తిలోపము బహుళ మనుటవలన "రాముడు + రాముడు అనుచో అప్రవృత్తి. ఏ కేటక్ అనుచో ప్రవృత్తి. హరి + హరి హరీహరి. నిండని నిండని నిండీనిండని వంటి వన్యకార్యములకు లక్ష్యములుగా నూహించవచ్చు" (419) అన్నది తె.వ్యా.స. నారాయణీయాంధ్రవ్యాకరణము యుగయుగము ఇత్యాదిగా జూపుటను' (421) బట్టి యీవిభక్తిలోపము తత్సమములలో గూడ వచ్చు నని యభిప్రాయము వ్యక్తమవుచున్నది. ఆచ్ఛికములలోనే యనునియమము సూత్రములో లేదు గాబట్టి ప్రాప్తించుటకవకాశ మున్నది. కాని యది సంస్కృతసమములలో గానరాదు. (కోటానుకోటు లన్నది యిక్కడనే సాధింపవలె నన్న నది యెట్లు నవ్యకార్యముచేత సిద్ధమునకు తప్పదు) యుగయుగము దినదిన మనునవి సిద్ధసమాసములు, సంస్కృతముననే 'దినదిన' అనుకృతిగా చెప్పుదురు గదా. రాముడురాముడిత్యాదులతో వన్నది స్పష్టము. కాగా బహుళగ్రహణముచేత సంస్కృతసమములలో నీవిభక్తిలోపము లే దని నియమించుకొనుట యుచిత మని తోచుచున్నది.

అన్యకార్యమునకు తె.వ్యా.ప. నిండీని దని యని చూపుచు దానిని నిండని + నిండని యని విడదీసినది. కాని నిండీనిండని - అను దానికి నిండియును నిండనిది యనుకేతిగా నర్థము స్పష్టము పిసిపిసి భంగి, యిత్యాదులలో పిసి, విసని-అని యాహో.విభాగము. ఇట్లు నట్లుగా దని - నిండని + నిండని అని విడదీసిన అసలు నిండని - అని యర్థమగును. కాని యుద్దిష్టమైన నిండియు నిండని దనునర్థము సిద్ధింపవలె

సరళాదేశాదికార్యములు సేసి, ద్రుతమునకు బిందుసంశ్లేషములు రానుండే స్వత్వము ప్రాప్తించుటయు నిట 'స్వత్వంబు లే' దని వారించుటయు గుర్తింపవలెను.

బహుళశః ఈయుద్దేశములోనె బా.వి. సమాసములో నుగాగమమును బొల్లునాఁ జూపియుండవచ్చును. చిగురు + కేలు ను వని యుండఁగా నుగాగమము వచ్చి నపుడు సువర్ణమే రాఁగల మువు నన్న (చిగురును + కేయిమువు) నది ద్రుతిస్వత్వ మగును గావు నను, సమాసములో ద్రుతము స్వత్వ ముండ దన్నారు గాఁబట్టి పొల్లు నకారమే వచ్చు నని బా.వి. అభిప్రాయపడిన దేమో యఁ పైవివరణమునుబట్టి యనుమానింపవచ్చు. కాని యటువంటిసందర్భాలలో ద్రుతమునకు స్వత్వమును నిషేధించుట వ్యర్థ మని యింతకుముందు గుర్తించితిమి. అనఁగా నిక్కడ నాగమము సువర్ణమే. చిగురును + కేయిదు వని ను అనునాగమము చేసినాఁ డనఁగా నీచేతనుప్రో వని సువర్ణము నేల యుంచఁగూడదు ?

పోనీ తె.వ్యా.వి. పేర్కొన్నట్లు ముందుగనే స్వత్వ మందరా దనుకొందము. నీచేతన్ ప్రో వని యెట్లయినది? స్వరలోప మగుటకు నాధార మేమి? అవసానమున ద్రుతిస్వరమునకు లోపము చెప్పినలక్షణమునందలిబహుళపదముచేత నిట స్వరలోప మగు నని చెప్పుదము. దానివలనఁ బ్రయోజన మేమి? నీచేతను ప్రో వని సువర్ణమున్నను నీచేతన్ ప్రో వని పొల్లునకారమె యున్నను నది లోపించునదే కదా. లోపించునపుడు సువర్ణ ముంచ నేమి? నకారము చేయ నేమి? కాఁగా లోపమువలనఁ ద్రుత మసలు నిలువక పోవు చుండఁగా స్వత్వము లే దనియు (బిందాదు లున్నవా?) నందులకై ముందు స్వరలోపము చేయవలె ననియు సమన్వయించుట వ్యర్థమే కదా.

వచ్చుఁ గాని యిట్టి చోటులఁ దనుసమాసములను నుదాహరించుట తగునా యనుటలో నాశంకలు వ్యస్తసమస్తలమాత్రవిషయకములే యని భావించెనేమో యనిపించుటకవకాశ మున్నది గదా. ఏమైనను నట్టి వ్యస్తసమస్తములు రెండును లక్ష్యస్థానములే యని గుర్తించు టొప్పును.

లక్షణసంప్రదాయము ననుసరించి లాక్షణికులు అ-ఇ-ఉ-లను చారిత్రకవ్యాకర్తలమార్గమున నిరూపింపరు. (బా.వి. 98)

**ఆది - అవి - అల్లోపము :**

అదియవిశబ్దముల యత్తునకు వ్యత్తిని లోపము బహుళముగాఁ జెప్పఁబడినది. బహుళ మనుటఁ బ్రవృత్త్యప్రవృత్తులను సూరి ననుస రించి నిరూపించిన విషయ బా.వి. 'దీర్ఘాచ్చులమీఁద విభాష నాది, నాయది' (97) యన్నది. సూరి యిట నాది నాయది యని యుదాహ రించినమాత్రమున వైకల్పికలోపము దీర్ఘముమీఁద ననుట కొప్పు నది కాదు. బా.వ. సమా. 8 సూత్రమునొద్ద 'ఇంటికొక్క + అది ఇంటిది. ఇంటియది యని కాదు. రామునికొక్క + అది రామునిది అనియే యగు (260) నన్నది. అనఁగా ఇంటియది రామునియది యనుట తప్పన్నమాట. దీని కాధార మేమి? సూరి యిట నదంతము లగుతదర్థార్థకవిశేషణముల మీఁద నల్లోపము నిత్య మన్నాఁడు గాని యెల్లెడల నిత్తునకు లోపము నిత్య మనలేదే. ఆతఁడవాతిసూత్రము నొద్దనే సూరి 'వానియది' యనియు నుదాహరించెను. ఇక్కడ నల్లో పము రాలేదు. రానిది యనురూపము దుష్టము గాదు గదా. దీర్ఘా చ్చులపై విభాష నన్న హ్రస్వాచ్చులపైఁ గా దనునభిప్రాయ మేర్పడుట సహజము. అట్టియనుమానమును గలుగకుండుటకై స్పష్టముగా వచ్చినయది రానియది యనురీతి వానిం గూడఁ జూపుట యొప్పును.

న్రామ్రేడితము కృతహ్రస్వమునకుఁ బరముగా లేదు గానఁ బ్రౌఢ. లక్షణము ప్రవర్తించదు. కాని హ్రస్వమునకు దీర్ఘము లేదు. కాఁగా లెమ్మన్నాలె వ్యాకరణరీతిరూపము గ్రైకే ప్రౌఢను దీర్ఘంబు విభాష నగు నని సవరించుకొనుట యుక్తము.

పిదపఁ గ్రిందివివరణమును తె. వ్యా. వి. 'పదుఁడు పదుఁడు పదుపదుఁడు పాపదుఁడు అగుట లేదు. (420) అన్నది పాపదుఁ డగుట లే దనుట కేవల ట్లిణ్యాసమనవకాశ మేది? పదఁడు + పదఁ డని యుండ దుజ్లోపమై పదపదఁడని యగు. ఇట బాపదఁ డని కావలె నన్న దీర్ఘము రావలె. (వర్ణము లోపించవలె) ఇది ప్రౌఢ లక్షణము చేతనే యవు నని తె. వ్యా. వి. తెలిపియుండవలె. (లేనిచో నిట దీర్ఘప్రసక్తి యనవసరము) ప్రౌఢ. సూ. ఆమ్రేడితము పర మైనప్పుడు కృతహ్రస్వమునకుఁ గదా దీర్ఘము చెప్పినది. పద + పదఁడు అనుచోఁ గృత హ్రస్వ మేది? పద అనుచో హ్రస్వ ము (లు) న్నను నది కృతహ్రస్వము గాదు. (దీర్ఘమునకు హ్రస్వ మైనఁ బోపఁ డనియగు నదియుఁ గలదు. కాని యిది యిట్టిది గాదు.) పోవునకే పాదపద యనునవి యాదేశింపఁ బడినవి. కావున నిట దీర్ఘము రా నవకాశము లేదు.

అసలు దీర్ఘము వచ్చు నన్నను తె. వ్యా. వి. చూపినట్లు పాపదుఁ డని యగుట యెట్లు? పదఁడు పదఁ డని యుండ దుజ్లోపముచే పద + పదఁ డని యగును. పదలో పవర్ణమందలి యకారము కృతహ్రస్వమే యనుకొన్నను దానికి దీర్ఘ మెట్లు? ఆమ్రేడితము దీనికిఁ బర మైనదా? నడుమ దవర్ణ మున్నదే. పదా పదఁ డని కావలె. లేదా పవర్ణమునందలి యుత్వమునకే దీర్ఘ మైనఁ బూపదఁ డని కావలె దుజ్లోప మగు నన్న పదఁడులోని 'దఁడు' మొత్త మెట్లు లోపించును!

ణము స్పష్టము చేయుచుండఁగా ననుకరణ మెద్దానికిఁ బరమగ నున్నదో దానికిఁ గదా ద్విత్వము. అనుకరించువాక్య మేదియో గుర్తింపఁగల్గినప్పుడు 'గతానుగతికో లోకః' అన్నది మొత్తము సంస్కృతవాక్య మని తెలియదా? నమో నమో యనుచు ననుచో నెట్లు గ్రహింతురు? సూరి యుదాహరింపలేదు గాన సందేహ ముండదా?

సంస్కృతవ్యాకరణమునందే అత్వ మాత్వ మగు ననుట స్పష్టత కేమో కాని యథార్థము గాదు. ఏ శ్లోకము సంస్కృతమునందు నైన ద్విత్వము తెలుఁగునందైన దేమో యని సందేహింతు రని యీయుదాహరణము పరిహరించుఁ గాక. ఇ లోకః పారమార్థికో యనియో వంటి వుదాహరింపవలె నన్న నట్టి వుండవలయును గదా. అట్లుండుటను బట్టి యిద్దాని నుదాహరించుట యెంతయు నొప్పునే కదా. సూరి దీని నుదాహరించుటలో నౌచిత్యము లే దనుభావ మసంగతము.

తత్తనియె :

అనుకరణంబునం దుదిహల్లునకు ద్విర్వచనం బగు నను సూత్రముచేత ద్విత్వము విహితము. ఇక్కడ బా.వి. 'విసితుదహల్లు ద్విత్వ మగును. అట్లు కానిచో తత్ + అనియె, త దనియె త్వామ్ + అనియె, త్వ మనియె అని యగును. (102) అన్నది. అట్లు కానిచో త దనియె ననుచో ద్విత్వాభావముతో రూప ముండు ననఁ గొనరాదు. ఇంక సూరి ద్విత్వమును విధించెను గాని విధింప కున్నచోఁ ద దనియె ననుకృతి యపరూపము లేర్పడు నని బా.వి. అభిప్రాయము గ్రహింప వలయును. సూరి యిట ద్విత్వమును నిత్యముగనే విధించెను గదా. (బా.వి.103) ఇట ద్విత్వము రాకున్నచోట (తత్ + అనియె) త

యుక్త మగునే కద. సంధి చేసిన వాక్యవిరామము లేకుండుట యున్న (సంధి చేయుచున్న వాక్యవిరామ మగునా?) వాక్యావసానమున ననుఁ లక్షణమున కవకాశ మేది? కావున నీవాక్యమున 'విరామము లేకుండ' ననుట పొసగునదిగాఁ గానరాదు.

మఱియుఁగా 'సంధి గావించినను గావింపవచ్చు నని అది దోషము గా దని' (౧౮౪) యనుట విచార్యము. సంధి లేమి దోషంబు గా దని లక్షణము చెప్పుచుండఁగా సంధి యగుట దోషము గా దనుటేమి? అది యట్లే యైన నీలక్షణము లేకున్న సంధి యగుట దుష్టమే యనవలయును. దాని కాధారము లేదు. వాక్యావసానమున సంధి యగుటయే దోష మైన సంధి లేమి యుచిత మన్నమాట. అప్పు డవసర మైనయంశము సంధి యగుట దోషంబు గా దన్నది. లక్షణము నట్లు చేయవలయుఁ గాని సిద్ధించి యున్నదియు నుచిత మైనదియు నైన సంధిలేమినే దోషము గా దని చెప్ప నేల?

'1-11 సూత్రములం దున్న సంధిపదము తిరిగి 55వ సూత్ర మందు సాక్షాత్కరించినది. అందుచేతనే లక్ష్యములుగాఁ జేర్కొన్న వాక్యములు ఉదంతములు. 2-3-4 వాక్యములు స్వరాంతములు.' (165) అన్నది బా.వి. ఈ ప్రసంగమునుబట్టి 'పూర్వపరస్వరములకుఁ బరస్వరం బేకాదేశం బగుట' యనుసంధియే యిటఁ బ్రస్తుత మైన దని బా.వి. అభిప్రాయ మని తేలుచున్నది. అనఁగా నిట్టిపరస్వరైకాదేశసంధి మాత్రమే వాక్యావసానమున లేకుంట దోషము గాదు. ఇతరసంధి కార్యములు వాక్యాంతమున లేకున్న నది దోషమే యగు నన్నమాట

క్త్వార్థకమునకు ముందు నున్న వచ్చుఁ బిమ్మట ఇకారము లోపించును. అనుచో వాక్యాంత మైనను ద్రుతము పై పరుషము సరళము గావింపఁబడె (104) నని బా.వి. పేర్కొన్నది. ఇట - వచ్చును

పిట్టలు అనుకృతిగా సరళాదేశము చేయుచున్నందున బా.వి. వివరణము ప్రకారము దుష్టమే యనవలసియుండు నది. ఇది యన్యాయముగా నాగు నిన్నపు మున మొల్లను చెప్పఁజాలము. ఇం తేల? యడాగమమును సంధికార్యముగనే సూరి స్పష్టము చేసెను. ప్రస్తుతసూత్రమందలిసంధి పదముచే బహుస్వరైకాదేశకార్యమునే సూరియు నుద్దేశించియున్న యెడల ఇక్కడ తేలవలసిన సంధి లేనిచోట ననుసూత్రముచే యడాగమము రావలసియున్నదే. ఇం దెక్కడను సూరి యడాగమము మాట లేదు.

• ప్రశ్నములలో 2,3,4 వాక్యాలు స్వరాదు లన్నది. బా.వి. అట వివరణమునం దున్నవి మూఁడు వాక్యములే. 1. సత్యము సర్వశ్రేయము 2. అది లేనిచో సర్వనాశములు చెడును. 3. ఇట్లు సంధిపరిహారంబు... ఇది సంధి పరిచ్ఛేద మున్నది న్యాయముగా లెక్కించిన దేమో బా.వి. మూలగ్రంథము + ఇది యేమి బహుస్వరైకాదేశమున కవకాశమే లేదు. సంధి నిషిద్ధమైన ప్రాచీనప్రకృతిశక్తులములలో నిది యొకటి. కాఁగా సంధి లేమి దోషము గా వివరణమునకు సంధి నిషిద్ధ మైనట్టిము లక్ష్యస్థాన మందు ఇట్లు? అనఁగా సూత్రమునందలి సంధిపదము బహుస్వరైకాదేశమునే యుద్దేశించిన దన్న బా.వి. ననుసరించి ఇది సంధిపరిచ్ఛేద మునందాని న్యాయవాక్యముగా గుర్తింప వీలు లేదు. సంధిపరిచ్ఛేదోక్తము లైన కార్యములను సామాన్యముగా గ్రహించినప్పుడే న్యాయవాక్యముగా గుర్తింపవచ్చును. మూలగ్రంథ మును ఇది అనుచో మూలగ్రంథ విధి యని చేయక యనవసరముగా లోపమును జేసెను గదా.

మిగిలిన మూఁడింట 'ఇట్లు' అనుకరణము మూఁడవ వాక్యము లక్ష్యభాగములోనిది కా దని స్పష్టము చేయుచున్నది.

# తత్సమపరిచ్ఛేదము

## నామసార్థక్యము :

బా.వి. 'ఇను కొన్నిస్థలములు ప్రాకృతసమరూపసాధనమునకు సరిపడుచున్నను అట్టియుదాహరణములను గూడ ప్రదర్శించిన 'తత్సమ' పదప్రయోగము సార్థకమనెడిది' (106) యున్నది. దీనింబట్టి తత్సమపరిచ్ఛేదమనుచోట తత్సమశబ్దప్రయోగము సార్థకము కాదని (నిరర్థకము) బా.వి. అభిప్రాయమగుచున్నది. 'సిరి' అను దానిని సూరి యీపరిచ్ఛేదమునం జూపుటను వ్యాఖ్యాతలు ప్రస్తావించిరి. దానిని గుర్తించుచునే తె.వ్యా.వి. అయినను 'చి.సూ. సంస్కృతసమరూపములతోపాటు ప్రాకృతసమరూపములను గూడ కొన్నింటి నుద్ఘాటించి తాను తత్సమమునకుం గావించిన నిర్వచనమును సార్థకము చేసియుండవలసిన (254) దన్నది. ఇట్టునకు బహువచనంబు పరంబగునప్పు డనుసూత్రమునొద్ద తపరకరణమునకుం బ్రయోజనము దెల్పుచో సూరి 'లకోకలు' అని చూపెను. స్థలాంతరముల ఎగనిని, కలుకులు, కొలుకు ఇత్యాదులు చూపెను. ఇయ్యవి దేశ్యములు. సిరులను దానికిం బ్రాధాన్య మిచ్చి ప్రాకృతసమముల నిటం జేర్చెనని వ్యాఖ్యాతలవారిమతము ననుసరించిన నంతకంటె నెక్కువగనే ప్రస్తుతములైన దేశ్యములు విషయమే మగును? కాన 'సిరి' కంతటి ప్రాముఖ్య మీవిషయమున నీయ నక్కఱ లే దనుట యుచితమే.

అయిన సూరి యిటం బ్రాకృతసమముల నేల యుదాహరింపలే దన్నది విచారింపవలసియున్నది. 'సంస్కృతసమేతరం బయిన యీభాష యచ్చ యనంబడు' ననుట ననుసరించి ప్రాకృతసమ

కట్టియెడల మాత్రమే సంస్కృతసమములోఁ బోలిక గలదు. (దీర్ఘమునకు హ్రస్వ మగుటలో స్త్రీసమత్వాదు లవసరము కాదు గదా.) అది సూచించుచునే సూరి లక్కోకిలు నను **లను**వాని నిటఁ జూపెను.

చిం. కర్త **'**న చ దేశ్యపదే న వైకన్వర్ణేఽపి**'** యనఁగా సూరి యేకాకారశబ్దములకుమాత్రమే గదా హ్రస్వము లేదన్నది. అనఁగాఁ దత్సమపరిచ్ఛేద**ము** గాన నందుఁ జెప్పఁబడినకార్యము సంస్కృత ప్రాకృతసమములకుమాత్రమే వర్తించు. దేశ్యములకు వర్తింపదు గాన నిషేధ మనవసర మని తాత్పర్యము. స్త్రీసమత్వాద్యతిదేశ**ము** వలన నాయయికార్యము లాచ్ఛికములకు సాధింపఁబడినవి.

కాని యిటఁ దత్సమపరిచ్ఛేదమునందలివిధులను బరిశీలించినఁ గొంతవైరుధ్యము గల దేమో యనిపించు.

ఇందలిహలంతప్రకరణము, (67-87 విధు లెల్ల) నజంత ప్రకరణమున 18,34,35 మున్నగువిధులు కేవలము సంస్కృతనామ **ము**లకే యగుట స్పష్టము. సందర్భానుసారముగా నాచ్ఛికములకుఁ జెప్పఁబడినవి 24,27,46,47 విధులు.

28,54 విధులు సంస్కృతనామములందే వర్తిల్లు ననుట కాలక్షణమున నాధారము లేదు అయినను దత్సమపరిచ్ఛేద**ము**నఁ జెప్పఁబడినవి గదా యని సంస్కృతప్రాకృతనామములకే యని గ్రహింప నవకాశ మున్నది. అపుడు మాలలు, జెలలు ఇత్యాది స్థల**ము**ల 28 సూత్రముచే బహువచనలకారమునకు రేఫ రాదు. లక్కోకిలు ఇత్యాదిస్థలముల **54** సూ.చే హ్రస్వమును రాదు. ఇట్టి ప్రయోజనము సిద్ధించుటకేయి తత్సమపరిచ్ఛేదమందుఁ జెప్పఁబడిన విధు లెల్లను సంస్కృత (ప్రాకృత) ప్రాతిపదికలకే చెందిన వనవలసి యుండును. హలంతప్రకరణాదులందలివిధులవిషయమున నట్లు **నిర్ణ**యించినను బాధ గానరాదు.

తృతీయాదులకు నుగాగమం బగు, కయిపట్టిమొక్కలకు నుగాగమంబు లేదను సూత్రములు తగ్గించుకొనునుపాయమును బా.వి. ఇట్లు చేర్కొన్నది. 'విభక్తులను జూపునపుడే ద్రుతము లంతమందుఁ గలవానిని ద్రుతములోనే చూపిన యీసూత్రము లనవసరములగును గదా. ద్రుతప్రకృతికములను నిర్ణయించుపట్ల నీవిభక్తు లట్లే నిరూపితములు' (168) - అంతే కాదు. చే తో లో అనువానిని కూడఁ బ్రత్యయములలోనే చేర్చిన కేసితరువాతిసూత్రము ననవసరమే. దీనివలన స్థలాంతరమునను గొంతమార్పవసరము. ఔపవిభక్తికములు 'తృతీయాసప్తములు' కల్పి ననుచో 'ద్రుతాంత మగుసత్వము' విధింపవలసియుండును. ద్రుతాంత మగుతృతీయాసప్తములకు ద్రుతాంత మగుసత్వము చెప్పుటలో నందు ద్రుతమును ద్రుతముగనే జేయుట కారణమే కదా. దానిననుసరించినుగాగమప్రసక్తికంటె నిదిమొ సులువని తోఁచిన నది యట్లే యనుకొనవచ్చు.

అయినను నాచేతను, నాకొఱకును ఇత్యాదిగా దీనికిఁ జివర నువర్ణము ద్రుత ముంట సమాన మయి యున్నపుడు చేతాదులనే ప్రత్యయములుగాఁ జెప్పి యంతమున సమానముగాఁ గన్పించులక్షణమును బ్రత్యేకముగ సామాన్యముగఁ జెప్పుటయే లాఘవోచితమార్గమని గ్రహింపఁదగును.

ద్రుతప్రకృతికములను జెప్పుచో నీవిభక్తులను ద్రుతాంతములుగనే నిర్దేశించె ననుటలో నభిప్రాయ మేమో? ప్రథమా కయిపట్టిమొక్కేతరంబు లయినవిభక్తులు - ద్రు.ప్ర. లనుటలోఁ దత్తద్విభక్త్యంతములు ద్రు.ప్ర. లని యర్థము స్పష్టము. విభక్త్యంతములను జూపుచో వాని కగునుగాగమమును జూపకుండు టెట్లు? అట్లు గాక నాచేతన్ అనురీతిగాఁ జూపుటవలన ద్రుత మాగమముగా వచ్చినది గా దనియుఁ బ్రత్యయావయవమె యనియుఁ జెప్పుట

కాధార మున్నదా? లేక యాగమముగాఁ జెప్పుచో నట్లు చివర ద్రుతమును జూపరాదా?

ఇట సూరి రామునిచేతను అనుకృతిగా ద్రుతము నువర్ణముగాఁ జూపుటనుగూర్చి బా.వి. "ఇది ద్రుతము కావున దానిస్వత్వరూపము లోనె (ను) ప్రదర్శింపఁబడె" (108) నన్నది. అనఁగా ద్రుతము పొల్లనకారము గావున దానినె చూపవలసియున్నను నువర్ణముగాఁ జూపుట స్వత్వము నుద్దేశించి యన్నమాట. ద్రుతము పొల్లనో యనియు దానిస్వత్వరూపముమాత్రము 'ను' అనియు బా.వి. అభిప్రాయము సరిగా నని తత్సందర్భమున గ్రహించితిమి.

ఏమైనను జేతాదులను ప్రత్యయములుగాఁ జెప్పియున్నంత సమాన మైనద్రుతము నాగమముగాఁ జెప్పుటయే యుచిత మగుపద్ధతి యని గ్రహింపవలెను.

## ఏకవచనములు:

డుమువుల లేకవచనంబు లనుచో బా.వి. 'ఇవి యేకవచనమునందే యుపయుక్తము (లు) తక్కినవి యేకవచనమందును బహువచనమునందును నుపయుక్తము(లు) అన్నది. లువర్ణము బహువచన మగుట దీనికిఁ దర్వాతఁ జెప్పఁబడినది. అట్టియెడల నిటఁ దక్కినవి యేకత్వబహుత్వములు రెంట నవు నన్న డుమువునేతర మైన లువర్ణము నుభయ మనునర్థ మేర్పడు నది సరి కాదు.

ఇవి యేకవచనమునందే యుపయుక్త మగు నన్న నందుకుఁ గారణ మవి యేకవచనము లగుటయే. డుమువుల అనునవి యేకత్వమునుమాత్రమె బోధింపఁగలవు గావున నాసందర్భమునసే యగును. నువర్ణము మున్నగునవి యేకత్వబహుత్వములు రెంట నవు. అవి యుభయములు గావ నని బా.వి. అభిప్రాయమును గుర్తింపవలెను.

**బహువచనము :**

బా.వి. "బహువచనవిభక్తులు -లను, లచేత, లతో, ల, లయొక్క, లయందు మున్నగునవి." (110) యనుట స్పష్టత నుద్దేశించి కావలెను. తక్కినవి యుభయంబు ననుకూలమున ననుసరించి దుముపునలు భిన్నములైనను, మొదలగునవే యేకత్వబహుత్వములఁ బ్రయోగింపఁబడుచు నేకవచనములును బహువచనములు నవును. కావున 'బహువచనవిభక్తు' లనుచు లను లచేత ఇత్యాదిగా లడాగమముతోఁ గూర్చి చూపుట యనవసరము కాదు.

ఇంక నిట బా.వి. "ఆగమము లట్లు టిత్సంజ్ఞ. పరశబ్దముయొక్క ఆదియందుఁ జేరి దాని కవయవ మగు" (110) ననుటయు స్పష్టతఁ గావలె. టిత్తయినది పరశబ్దమున కాదియందుఁ జేరు నని చెప్పు టెట్లు? (కిత్తయినది పూర్వశబ్దము నంతమునఁ జేరునా?) ఆశబ్దము పూర్వమో పరమో యనవసరము. టిత్తుగా దేనికి విధింపఁబడినదో దాని కాద్యవయవముగాఁ జేరును. ఒకవేళ నీయది పూర్వశబ్దమునకు విధించిన దానికే యాద్యవయవముగాఁ జేరును గాని టిత్తుగాఁ జెప్పెను గావున (దేనికి విధింపఁబడినను) పరశబ్దమున కాద్యవయవముగాఁ జేరు ననుట ప్రమాణానుగుణము కాదు గదా.

ఆపిదపఁ గూడ బా.వి. 'టిత్సంజ్ఞ గావున ఆద్యన్తౌటకితౌ యనునియమానుసారము పరశబ్దముయొక్క ఆదియందుఁ జేరును. రాముల + ను అనురీతివిభజనము చేయరాదు. అప్పు డది లగాగమ మగు' (124) నన్నది. ఇదియు నస్పష్టము. పరశబ్దమునకు (విభక్తికి) విధించుటచే టిత్తు గావునఁ బరశబ్దమున కాద్యవయవ మైనది. టిత్తా కిత్తా యన్నదానికంటె ముం దది దేనికి విధింపఁబడిన దన్నది ముఖ్యముగా గుర్తింపవలెను. రాముల + ను అని విభాగించినమాత్రమున

వ్యక్తుల **నుద్దేశించిన** దనుకొందమా! కాని బా.వి. ఆవిషయముఁ గూడ అమహత్తులు - బ.వ. మానవ, మానవాతిరిక్త స్త్రీపురుషులు, అమహత్తులు - ఏ.వ. స్త్రీతిర్యగ్జంతువులు. బ.వ. తిర్యగ్జంతువులు, అనుటంబట్టి స్త్రీవాచకములు బహుత్వమున నమహత్తులు గాక మహత్తులే యగునని బా.వి. నిర్ణయించినట్లు చెప్పకతప్పదు. ఇది యసంగతము. ఈ నిర్ణయమునకు సూత్రమున నెట్టియాధారమును లేదు. సీతలు వచ్చియున్నారు అని బా.వి. చూపినలక్ష్యమే మాత్రము. వచ్చియున్నారు అను రూపమునుబట్టి సీతలు మహత్తు లగునా? అది యమహత్తే యైనను క్రియారూప మమహత్త్వము నందే యుండవలసియున్నను 'సర్వనామ క్రియారూపంబులుబహువచనంబులు మహత్తునకుంబోలె నమహతి కగు' ననుటంబట్టి క్రియ మహత్కార్యము నందినది. ఆలక్షణమున నే సరి 'మహత్తునకుంబోలె' ననుచుండఁగా నిది మహత్తే యను టెట్లు? బహుత్వమున స్త్రీవాచకములు మహత్తులే యైన వానికిఁ బ్రత్యేకముగా మహత్కార్యము విధింపనేల? మహత్కార్య మైనమాత్రమున మహత్తే యగునా? పూజ్యతయం దేకత్వమునను బహువచనము గలుగును 'ఇటఁ గన్యామహామునిఁ జూచిపోవఁగా వచ్చితి మెందుఁ బోయిరో కో వారు" ఇట బహువచనము గానవచ్చుచున్నది గదా యని యర్థమును బహుత్వముతోఁ జెప్పుట పొసఁగునా? ఏకవచనమునందున్నను స్త్రీవాచకము అమహత్తే యని గుర్తింపవలయును.

**మ హ తి :**

'మహతీవాచకము గుర్తించినను మహతీవాచకక్రియ లుండవు. ఇందువలననె మహతిని వ్యాకర్తలు పృథక్కరింప రైరి.'(113) అన్నది బా.వి. మహదిత్యాదివిభాగము క్రియలనే యుద్దేశించి చేసినది గాదు. అయ్యు స్త్రీవాచకములంగూర్చి ప్రత్యేకముగాఁ బ్రస్తావింప

వలసినసందర్భమున సూరి యుమహత్తులనుండి పృథక్కరించి 'మహతి' యని పేర్కొనెను. స్పష్టసే. తత్స. 86. అచ్ఛి. 28. చింతామణిలో ఉభయవిధమహతీనా మ్నునుచో అమహతీ మహతీతర మని యిట్ల ప్రయుక్తము. మహత్తులనుమాత్రమె లక్షణము పేర్కొనఁగాఁ దద్భిన్న మమహత్తుగా గమ్యమాన మగుచున్నట్లే మహత్సంజ్ఞ ననుసరించియె స్త్రీవాచకము మహతిగా వేఱ చెప్ప నక్కఱ లేక గుర్తింపఁబడుచుం డఁగా లాక్షణికు లిట్లు ప్రయోగించిరి.

**డు మ ం త ము :**

రాము డిత్థు, భార్గవు, రాజపురుషాదులు డుమంతము (115) లన్నది బా.వి. అచ్చుపొరపాటు గావచ్చును. రాము డిత్థ, భార్గవ యని యుత్సాము సంపకమునకును వానికి డుమంతసంజ్ఞ గలదు.

సుబంతతిఙంతములనునవి సంస్కృతమున సుప్తిఙ్ప్రత్యయము లిత్యాది బా.వి. వివరణము స్పష్టత నుద్దేశించిన దనవలెను.

**ప్రా తి ప ది క ము :**

కృత్తద్ధితసమాసములు కూడ ప్రాతిపదికము (116) లన్నది బా.వి. అయ్యును సమాసమువలెఁ గృత్తద్ధితములే ప్రాతిపదికసంజ్ఞ నందవు. కృదంతమును దద్ధితాంతమును ప్రాతిపదికము లగును. బా.వి. అభిప్రాయము గూడ నిట్లయియుండవచ్చును. అయ్యును నిది వ్యాఖ్యానమె కావున స్పష్టముగాఁ జెప్పఁదగును. 'కృత్తునకు రామ తద్ధితమునకు భార్గవ సమాసమునకు రాజపురుష' యని బా.వి. తరువాతఁ జేసినవివరణమునను గృత్తునకనఁగాఁ గృదంతమునకనియుఁ దద్ధితమునకనఁగాఁ దద్ధితాంతమునకనియు బా.వి.యుద్దేశముగాఁ జెప్పినచో సరిపడును.

నివర్ణాగమము రావలసియుండఁగా 'టాడా విత్తో న ని స్యాత్' అని యుపంతములపై నద్దానిని నిషేధించెను. (కావున 'హారనిచేత' యనునది చిం. సాధించుచున్న దనుట పొరపాటు) ఇట్టినిషేధమునుబట్టియే ఈ 'నియమము ఉత్వదుజ్ఞులు చేయుశబ్దములకుమాత్రమే' యని గ్రహింప వలసియున్నది. (644) అని తె.వ్యా.వి. (వ్యా.సం.స. ననుసరించి) పేర్కొనుట తప్పు దని స్పష్టము నివర్ణాగమము డునంతములకే యగు నన్న నిపంతములకు అనిత యుబుచే దుజ్ఞు రాదు నివర్ణాగమము ప్రాప్తింపదు గావున దానిని నిషేధించు టాడా విత్తో న ని స్యాత్ తనుసూత్రము వ్యర్థ మనవలసియుండును.

రాజశబ్దము పుంలింగమును మహద్వాచకము నయినను దానికిని నివర్ణకమును, నివర్ణాగమమును ప్రాప్తింపవు. 'డు స్యాత్సిదా రాజ్ఞః' అని డువర్ణకము విహితము. ఈ 'డు' వర్ణము స్త్రీ ప్రత్యయమువంటి దనుకొన్న నది తైనను స్త్రీత్వమువచే నివర్ణక నిగాగమములు రావు. కానున్నను డువర్ణవిధానసామర్థ్యముచేతనే మహత్త్వపుంలింగకార్యములు రావు. లేకున్న విశ్వపా - విశ్వపుడు - విశ్వపుని విశ్వపునిచేత నని యైనట్లే రాజునిచేత యవ్వఁ గదా. డువిధాన మేల? దీనింబట్టియే యూకార్యములు దీనికి రావు.

## విధాతృనిచేత :

అనుపంత మగు తెనుఁగుడునంతమునకు సూత్రి నిగాగమము నిత్య మనెను. అచ్చ తెనుఁగుడునంత మని యర్థము చేసియును బా.వ్యా. విధాతృఁడు, ధాతృఁ డనునవుపంతసంస్కృతడునంతములను గూర్చి జూపి నిగాగమము నిత్య (118) మన్నది. కాని సూత్రమే విధాతృ యొక్క + ఆజ్ఞ విధాతృనాజ్ఞ యనుచో నిగాగమమనిత్యముగా ఋపంత

మును జూపెను. ఋదంతములకు నిగాగమము నిత్య మని చెప్పి నెడల షష్ఠీసమాసమునం దచ్చు పర మగునపుడు చెప్పిననుగాగము ఋకారమునకుఁ జాలును. నిర్వ్యవధానముచే (నది నిత్యము గాన) ఋకారమున కచ్చు పర మగుట యసంభవమే కావున ఋకారమునకు నుగాగమ మటఁ జెప్ప నక్కఱ లేదు. అనఁగా ఋకారశబ్ద మాసూత్రమున వ్యర్థమే యగు. ఇంక సవిత్రన త్రిత్యాదులు దుష్టములు నగు.

## కు ప ర క న గా గ మ ము :

'న్యా.ఆ.' 'ప్రాయః' అనుటచే 'ప్రాయోగ్రహణా దూదంతా దపి భవతీతి జ్ఞేయమ్' అని అహో. (కవిశి) వివరించెను. చి.సూ. తపరకరణమును దొలఁగించి ఉకార మని పేర్కొనెను (646) అన్నది తె.వ్యా.వి. సూరి తపరకరణము చేయకుంటకు ఊదంతములకు నగుట ప్రయోజనముగా నెంచ నవకాశము లేదు. అహో. ఊదంతా దపి యనుట సమంజస మని తె.వ్యా.వి. అభిప్రాయపడినట్లున్నది. కాని యది సరి కా దని యట వజ్ఝలవారు స్పష్టము చేసిరి. (వ్యా.సం.స.) నామంబులతుదిదీర్ఘమునకు హ్రస్వము రా ఊకారాంతము లుదంతముల యగు. ఎల్లస్థలములందు నూకారాంతములకు పువర్ణకేతరవిభక్తి పరకత్వమున పుగాగమ మవుం గావున దీర్ఘోకారమునకుఁ గువర్ణకము పర మవుట కానరాదు. భ్రూవునకు. ఇంక పువర్ణకపుగాగమములు లేనివి తద్భవదేశ్యస్థలములు. తె.వ్యా. శాలూనకు అనున దొకటి చూపినది. ఇట్టివి కవిప్రయుక్తము లై యున్న వేమో వెదకవలసి యున్నది.

అట్లయ్యు సూరి 'ఉకారమున' కన్నట్లే ఋకారమున కన్నాఁడు. అట దీర్ఘాంతము లసలు లేవు గదా. దీర్ఘాంతములు లేమి నట వారింప

నలసినయవసరమును లేమినిబట్టి సూరి తపరకరణము చేయకపోయి యుండనగు. అనంతం బయి దీర్ఘపూర్వ... అనుచో దపరకరణము చేసినను-ఋకారంబున కని యిట్లు జేయుచున్నను ఫలిత మొకటియు.

అందును గవిప్రయోగము లున్న దీర్ఘాంతములపై (ఈ) నాగమము చేయుట కవకాశ మున్నమాట సూత్రతః వాస్తవమే.

## అ ం దు ప ర క న గా గ మ ము :

చి.సూ. ననమునందు వనమందు అనుటకు క్రమములనే గ్రహించెను. వనమునయందు అనుహాపము సమ్మతించినట్లు లేదు (647) అన్నది తె.వ్యా.వి. కాని సూరి సమానంబునయందు అని బా.లో ప్రయోగించుట స్పష్టమే. సూత్రాంధ్ర వ్యాకరణమున 'నకందా' యని యందుపరకత్వమున నగాగమమును విధించెను గూడ.

బ.సీ. ఋవర్ణాంతములపైనె నగాగమము చూపె. కాని వృవర్ణాంతములపైఁ గూడఁ గలదు. తనువృనయందు (648) అని తె.వ్యా.వి. సముచితముగా వివరించినది. అమహాత్ములకందు వర్ణకం బనులక్షణము ననుసరించి వృగాగమముపైని (అమహాత్ములకు) నగాగమము సిద్ధించుచునే యున్నది. అయ్యు బ.సీ. అట్టి దుదాహరింప లేదు. సూరి ఉండిపదంబు పరం బగునపుడు వలనను ద్వితీయాసప్తములు ప్రాయికంబుగ నగు నని సప్తమిని విధించెను. అందువలనె నవర్ణక మగును యథాసంభవముగా. కాని సూరి యుదాహరించలే దని ప్రౌఢవ్యాకర్త 'యందువర్ణక' మట్లు నవర్ణకంబు నగు నని సూత్రించెనే గద. అట్లే యమహాత్ముల కని చెప్పినను ముగాగమము పైనే చూపుట ననుసరించి వృక్కుపై (నమహాత్ముల) నవునా? కాదా? కాదేమో-చెప్పవలసివచ్చును. ఇట్లే బ్రతుకునయం దిత్యాదిస్థలము లును లక్షణసిద్ధము లగుచు గ్రహింపఁదగియున్నవి.

## సంబోధనము - సంబుద్ధి:

తె.వ్యా.వి. 'ఆంధ్రవ్యాకరణములందు ఆమంత్రణము సంబుద్ధి సంబోధనము అనునవి పర్యాయములుగా నుపయుక్తము' (634) అన్నది. 'ఏకవచనం సంబుద్ధిః' అను పాణినీయవ్యాకరణము ననుసరించి సంబోధనైకవచనమె సంబుద్ధి. ఏకత్వబహుత్వములు రెంట సంబోధన సంజ్ఞ (ఆమంత్రణము) సామాన్యము, చింతామణి బాలవ్యాకరణము లందు సంబుద్ధి యేకవచనస్థలముననే ప్రయుక్తము. ఋతౌ తు నస్త్రీత స్యాత్సంబుద్ధౌ యనుచోఁ జిం.లో బహువచనము ప్రసక్తి లేదు. కృతోత్కం బగుసంస్కృతనామంబుసంబుద్ధిడుజ్ఞునకు ఇత్యాదిగా సూరి యును సంబోధనైకవచనస్థలముననే సంబుద్ధిశబ్దము నుపయోగించె. వి.వి. 'వికృతా వత్ర వా లోప స్సంబుద్ధ్యుపదే తు యః' — అని సంబుద్ధిని ప్రయోగించినచోట ఓ రాములార అనుకితివానినిబట్టి బహువచనస్థలములును గ్రహింపఁదగినవిగాఁ దోఁచు. అయ్యుఁ బిదపఁ జెప్పిన రో ఇతి స్త్రీవాచకో భవేత్, సీచతాయాం రిపి స్యాతాం స్థలముల నేకవచనస్థలమే గ్రాహ్య మనవలసియున్నది. దానిని బట్టి సంబుద్ధ్యుపదే యనుచోఁ గూడ నేకవచనస్థలమునే యుద్దేశించెనేమో యని యెన్న వీ లున్నది.

అయ్యును నిచ్చోటిసంబుద్ధి సంబోధనైకవచనమును గాక యేకవచనాంత మగుశబ్దస్థలమునం దనుకితిగాఁ గొంత విశిష్టమైన యర్థముననే ప్రయుక్త మయియున్నది.

పై తె.వ్యా.వి. సిద్ధాంతము ననుసరించి బా.వి. సంబుద్ధి సంబోధన మనుసామాన్యార్థముననె ప్రయోగించినది. 'తమ్ముఁడు బల్లిదుఁడు మున్నగువానికి సంబుద్ధిలో డుజ్లోపము రాదు.' 'కేవల ప్రాతిపదికమె సంబుద్ధియం దుపయుక్త మని చెప్పుట శాస్త్రోచితము కాదు.' (125)

## సంబోధనము - దీర్ఘము :

సంబోధనంబునందుఁ బహుత్వంబునందుదియకారేకారంబులకు దీర్ఘంబు విభాష నగు నను సూత్రమును వివరించుచు బా.వి. 32 సూ.చే అత్వ మాదేశము కాఁగా దానికిని, ఇకారాంతము లైనసంస్కృతాచ్ఛికశబ్దములకును దీర్ఘము వికల్పముగా విధింపఁబడినది (125) యున్నది దీనినిబట్టి యుకారమునకు వచ్చినయకారమునకే కాని శబ్దము సహజముగా నదంతమైన నాయకారమున కీసూత్రముచే దీర్ఘము ప్రాప్తింప దని యర్థ మగుచున్నది. ఇట్టిపొరపాటు పడుట కవకాశము లేకున్నను నగారి 'ఓరాముఁడా, ఓచెలియా' - యని యుదాహరించెను. ఇందుఁ జెలియా యన్నప్పుడు దీర్ఘము వచ్చిన యత్వము 32. సూత్రముచే నైనది గాదు. 32 సూ.చే వచ్చిన దైనను సహజ మైన నెట్టి దైనను సంబోధ్యవాచకముతుది నకార మున్న దానికి దీర్ఘ మగు నని చెప్పవలయు. ఓరాములారా యనియు నవును గదా.

ఆపిదప బా.వి. ఇకారాంతములవిషయమున సంస్కృతాచ్ఛికశబ్దము లనుటయో సంస్కృతశబ్దము లనుట పొరపాటు. 'హరి' యనుచోఁ బ్రాతిపదికము సంస్కృతమే యైనను సులోప మయిన పిదప సంస్కృతసమమే యగును. ప్రాతిపదికమునకుఁ గాదు గదా దీర్ఘము వచ్చుట. కావున 'సంస్కృతసమాచ్ఛికశబ్దము' లనుట యొప్పును.

## సంబుద్ధి - డుజ్లోపము :

'కృతోత్కం బగుసంస్కృతనామంబుసంబుద్ధిడుజ్జున' కనుసూత్రమును వివరించుచు బా.వి. సంస్కృతనామము — సంస్కృతప్రాతిపదికము. దీనియొక్క సంబుద్ధిడుజ్ ఓరాముఁడ ఓరాముఁడా (32,33)

ఇట్టిడుజ్‌నకు లోపము విభాషగా నగును (125) అన్నది. ఇట డుజ్‌నకు, (నగాగమము నైనది కాని ప్రాతిపదిక కుగాగమద్విత్వములే రాలేదు.) డుజ్‌ను అనుకీతివ్యవహారము స్పష్టత కేమో. సూరి డుజ్జున కనుకీతి పేర్కొనుట లక్షణానుగుణము. సంబుద్ధిడుజ్జును ఓ రాముఁడ, ఓ రాముఁడా యని 32,33 సూత్రములను గూడఁ బ్రస్తావించి ఇట్టిడుజ్‌నకు లోప మనుటలో శా.వి. 'అత్వము' దీర్ఘము నైనవానినే గ్రహించి వానికే లోపము చేయఁదలఁచిన ట్లున్నది. కాని యది సరి గాదు. ఓ రాము(ఁడు) డుజ్ అనుచో నున్న డుజ్జు సంబోధమునందలిదే కావున సంబుద్ధిడుజ్జే యవును. దానికే లోప మగును. లోపము రానిపక్షమునను ఓ రాముఁడు అని కాఁగా డుజ్జు నత్వమున కత్వమును దానికి దీర్ఘము వికల్పముగను వచ్చి ఓ రాముఁడా యని యవును.

సంస్కృతనామముల కనుటచే నాచ్ఛికములకు నీలోపము రా దని సూరి స్పష్టము చేసెను. దీనిని వివరించుచో శా.వి. తమ్ము బల్లిదు వంటిరూపము లుండవు (125) అన్నది. ఆచ్ఛికముల డుజ్జునకును లోపము వచ్చు నన్నచో తమ్ము బల్లిదు అని రూపము లుండవు. డుజ్లోపము వచ్చినను రాకున్నను జివర నుకార ముండుటచే 32. సూ.చే దాని కత్వము రాక తప్పదు. కాన తమ్మ - బల్లిద - అని కావలె. అవి యుండ వనవలె. కాఁగా డుజ్లోప మైనను తమ్ము బల్లిదు అని యుండ దని గుర్తింపవలె.

ఇంతే కాక శా.వి. ఇంకొక విశేషము చెప్పినది. 'హలంతములలో శ్రీమంత, గుణవంత ము న్నగునవి శ్రీమంతుఁడు గుణవంతుఁడు అని యగును. ఇట్టివానిలోఁ గూడ డుజ్లోపము రాదు. ఏలన ఇవి సంస్కృతప్రాతిపదికలు కావు. సంస్కృతసమప్రాతిపదిక లగును' (126) అన్నది. సంస్కృతనామ మనగా సంస్కృతమున నేది ప్రాతి

పదికమో యదిరోఁ దెలుఁగునఁ బ్రాతిపదికముగా నిల్చినవానినే యుద్దేశించినట్లు తెలియుచున్నది. 'శ్రీమత్' అన్నది సంస్కృతమునఁ బ్రాతిపదికము. అదియే తెలుఁగున శ్రీమంతమ్ అనునాకారముతోఁ బ్రాతిపదిక మగుచున్నది. కాఁగా శ్రీమంతమ్ అనునది సంస్కృత నామము గా దనుట కాధారము చాలదు. ఇట్టిచోట్లఁ బ్రాతిపదికలకు సంస్కృతసమవ్యవహారము విషయ మట్లుంచి దుష్టోపము రా దనుట వలన శ్రీమంతా, ఋత్విజా అంగిరసా-అనుకీతిరూపము లసాధువు లను నిర్ణయ మేర్పడుచున్నది. ఇది యంగీకారయోగ్యము గాదు. లక్ష్యానుగుణమును గాదు.

## ఆ ర గా గ మ ము :

'అమ స్త్రీనుజసో స్తః క్రమేణ చాదారదాగమా వ స్తే' యనుమూలము నుద్దేశించి బా.వి. 'మూలమునందు ఆరత్' అని తపరకరణము గలదు. దీనినిబట్టి దీర్ఘరూపములు సాధింపఁబడవు. దీనిని కిత్తుగాఁ జేర్కొనుటయే యుచిత' (1:7) మన్నది. చిన్నయవలెఁ గాక చింతామణి 'అదారదాగమా అస్తే' యని యంతమున నాగమము లవు ననుటంజేసి యాగమములను గిత్తులుగాఁ జెప్పవలసినయవసరము లేకపోయినది. సూరి కిత్త్వముచే సాధించినదానిని జింతామణి యస్తే యనుదానిచే సాధించినది గదా.

ఇంకను బా.వి. మూలమునందలితపరకరణముచే 'దీర్ఘరూపములు సాధింపఁబడవు, దీనిని కిత్తుగాఁ జేర్కొనుటయే యుచిత మనుటలో నింకొక వైరుధ్యము నేర్పడుచున్నది. తపరకరణమువలన దీర్ఘము సాధింపఁబడ దనియు నందుకై కిత్తుగాఁ జెప్పుట యుచిత మనియు బా.వి. ఉద్దేశించె ననవలె. తపరకరణము చేయకున్నను బ్రత్యేకముగా విధింపకుండ ఆరగాగమమునకు దీర్ఘాంతత సిద్ధించునా?

అట్లయిన సూరి కిత్తుగనే చెప్పెను గాన నపరకరణము చేయ లేదు గాన నీసూత్రగాగమసిద్ధాంతముచేతనె దాముఁడోరా అనుకృతి దీర్ఘాంతరూపములు గల్గునా? అయిన సూరి యిట్లు సులభముగ 'కిమికిం శాక్షికంబుగ దీర్ఘంబగు' ననె నేల? బా.వి. నుడివినచో దేమా (దీర్ఘము కూడఁ గల్గు నన్నదే కాని బా.వి. తత్స. 33 సూ.చే నగు నని వివరింపలేదు.) గాని ఆగమాగమమును ముదిదీర్ఘము సంబోధనంబునం దను (తత్స. 38) సూత్రముచేత నగునదే. ఆగమాగమసిద్ధిచేతనే యూరా అనుకృతిరూపమును సిద్ధించు నని (తపరకరణము చేయక కిత్తుగాఁ జెప్పుటచే) బా.వి. తలంచిన నయ్యది యుక్తము. సూరి సంబోధనమున నుకారంబున కకారం బగు ననుటంజేసి బా.వి. 'కార ప్రత్యయమును జేర్చుటకన్న 'యుత్వంబున కత్వం బగు నన్నఁ జాలు' (124) నన్నది. ఉత్వము అత్వము నగుటంబట్టి సూరిలక్షణమున నలె బా.వి. సంస్కరణమునను తపరకరణము లేదు. కాన దీర్ఘ మిటనే సిద్ధించునా? దీర్ఘము విధించుటకు ఇతరసూత్రము కడ నంతకు ముందు సూత్రముచే నైనయత్వమునకే దీర్ఘ మని బా.వి. వివరించి నది గదా. కాఁగా తపరకరణము చేయకున్నను హ్రస్వస్థలమున దీర్ఘము ప్రత్యేకముగా విధింపవలసినదే కాని తపరకరణము లేమి మాత్రమున నయ్యది సిద్ధింపదు.

అట్లు గాక యెచ్చటనేఁ బ్రత్యేకముగా దీర్ఘము విహితము గాఁగా నద్దానిచే దీర్ఘ మగుట కిచ్చటఁ దపరకరణ మనరోధించునా? ఇచ్చటితపరకరణమున కిటఁ దత్కాలమాత్రగ్రహణము ప్రయోజనము గాని యింక నెప్పుడును నది మార్పు చెందరా దను టెట్లు? దీర్ఘము ప్రత్యేకముగాఁ జెప్పఁబడినపు డద్దానిచే దీర్ఘ మగుట కెట్టివిరోధమును లేదు. ఇంక నిద్దానికి దీర్ఘ విధిచేతమాత్రము గుదురదు.

కాని లాక్షణికులచే బ్రాహ్మణాంతరములోఁ దపరకరణము నిర్దేశింపఁబడఁగా నుచ్చారణసౌకర్యమునకు తకారమును గాక యింకే దేని హల్లును జేర్చుకొన్న బాగుండెడి దేమో యనుట తప్పు గాదు.

**మువర్ణకము :**

స్యాదమహాత్తాం విభక్తౌ సో స్య ము అను చిం. లక్షణము నకు బా.వి. చివర నింకొక 'స్యాత్' అను దానిం జేర్చి మూలముగాఁ జూపుచున్నది. అన్యాపేక్ష యుండకొండదము.

బా.వి. 'విద్యు లత అనునవి సహజముగా అదంతములు కావు. అమహాత్తులు గాన మువర్ణకము రాఁగూడదు.' (130) అన్నది. (వనిత ఇత్యాదులు నిదర్శనముగాఁ బ్రస్తావింపఁదగినవే.) కాని వీనికి మువర్ణకము రాకపోవుటకు విద్యు-లత అనునవి సహజముగా నదంతములు కాకపోవుట కారణమా? లేక యమహత్తు లగుటయా? రెండునా? అమహదదంతములకు మువర్ణకము వచ్చు నని సూత్రము చెప్పుచున్నది. కావున సహజముగా నదంతములు కామి మువర్ణకము రాఁగూడ దని బా.వి. అభిప్రాయము నెన్నుదము. కాని యది సరి గాదు. సహజముగా నదంతము లైనవానికే మువర్ణక మగు నన్న జగము, మనము, ఇత్యాదుల నెట్లు? అవి సహజముగా నదంతములా? జగత్-జగ, మనస్-మన కాఁగా నెట్లయిన నదంతము లగుచో నిట్టి వానికి మువర్ణకము రాక తప్పదు. కాన విద్యుము లతము అని యేర్పడకుంటకు సహజముగా నదంతములు గా వన్నది కారణము కాఁజాలదు.

పిదప బా.వి. 'ఒకవేళ వచ్చినను స్త్రీలింగప్రథమైకవచనమునకు లోపము విధింపఁబడుటచే అట్టిరూపము లేర్పడవు' (130) అన్నది. (శాస్త్రమున సిద్ధాంతపక్షమున పక్షాంతరకల్పన మొప్పదు.

వనాదిశబ్దముల కాదేశ మనఁగాఁ బ్రాతిపదికలకుఁ బ్రత్యయ మాదేశ మగుట మాత్ర మిందే కల దనవలసియున్నది. ముబులు వనాదిప్రాతిపదికల కాదేశములైన (వనేకాల్లులు గాన సర్వాదేశము లై) నిఁక మిగులునది ప్రత్యయ మొక్కటి. వన - ము వన-బు అనఁగా వనము అనుదానికి బదులు 'ము' అని, వనంబు అనుదానికి బదులు 'బు' అని. కాని తె.వ్యా.వి. 'వనము' అనురీతినే చూపినది. బువర్ణము కూడ వనాదులకే యాదేశముగా రాఁగా నది పరముగా నుండుటయు ము వర్ణమునకు బిందు వగుటయు నెట్లు? ముర్వనాదికశబ్దేభ్యో ముబూ స్యాతాం చ తత్పర మ్మోసి ప.వి. వనాదిశబ్దముల కయి నముపర్ణమునకు (ఇది ప్రత్యయము గానఁ బరముగా నయి వనము అని యుండు) పరముగా ముబు లగు నన్నది. (కాని వనముము వనముబు అని యుండును వనాదులకే ముబు లాదేశము లనలే మని గుర్తింపఁదగును.)

అది యట్లుండ తె.వ్యా.వి. 'వన మ్ము' అని యెట్లు చూపినదో? మా పరే మోఽనం భవే త్తనుసంశము తె.వ్యా.వి. వివరింపలేదు. కాని 'వనమ్ము' అని చూపినది. 'బా పరే మస్య బిన్దుః' అనుచో మస్య మోః అనియే గ్రహింపవలె. వనంబు అనియే యగును. 'వనమ్ము' అని బుపరకతలో వనమ్ము అనువో వలె మేళనము ప్రసక్తి లే దని గుర్తింపవలసియున్నది. ఇట్టి లక్షణవివరణములు నుదాహరణములతీరు భిన్నము లై యున్నవి.

**ముగాగమము :**

ముగ్విధానమునుగూర్చి బా.వి. 'ఒకప్రాతిపదిక కొకేవిభక్తి చేరుట వ్యాకరణపద్ధతి. విభక్తిపై విభక్తి చేరిన దని చెప్పరాదు' (150) అన్నది. ఇట్లే 'కాని వ్యాకర్త ప్రత్యయముపై ప్రత్యయము చేర ననుట కంగీకరింపఁడు' (165) అనె. స్పష్టతకుఁ గావచ్చును.

అగ్గలికము అనుచో ఇక్ ప్రత్యయముపై ము ప్రత్యయము లేదా? ప్రత్యయముపై ప్రత్యయము రాదని సామాన్యముగాఁ జెప్పుట యొప్పదు.) ఇది స్పష్టతకయి చేసినవివరణము కావచ్చును. ఒక ప్రాతిపదికపయి ననేక విభక్తులు చేరుట యనుసందర్భ మసంభవము. ప్రస్తుతస్థలమునే చూచిన వృక్ష అను ప్రాతిపదికముపై ము వర్ణకము చేరిన వృక్షము అని యగును. కాని యిప్పుడిది ప్రథమైక వచనాంత మగుపదమే కాని ప్రాతిపదికము కాదు. దీనిపై లువర్ణా దులు చేరు టెట్లు? అవియుఁ బ్రథమైకవచనమువలెఁ బ్రాతిపదికము పయి రావలసినవే కాని (ప్రథమైకవచనాంతమగు) పద ... పయి వచ్చుటకు వీలు లేదు గదా. కాఁగా నొకవిభక్తి చేరుటతోనే ప్రాతిపదికము పద మగును గావునఁ బదముపై విభక్తి చేరుటకు వీలు లేదు గాన నొకే ప్రాతిపదికముపై ననేకవిభక్తులు చేరుట యనుసందర్భ మసంభవము. ఒకే ప్రాతిపదికపై రెండువిభక్తులు చేరుట యనుటలో బా.వి. అభిప్రాయము పైరీతిని యగునా?

బా.వి. ఇంతకు ముందు 'ప్రథమైకవచనవిభక్తులు ముప్రులు వర్ణకములు. ప్రాతిపదికపై ద్వితీయాదివిభక్తులు పర మగు నప్పుడు నిల్చియున్న ముప్రులు ఆగమములు వర్ణములు. (123) అన్నది. వనములు ధేనువులు అనురీతిగా ద్వితీయాదివిభక్తులుండే కాక ప్రథమాబహువచనస్థలమునను ముప్రు లాగమము లె. (130) ఇంక బా.వి. ఒకచోఁ జేర్కొన్నట్లు వర్ణకములైనముప్రులను ముప్రువర్ణము లన్నను తప్పు గాదు, ఆగమములను వర్ణము లనవచ్చుఁ గాని వర్ణకము లనరాదు.

## ముగ్లోపపూర్వస్వరదీర్ఘాలు:

లులన లనుసూత్రముచే నీరెండుకార్యములు విహితములు. వచ్చిన రెండును వచ్చును, రాకున్న రెండును రా దనుచు బా.వి.

‘సన్నియోగశిష్టానాం సహ వా ప్రవృత్తి స్సహ వా నివృత్తిః’ అని పాణినీయపరిభాష (133) యున్నది. కాని దీని స్వరూప మిట్లు గానరాదు.

సన్నియోగశిష్టానా మన్యతరస్యాపాయే ఉభయోరప్యపాయః (88) అనునది. ఇది సన్నియోగశిష్టము లైనకార్యములలో నొకదాని కపాయము గల్గిన రెండు నపాయము నందు నని చెప్పుచున్నది. కాని ప్రస్తుతసందర్భమున దేని కేనపాయము లేదు గాన నీపరిభాషకుం బ్రసక్తి లేదు. ముగ్లోపపూర్వస్వరదీర్ఘము లిట సన్నియోగశిష్టములు. ఇందు ముగ్లోపము గాని పూర్వస్వరదీర్ఘము గాని యెట నే నొక్కదాని కపాయము గల్గిన రెండవదియు నివృత్త మగును. ఇట సూత్రము ప్రవర్తించుటను గూర్చి నవిచారణమె కాని యందొకటి నివారింపఁబడఁగా రెండవ దేమగు నను ప్రశ్న యేది? ఈపరిభాష కిటఁ బ్రసక్తి లేదు.

సహ వా ప్రవృత్తి స్సహ వా నివృత్తి యనుభాగ మున్న పరిభాష వేఱొం డున్నది. అది ‘ఏకయోగనిర్దిష్టానాం సహ వా ప్రవృత్తి స్సహ వా నివృత్తి’ యన్నది. (పరిభా. 16) ఈయది యనువృత్తిసందర్భమునది. (క్వచిదేకదేశోఽప్యనువర్తతే. 17) ప్రస్తుత మనువృత్తికిఁ జెందినవిచారణము లేదు గాన దీనికి నిటఁ బ్రసక్తి లేదు. కాఁగా నిట నీపరిభాషలలో నెయ్యది యు ననవసరము. (వా. త్రి. శే.)

ముగాగమమునకు లోపంబును దత్పూర్వస్వరంబునకు దీర్ఘంబు నని సూత్రమున నుపయుక్త మైనసముచ్చయార్థకముచేతను యీరెండుకార్యములు గలిసియే **వచ్చు** ననియు **విభాష** యగుట రాకున్న రెండును రా వనియు సామాన్యముగనె యర్థము సిద్ధ మగుచున్నది. ఇట నవసర మైనయర్థము చార్థకముచేతనే సిద్ధ మగుచుం

డంగా వర్ణానిని విడచి సంపన్నమును సరిపడకుండ పరిభాష లెయ్య విరావా కలిపి తెచ్చి ముడిపెట్టుట సంగతము గాదు గదా.

**వేలాలు :**

'ఇందు మూలోపము నిత్యము' అన్నది బా.వి. కాని సూ.వి. వేలము అనురూపమును జూపుచు పెటపెట్ర్వేలి వేలముల పెంపు (చిత్ర భా. 2-9) అను ప్రయోగమును జూపినది. ఉపేక్షింపఁదగు నేమో.

భాండాలు ఇత్యాదులు ప్రతిపాదితాలు గాని విభాషను వ్యవస్థితముగాఁ జేసికొన్నయిట్టివానిలో మూలోపమును నిషేధింపనగును (134) అన్నది బా.వి. వీనిలో మూలోపము లేదని విభాషకు వ్యవస్థ చేయవలె నన్నమాట. ఇట్టివ్యవస్థ యవసరమా? సార్వ సూత్రమున 'నొకానొకచో' యనుటచే విధి మార్గమున నున్న యెల్ల యెడలఁ బ్రవర్తింపవలసిన యవసరము లేదు గదా. కావున మూలోపము లేనితావులు నొకానొకచో యనుదానిచే సంగ్రహితము లవుచున్న వని గుర్తింపఁదగును.

**కిటికీలు :**

బెంచి + లు బెంచీలు, కుర్చీ + లు-కుర్చీలు కిటికి + లు-కిటికీలు అనుకృతి నన్యదేశ్యములలో ఇత్వము దీర్ఘ మగుచున్న దన్నది బా.వి. (135) కాని బెంచి కుర్చీ కిటికీ అనుకృతిగా నీశబ్దములు సహజముగానే దీర్ఘాంతములుగా వినిపించుచున్నవి. దానిని గుర్తించిన నిత్వము దీర్ఘ మగు ప్రసక్తి యుండదు లే దనవలె.

**ఉత్తమము :**

'త్ర్యాదీనా మంత్య ముత్తమమ్ మాహుః' గాని యంతకు మించి గాని వర్ణములు గలశబ్దములందలి తుదివర్ణము ఉత్తమము (136)

అనుచునే బా.వి. జిగి, నిసి ఇత్యాదు లుత్తమములు గా (136) ననుట విశేషము. ౩, లేదా యంతకంటె నెక్కువ యక్షరము లున్న శబ్దమున నాచివరియక్షరమున కుత్తమ మని సంజ్ఞ. అంతే కాని యుట్టిపపు ననుఁ గాదు గదా.

మూఁడు గాని యంతకు మించి గాని యనుచో వర్ణము లనక యక్షరము లన్న బాగుండెడి దనిపించు. జిగి యనుచో నక్షరములు జి - గి. యన్నవి రెండే. కాని వర్ణము లన్న జకారేకార గకారేకారములు నాలుగు. (ఇట వృగాగమ మనఁగా వృ అనునక్షరమే కాని 'వ్' అనువర్ణము కాదని బా.వి. (139) కూడ చెప్పినది.) అంత్యవర్ణ ముత్తమ మన్న గివర్ణమునందలి యికార ముత్తమ మగు. ఉపోత్తమము గకార మగు ఉపోత్తమ మికార మగుట యసంభవము నగుఁ గదా.

### తొమ్మిదులు :

శ్రీనాథకవిప్రయోగం మే లైన రెండుతొమ్మిదులు విద్యల లోన మాపుదురు ఇట యతికోసం తొమ్మిదు లని యున్నా వాడుకలో రెండుతొమ్మిదు లని ఎక్కాలు చదువుదుము కదా. ప్రౌ. వ్యా. సమాస. 23 సూ.నందు తొమ్మిదులు అని కలదు. (137) కవిసార్వభౌముఁడు యతికై పడ్డపాట్ల నొక్కముక్కలో తేల్చినది బా.వి. అవుఁ గాక. యతేతరస్థలాల నట్లు ప్రయోగించిన నది స్వీకరింతురా? లక్షణానుగుణ మై యున్న దే మని తిరస్కరింతురా? ఏల యన వ్యవహారములో నందులోను 'ఎక్కాలు' చదువు చున్నప్పుడు తొమ్మిదు లందుము గాఁబట్టి కవి యట్లు ప్రయోగించినాఁ డనవలె. వాడుకభాష కింతటి ప్రామాణికత్వము గల్పింపఁగా బాలవ్యాకరణము వంటి గ్రంథములె యనవసరము. వానికి వ్యాఖ్యలు నేల యనిపించు.

యుట మహాత్ములను జూపలేదు. (క్రియాపదంబులం దిత్తున కనుచో మధ్యమపురుషక్రియలను జూపవల్లు) కాఁగా మహాత్ములకు బహువచనముగాఁ జెప్పఁబోవుట ననుసరించి సూరి యుదాహరింపలేదయిన నంతమాత్రమున నీసూత్రముచేఁ బ్రాప్తించుటదే యనుమహాత్ముల కని చెప్పరాదు.

ఇంకను బా.వి. మూలమునందును సర్వత్ర అని కలదు. దీనికి బాలసరస్వతి సప్తవిభక్తులయందు - అని పేర్కొనెను. కాని వువర్ణకేతరవిభక్తులు పర మగునపుడు వుకార మాగమముగా వచ్చు ననుసూత్రనిరూపణమే శాస్త్రసమ్మత (138) మన్నది. వావిళ్ళవారి బా.స.లో సర్వత్ర మూఁడులింగములందును అనఁగాఁ బ్రథమైకవచనమున కాదేశ మయ్యుఁ గడమచోటుల విభక్తులకు ముందాగమ మయ్యు వచ్చు నని యర్థ (200) మని యున్నది. కాని చిం.సూత్రమున సర్వత్రోదోత్తో ర్వా ర్భవతి మువ త్త్వని మువన్నిదేశము వలన 'న్యాయమహాత్మాం విభక్తౌ సోర్వా ము' అనుచోటవలె సుస్థానమున నాదేశముగను నితరవిభక్తిపరకల్పమునఁ బ్రాతిపదిక కాగముగను వచ్చును. సూరియభిప్రాయము చింతామణి ననుసరించియే యున్న దనుట స్పష్టము.

**అంతట - భ్రావు:**

'భ్రూ' శబ్దమునకు ప్రథమైకవచనలోపము లేదు. అట్లు వువర్ణకము లోపింపఁజేయకుండుటకే 48 సూ.నందు అంతట అని చెప్పఁబడె (142) నన్నది బా.వి. విద్య ఇత్యాదుల సమహత్త్వమునుబట్టి ముందు మువర్ణకము చేసి స్త్రీలింగ మగుటఁ బిదప దానికి లోపము చేయుట గమనించితిమి. బా.వి. అదేపద్ధతి నిట ననుస

రించిన దని స్పష్టము. అట్లుగా ఉకారాంత — సూత్రముచే 'వు' వర్ణకము రాఁగా స్త్రీలింగంబుల-అనుసూత్రముచే నదియు లోపించు ననియు, లోపింపకుండుటకే ఉకారాంత-సూత్రమున అంతట అనఁబడిన దనియు బా.వి. అభిప్రాయము. ధేయశబ్దము నెడల నిట్లు స్పష్టముగాఁ జెప్పినది (183) కూడ.

కాని యిది సరి కాదు. అంతట వువర్ణకం బగు ననుచో 'నంతట' యనునది ప్రథమైకవచనలోపబాధనార్థ మని సూరి స్పష్టము చేసె. అంతట నగు ననుటచేఁ బ్రథమైకవచనము లోపించుటద్వారాన వువర్ణకము వచ్చుట కవకాశము లేనిచోటులనంతయు - అద్ద మగు నా ప్రథమైకవచనలోపమును బాధించి వువర్ణక మగు నని గ్రహింప వలసియున్నది.

అంతట-సర్వత్ర యనునవి సమానార్థకము లనుట స్పష్టమే. నిగాగమంబు సర్వత్ర విభాష నగు ననుచో సూరి 'సర్వత్ర' యని యన్నను నగాగమబాధనార్థ మనెను. అట నగాగమము వచ్చుచుండఁగా దానిని బాధించి నిగాగము మగు ననియే కదా యర్థము. ఇట వువర్ణకమువలె నట నిగాగమమును ముందుగాఁ జేసిన నగాగమ బాధ యెట్లు? విభాషగా నిక్క చెప్పఁబడ నక్క నిత్యమైనది. ముందుగా నిగాగమ మన నెట్లు వచ్చును! అట నెట్లు నగాగమము రావలసియుండఁగా దానిని బాధించి నిగాగమ మగుట 'సర్వత్ర' యనుదానిచేత సిద్ధించుచున్నదో యట్లే యిటఁ గూడఁ (స్త్రీలింగ మగుటచే) బ్రథమైకవచనలోపము రావలసియుండఁగా నాలోపమును బాధించి వువర్ణకము చేరుట 'యంతట' యనుదానిచే గుర్తింపఁ దగును. కాన వువర్ణకము ముందే యగు ననుకొనరాదు.

భటుపు :

'భటువు - అనుహద్వాచకము. ఉంగరమువంటిది. భటుఁడు మహాత్ము. సైనికుఁడు. ఇట వృవర్ణకమునకు అప్రవృత్తి. కర్తృనియమునందు క్లిష్టతను గ్రహించి సూరి బహుళసంజ్ఞను విధించె' (140) నన్నది బా.వి. సైనికుఁ డనునర్థమున భటుఁ డనియే కాని భటు వని లేదు గాన నట వృవర్ణకము రా దని బా.వి. అభిప్రాయము. ఇది యసంగతము. ఇట భటశబ్ద మదంతము రామశబ్దమునకువలె. రాముఁడు అని కానట్లే భటు వని కాదు. ఇది యుదంతము గాన వృవర్ణకమునకుఁ ప్రాప్తియే లేదు గావున నప్రవృత్తి యని చెప్పరాదు.

ఇట బా.వి. బహుళసంజ్ఞను విధించె ననుటలో బహుళ సంజ్ఞతో నని తృతీయార్థమునఁ దృతీయకు ద్వితీయ చేసి చెప్పిన దని యూహింపవలెను. బహుళముగా నని యుద్దేశము.

అత్వ స్త్రీవద్భావాలు :

'ఋకారాంతంబున కత్వంబును స్త్రీవద్భావంబు నగు' నను దానిని వివరించుచు 'ఋకారాంతశబ్దములయొక్క ఋకారమునకు హ్రస్వ మగుఅకార మాదేశ మగు (140) ననుచునే బా.వి. వివర భ్రాతృ + అ భ్రాత (140) అని చూపుట సరి కాదు. అకారమును బరముగాఁ జేర్చుటవలన నది యాగమ మయినట్లుగా లక్ష్యవర్తనమున నర్థ మేర్పడును. ఋకారముస్థానమునఁ గదా యత్వము చేయవలసినది. స్త్రీవద్భావప్రయోజనమును దెల్పుచు 'ప్రథమైకవచనవిభక్తి లోపము కల్గును. 22 సూ.చే డుఙ్వర్ణకము రావలసియుండఁగా ఈ విధిచే నివారింపఁబడినవి (ది ?) (140) అన్నది. స్త్రీవద్భావమువలన సులోపమే కాదు' 21 సూ.చే రావలసినయుత్వమును దీనికి రాదు. అత్వవిధానసామర్థ్యముచే నుత్వము లే దనుకొన్నను (ఇట్లనుకొను

టకు వీలు లేదు. పిదప నిత్వ మగుచో నత్వవిధానము వ్యర్థ మగు నని యుత్వమునే విధించిన పునర్ణకప్రసక్తి గల్గును. అప్పుడు స్త్రీత్వ విధానసామర్థ్యముచే పునర్ణప్రాప్తిని వారించుకొనవలె. ఇది క్లిష్ట మార్గము గదా.) సిగాగమాదులు వారింపఁబడుట స్త్రీవద్భావమువలన సిద్ధించు ప్రయోజనమే.

ఇక్కడ స్థలాంతరమున 'వ్యక్తముగా సురశబ్దము నిత్యముగా స్త్రీతుల్యము. అనఁగా ప్రథమైకవచనలోపము (146) అన్నది. (ఇక్కడ వేధ-168) అది సరి గాదు. 'సురులు' అని యుత్వ మగునా? – ఉత్వమును వారించుటయు స్త్రీతుల్యతవలన సిద్ధించుప్రయోజనమే. 'సురుఁడు' అనురూప మున్నప్పుడే సురలు అను బహువచనరూప మేర్పడు ననుకేతినిర్ణయమునకు లక్షణము సహకరించదు. కావున నత్తునకు రావలసినయుత్వము సురుఁ డనురూపము లేమిచే సాధింపఁబడదు స్త్రీతుల్యతచేతనే.

మద్యార్థకముగా సురశబ్దము (సురా?) కలదు గాన నీసుర శబ్దమున కేకవచనరూపము లే దను బా.వి. ఊహ చమత్కారజనకము. మద్యములు అనునర్థమున 'సురలు' అని యుండవా. సురలు అని దేవత లనునర్థమునఁ గలదు గదా.

## దీర్ఘమునకు హ్రస్వము :

'నామంబులతుదిదీర్ఘంబునకు హ్రస్వం బగు' ననుసూత్రమును వివరించుచు బా.వి. దీర్ఘాంతము లగుసంస్కృతనామములు హ్రస్వములై (అనఁగాఁ దుది దీర్ఘమునకు హ్రస్వమును బొందినవై యని యభిప్రాయముగా గ్రహింపఁదగును) తెలుఁగునఁ బ్రవేశించు (142) నన్నది. ఇది సక్రమముగా లేదు. రమా యనుదీర్ఘాంతప్రాతిపదిక మళ్లీ తెలుఁగునఁ జేరును. తెలుఁగులోనికిఁ బ్రవేశించినపిదప వాని

తుదిదీర్ఘమునకు హ్రస్వ మగును. అంతే కాని హ్రస్వాంతము లైన పిదపఁ దెలుఁగులోనికిఁ జేర నగరాదు. రాము యనునది ప్రాతిపదికముగాఁ దెలుఁగునఁ జేరఁగా దాని కుత్వ మగును గాని రామాదులు పుంలింగంబై యనుసూత్రముచే నుత్వ మంది రాము అని యై తెలుఁగునఁ బ్రాతిపదికలుగాఁ బ్రవేశించు ననవచ్చునా? ఇటఁ గూడ నట్లే.

బా.వి. సంస్కృతసమము లేర్పడుటను వివరించుచు 'కొన్ని దీర్ఘములు హ్రస్వము లగును లక్ష్మి, లత (423) అన్నది. కొన్ని యనుట యింతకుముందుకంటె విశేషము. కొన్ని యనఁగా నేకాక్షర శబ్దములు దప్ప నని భావము గావచ్చు. స్పష్టముగా నేకాక్షరములు గానిశబ్దములతుదిదీర్ఘమున కని చెప్పిన బా గుండెడిది.

ఇట సూరి సంస్కృతసమములనే చూపె నని కాఁబోలును బా.వి. సంస్కృతనామము లని వివరించినది. కానీ యిటఁ జూప కున్నను నాపిదప సేనాని, అనుసంస్కృతసమశబ్దమువలె 'సిరి' యను ప్రాకృతసమమునుసైతము సూరి కృతహ్రస్వముగాఁ జూపెను. కాఁగా సంస్కృతనామములందువలెఁ బ్రాకృతనామములకును దుదిదీర్ఘమునకు హ్రస్వ మగుటను సూరి యుద్దేశించె నని స్పష్టము. కృత్తోత్వం బగు సంస్కృతనామం బనుచో సంస్కృతనామ మనుటవలన నాచ్ఛికములు గ్రహింపఁబడ వని సూరి స్పష్టము చేసెను. మఱి యిట సంస్కృత నామంబుల-యనక నామంబుల-యని సామాన్యముగా నిర్దేశించియుండఁగా సంస్కృతనామములకే యగు నని వివరించుట కవకాశ మేది? ఇది యట్లే యైన కృతోత్వంబగు-అనుసూత్రమున సంస్కృతనామ మను టేల?

కాని సంస్కృతనామ మనలేదు గాని నాచ్ఛికములకు నగు నన్నఁ దద్భవదేశ్యశబ్దములందును నీవిధి ప్రవర్తింపవలసియున్నది గదా యనిపించును. ఇట్టియెడల నిర్ణయమునకు లక్షణమున సూరి యొక యాధారము గల్పించినట్లు గానరాదు. అయిన - కృతహ్రస్వము లను వివరించుచో నేనాని, సిరి యనువానిం జూపుటయు, లకోరీ లను నది దీర్ఘాంతముగానే చూపుట ననుసరించి ఆలక్ష్యములసామర్థ్యముచే నీహ్రస్వము సంస్కృతప్రాకృతనామములందే వర్తిల్లు ననియుఁ దద్భవ దేశ్యములందు లేదనియుఁ జెప్పనగుమార్గ మొకటి గానవచ్చు - పరిశీల నార్హము.

## ప్రథమైకవచనలోపము :

దీర్ఘాంతములకు హ్రస్వము కలుగగా ఉచిత మగువిభక్తి చేరిన గాని పదత్వ మేర్పడదు. ఆవిభక్తి చేరి పదత్వమును సిద్ధింపఁజేయఁగనే లోపించును. లోపింపఁజేయునపుడది యేవిభక్తియో యోజించుట కూడ వ్యర్థము (14వ) అను బా.వి.వచనములలో ఉచిత మగువిభక్తి యనఁగా నాయాయర్థములం దాయైవిభక్తు లని యర్థము చేసిన ననర్థ మేర్పడును. ప్రథమైకవచనేతరములకు లోపము రాదు గదా. అట్లే లోపింపఁజేయునపుడది యేవిభక్తియో విచారణ మనవసర మనుట లోను నయ్యది డుమువులలో నేది యనుయోచన మనవసర మనియె గ్రహింపవలెను. కాని ప్రథమైకవచనముల గ్రహించుటకును నీవివరణ మంతలియస్పష్టతచే నవకాశము గల్గినను నట్లు గ్రహింపరాదు. గ్రహించిన ననర్థమే కల్గును గదా. డుమువులలో నేది? ప్రథమైకవచన మన నేది యనునది యనవసర మనుట సాధారణదృష్టితోఁ గావలెను. ఏదో యొకప్రత్యయము చేయక లోప మగు నన్న దేనికిఁ జేయుదుము? (చూ. బా. సూ.)

## అప్రవృత్తి :

చరిత్రాదులయందు మువర్ణకంబునకు లోపమును సూరి బహుళముగా విధించెను. ఇట బా.వి. 'ములోపము రాకుండుటకు (అప్రవృత్తి) ఉదాహరణము 'వేగము' (144) అన్నది. వేగము అనుచో ములోపము లేనపుడు దానిని చరిత్రాదులలో నేల చేర్పవలె? సూరి చేర్చెను. అది యసంగతి మని నిర్ణయింపవలె. ఇంతకు సూరి యప్రవృత్తి యనలేదె. వనము వృక్షము ఇత్యాదులలోను ములోపము లేదు. అవియు నప్రవృత్తిస్థలములై యుండునా? చరిత్రాదు లని గణ మేర్పరచి యందు విధించినపుడు నాకార్యము లేనిశబ్దము లాగణమునఁ జేర్చుటకే వీలు లేదు. ఎవ్వరేని జేర్చిన నయ్యది ప్రమాదమే. కాఁగా నిట్టిస్థలముల బాహుళ మున్నను నప్రవృత్తిస్థల ముండ దని నిశ్చయింప నగును.

ములోపము నిత్య మగుచోట్లఁ గుండును (జూపఁడగు నన్నది) బా.వి. ప్రౌఢవ్యాకరణ మంతకు ముందటిదైన సూరి యట్లు చేసెడి వాఁ డేమో. క.ము. 'తెలుఁగని భ్రాంతి చెందెడవు గాని కుంప శబ్దము సంస్కృతి' (76) యున్నది.

## హంస :

హంసశబ్దమునకు మువర్ణకము కల దని కొంద అందురు. కాని నన్నయభారతమునందు హంసశబ్దము సర్వత్ర స్త్రీసమముగా వాడఁబడినది (తె.వ్యా.వి. 268) హంసశబ్ద మవంతా మహత్తగుట (స్త్రీలింగము కాక) మువర్ణకము రాక తప్పదు. కాఁగా హంస యనియే ప్రయుక్తమైన దన్న నట మువర్ణకలోపము నిత్యముగాఁ జేయఁబడిన దనవలె. నన్నయేతరులు ప్రయోగించిరా? నన్నయభాషకుమాత్రమె కాదు గదా ఈలక్షణము. అట్టియెడల ములోపము వికల్ప మనవలె

అయినను 'ము' లోపించిన హంస అనుదానిని తె.వ్యా.వి. స్త్రీసమ మనుట యొప్పదు. సూరి స్త్రీసమసంజ్ఞ నాచ్ఛికములయెడనె ప్రయోగించె. చింతామణియు నంతియ. చింతామణియు, సూరియు నిట ములోపమునే చెప్పుట జరిగినది గాని స్త్రీతుల్యము లగు ననియుఁ జెప్పలేదు.

ఆం.భా. శాకర్త వంటిపండితులే చరిత్రాదులు మువర్ణకము రానపుడు (వచ్చి లోపించు నని గుర్తింపవలసియున్నది.) స్త్రీసమము లగు నని వర్ణ్యాదులు స్త్రీసమము లని యిచ్చవచ్చినట్లు రచించుట విచార్యము. విశిష్టవృష్టి లేమి కిట్టి వ్రాతలు నిదర్శనములు ([illegible]) అన్న తె వ్యా.వి. హంసశబ్ద మాచ్ఛిక మని తలఁచినదా? దీనికిఁ బ్రత్యేకముగా స్త్రీతుల్యత చెప్పమి చరిత్రాదులలోఁ జేర్పవలసినదే గదా. స్థలాంతరమునను తె.వ్యా.వి. 'స్త్రీసమము లయినతత్సమశబ్దము'లనుట (265) యొట్టివృష్టివలననో యర్థము గాదు.

సింగంబుదూత యగుజంబుకంబు :

సూరి దూతశబ్దమున కమహత్త్వమున స్త్రీత్వము నిత్యమని వివరించెను. దానింగూర్చి తె.వ్యా.వి. ఇట్లన్నది. "స్త్రీలింగతుల్యము లైనవిశేష్యములయొక్క విశేషణములు స్త్రీలింగతుల్యములుగానే యుండవలసినయవసరము లే దని కావించినియమమునకు భిన్నముగా చి.సూ. పైసూచన గావించెను—'విశేష్యాత్ప్రాప్తే స్త్రీతా స్యాత్ దుజ్యా స్యాత్తాం తు ఫేనకే' యని వి.వి. చెప్పినది. సింగంబు దూతం బగుజంబుకం బనుచో జంబుకం బనునది విశేష్యము. దానియందు స్త్రీత్వ మతిదిష్ట మైనదా? విశేషణమున కది రా నక్కఱ లే దని చెప్పఁగా చి.సూ. వి.వి.కు భిన్నముగాఁ జెప్పె ననుటకు?

మహాత్ములకు స్త్రీత్వ మగు ననఁగా నవి విశేష్యము లగునప్పుడే కాని విశేషణము లగునప్పుడు గా దని యర్థమా? అంత యైనఁ గుంభకర్ణుఁ డనవచ్చునే కదా. వి.వి. కారికకు సైత మర్థ మిది కా దని గ్రహింపఁదగును. స్త్రీత్వ మతిదేశింపఁబడినశబ్దము విశేషణ మగుచో దుష్ప్రలగు నని కారిక కర్థము గా దనియు, విశేష్యము స్త్రీత్వ మతిదేశింపఁబడినది గాఁగా దానికి విశేషణ మగు శబ్దమునకు స్త్రీత్వ ముండ దనియు దుష్ప్రలే యథోచితముగా నగు ననియుఁ (మహాత్ముఁ డగువిశ్వకర్మ, ఉన్నత మైనగోడ) గా నర్థము విస్పష్టమే. తె.వ్యా.వి వివరణమునను నాయభిప్రాయమే యున్నది. కాని యది యిట లక్ష్యమునం దన్వయించుట లే దంతియ. మఱి సూరి నిరూపించిన భేద మేది?

ఆ భేద మేదో నిరూపించుటకుఁ గాఁబోలును తె.వ్యా.వి. 'ఇట విశేష్య మమహత్తు. విశేషణము మహత్తు' అన్నది. విశేష్య మమహత్తయిన విశేషణము మహ త్తగుట యేమి? 'స్త్రీతిర్యగ్గత భిన్నంబులును వానివిశేషణంబులును మహత్తు లనంబడు' ననులక్షణము ననుసరించి స్త్రీతిర్యగ్గతములును తద్విశేషణములు నమహత్తులే యగును గదా. జంబుకము తిర్యక్కు గాన నమహత్తు కాఁగాఁ దద్విశేషణ శబ్ద మమహత్తే కాక తప్పదు. మహ త్తగుట యెట్లు?

ఎట్లో వివరించుచున్నది తె.వ్యా.వి. 'జంబుక మిట అమహత్తైనను వార్తాహరత్వ మనుమహాకార్యమును నిర్వహించుచున్నది కావున నిట్టివిశేషణమునందే మహాత్త్వ మారోపింపఁబడినది. (281)

మహాకార్యమును నిర్వహించునది జంబుకము గదా. జంబుకమునందు మహత్త్వ మారోపింపక తద్విశేషణమునందు మాత్రమే యారోపించు టెట్లు? పోనీ యట్లు చేయుదము.

ఇది సూరిమతమా? సూరి 'అమహాత్త్వంబునందు స్త్రీత్వంబు నిత్యం' బని గదా చెప్పెను. విశేషధర్మనిర్వాహణ మున్నది గదా యని విశేష్యమును వదలి విశేషణమును మహాత్తుగాఁ జేయఁగా నది మహాత్తే యైనది. సూరి స్త్రీత్వము నిత్య మన్నది యమహాత్త్వమునందు. మహాత్తగునీవిశేషణమునకు స్త్రీత్వము నిత్యము గాదు. సూరియే తనలక్షణమున కనుగుణ మగు నుదాహరణ మీయలేక పోయెనే.

ఇంకను తె.వ్యా.వి. 'అందును మాతుఁ డను మహాద్వాచక రూపము కాక మాత యను స్త్రీత్వాదేశరూపమే ... పరిశీలన మపూర్వ మన్నది' (281) అనఁగా స్త్రీత్వము లేకున్న మాతుఁ డని యగు నన్నమాట. కాని సూరి స్త్రీత్వము నిత్య మన్నది యమహాత్త్వమునం దగుటచేతను మహాత్త్వమున విభాష యే. మాత. మాతుఁ డని యుండవచ్చు. తె.వ్యా.వి. వివరణానుసార మిట మాత శబ్ద మమహాద్విశేషణమే కాని మహ త్తైనది కదా. కాన నిట స్త్రీత్వము నిత్యము కామిఁ బక్షాంతరమున మాతుఁ డగు జంబుకం బనియు నుండుట సముచితమె. మాతుఁ డనురూప మిట నుండ దనుట తె.వ్యా.వి.వివరణమునకే విరుద్ధ మని స్పష్టము.

సూరిమతమును స్పష్టమే. ఇట జంబుక మనువిశేష్య మమ హాత్తు కానఁ దద్విశేషణ మగుమాతశబ్దము నమహత్తే. (స్త్రీత్వము మహత్కార్యము గాన నది మహత్తే యగుచున్న మాతశబ్ద మొక్క డును నమహాత్తు గా దనవలె. మఱి సూరి యమహాత్త్వంబున నిట వ్యర్థము. అసలు విశేష్య మమహాత్తు గా విశేషణము మహ త్తగుటయే సూరిలక్షణమునకు విరుద్ధము) కాఁగా నిట మాతశబ్ద మమహాత్త్వ మునం దున్నది గావున సూరి వివరణము ననుసరించి స్త్రీత్వము

నిత్యము. కాన ధూర్త యగు జంబుకంబు అని మాత్రమె యుండును. స్త్రీత్వము లేనిచో నదంతమహత్త్వము ననుసరించి ముఁవర్ణక మై ధూర్త మగు జంబుకంబు - అని కావలయును. నిత్యస్త్రీత్వాతిదేశము వలన నిట ధూర్త మనుమువర్ణకాంతరూపమె నివారింపఁబడిన దని గ్రహింపఁదగును.

ధూర్తుఁ డగు జంబుకం బని యేర్పడుప్రసక్తియే లేమి దానిని వారింపవలసినయవసరమును లేదు. విశేష్య మమహత్తు కాఁగా విశేషణము మహత్తనుకొన్న పొరపాటువలన ధూర్తుఁ డను రూపము వారింపఁబడినట్లు తె.వ్యా.వి. ఎంచినది. అది మహత్తన రామి ధూర్తుఁ డని యగుటకే యవకాశము లేమి నట్టిరూపము వారింప నక్కఱ లేదు.

ఏ మైనను నిట్టిసందర్భమున ధూర్త యగు జంబుకం బనియే యుండు నని సూరి నిర్ణయించుట స్పష్టము. దీనినిగూర్చి తె.వ్యా.వి. ఇట్టి చి.సూ. పరిశీలన మపూర్వ మనుచున్నది. కాని వ్యా.సం.స. సూరిగారియిట్టివ్రాఁతకు కపిలవాయివివరణాను మూల మని ధూర్త శబ్దంబున కమహత్త్వంబున స్త్రీత్వంబు నిత్యంబు సింగంబుధూర్త యగు జంబుకంబు ఇత్యాదులు అని యం దుండి పంక్తు లుద్ధరించిరి. (604) మఱి యీ సీతారామకవి సూరికిఁ బూర్వుఁడే యైన సూరి చెప్పిన యంశము పూర్వోక్తమే యగును.

పిదప తె.వ్యా.వి. 'ధూర్తుఁ డగు జంబుకుం డని యనరా దనుటకుఁ బ్రమాణము కనుపట్టు' (281) దన్నది. ధూర్తుఁ డగు జంబుకుం డనరా దనవలసినయవసరమును లేదు. అవకాశ మెట్లును లేదు. జంబుకుఁ డనుచో విశేష్య మగు జంబుకశబ్దము మహత్త్వమునం దుండుట స్పష్టము. విశేష్యము మహత్తయినపుడు విశేషణమును

మహాత్తే యగును. కాఁగా మాతశబ్ద మిట మహాత్తే. అమహాత్త్వమున స్త్రీత్వము నిత్య మనుటచే మహాత్త్వమున విభాష యగునే కదా. కావున మాత యగుజంబుకుం డనుదానితోపాటు మాతుఁ డగుజంబుకుం డని యుండుటయు సూరిసూత్రానుగుణముగ సిద్ధించుచునే యున్నది.

కాన సూరి వివరించినది యమహాత్త్వమునందలిమాత యగు జంబుకం బనునదే కాని మహాత్త్వపక్షమునందలి-మాతుఁ డగుజంబుకుం డనునది కా దని గ్రహింపవలె.

నావి :

'నావి యనురూపము రావిపాటిగురుమూర్తిశాస్త్రి తెనుఁగువ్యాకరణమునందుఁ గలదు దీనిని సూరి పాఠ్యగ్రంథముగా బోధించుటచే ఇట్టివానిని గుర్తించెను' (149) అన్నది. బా. వి. (తె. వ్యా.వి 282) అయ్యు నందనోపును. సారస్వతత్రిలింగశబ్దానుశాసనమున నీ'నావి' ప్రస్తుతింపఁబడినది. 'జీవ న్నావః పుష్పదన్తస్య'- నౌశబ్దస్య సంస్కృతిస్తత్త్వమ్యేకవచనప్రమాణం నావ్య పుష్పదన్తస్య మతే. నావి నావిచేత నావి దెచ్చె నావియొక్క. అథన్వాఽభారతే ఆది పర్వణి-నయుమా ర రాఘవుఁడు నావి యొక్క. (శబ్దపరిచ్ఛేదము. 58సూ.) సూరి దీనిని జూచియుండఁడా?

పైని-పైకి :

దీనింగూర్చి బా.వి. పైని పైకి యనునవి విభక్తిప్రతిరూపకావ్యయము లనఁదగును. ఇవి ప్రతిపదోక్తములు గావున వీనికి విభక్తి వేఱుపఱచి చూపరాదు. (150) అన్నది అనఁగా సూరి పై + ను, పై + కు అనుకొని ద్వితీయాచతుర్థ్యంతములుగా వీనిని సాధించుట తగ దని భావము. కాని యసలు వీని నవ్యయము

లనుట యసంగతము. 'మీఁదు' అనునర్థములో పయి-పై - అన్నది ప్రథమాంతము. స్త్రీసమము. పైకి అనుచో మీఁదికి-ననుకీలిగా షష్ఠ్యర్థ మున్నది. పైని అనుచో సప్తమ్యర్థమున నైన దగుట ద్వితీయాసప్త మ్యర్థము సునన్వితమవుచున్నది. ఇట్లాయావిభక్తులు ప్రసక్తములం దవుచుండఁగా నవ్యయము లను టెట్లు? బహువచనమునను నేకవచన మునను జేతానుఁబును జేయుట లేదు గావున నివి యవ్యయ మనఁగాన రాదు. అప్పుడు ఇత్యాదులకును బహువచనము లేదు. ఏకవచనము నందును నెల్లవిభక్తులు గానరావు. ఆయాశబ్దములపై నానావిభక్త్యర్థ ములవివక్షయే కుదురుపడమింజేసి యాయావిభక్తులు చేరకపోవచ్చు. ఊరుశబ్దమునకును ఊరిచేత ననుకిని తృతీయాంతరూప ముండదు. అంత మాత్రమున నయ్యవి యవ్యయము లగునా? అప్పుడీతఁడు లవ్యయ ములా? బా.వి. అవియు నవ్యయములే యున్నవి. కాని యిందలి పొరపాటెంతకు ముందే స్పష్టము.

తెలుఁగున విభక్తిప్రతిరూపకావ్యయము లనుకొనినయవ్యయ మెటనేఁ గుదురుపడునా? పరిశీలనార్హము. విభక్తిప్రతిరూపకము లనఁదగునవి లేవని తోఁచుచున్నది.

**కంధరాదులు:**

కొన్నింటికి స్త్రీలింగత్వ మారోపితము. అందుచే మావర్ణక మునకు లోపాలోపము లేర్పడును కంధర - నాసిక - దంష్ట్ర) (423, 424) యన్నది బా.వి. ఇది సరి గాదు. ఈకంధరాదులు సంస్కృతాను సారముగ సహజముగనే స్త్రీలింగములు. కంధరాదులు క్లీబతుల్యంబులు బహుళంబుగా నగు నని క్లీబతుల్యతయే యతిదేశింపఁబడినది. అనఁగా నిట నారోపింపఁబడినది క్లీబతుల్యతయే కాని స్త్రీత్వము గాదు. స్త్రీత్వ మందే యున్నవి. స్త్రీత్వపక్షమున నైనను ములోప మనుట సరి గాదని స్పష్టము.

## విధము :

విధాశబ్దమునకు సూరి (66 సూ. బాహుళకతచే) క్లీబతుల్యత నిత్య మనెను. ఇట బా.వి. కొన్నిసంస్కృతనిఘంటువులలో 'విధః' అని పుంలింగరూపము గలదు. అది గ్రహించినప్పు డీయతిదేశము దీనికట్లు వ్యర్థము. బహుళమునకు మాఱుగా విభాష యున్నచో సరిపోవును. (150) (తె.వ్యా.వి. 285) అన్నది. ఇది గ్రహింపకపోవుట చేతనే సూరి (శాస్త్రి) అవసర మని యట్లు చెప్పియుండును. విధాశబ్దంబు సంస్కృతంబునందు పుంలింగంబు నగు - నని ప్రౌఢవ్యాకర్త యొక నిఘంటువునుండి ప్రమాణమును జూపెను. బా.వి. కొన్ని నిఘంటువులనుటలో నింకను నితరనిఘంటువులలో నుండుటను జూచిన దేమో. దానిని 'గ్రహించినప్పు' డనుటంజేసి గ్రహింపకుండుట కవకాశము నిల్పబడినది. అట్టినిఘంటువు(లు ?) అప్రసిద్ధము లేమో. ఏమైన సంస్కృతమున నెక్కడనేని పుంలింగశబ్ద మున్నను దెలుగునందలి తత్సమరూపము ప్రసిద్ధమైనవిధాశబ్దమునుండి యేర్పడిన దని యొన్నటయే యుచితము. (చూ. త్రి. శే.) కావున నీవిధాశబ్దమునకు నీయతిదేశమును నిత్యతానియమమును నొప్పుచున్నది.

పుంలింగశబ్దమును గ్రహించునపుడే బహుళమునకు మాఱుగా విభాష యనందగు నని బా.వి. తలంచిన నదియుం దగ దనియే దీనివలన స్పష్ట మగుచున్నది. అట్లు గాక విభాషకు వ్యవస్థ చేయుట ద్వారాన నీయర్థమును సాధింపంగల మని స్త్రీలింగశబ్దమునుండియే క్లీబతుల్యతతో సాధించుపక్షమునను విభాషయే చాలు నని యభిప్రాయపడిన - నదియు ననవసరమే - యని 'ద్వితీయను ప్రథమ' యనుకారకస్థలమున స్పష్ట మగును.

**హాలంతములు :**

సంస్కృతములోని విభక్త్యంతరూపము తెనుఁగులోనికి గ్రహింపరాదు. అందుచే వ్యాకర్త జాగ్రత్త వహించి 'ప్రథమైక వచనాంతతుల్యము' అనెను. అట్టిరూపము లీభాషలో ప్రాతిపదిక లగు' (151) అన్నది. బా.వి. సంస్కృతములోని విభక్త్యంతరూపము తెనుఁగున గ్రహింపరా దనఁ ప్రాతిపదికముగా గ్రహింపరా దని యూహించుకొనవలయును. అనుకరణమునం దన్నఁ దెనుఁగున గ్రహింపవచ్చునే కద. అనుకరణము లేకుండ నన్న సంస్కృతవిభక్త్యంతరూపము లేమి సంస్కృతప్రకృతిప్రత్యయాదులుమాత్రము గ్రహింపవచ్చునా? కాఁగా సూత్రమునుబట్టి వ్యాఖ్యానమునందుఁ ప్రాతిపదికలుగా గ్రహింపరా దనియే యూహించుకొనవలయును.

ప్రాతిపదికలుగా గ్రహింపరా దనుచోఁ గూడ సంస్కృతములోని విభక్త్యంతరూప మునకు యుక్తింగలదు. సంస్కృతము గా దని తెలుఁగున నైనను విభక్త్యంతరూపము ప్రాతిపదిక మగునా? నామంబు సంశ్లిష్టబహువచనాంతతుల్యం బగు బహువచనంబు నెనయు ననుచోఁ గొడవండ్లు-లు మున్నగు శబ్దములు నిల్లే కదా. సూరి తుల్య శబ్దమును ప్రయోగించెను. ప్రాతిపదికలకుఁగా నందు సరిపడదు గదా. అట్టియెడ నేభాషయందేని విభక్త్యంతరూపము ప్రాతిపదిక కాకుండఁగా సంస్కృతమునే ప్రత్యేకించి చెప్పనేల?

జాగ్రత్తవహించి ప్రథమైకవచనాంతతుల్య మనుచో ననుచో నావహించిన 'జాగ్రత్త' తుల్యము అనుటలోనె యని గ్రహింపవలెను. మతుబాదికంబు ద్వితీయైకవచనాంతతుల్యం బిత్యాదిగ ననెనే గదా.

కాఁగా నిట విభక్త్యంతరూపము ప్రాతిపదికగాఁ జెప్పరాదు గావున జాగరూకతతో నిట్టియెడలఁ దుల్యశబ్దము ప్రయోగించె నను భావమునే వ్యక్తీకరింపవలసియున్నది.

అజంతశబ్దములు సంస్కృతప్రాతిపదికలె తెలుఁగున ప్రాతిపదిక లగు' (151) నని చెప్పవచ్చును. ఏవో కొన్ని స్త్రీలింగశబ్దములు (కర్తృ - కర్త్రీ)) తప్ప దాదాపు అజంతము లెల్ల నట్లే గావున.

ఈహలంతశబ్దము లేలింగములో వాని ప్రాతిపదిక లెట్టివో తెలిసికొనవలసినపని లేదు. కర్మ, వర్మ అనునవి నకారాంతశబ్దములు అన్నది బా. వి. (151) ప్రాతిపదిక లెట్టివో తెలియఁబడి లేదనుటచే కర్మ నకారాంత మని వివరించుట విశేషము. నిజమునకు కర్మన్ శబ్దమునకు 'హలంతంబు' అనుసూత్రముచేఁ బ్రథమైకవచనాంతతుల్యరూప మగుకర్మ యనునది తెలుఁగున ప్రాతిపదికగా నిల్చు ననుకీతిగాఁ బ్రక్రియాక్రమమును గ్రహింపఁదగును. అట్లు డా ప్రాతిపదిక లెట్టివో తెలియవలసియే యుండును. ముదావులు, బుద్ధిగాములు అనుకీతి సూచిని క్రోశములు గమనార్హము. విద్యార్థుల సౌలభ్యమునకై కొందఱు పూర్వపద్ధతిలో నట్లు చెప్పఁబడియుండవచ్చు.

ఇఁక యేలింగములో తెలియనక్కఱలే దనుట విచార్యము. మతుబాదికములు సంస్కృతములైనను నవి యేలింగములో తెలియకతప్పదు. వీనికి యథాయోగ్యముగ డుజాగమ లగు నని సూత్ర స్పష్టము చేసె. మతుబాదిసూత్రమునందును 'ఏలింగ మనువిచారము లేక మకారాంతము లైనద్వితీయైకవచనాంతరూపము లీసూత్రమ్ముక్రిందఁ జేరు' నన్నది. (153 బా.వి.) ఏలింగమో తెలియకున్న క్రమముగాఁ డని డు జై ట్లగును? ముదావులకుఁ బ్రథమైకవచనలోపము లేదనుట యేలో యెట్లు తెలియు ?

సూరి వీనికి యథాయోగ్యముగ డుజాదు లగు ననఁగా బా. వి. మహద్వాచక మయిన అత్వమున కుత్వము, డుజ్ (డుజ్జు) చేయును. (154) ఇత్యాదిగ నన్నది. పుంలింగము గాక కేవలము

మహత్త్వయిన డుజ్జెల్లగును. అది పుంలింగ మగుట గుర్తింపవలెను గదా. బ్రహ్మము అనుచో నాయూయర్థముల బ్రహ్మశబ్దము నపుంసక లింగము. బా.వి. 'గోష్పశక్తి. అమహత్తు కావున బ్రహ్మము అగును.' (158) అన్నది. నపుంసక మగుట మువర్ణక మగును. మువర్ణక మగుటకు నపుంసక మగుటతో పాటు అమహత్తు కూడఁ గావలసిన పని లేదు గదా. దైవము. కావున నిట లింగమునుగూర్చి తెలియ నక్కఱ లే దన్నఁ బ్రమాదముల కవకాశ మున్నది.

ఇంక నితరములు. దీని కుగాగమమును, ములోపము నన్నుల ననుసరించి యవి యేలింగములో తెలియ నక్కఱ లే దని బా.వి. అభిప్రాయపడిన దేమో. కాని యుగాగమము తుదిహల్లునకుఁ గదా చెప్పఁబడినది. చివర హల్లు తీసినాంతాదుల యెడ నేమి? సత్వ కర్మాదులకు స్త్రీత్వవిధానావసరము గుర్తింపవలయు నన్న నపి సంస్కృతమున నేలింగములో తెలియవలదా? దేవకర్మ యనుచో ను జరుగుచుండఁగా కర్మ మనుచో మువర్ణ మైనదే. ఇటఁ గూడ బా.వి. నకారాంతము లమహత్తు లైన మువర్ణకము, మహత్తు లైన నుత్వదుజ్జు లనురీతిగా వివరించినది. (152) కాని యుత్వదుజ్జు లగుటకు శబ్దము మహత్త్వగుటతో పాటు పుంలింగము కూడఁ గావలెను గదా. కర్మాదులకు నపుంసకములకు నమహత్త్వమునుబట్టి కాక నపుంసకత్వమునంజేసి మువర్ణక మగును. ఆత్మ ము న్నగు స్థలములను బా.వి. (160,162) పయిరీతిగాఁ జెప్పుట (152 పుటలోవలె) సరి కాదు.

ఊర్ధ్వరేతుఁడు, మున్నగువానిం జూడ నవి యేలింగములో తెలియ నవసరము స్పష్టము. బా.వి.కూడ నట్టివానిలింగమునుగూర్చి ప్రస్తావించియే యున్నది.

**ము ద ము :**

'ఇవి (ముదాదులు) స్త్రీలింగములు. అందుచే ప్రథమైక వచనలోపము రావలయును. అట్లు చేయుట విహితము కాదు. అంతిమమకారమును లోపింపఁజేసి తరువాత విహిత మగు ప్రథమైక వచనవిభక్తి చేర్పవలయు' (154) బా.వి. అభిప్రాయము స్పష్టము గాదు. లోపము రావలసియుండ నది విహితము గాకుండు టేమి? తత్స 57. సూత్రముచే లోపము విహితమే కదా. మకారమును లోపింపఁజేసినవెంటనే ప్రథమైకవచనమును చేర్పవలయు ననుటయు సక్రమము గాదు. తత్స. 57 సూ.చేఁ ప్రథమైకవచనలోపము రావలసియుండఁగా నయ్యది తత్స. 72 సూ.చే ముదాదులకు నిషిద్ధ మైనది. ఇంకఁ నంతిమమకారము లోపించినపిదప తత్స. 57 చే లోపము ప్రాప్తింపఁగా 72. చే నది నిషిద్ధము కాఁగాఁ బిదపఁ ప్రథమైకవచనము (మువర్ణకము) చేరు ననురీతిగాఁ ప్రక్రియ నడపుట సక్రమము.

**ఋ త్వి గా దు లు :**

'ఋత్విక్ మున్నగునవి విభాషగా ద్వితీయైకవచనాంత తుల్యరూపములు ప్రాతిపదికము లగును. (మున్నగువానికి - అగును అని యర్థము చేసికొనవలయును.) మహదర్థమున ఉత్వదుజు (జ్జు)లు చేరును. అనుమహదర్థము విభాషగా ననుటచే ప్రథమైకవచనాంత తుల్యరూపములు. వానికి ఉగాగమము ద్విత్వము కల్గి అన్యరూపములును ఏర్పడును (155.) అన్నది బా.వి. అనుమహదర్థము అను తరువాతఁ గొంతభాగము నష్టమైయుండును. అనుమహదర్థమున మువర్ణకము చేరు నని యుండనోపు. లేనిచో ఉత్వదుజ్జులైనవి మహద్రూపములును ఉగాగమద్విత్వములైన యమహద్రూపములు నగు

మంతి అనుచో తకారముపై నత్తు గలదు గాన హనుమంత్ + అ = హనుమం అన్ + అ - అని చెప్పుడు గాన అన యని యాదేశ మదంతము గాక అన్ అనియె యాదేశముగా గుర్తింపవచ్చు. హనుమం + అన అనుచో స్వరపరకతలో బిందులోప మొకటి విశేషముగా గుర్తింపవలసియున్నది.

నన్నయ ప్రయోగించినహనుమచ్ఛబ్దము స్త్రీసమముగా గ్రహింపదగు. (తె.వ్యా.వి. 314) (బా.వి. 158) ఇది పుంలింగ తుల్యమై మగాదులలోఁ జేరుటయుఁ గలదు. హనుమనివాలము (సూ.ని.)

## విశ్వకర్మఁడు:

'విశ్వకర్మఁ డనియుఁ గొం దందఱు. కాదుచో స్త్రీత్వాతిదేశము ప్రాయికముగా నగు నన్న బాగుండు నేమో. (159) అన్నది బా.వి. విశ్వకర్మఁ డను దాని కొకేకొక్క ప్రయోగము లభించె. తె.వ్యా.వి. హరివంశాదికావ్యప్రయోగములు పరిగ్రహించుకొని ప్రౌఢవ్యాకర్త విశ్వకర్మఁ డనియుఁ జెప్పినట్లు (311) పేర్కొన్నది కాని ప్రౌఢవ్యాకర్త హరివంశమునుండి గాని యొక్క ప్రయోగమును జూపను. తె.వ్యా.వి. కూడ 'ఇంకను నిట్టిప్రయోగములు చూపి సమర్థించిన బాగుండెడి' దని (311) స్పష్టము చేసియు (ఇట్టిప్రయోగములు దొరుకమింజేసియే ప్రౌఢవ్యాకర్త చూపలేదేమో) 'హరివంశాది' అని యాదిశబ్దమును జెప్పుట కాధారము స్పష్టము చేయలేదు. కాఁగా స్త్రీత్వము ప్రాయికముగాఁ జెప్పఁదగు ననుటకంటె నాప్రయోగము విశిష్టముగా గుర్తించుటయే యుక్తము. గవనులు మీనులన్ ఇత్యాదు లట్టివే కదా.

ఆపిదప నింకను వింతగా "విశ్వకర్మకు స్త్రీలింగాతిదేశము వైకల్పిక (427) మన్నది. విశ్వకర్మం డను నొకేనొక్క ప్రయోగమును బట్టి ప్రాయిక మనుటయే సంగతము కాకుండఁగా వైకల్పిక మనుట యేమి (ఇంకను క్వాచిత్క మని పిదప ననలు లేదని చెప్పలేదు.) కవిప్రయోగము చూపకయే భవిష్యత్తును బా.వి. యంగీకరించె. (168)

## ఆత్మ – ఆత్మము :

ఆత్మన ఇనుఛన్నాం డా వా అను సూత్రముచేఁ జింతామణి ఆత్మన్నిజంతములకు డా ప్రత్యయమును వికల్పముగా విధించినది. ఇట తె.వ్యా వి డా ప్రత్యయము రానిపక్షమున నంత్యహల్లు లోపింపఁగా మహద్విపక్షచే మహీముఁడు మున్నగురీతిగను మహా ద్విపక్షచే ఆత్మము, మహిమము ననురీతిని రూపములు సిద్ధించును. (-98) అన్నది. పక్షే అంత్యహల్లోప-మున్నగునవి. వివరణమునే కొంతవఱకిది యనుసరించియున్న దనవచ్చును. అంత్యహల్లోపప్రసంగమునుబట్టి ఆత్మన్, మహిమన్ అనునట్టిశబ్దములే ప్రాతిపదికలుగా స్వీకరించుట స్పష్టము. కాని నాంతములు దాదాపుగా నన్నియును సగుణవర్ణముసంధి వగుటచే 'ప్రథమైకవచనతుల్యం సర్వత్ర హల స్త మగుణవత్ప్రభృతి' యనుసూత్రము ననుసరించి ప్రథమైకవచనాంతతుల్యము లగు ఆత్మా గరిమా యనునవే ప్రాతిపదికలుగా స్వీకరింపవలసియున్నది. (బా.వి. 151,160) కావున నంత్యహల్లోప ప్రసంగము లేదు. 'డా' అని డిత్తుగాఁ జెప్పుటవలన టిలోపము ప్రయోజన మని, ఆత్మన్ అనుకీతినాంతమునే యిటఁ బ్రాతిపదికముగా గ్రహింపవలె ననరాదు. 'డా బవిధ్యాత్తే రః' అనుచోఁ జెప్పినదాఫ్వాను, డిత్తుగనె చెప్పఁబడినది. అయ్యు 'ఉః' అని బుకా

రముస్థానమునఁ జెప్పఁబడినదే. డిత్త్వమువలన నక్కడ నేట్టిప్రయోజనము సమన్వయింపఁబడును ?

అంతకుముందు డాప్రత్యయము వచ్చును. ఇది ఇత్సంజ్ఞ (?) గావున ఆ యను స్త్రీలింగప్రత్యయము చేరఁగా ఆత్మా మహిమా గరిమా వంటిరూపములు సిద్ధించు (ఎ97) నన్నది తె.వ్యా.వి. ఇది స్త్రీప్రత్యయమువంటి దనుటయుఁ బరిశీలనార్హమె. డాబవిధ్యాత్రాందేరుః అనుచో డాప్పని చెప్పియున్నట నది స్త్రీప్రత్యయమువంటి దను భావమును జిం. వ్యక్తము చేయలేదు. (డాకంటె డాప్పైన నాయన కాశ మెక్కువ యగుట స్పష్టము) 'తా వృభౌ రమేశసమౌ' యని డాబంతములు రమాశబ్దతుల్యము లన్నది. అనఁగాఁ బ్రథమైకవచన లోపాదిక మగు నన్నమాట. (ముందు దీర్ఘమునకు హ్రస్వము) డాప్ప స్త్రీప్రత్యయమునంటి దన్న రమాసమత్వము లేకయే యాయయి కార్యములు సిద్ధించును గాన రమాసమత్వవిధానము వ్యర్థమే. అట్లే యుటఁ గూడ 'డా' యన్నది స్త్రీప్రత్యయ మనుట కాధారము చాల కున్నది.

ఆత్మా యన్నది దీర్ఘమునకు హ్రస్వ మయి ఆత్మము ఆత్మఁ డనురీతి నవుచుండఁగా డాప్రత్యయము వచ్చినను నదైన డావిధానముప్రయోజన మేమి? కావున డావిధానసామర్థ్యమువల ననే యాశబ్ద మదంతముగానే నిల్చు ననియు నుత్వడుజాదులు రావనియుఁ జెప్పుట యుచిత మని తోఁచుచున్నది. ఇంకను 'తా వృభౌ' యనుచో డాబంతములు డిత్తులైనవాని కన్నింటికి (డా-డు) నుపలక్షకము లన నవకాశము గలదేమో పరిశీలింపఁదగు.

తె.వ్యా.వి. ప్రస్తావించినమహిమఁ డనురీతిరూపములు వెదుకఁదగియున్నవి.

**రాజు :**

'మహాత్త్వంబున సార్థకంబగు రాజశబ్దము రాజునాఁబడు' యనుచో నిపతింపఁబడిన 'రాజు' శబ్దము "ప్రాతిపదికము గాక ప్రథమైక వచనరూప" (161) మని బా.వి. అభిప్రాయము సమంజసమే. కాని పిదప 'ద్వితీయాదివిభక్తులు ప్రక్రియవలననే కుదురును. దీర్ఘము హ్రస్వమగుట (54) రాజ, ఉత్వముత్వ మగుట (21) ఆపైని ద్వితీయాదివిభక్తులు చేరును. రాజును రాజుచేత రాజుకొఱకు మున్నగునవి' (161) యనుట సమంజసముగా లేదు.

'వేధః పురోధః పురోధసుఁడు' అనుచోఁ జూపఁబడినవి ప్రథమైకవచనాంతరూపములే. పురోధసుఁ డనుదాని ననుసరించి వేధః పురోధలును ప్రథమైకవచనాంతములే యనుట స్పష్టము. ఇట సూత్రమునఁ ప్రథమైకవచనాంతరూపములే చూపఁబడినవి గావున నితరవిభక్తివచనముల సందర్భమున సాధారణప్రక్రియ నడచు నన్న - వేధుఁడు వేధుచేత, పురోధుకొఱకు ఇత్యాదిగా రూపములు గావలెను గదా. అట్టి విస్పష్టమా? అదే సిద్ధముగాఁ ప్రస్తుతస్థలమునను సూత్రమునఁ ప్రథమైకవచనాంతరూపమును నిర్దేశించెను. ఇతరవిభక్తివచనసందర్భమున సాధారణప్రక్రియ నడచు ననుట కుదరదు.

సూత్రమునందుఁ ప్రథమైకవచనాంతరూపము నిర్దేశింపఁగా నం దేయే ధర్మములు నిపతింపఁబడినవో యవి యితరవిభక్తికముల సమన్వయింపవలసి యున్నవి. వేధసు నలోపస్త్రీవద్భావములు నిపతింపఁబడినట్లు సూరి స్పష్టము చేసెను. ఇతరవిభక్తివచనములందు నట్లే కదా. కావున వేధుని ఇత్యాదులు గాక వేధను ఇత్యాదిగ నవుచున్నవి. అట్లే యిట 'రాజు' అను నిర్దేశమునుబట్టి రాజశబ్దమున నుత్వస్త్రీవద్భావములు నిపతింపఁబడినట్లు గుర్తింపవలెను. రాజా (మునిరాజ) యను ప్రాతిపదిక కుత్వము (ఈనిపాతముచే) రాఁగా

రాజు అని కాఁగా స్త్రీవద్భావనిపాతనమువలనఁ బ్రథమైకవచనము లోపించును. రాజు అన్న నుదంతమైనది గావున 'స్త్రీలింగంబుల- అను సూత్రముచేఁ బ్రాప్తమగు సులోపమును బాధించి 'ఉకారాంత గోశబ్దంబుల కంతట' ననుటచే పువర్ణకమగు నని భావింపరాదు. అట్టి యెడల నిట స్త్రీవద్భావము చెప్పుట వ్యర్థ మగును గదా. ఆచ్ఛిక శబ్దంబు లెల్లం దఱుచుగ స్త్రీసమము లని చెప్పఁబడినది. ఊరు పేరు ఇత్యాదు లుదంతములే యైనను స్త్రీసమత్వాదిదేశసామర్థ్యమువలనఁ బ్రథమైకవచనలోపమే కాని పువర్ణకమెట్లు లేదో యిటుఁ గూడ నట్లే రాజుపై పువర్ణకము రాదని గ్రహింపఁదగును.

కాఁగా రాజును రాజుచేత ఇత్యాదులందలియుత్వము నిపతించుటవలన నైనదే కాని పుంలింగంబై యనుసూత్రముచే నైనది కాదు. బా.వి. చూపినప్రక్రియయే సూరియు నుద్దేశించిన విధాన మిట్లుండెడిది గాదు. రాజులు ఇత్యాదులయం దగునుత్వము ప్రథమైకవచనమునమాత్ర మేల గాదు? దానిని గూడ నిపతింప నవసర మేమి? నిపతింపవలసిన దింకఁ బ్రథమైకవచనలోప మొక్కటి. మహత్త్వంబున స్వార్థపరం బగురాజశబ్దము ప్రథమైకవచనంబు (డుజ్జు)నకు లోపం బగు నని స్పష్టముగా నవసరమైనయంశమునే చెప్పవచ్చును గదా. అట్లనకున్నను సూత్రమునఁ బ్రథమైకవచనాంతముగాఁ జూపిన రాజు అనుదానిలో నుత్వము 21. సూత్రముచే నైనదే యనియుఁ బ్రథమైకవచనలోపమే నిపతింపఁబడిన దనియుఁ జెప్పఁగలమా?

నిపతింపవలసినయవసర మేమో తెల్పుచు బా.వి. "ఇది మహత్తు గావున (పుంలింగమును) అత్వ ముత్వ మగును. డుజ్ చేయును. రాజుఁడు అగును. ఈడుజ్‌ను లోపింపఁజేయుమార్గము లేకయే

యీనిపాతము (161) అన్నది. డుజ్జు లోపింపఁజేయు మార్గము లేకున్న నది కల్పింపవచ్చును. 'డుజ్జునకు లోపం బగు' ననవచ్చును. వృద్ధాదులఁ డుజ్జునకు విభాషగా లోపము చెప్పలేదా? వృద్ధు ఇత్యాదిగా (వికల్పముగ) నిపతించెనా? ఇట లోపము నిత్యముగాఁ జెప్పవచ్చు. (ఇంకను వృద్ధాదిసూత్రమునందునే విభాషకు వ్యవస్థ చేసి రాజునకు డుజ్లోపనిత్యతను సాధింపవచ్చు.) ఇట నిపతింప నేల?

డుజ్లోపమునకై మార్గము లేక నిపతించె ననరాదు. అట్లని డుజ్లోపమును జెప్పరాదు. డుజ్లోప మున్న డుజ్జు చేరుట ముందు జరుగుఁ గదా. ఇది దుమంతము. కావున ద్వితీయాదివిభక్తుల రాజుని రాజునిచేత ఇత్యాదిగను రూపముల కవకాశము గల్గును. వారి ఇత్యాదులకువలెఁ బ్రథమైకవచనలోప మున్నఁ బైయిబ్బంది యుండదు. వారిచేత ననునట్లుగా రాజుచేత నిత్యాదిగ నగును. అయినఁ బ్రథమైకవచనలోపము చెప్పక యుత్వమును గూడ నిపతింప నేల?

సూరి రాజుశబ్దం బొక్కటి దంత్యయుక్తంబు గానంబడియెడి నను చో నిందలి జకారము దంత్య మగుట ప్రస్తావించెను. దానిం బట్టి చూడ నిట దంత్యతను గూడ నిపతించుట యుద్దేశించె ననిపించు. అట్టి దంత్యత, రాజులు, రాజుచేత నిత్యాదులందును సిద్ధింపవలసి యున్నది. కావున నెల్లవిభక్తివచనముల సిద్ధించుటకు నిపతించుట యవసరము. లేకున్న నట్లొకతీరము చేయవలయు. కావున నుత్వముతోఁ గలిపి, యుత్వము, జకారమునకు దంత్యత, స్త్రీత్వము నిట్లు నిపతించె ననవచ్చు. దీనిచేత నిపతింపఁబడినస్థలమునని 'రాజులో దంత్యత. సాధారణప్రక్రియ ననుసరించిన వాతరాజుఁ డిత్యాదుల దంత్యత (బా.వి. 161) లేదు.

ఏమైనను బ్రథమైకవచనరూప మొక్కటి సూత్రమున నిర్దేశించె నని యది యొక్కటి నిపతింపఁబడినరూప మనియు నితర

విభక్తివచనస్థలముల సాధారణప్రక్రియయే నడచు ననియుఁ జెప్పుట సంగతము గాదు.

వృక్ష మమహత్తైనను మహత్తుగా వివక్షించినపుడు వృక్షరాజు అని యగుటకు లక్షణము విరోధింపదు. (బా.వి. 161, ఖగరాజు అనుచో ఖగ మమహత్తే కదా. మహద్వాచక లేక యారూపమెట్లగును? సూరి దాని నెట్లుదాహరించెను? ప్రాణివాచకములే గాని యచేతనములు మహద్వాచక కర్మములు గా వనరాను (బా.వి. 161) అట్లయైన సముద్రుఁడు మేఘుఁడిత్యాదులు బాల.చేసనాధువు లనవలసివచ్చు.

స ర ము :

పయఃప్రభృతులలో సలోపము లే దని సూరి యందు 'సరస్సు'చూపెను. అది తెలుఁగింపవలె ననియు సరము అనురూపము కూడ నుపయుక్త మనియు (163) బా.వి. నిరోప్నన్నది. అట్టి ప్రయోగములు వ్యా.సం.స. (668) నుండి తెలియనచ్చును. 'అర్వాచీనప్రయోగములలోఁ జూపట్టు (వ్యా సం.స.669)'టవలన నప్రాచీన మని సూరి (సం గనుకాసె నెలఁతిచ్చెను) ప్రమాణీకరింపలేదేమో.

భు వి - ది వి - హృ ది :

భూదివోస్తు జా యత్తే స్వని చింతామణి చెప్ప సూరి వీనిని నిపతించెను. తె.వ్యా.వి. ఇట 'సంస్కృతమునందలి సప్తమ్యేకవచన రూపములు ప్రాతిపదికలుగా తెనుఁగున గ్రహింపఁబడినట్లు చెప్పుట శాస్త్రోచితము గా దని సూరియభిమత (311) మన్నది. సప్తమ్యేక వచనాంతములె (పదము) ప్రాతిపదిక లనుట శాస్త్రోచితము గా దనుట యేభాషయం దైనను సర్వసమ్మతము. అయినను ప్రథమైకవచనాంత

తుల్యములు ద్వితీయైకవచనాంతతుల్యము లన్నట్లుగనే సప్తమ్యేకవచ నాంతతుల్యం బన్న నది శాస్త్రోచితమె యగు నని సూరివిధానము ననుబట్టియు గ్రహింపవచ్చును. కాని యట్టి రెండుమూఁడింటికై యట్టి విధానము చేయుటకన్న వానిని నిపతించుటలోనే లాఘవము గల దనవచ్చును. ఘటుశాదికము లును తదితరస్థలములు (ప్ర ప.తుల్య రూపస్థలములు) ననేకము లగుటచేతఁ దత్తద్విభక్తితుల్యములు నామము లగు ననుట యొప్పును.

## స్త్రీలింగములు - స్త్రీప్రత్యయాంతములు :

'స్త్రీలింగంబు లెల్ల స్వస్వనియతంబు లగు స్త్రీప్రత్యయంబులం గూడి యుండఁ బ్రవర్తిల్లు' ననులక్షణముఁ గూర్చి బా.వి. 'స్త్రీప్రత్యయాంతము లెల్ల స్త్రీలింగములే కాన సూత్రమున ఆపద మనవసర మేమో (167) యని యనుమానించబడి. స్త్రీలింగంబు లనునది యిటఁ గర్త. అదే లేకున్న నాలక్షణ మన్వయించు టెట్లు? బా.వి. చేర్కొన్నట్లు స్త్రీలింగంబులు (ఎల్లన్) అనుపదమును దొలఁగించి (ఎల్ల) స్వస్వనియతంబు లగు స్త్రీప్రత్యయంబులం గూడి యుండఁ బ్రవర్తిల్లు' అనుచో స్త్రీప్రత్యయంబులం గూడి వర్తిల్లున వేవి? 'స్వస్వనియతంబు లగు' అనుదాని కన్వయ మెట్లు? అదియుఁ దొలఁగింపవలెనా? అట్టియెడల సూత్రమె మార్చి 'స్త్రీప్రత్యయాంతంబు లెల్ల నిందుఁ బ్రవర్తిల్లు' ననవలెను మహామహాత్ములు పుంనపుంసకము లైన (హలంత) శబ్దములు తత్సమము లగుటను నిరూపించుచు స్త్రీలింగశబ్దములం గూర్చి చెప్పవలయునప్పుడు ఈలక్షణమునఁ బ్రకరణానుగుణముగ స్త్రీలింగంబులు (ఎల్లన్) ననుకర్తృవాచకము సముచితముగ నున్నది.

**కపిలవశిష్ఠము :**

"ఇట సంస్కృతభాషానుసారము విశేష్యము స్త్రీలింగము నందుండుటచే విశేషణము కూడ అదేలింగము నందుండును. ఆంధ్రభాషానుసారము విశేష్య మమహత్తగుటచే విశేషణము అమహద్వాచకము గానే యుండును" అన్నది. (168) శా.వి. ఈవ్రాఁత సంగతము గాదు. ఆంధ్రభాషలో సంస్కృతభాషానుసారముగా నుండు టేమి! సంస్కృతానుసారముగా నొకప్పుడు స్త్రీలింగము నుండ నాంధ్రభాషానుసార మొకప్పు డమహత్త్వమును నుండు టేమి? స్త్రీలింగ మం దున్నప్పు డది యమహత్తు కాదా? కపిల వశిష్ఠ యనుచో వశిష్ఠ యన్నది యమహత్తు కాదా? ఆంధ్రభాషానుసార మమహత్తు కాఁగా నది స్త్రీలింగశబ్దము కాదా! ఆంధ్రమున నింకే దేని లింగ మతిదేశించినఁ దప్పఁ దెలుఁగున మహత్తైనను నమహత్తైనను సంస్కృతానుసారముగ నుండు లింగ మిట్లు యుండుటకె తప్పదు గదా.

ఇట శా.వి. పేర్కొన్న క్రమమును బట్టి యితరస్థలముల నపరూపము లిట్లేర్పడును. వృక్షశబ్దము సంస్కృతానుసారముగాఁ బుంలింగము నందుండఁగా ఉన్నతుఁ డగువృక్షుఁ డనియు నాంధ్రభాషానుసార మమహత్త్వమున నుండఁగా ఉన్నత మగువృక్ష మనియు ద్వైరూప్య ముండవలదా? అయిన నుత్వదుష్టులు రావలె నన్నఁ బుంలింగ మగుటతో పాటు మహత్తు కూడఁ గావలెను గావునను నిది పుంలింగ మైనను నమహత్తు గావునను ఉన్నతుఁ డగువృక్షు మని యుండ దనవలె. అనఁగా నది సంస్కృతానుసారముగఁ బుంలింగమె యైనను నాంధ్రానుసారముగ నాపక్షమునను నమహత్తగుట గుర్తింప వలెను కదా. అట్లే యిటుఁ గూడ సంస్కృతానుసారము స్త్రీలింగ మైనను నాంధ్రానుసార మమహత్తు గాన స్త్రీలింగపక్షమునను నమహత్కార్యము జరుగక స్త్రీలింగకార్య మేల యైనది?

ఇం తేల? మహతీవాచకము లైన స్త్రీలింగశబ్దములు విశేషణములను స్త్రీలింగములే (167.) యేల యగును? స్త్రీవాచక మమహత్తే కదా. తిర్యగ్జడములకువలె. సంస్కృతానుసారముగా వనిత మనోహారిణి యని స్త్రీలింగమునం దుంటతో పాటు వనిత మనోహారి యని యాంధ్రభాషానుసార మమహత్త్వమున నేల యుండదు.

కపిల యనువిశేష్యపక్షమునఁ జూచినను నందు స్త్రీలింగత్వము నమహత్త్వము నన్నియు యున్నవి. (అదంత) అమహత్త్వముచే మువర్ణకము ప్రాప్తమవుచుండఁగా స్త్రీలింగత ననుసరించి స్త్రీలింగంబుల— అనుసూత్రముచేఁ బ్రథమైకవచనలోపమై యగుచున్నది. ఆస్లే విశేషణము నెడలను. స్త్రీలింగతుల్యామహత్త్వముఁ నుబట్టి మువర్ణక ప్రథమైకవచనలోపకార్యములోఁ బ్రథమైకవచనలోపకార్యమే యగును గాని యమహత్త్వమునుబట్టి మువర్ణకాగ్యము కాదు. విశేషణము నెడల బా.వి వివరించిన తీరునుబట్టి చూచిన నది విశేష్యము నెడల నేల వర్తిల్లదు? కపిల యనువిశేష్యమునకును సంస్కృతానుసారముగా స్త్రీలింగముతో కపిల యనురూపముతో పాటు ఆంధ్రానుసారముగ నమహత్త్వముతో కపిలము అని కావలదా? ఇట్లేర్పడు నపరూపము లసంఖ్యాకములు. మువర్ణక మగునది (క్లీబములకును) నమహత్తులకె గదా. స్త్రీలింగములు తెలుఁగున నమహత్తులే యగుచుండె. సంస్కృతాంధ్రభాషానుసారముగా నీద్వైరూప్యము విశేషణములందె కాని విశేష్యములందు వర్తిల్ల దనుటకుఁ బ్రమాణ మేది? బా.వి. సాధారణీకరించి చెప్పినది గదా.

అసలు సంస్కృతానుసారముగ స్త్రీలింగమునను నాంధ్రానుసారముగ సమహత్త్వమున నుండి ద్వైరూప్యము సాధారణముగా సిద్ధ మగుచుండఁగా నీమహతీతరంబు లగు - నిత్యాదిసూత్ర మేల? సూరి వ్యర్థముగాఁ జెప్పెనా?

సూత్రము చెప్పఁ దలఁచుచో ని ట్లేల చెప్పవలె? ఆంధ్ర భాషలో శబ్దము లాంధ్రానుసారముగా నుంట సహజము గాని సంస్కృతానుసారముగా నుండు టెట్లు? రాముఁడు + అతఁడు అనుచో సంస్కృతానుసారముగా సంధి యగుచున్నదా? కాఁగా నాంధ్రానుసారముగా నిట విశేషణ సమహత్త్వమునం దుండఁగా కపిల వరిష్ఠ మనుకీతి మువర్ణకాంతరూపములు సిద్ధము లగును. అట్టి యెడల కపిల వరిష్ఠ యనుకీతి (సంస్కృతానుసారముగ నేర్పడు స్త్రీలింగరూపములే యాంధ్రభాషయందు విశిష్టములు గాన నట్టివి సాధింపవలె. కాన సూరి యమహద్రూపసిద్ధికై క్లీబత్వము సూత్రించుట యసంగతము గాదా?

ఈవివరణము లక్షణమునకుఁ జెందినది గాన నీలక్షణముచే సిద్ధించునర్థమే కాని యీయది సహజసిద్ధము కా దనుకొందమా? ఈవివరణము లక్షణానుగుణ మగు టెట్లు? వరిష్ఠ మనురీతిరూపము లమహత్త్వముచే సిద్ధ మైన వనుట లక్షణవిరుద్ధము. లక్షణము క్లీబత్వము నను జెప్పుచున్నది గానఁ గ్లీబత్వముచే సిద్ధ మవునవి. స్త్రీలింగ పక్షమునను నీయవి యమహత్తులే యగుటచేత మువర్ణకరూపమె యమహద్రూప మనరాదు. (కపిల) వరిష్ఠ వరిష్ఠ మన్నవి రెండు నమహత్తులే. ఒకటి స్త్రీలింగమునం దుండ నొకటి క్లీబత్వముచేత సిద్ధ

మైనది. క్లీబత్వాతిదేశమువలన నందు సంస్కృతానుసారముగ నున్న స్త్రీలింగత్వము బాధిత మై క్లీబకార్య మగుచున్నది.

కపిల వరిష్ఠ యనుకీటివిశేషణ స్త్రీలింగరూపము సైతము సంస్కృతానుసారముగా సిద్ధించుచున్న దనుట సరి కాదు. 'విశేష్యంబు ననుంబోలె విశేషణంబులకు లింగవిభక్తివచనంబు లగు' ననునాంధ్రలక్షణముచే విశేష్యలింగము విశేషణమునకు వచ్చుట యాంధ్రలక్షణ సిద్ధముగా గుర్తింపవలయును.

—*—

# ఆచ్ఛికపరిచ్ఛేదము

ఈపరిచ్ఛేదమునందు మూఁడుప్రకరణములు గలవు. 1. ఆచ్ఛికప్రకరణము. 2. సర్వనామప్రకరణము. 3 ఔపవిభక్తికప్రకరణము. (బా.వి. 170) ఇట్లు విభాగించుటవలన సర్వనామాదు లాచ్ఛికములుగా వని యర్థ మగుచున్నది. ఆచ్ఛికప్రకరణము ప్రధాన మైనది. అదే ఆచ్ఛికపరిచ్ఛేదము. సర్వనామౌపవిభక్తికప్రకరణము లాచ్ఛికప్రకరణమున నవాంతరభేదములే కాని తద్భిన్నములు గావు. కనుకనే సూరి యాచ్ఛికప్రకరణ మని వేఱుగా విభాగింపలేదు. స్వతంత్రముగా బా.వి. చూపినయీభేద మనుచిత మనక తప్పదు.

**పంకజము:**

ఇది 'యాంధ్రవర్ణఘటిత మైనసంస్కృతసమ' (170) మని బా.వి. పేర్కొన్నది. కాని యిందు జకార మత్తుతోఁ గూడియున్నది. ఇది యచ్చతెనుఁగైన దంత్యముగా నుచ్చరింపఁబడవలయును. అఆ ఉఊఒఓఔలం గూడినచజలు తాలవ్యము లగుట యచ్చతెనుఁగునఁ గుదురదు గదా. పంకజ మనుచో జవర్ణ మత్వఘటిత మయ్యుఁ దాలవ్యముగా నుచ్చరింపఁబడుట నాతాలవ్యజకార మనాంధ్రవర్ణ మనియే నిశ్చయింపఁదగియున్నది. (కుండ. చూ.త్రి.శే))

**పుంలింగతుల్యములు:**

“వికృతౌ సర్వే శబ్దాః క్లీబసమాః స్త్రీసమాశ్చ నాన్యే స్యుః’ అనుచోట నాన్యే స్యుః అనఁగాఁ దెలుఁగునఁ బుంలింగతుల్యములు లేవనియే యర్థము. కొండొకచోఁ బుంలింగతుల్యములు గల వని

టను వివరించుచో 'కా + ఆ - కా (సవర్ణదీర్ఘసంధి) 'ఆ'నుకూడ మాగాదుఁలో సూరి చేర్చి గొప్పపొదుపు సాధించె' (174) నన్నది. ఇటుఁ బొదుపు సవర్ణదీర్ఘసంధి చేసి కాప్రత్యయమాదు లనుటలో. అనఁగా నిట స్పష్టతకంటెఁ బొదుపునకుఁ బ్రాధాన్య మీయఁబడిన దన్నమాట. ఆ ప్రత్యయ మిట సూరి కాప్రత్యయమాదు లనుచోటియాదిశబ్దముచే నుద్దేశించె ననుట లెస్స. అది తత్సందర్భమున స్పష్ట మగు.

కాప్రత్యయముమీఁదిబహువచనలకారమునకు లఘ్వలఘురేఫలును లఘురేఫమునకు ముందు బిందుపూర్వకడకారము నగు నని సూరి చెప్పుటను మార్చి బా.వి. అలఘురేఫమును మాత్రమె విధించి వికల్పముగా ముందు బిందుపూర్వకడకారము విధింపనగు ననియు సంయుక్తమైనపు డలఘురేఫము లఘువే యగు ననియు తలఁచినది. (176) అనఁగా నిచ్చట స్పష్టతకంటెఁ బొదుపునకుఁ బ్రాధాన్య మీయఁబడిన దన్నమాట. విలుకాండ్రు విలుకాఁడు అనురీతిగా బిందుపూర్వకడకార మున్నపుడు లఘురేఫముమాత్రమే యుండుటయు బిందుపూర్వకడకారము లేనపు డలఘురేఫము మాత్రమే యుండుట స్పష్టమై యుండఁగా దాని నట్లే స్పష్టముగా విధించుట యుచితము గదా. ఇంకను బా.వి. చేసినసూచనము ననుసరించినఁ బ్రక్రియలో లాఘవ మున్న దని నిర్ణయింపలేము. ఇంక లక్షణమున నైనను లాఘవము గల్గునా? కాప్రత్యయముమీఁది — అలఘురేఫంబును ముందు బిందుపూర్వకడకారంబు వికల్పముగను నగు నని చెప్పవలె. సూరి చెప్పినలక్షణముకంటె నిందు లాఘవ మున్న దనలేము. లక్షణనిర్మాణమునఁ గాని ప్రక్రియలోఁ గాని లాఘవము లేకుండఁగా స్పష్ట మగుమార్గము నేల విడువవలయును. ఇంకను అలఘురేఫకు ముందు బిందుపూర్వకడకారము విధించినచో నట్లు విధించుటనుబట్టి (యెల్లయెడల సంయుక్తస్థలములలో నలఘువు లఘు

పైనను) ఇచ్చటమాత్ర మేఘు నక్షే యుండు నని చెప్పుట కవకాశము గలదు. అస్పష్టత గాని తెచ్చుకొన నేల? ఒకవేళ గౌరవమె యున్న దన్నను సంస్కృత సూత్రలక్షణము కాదు గదా.

## జేత్రప్రభృతులు :

జేత్రప్రభృతుల బహువచనమునకు ముందు ను ఙ్ఞాలు నను టలోఁ ప్రభృతిశబ్దము నిరర్థక మని వ్యాఖ్యలవారు భావించిరి. (బా. ఉ.) బా.వి. ప్రేండ్లు మొక్కలీండ్లు మున్నగున విత్రి వని (177) ప్రభృతిశబ్దమును సార్థకము చేసినది. కాని సూ.వి. ప్రేను - ప్రే లనియు మొక్కలీం డనుచో మొక్కలీం డ్రనియు బహువచనరూపములను జూపినది. బా.వి. చూపినరూపముల కెటనే నాధారము గల దేమో యింతకు నస్పష్టము.

## కూఁతురు :

కూఁతుశబ్దము ప్రథమైకవచనంబునకు నవర్ణకం బగు నని సూరి చెప్పుటను గూర్చి బా.వి. ప్రథమైకవచనమునందు రువర్ణము వికల్పముగాఁ జేరు నని పెద్దసవరణము. సూరి ప్రథమైకవచనమందే రువర్ణము చేరు నని తక్కినచోట్ల లోపించు నని పేర్కొనె (118) నన్నది. సూరి ప్రథమైకవచనమునందుఁ జేరు ననుచుండఁగాఁ దక్కినచోట్ల లోపించు నని యర్థ మగుట యెట్లు? తక్కినచోట్ల రువర్ణమునకుఁ బ్రాప్తియే లేదు గదా. లోపింపవలయు నన్నది ప్రాతిపదికావయవము గావలెను. కూఁతురు ప్రాతిపదికమైనఁ గూఁతుశబ్ద మను టెట్లు? ప్రథమైకవచనముగా రువర్ణకవిధాన మేల? కూఁతురురు - అని యుండునా?

బ. వ. లువర్ణకము పర మగుచుండఁగాఁ బ్రథమైకవచనముగా వచ్చిన 'రు' లోపింపవలయును. ద్వితీయాదివిభక్తులు ప్రాతి

పదికే చేరవలయును. (244) అన్నది తె.వ్యా.వి. ఇది చారిత్రిక దృష్టి యేమో. లాక్షణికులమార్గ మిది కాదు. ద్వితీయాదివిభక్తు లెట్లో యట్లు ప్రథమావిభక్తియుఁ (బహువచనమును) ప్రాఁపదికే చేరవలె. కాఁగాఁ గూతును అను ప్రథమైకవచనాంత(పదము)పై బ.వ. లువర్ణకము చేరుటయు నప్పుడు ప్రథమైకవచనవర్ణకము లోపించు టయు నశాస్త్రీయము మనకే తప్పదు.

## నీర్లు - నీళ్లు :

బహువచనశిష్టంబు లయి యద్విరుక్తంబులయిన డకారల కారంబుల కెల్ల ఘులకారంబు నిత్యంబుగ నగు' ననుచో సూరి రేఫమును ప్రస్తావింపకుంటచే బా.వి. 'నీర్లు - నీళ్ళు' వంటి వింక నిరూపితము కావు. (182) అన్నది. నీర్లు అను రూపము నీళ్లు అని యగుట కవకాశము లే దని యభిప్రాయము గావచ్చు. ఉల్లోపము చెప్పిన ఆచ్ఛి. 12. సూత్రమునొద్దఁ జూపిన గోర్లు నీర్లు అను వానింబట్టి నీర్లు అను నది యిందు నిరూపితమె కదా. నీర్లు - అన్నది నీళ్లగుట నిరూపితము కా దందమా? కాని నీరు + లు అనుచో ఆచ్ఛి. 13. చే ళాదేశము రాఁగా నీళులు - (బహుళము గాన రాకున్న నీరులు) ఉల్లోపమైన నీళ్లు (నీర్లు) అనుకిటి నవును. (మా. శా. సూ.)

## కోడండ్రురు :

'సూరి కోడవలినిబట్టినను అంధుడగు ధృతరాష్ట్రుఁడు సుందరి నా కోడండ్రురయందు - అనెను. తిక్కన ఎవ్వరియాండ్రు రింక - అనెను. ఇట్టివి భ్రాంతిమూలకములు. (185) అనుచో బా.వి. చమత్కార మాదరింపవచ్చును గాని యవి సూరిలక్షణమునకు విరుద్ధము లనునభి ప్రాయ మసంగతము. కోడవండ్రులు (కోడవండ్లను అని సూరియొ

చూపుటనుబట్టి సంశ్లిష్టబహువచనాంతతుల్య మగునామముపై బహువచనవిభక్తు లెల్లఁ జేరుట స్పష్టము) కోదండ్రురయందు ఆంధ్రురు అనుచో కోదండ్రుడు ఆంధ్రుడు అనునవి గ్రహించుట భ్రాంతియా లేక పైని బహువచనలకారమునకు రేఫ మగుట భ్రాంతియా? కోడలు ఆలు అనునవి బహువచనాంతతుల్యరూపములు ప్రాతిపదిక లయినపుడు కోదండ్రుడు ఆంధ్రుడు అనియు కాకతప్పదు. ఆంధ్రుడు అన్నది బహువచనరూపము కాఁగా నట్టిరూపము ప్రాతిపదిక లందు ననఁగా బహువచనమున లేని (కోడవండ్లువంటి) ఆండ్లు అనురీతిరూపము గానేరదు గదా. కాఁగా నీక భ్రాంతి సంశ్లిష్టబహువచనాంతముపై నున్న బహువచనలకారము రేఫ మగుటయందా? అట్లనరాదు.

ఆల్వాదులబహువచనలకారంబునకు రేఫంబును మున్నగు సూత్రముచేతనే యగును. ఆల్వాదులలో ఆంధ్రుడు అనురీతిని గ్రహించుటె ట్లనరాదు ఆంధ్రుడు అన్నది ఆలు అను ప్రాతిపదికవికారము. ఆలు అనునామము ఆంధ్రుడు అని యై ప్రాతిపదికమై యున్నది. కావున నాల్వాదిసూత్రము వర్తిల్లును. రాము యన్నది డుమంతము. రాము, రామువి (చేత) అన్నవియు డుమంతములే కదా. ఆంధ్రు + లు ఆంధ్రురు అనియె యగును. మాందులువర్ణము లేకుండుటచే నట బిందుపూర్వక డకారము ప్రసక్తి లేదు ఉదాహరణమునకుఁ జింతామణిలో డాప్వరానప్పటివిధాత్రానులు 'తా ప్రభో రమేశ నమో' యని యీశబ్దతుల్యము లవుఁ గదా. ఈశుఁ డనుచో నవలె విధాత్రుఁ డని డు జప్పుచున్నది. ఈశుఁ డనుచో నత్వమున కుత్వము గలదు గదా. విధాత్రుఁ డనుచో నామమున కుత్వ మైనదా? అత్వము లేదు గాన నీశశబ్దతుల్య మైనను నుత్వప్రసక్తి లేదు.

అట్లే యిటుఁ గూడ ఆంధ్రు అనుసంశ్లిష్టబహువచనాంతతుల్యరూప మందిన ఆలుఅను ప్రాతిపదికపై బహువచనలకారము రేఫ మైనను ముందులువర్ణము లేమి బిందుపూర్వకడకారముప్రసక్తి లేదు. కోడండ్రురయుండు ఇత్యాదులు సూనుసూత్రసిద్ధములే. వేడుకాండ్రురను చెలియాండ్రురయుంను ఇత్యాదిగఁ బ్రయోగించుకొనవచ్చును.

**చేలు - పేలు :**

బహువచనంబు పరం బగునపుడు చేను పేను మీను శబ్దంబుల నువర్ణంబు లోపించు ననులక్షణ ముండఁగా బా.వి. 'చే, పే, మీ' అనువానిని ప్రాతిపదికలుగా గ్రహించి ను ప్రథమావిభక్త్యర్థమునందు వచ్చు నని యు తలంపవచ్చును. అట్టిదానికి బహువచనమందు లోపము కల్గు (187) నన్నది. ప్రథమావిభక్త్యర్థమునం దనఁగాఁ బ్రథమైకవచనముగా వచ్చు నన్నమాట. ప్రథమైకవచనముగా వచ్చు నన్నఁ దదితరవిభక్తిస్థలమున నెట్లగును? చే ప్రాతిపదిక. లువర్ణము బహువచనము చేలు. మఱి బహువచనమందు లోపము గల్గు టెట్లు? అన లిది వచ్చునఁ గదా లోపము వచ్చుటకు. కూఁతుశబ్దమునకుఁ బ్రథమైకవచనమున రువర్ణక మగు నన్నస్థలమునను బా.వి. ఇట్లే వివరించినది. బహువచనస్థలమున లోపింపవలయు నన్నఁ బ్రథమైక వచనేతరస్థలముల దీని నాగమముగాఁ జెప్పవలెను. ఆగమముగాఁ జెప్పినపుడు లోప మేల? ద్వితీయాద్యేకవచనముల నాగమము నిత్యముగనే చెప్పినను బహువచనస్థలముల లే దని చెప్పుట లాఘవము గదా. చేను నాము మనియు బహువచనపరకతలో 'ను' లోపించు ననుటను బైరీతిగా మార్చుటలో బా.వి. సాధించినప్రయోజన మేమి? స్త్రీసమములందు నెల్ల నిట్లు తుదివర్ణము ప్రథమైకవచనముగాను దదితరవిభక్తిస్థలముల నాగమముగను జెప్పవచ్చునా? ఇఁ

నిట ద్వితీయాద్యేకవచనార్థములం జేనికిం జేనికి ననురీతి నుండును. ఇట నిత్య మహావిభక్తికము. ఇట నువర్ణమునే చేసి యిత్వము చేయకతప్పదు. లాఘవ మని నివర్ణము నాగమము చేయుదురా? చేనన్ అనుచో (తృతీయా) సప్తమ్యర్థమున నత్వ మగుట యెట్లు? ఇట్టివిలక్షణ మైనప్రణాళికవలనం బ్రయోజనము గానరాదు కాని యనుచితగౌరవము**మా**త్రము స్పష్టము. కాంగా నీనువర్ణము నాగామ యవము యని గుర్తించుట శబ్దశాస్త్రోచితము. ఒకవేళ బా.వి. చారిత్రకముగా నూహించుచున్న దేమో. (188)

పాలు :

'ఇట్టివే దోయి - దోలు. పాయి - పాలు. ప్రాయి-ప్రాలు. మున్నగునవి' (188) అను బా.వి.వివరణము చారిత్రకదృష్టితో డిది గావచ్చును. రేయి - రేలు. అనుచోవలె పాయి - పాలు అనురీతిగా నగు ననుట శబ్దశాస్త్రమున సమన్వయింపదు. 'పాలు' అనుదానికి పాయి యనునేకవచనరూప మప్రసిద్ధము. దీని కేకత్వబోధకత్వ వివక్షయు సముచితముగాం గానరాదు. పాయి యని యొక్కప్రయోగమును సూ.ని. చూపినది. ద్విపదహరిశ్చంద్రోపాఖ్యానమున ఆ.కి.అ విపర్యయములు పెక్కు లున్నవి. పాలను పాలచేత ఇత్యాదిగా నుండును బట్టి యుంపలింగవర్ణము బహువచనమె యనుట స్పష్టము. కాన నది నిత్యబహువచనముగాం జెప్పుట యుచితము. పాయి యనురూపము నంగీకరించుటకుం బ్రయోగప్రామాణ్యము లభ్యము గాదు.

'ఇట్టివి ప్రథమాతుల్యములు. కావుననే సమాసమునందును వీనికి లోపము' (188) అన్నది. బా వి. అనంగా రేయిప్రభృతులలోం దుదియువర్ణము ప్రథమావిభక్తివంటిది గావున సమాసమున లోపించు చున్న దని యభిప్రాయ మగుచున్నది. రేనిద్రించు, నేవోసిన, పడగలు

వే గల శేషుండు ఇత్యాదిగఁ బ్రథమైకవచనమునందును యువర్ణము లేని ప్రయోగము లున్నవి. సమాసమందుఁ గానరాకపోవుటనుబట్టి ప్రథమా విభక్తివంటి దనునూహ గల్గిన నది యసంగతము. బహువచనపరకతలో లోపించుటనుబట్టి యది ప్రథమావిభక్తివంటి దన్న నదియు శబ్దశాస్త్రోచితము గాదు. ఆవులు ఆలు అనురీతిగా లోపించునెల్ల తావుల శబ్దాంతిమవర్ణములు ప్రథమావిభక్తులుగాఁ జెప్పట భాషాశాస్త్రమున సరిపడునేమో కాని వ్యాకరణశాస్త్రమునఁ గుదురదు.

**ఆలు - జాలు :**

బహువచనంబు పరం బగునపు డావు ప్రభృతులతుదియక్షరంబునకు లోపంబు విభాష నగు నని సూరి యిట్టి వుదాహరించెను. ఇట బా.వి. 'వుములు ప్రథమావిభక్తిప్రత్యయములు. బహువచనమునం దివి యాగమములు. ఈగణమునం దీయాగమములు వికల్పము' (188) అన్నది. ప్రథమావిభక్తు లైనముపులును గలవు. సందర్భము ననుసరించి బహువచనమం దవి యాగమ మవుటను బా.వి. ఇటఁ బ్రస్తావించియుండవచ్చును. ప్రథమైకవచనేతరస్థలముల (బహువచనమందే కాక ద్వితీయాద్యేకవచనస్థలములందును) నాగమము లవును గదా. కాని ఆవులు జాములు అనుచో వుము లాగమము లనుట పొసఁగదు. చుట్టములు మీసములు అనుచో ము ఆగమమే. ఈ రెంటిని గలిపి ముపు లాగమము లనురీతి వివరించు టెట్లు? ఆవులు జాము లనుచో వుము లాగమము లనఁగా ఆ, జా అన్నవి ప్రాతిపదిక లనవలె. ఆవు జాము అనుచో నవి ప్రథమైకవచనము లనవలె. ఎట్లు వచ్చినవి. ఉకారాంతగోశబ్దములకుఁ గదా వువర్ణకము (వుగాగమము) విహితము. ఆ అన్నది అం దేది? అట్లే అమహాన్నపుంస

ములకదంతములకే మువర్ణకము (ముగాగమము) విహితము. 'జా' అన్నది యాదంతమె. కాఁగా నిట నివి యాగమము లనుటకు శబ్దశాస్త్రమునఁబట్టి యవకాశము లేదు.

ఆచ్ఛికశబ్దములు స్త్రీసమ క్లీబసమ పుంలింగతుల్యములుగాఁ జెప్పఁబడ్డవి. స్త్రీసమత్వమువలనఁ బ్రథమైకవచనలోపము.' క్లీబసమత్వమువలన మువర్ణకము, పుంలింగతుల్యతవలన డుజాదులును నవును. ఇంక పువర్ణక మెట్లు చెప్పఁడు? ఊరు మొదలగు నదంతము లైనను స్త్రీసమత్వాతిదేశమువలన సులోపమే కాని పువర్ణకము నందవు. అహో. వ్యాఖ్యానుసారముగా పుట్టువు అన్నవు అనుచో నాచ్ఛికములపై పువర్ణక మగుటను తె.వ్యా.వి. ప్రస్తావించినది. వజ్ఝలవారిట్టియభిప్రాయమును దిరస్కరించుట యుచితమే. (వ్యా.సం.స.) ఊరు-ఊరువు, పేరు-పేరువు-అనుకృతి నుండవలసిబాధ తప్పినది. సూత్రాంధ్రమునఁ 'గ్వాప్యాచ్ఛికస్య పుః' అన్నసూరియభిప్రాయ మింకను బరిశీలనార్హము. మొత్తముపయి - మహత్తు లైనను (కొడుకు) నమహత్తు లైనను (ఊరు) నాచ్ఛికములపై పువర్ణకము వచ్చుట లేదనక తప్పదు. ఏ మైనను 'ఆవు' అనుచోటవువర్ణము ప్రత్యయము కాదు. ఆవులు, జాములు అనుకృతి సిస్త్రీసమము నుండలిపుము లాగమములు గావనియుఁ బ్రాతిపదికావయవములే యనియు గుర్తింపఁదగును. చుట్టలు, జాలు అని యుదాహరించుచో సూరి యాగమమూ శబ్దావయవమూ యనువివక్ష చేయమి స్పష్టము. అందుకే ముగ్వాక్కులకు లోప మనక తుదియక్షరమునకని సామాన్యముగాఁ జెప్పె.

ఇంకను సూరి యిట ముపువర్ణములలోపము గల్గినవానిని జూపుటనుబట్టి యిట (నాగమములు వికల్ప మని లక్షణవిరుద్ధముగఁ

చెప్పి) మువులకే లోప మని బా.వి. తెలిపిన దేమో. సూత్రము తుదియక్షరమున కని సామాన్యముగాఁ జెప్పుచున్నవి. మఱి ప్రభిన్న వర్ణములకును లక్ష్యానుగుణముగ లోపము చేసికొనుటకు లక్షణమున వీలు గలదే కద.

మఱియుఁ బ్రస్తుతసూత్రము తుదియక్షరమునకు లోప మని చెప్పుచుండఁగా బా.వి. మువులయాగమము వికల్ప మని యర్థము చేయు టెట్లు పొసఁగును? మీఁసములు, చుట్టము లనుచో ముగాగమము గూడ నిత్యమే. నిత్యమైన యాగమ మిట వికల్పముగ లోపించినది కాని వచ్చుటయే వికల్ప మనరాదు. చరిత్రాదులకును మువర్ణకలోపము విహితము. అట మువర్ణకముగాగమములు వికల్పముగా నగు ననఁ దగునా? అవు లనుచో వువర్ణ మాగమ మనుకొన్న వు డాగమము వికల్పముగా నగుట నిట విధింప నక్కఱ లేదు. మువర్ణాగము మొక్కట చెప్పఁ జాలును. గోశబ్దమునకే గదా వుగాగమము నిత్యము. తదితరములకు (ఉదంతములకు) బహుళ మవుటంజేసి యిట బహువచనమున మం డాగమము లేమియుఁ గల దన్న నావులు, ఆలు నన్నవి వుగాగమమును జెప్పుసూత్రమునకే లక్ష్యము లవును. ఇటఁ జూప నేల? వువర్ణాగమము వికల్పమని యిచ్చట విశేషముగాఁ జెప్ప నేల? ముగాగమమువలె వుగాగమ మెల్లయెడల నిత్యముగ విధింపఁబడ లేదు గదా. దీనింబట్టియు నిట నాగమత్వము ప్రసక్తి తెచ్చుట యనవసర మని స్పష్ట మగుచున్నది.

మొత్తముమీఁదఁ దుదియక్షరమునకు లోప మను లక్షణమునకు నాగమములు వికల్ప మనురీతివివరణ మననుగుణము గా దని స్పష్టము.

## నామాంతము :

ఇయకు మాఱుగా నామాంతంబున కేత్వంబు బహుళంబుగా నగు నప్పుడు నగు. ఇట బా.వి. 'నామాంత మనఁగా ప్రాతిపదిక యొక్క చివర అని కాక మధ్య, లోపల, అనియు నర్థములు. కావున చెలియలు మొదలగువానిలో మధ్య నున్న ఇయకు మాఱుగా ఎత్వము వచ్చును.' (189) అన్నది. అవుఁ గాక. చెలియ లనుచో నెత్వ మయిన చెలెలు అని కావలె. (చెల్లెలు ?) అట్టిరూప మున్నదా? చెల్లియ, చెల్లియలు అనువానిని సూ.వి. చూపినది. కాని ప్రయోగము లేదు. శ.ర.కు నాధార మేమో.

తె.వ్యా.వి. పరియాచకము పరేచకము పర్యాచకము కదెంబడె అనువానిం బ్రస్తావించి కదెంబడె అనురూపమును సూ.వి. శ.ర. చూపలే దన్నది. పరేచకము సమ్మతి మైన ట్లున్నది కాని యదియుఁ గాన రాదు. పర్యాచక మన్నది యిత్వలోపముచే సాధ్యము. పరేచక మవు టెట్లు? అంతశబ్దమునకు మధ్య మని యర్థము చేసినను 'ఇయా'కు 'ఏ'త్వ మగుట యెట్లు?

నామాంత మనుచో నంతశబ్దమునకు నడుము నను రీతిగా నర్థము చేయుట యొప్పదు. అట్టియర్థము గలది 'యంతర్' అను నవ్యయము. దానితో 'నామాంతము' అను రీతి రూప మేర్పడఁజాలదు. ఇట సంస్కృతమునఁ బ్రాతిపదికము నామాంతర్ అను రీతిగా రేఫాంత మైయుండును. 'భవచ్ఛ్రోత్రాదుల కిందుఁ బ్రయోగంబు లే' దను లక్షణము ననుసరించి రేఫాంతము లగుఁ దెలుఁగునఁ బ్రయోగము లేదు గావున నీశబ్దము సంస్కృతసమముగా నైనను దెలుఁగునఁ జేరదు. మొత్తముమీఁద నామాంతం బనుశబ్దముచే నామమునకుతుది యనురీతిగా నంతశబ్దమునే గ్రహింపవలయుట స్పష్టము.

**స ర్వ నా మ ము :**

సర్వనామసంజ్ఞ "ఆంగ్లభాషాప్రభావము ప్రసరించినకాలమునందే తెనుఁగువ్యాకరణవాఙ్మయమునందు ప్రవేశించిన' (659) దన్నది తె.వ్యా.వి. అథర్వణునిత్రిలింగశబ్దానుశాసనము 'సర్వవాచ్యం సర్వనామ' యని (4 కాం.) యర్థముతో దీనిఁ జేర్కొనెను. మఱి యీత్రిలింగశబ్దానుశాసన మెప్పటిదో? పరిశీలింపవలె.

**వే న :**

దీనికిఁ బ్రయోగము దొరుకలే దని ప్రౌఢవ్యాకర్త చెప్పఁగా (ప్రౌఢ.శబ్ద) బ.వ.లుగా వాన వీన వేన అనువానికి ప్రయోగములను గూడ ప్రౌ.వ్యా. చూపె' (667) నని తె.వ్యా.వి. పేర్కొనుట విచార్యము.

**కొ ం ద ఱు :**

క.సం. అందఱు అనుదానికి అందోఱు అనురూప మున్నట్లే కొండ అనుదానికి కొందోఱు అని యున్నట్లు చెప్పినది (తె.వ్యా.వి. 118) తె.వ్యా.వి. దీని నంగీకరించిన దేమో. కాని యిది గానరాదు.

**పూ ర ణా ర్థ ము :**

సంఖ్యకుం బూరణార్థంబునం దవగాగమం బగు ననుటను వివరించుచు బా.వి. 'ఒకసంఖ్యను తరువాతిసంఖ్యచేత నింపునపుడు అవ (క్) అగమ మగును (199) అన్నది. తరువాతిసంఖ్యచేఁ బూరించుట యేమి? సూత్రము ననుసరించి సంఖ్యావాచకమునకుఁ బూరణార్థమున ననఁగా నాసంఖ్య పూరింపఁబడుటలో-నని యర్థము స్పష్టము. ఆసంఖ్య పూరింపఁబడుటకుఁ 'దరువాతిసంఖ్య'తో సంబంధ

మేమి! దానిచేత నింపు కేమి? మూఁడవవాఁడు గల్గునంపునకు రెండవ వానింగూర్చి రెండవవాఁ డనరాదా? కైకేయి రెండవభార్య భరతుఁడు మూఁడవసోదరుఁడు (బా.వి. 200) అన్నట్లు సుమిత్ర మూఁడవభార్య. శత్రుఘ్నుఁడు నాల్గవసోదరుఁ డనరాదా? (భరతుఁ డౌనని మూఁడవసోదరుఁ డగునో వానికి శత్రుఘ్నుఁడు నాల్గవసోదరుఁ డగును గదా.) ఇట్లు రెండవవాఁ డనియు నుంట లక్షణానుగుణము. అట్టిరూపము లే దని నిశ్చయింపఁ దగునా? (ఒకటవ... బా.వి. 199) ప్రయోగములఁ బరిశీలింపఁదగును.

## మహతి - మహాత్మ్యార్థ్యము :

సర్వనామ క్రియాపదంబుల బహువచనంబు మహత్తునకుంబోలె మహతికిని సమానము నని నిరూపించును బా.వి. ఇట్లన్నది 'తెలుఁగున మహతి' యనువిభాగము ప్రధానముగా లేదు. ఏలన తద్వాచకము లేకవచనమునందు అమహత్తులలోను బహువచనమందు బహువచనమందును (ఇట రెండవబహువచనస్థలమున 'మహత్తులలోను' అని బా.వి. అభిప్రాయము గ్రహింపఁదగును.) అంతర్భాగము లగుచున్నవి. (200) విద్యార్థులకు సులభముగా నవగాహనము నగుఁ జేయవచ్చు నని బా.వి ఇట్లు నిరూపించియుండవచ్చు. నిజమున కేకవచనమున నమహత్తులలోను బహువచనమున మహత్తులలోను నంతర్భాగ మనుట యొప్పదు. స్త్రీత్వగ్రహణభిన్నంబు లనుసూత్రము ననుసరించి స్త్రీవాచకము లమహత్తులే యగును. ఏకత్వమున నొకటియు బహుత్వమున నింకొకటియు నవుప్రశ్నయే లేదు. సర్వనామక్రియాపదముల (మహతీ) బహువచనములు మహద్రూపమునం దుండవచ్చును. కాని యది మహత్తు గాదు. శబ్ద మమహత్తే. మహాత్మ్యార్థ్యము

నందిన దంతియు. అశ్వోత్తముఁ డని యున్న నయ్యది తిర్యక్కు గాక మహాత్ముఁడా? మేఘుఁడు మున్నగువానినిబట్టి యమహాత్తు లెల్ల నొక్కచో మహత్తు లగు ననవలయునా?

ఇంక సూత్రార్థము గాఁ గానవచ్చును, 'బహువచనమహతీవాచకములను మహద్వాచకసర్వనామములతోను, క్రియాపదములతోను అన్వయి' (200) మన్నది. అన్వయముప్రసక్తి యేల కల్గినదో? సూత్రమునకు దానితో సంబంధము లేదు. వారి దృష్టాంతములు రుక్మిణీసత్యభామ లనువిశేష్యములతో నన్వయించును. అన్వయమును ప్రస్తావించు బా.వి.వాక్యము విలక్షణము. ఏ స్త్రీలును అమహత్తు లగుటచే నమహదర్థము నందవలసినమహతీబహువచనస్థలముల మహదర్థ మగుటయే సూత్రము చెప్పుచున్నది. శబ్దశాస్త్రోచితముగా.

ఔపవిభక్తికాలు - అనౌపవిభక్తికాలు :

వీనిని వివరించుచు బా.వి. 'ఉపవిభక్తులు వచ్చుపదములు ఔపవిభక్తికములు. ఉపవిభక్తిసంబంధము లైనవర్ణములును ఔపవిభక్తికము లగును. ఇవి రానివర్ణము లనౌపవిభక్తికములు' (202) అని దీనికిఁ బ్రమాణముగా 'యత్రైతే తత్ర తత్సంజ్ఞా నామ్నా మన్యత్ర చాన్యథా' యను వి.వి వచనము చూపినది. వి.వి. నామ్నా మనుటచే 'నౌపవిభక్తికములు చేరుట కర్హమైననామములకే యౌపవిభక్తికము లని వ్యవహారము. కాని పదములకుఁ గా దని తెలియవలసియున్నది. దుమంత మన్నది యెట్లు దువర్ణకము చేరుప్రకృతులకు సంజ్ఞయో యట్లు యౌపవిభక్తికసంజ్ఞయును బ్రాతిపదికములకే లాక్షణికవ్యవహారము నట్లు యున్నది.

కర్తృ మగుట నౌపవిభక్తికము కదా. వికల్ప మయిన ననౌపవిభక్తిక మనఁదగునా? యని పరిశీలింపవలసియున్నది.

## ఔపవిభక్తికములు - ప్రాణివాచకములు :

వజ్ఝలవారు అప్రాణివాచకము లగు స్త్రీసమశబ్దములకు మాత్రమే యుపవిభక్తు లగు ననుటను తె.వ్యా.వి. ఉద్ధరించినది. (650) ఆయభిప్రాయమును తె.వ్యా.వి. ఆమోదించిన ట్లున్నది కాని యది యంగీకార్యము కాదు. (చూ. బా. సూ.) లేటికంపు ఱంకేటిచిప్ప ఱోఁడేటిమంట ఇత్యాదిగాఁ బ్రాణివాచకములకు నవుటను తె.వ్యా. చిన్నయయును స్పష్టము చేయుట గమనింపనగు. ప్రయోగములందును ప్రాణివాచకములకు నౌపవిభక్తికము లవుట గలదు. కాని వానితృతీయా సప్తముల కత్వము మాత్రము గానరాదు.

## ఔపవిభక్తికాలు - సమాసము :

చింతామణి 'స్యు స్తే హి విభక్తౌ సమాసే చ' యనఁగా సూరి 'ఇవి ద్వితీయాద్యేకవచనంబులు పరంబు లగునప్పు డని మాత్రమే చెప్పుటచే సమాసమువిషయము ప్రస్తావింప లే దని స్పష్టము. ఇట బా.వి. 'సమాసములందును' ఉపవిభక్తులరాకను సూరి ప్రస్తావించకపోవటం (బా.వి.లో ఇట్లు ప్రామాణికవ్యావహారిక భాషల కలయిక యుట సహజ గానవచ్చు.) లోపముగా కన్పించు (203) నన్నది. ఇట్లు నిర్ణయించుటకుఁ బ్రమాణము చూపిన బా గుండెడిది. విభక్తిపరత్వమునసే యుపవిభక్తులు చేరఁగా నేతియొక్కముంత - యనుచో సమాసము చేయ విభక్తి లోపింపఁగా నేతిముంత యనియే యవును. సమాసములోఁ బ్రత్యేకముగాఁ జెప్ప నేల? విభక్తి పరత్వమున రాకుండ సమాసమునందు మాత్రమే వచ్చునౌపవిభక్తిక

టివర్ణంబునకు ముందు పూర్ణబిందువు బహుళముగా నగు' నన్నది పూర్వసూత్రము. ఆసూత్రముచేతనే యైనఁ బూర్ణబిందువే కదా రావలసినది. అట్టియెడల ఖండబిందు వుండదు గాన నని ఖండబిందు ప్రసక్తి యేల? పయిసూత్రముచే నైనను (బూర్ణబిందువిధానము వలన) అనాదేశపక్షమున ఖండబిందు వగుచున్నదా? అట్టియెడల నిటఁ బదాది గావున ఖండబిందు వుండ దన నేల? కాఁగా ఖండబిందు ప్రసక్తి దెచ్చుట యనవసర మని స్పష్టము.

పయిసూత్రమందే బహుళపద మంటు నిటఁ బ్రసక్తిగా నటనే గ్రహింప వీలు గలదు. తెనుఁగుల మీఁది సాంస్కృతిక పరుషములు కని చెప్పినతీరుగా ననేకసంగ్రాహకముగా (చెక్కుంట సమానముగాఁ గప్పించుటను ననుసరించి) యీసూత్రము స్పష్టముగా నిరూపింపఁదగియుంట నిది యిట్లు సూత్రింపఁబడెను. అంతను ప్రాప్తముమీఁద - అనుసూత్రముచే బహుళముగాఁ బ్రాప్తించుచుండఁ బదాద్యంబగు - ననుసిద్ధాంతముచే నిత్యముగాఁ జెప్పఁబడిన దని గ్రహింపఁదగు. అంతియ కాని ప్రాప్తముమీఁది - అనుసూత్రము నందలిబహుళపదముచే నిటఁ బ్రసక్తి యుండదు. బా.వి. ప్రవృత్తికిఁ బ్రత్యేకవిధి గావింపఁబడె (205) ననుట సమంజసము కాదు. అయ్యది స్పష్టతకుఁ జెప్పినట్లు పిదప నెంచుట కొంతవఱకు యుక్తమే.

**ఔపవిభక్తికము - అత్త్వము :**

ఔపవిభక్తికములతృతీయాసప్తములకత్త్వం బాదేశంబు బహుళంబుగా నగు ననుసూత్రాభిప్రాయమును వివరించుచు బా.వి. 'ఇట్లు కరణార్థమందును చేతతోడ అనుతృతీయావిభక్తులకు, అధికరణార్థమునందు వచ్చు అందు అనుసప్తమీవిభక్తికి మాఱుగను 'అన్' అనునాదేశము కల్గును (208) అన్నది.

ఔపవిభక్తికపరకవికారములు :

తె.వ్యా.వి 'ఔపవిభక్తికములు పదములకు (?) విభక్తులు పరమగునపుడు వచ్చు'నవి కావున ఇవి యంతస్సంధికి జెందినకార్యము(లు) ఏమైనను ప్ర.ఆ. దీనిని సంధిప్రకరణమునందు పేర్కొనుట సముచితము. చిన్నయసూరి దీని నాచ్ఛికపరిచ్ఛేదమునందు వచించె (౫0) నన్నది. ఇట్లనుటలో సూరి దీని నాచ్ఛికపరిచ్ఛేదములోఁ జెప్పుట యంతగా నుచితము కాదనునభిప్రాయము వ్యక్తమగుచున్నది. అది సరి కాదు. విభక్తిపరత్వమున నగు ముగ్వాగమాదులెల్లు విభక్త్యంతములను నిరూపించుపరిచ్ఛేదమునఁ జెప్పఁబడినవో యట్లె యీయుపవిభక్తులను గూడ నటఁ జెప్పుటయే యుచితము గద. ఉపవిభక్తులు విభక్తిపరకత్వమున నగున వని స్పష్టమే. అనఁగా నివి విభక్తినిమిత్తకము లయినవె. ఇంక నివి యాచ్ఛికశబ్దములకే కాని తత్సమశబ్దములకు రానేరవు. కావున నాచ్ఛికపరిచ్ఛేదమునందుఁ జెప్పుటయ యుచితమైనది. ఔపవిభక్తికవర్ణాః స్త్రీటాస్వయ యని సంధిపరిచ్ఛేదమునఁ జెప్పినచింతామణియు, కేషాంచిదుదన్తానామ్, ఔపవిభక్తికనాన్తా మనువానిని బాలంతపరిచ్ఛేదమునఁ జెప్పుట గమనార్హము. ఔపవిభక్తికవర్ణాః అనునది యెట్టిదైనను సంధికార్యమును జెప్పుచున్నదా?

నామమునకు విభక్తి పరమగుచుండఁగా నాగమాదేశాదులుగా వచ్చుట ననుసరించి యిది సంధికార్యమనుట యొప్పునా? ముగ్వాగమాదులు మాత్రమట్టివి కావా! కాఁగా నాచ్ఛికముల కగునుపవిభక్తులను సంధిపరిచ్ఛేదముకంటె (నామ) విభక్త్యంతములను నిరూపించు నాచ్ఛికపరిచ్ఛేదమునందుఁ జెప్పుటయే సముచితమని గ్రహింపఁదగును.

—*—

# కారకపరిచ్ఛేదము

## విభక్త్యర్థాభిధాయకశబ్దములు :

విభక్త్యర్థములం దుపయోగింపఁబడు పదములను బ్రస్తావించుచు బా.వి. 'అధికరణార్థమునందు అందు అను సప్తమియే కాక లోపల మీఁద క్రింద ప్రక్క వైపు మున్నగునవి. కేచిత్ (తు) వైకృతశబ్దాః విభక్త్యర్థాభిధాయకాః' అని అథర్వణుఁ డిట్టివి సకృత్తుగా నున్నట్లు గుర్తించుటకైన జరిగెను (210) అన్నది. వీనిలో లోపల అనునది యంతర్థకముగాఁ బ్రయోగింపఁబడుట చెప్పవచ్చు. నిర్ధారణమున నగు షష్ఠీలోపలయు యధికరణార్థమునం దగు నన్న లోపల లో అన్నవి రెండును సప్తమ్యర్థమును సిద్ధించును. అపుడు లోపల సప్తమీవిభక్త్యర్థాభిధాయకశబ్ద మనవలసిన యవసరము లేదు. మీఁద క్రింద అనునవి సప్తమికైన యత్వముతోఁ గూడియుంట నధికరణార్థమునం దున్నను నప్పదము లంతర్థమునఁ బ్రయుక్తములు గావు. వనమునందు, వనములోపల నన్నట్లుగా వనమునం దనుటకు వనముమీఁద వనముక్రింద నని యుండునా ? చాపయందుఁ గూర్చుండెను అనుటకంటెఁ జాపమీఁదఁ గూర్చుండె నను వ్యవహారము ప్రచురము గావచ్చును. కాని యట చాపమీఁది ప్రదేశమున నని మీఁదుశబ్దమున సప్తమ్యర్థము స్పష్టముగా గమనింపఁదగి యున్నది. ప్రక్క వైపు అనునవియు నట్లే యంతర్థకములు కావు. ఇట్టివానిని విభక్త్యర్థాభిధాయకశబ్దము లనుటయు నొప్పదు. కేచిత్తు వైకృతాశ్శబ్దాః అనుకారిక మెయి, మై, కోసము అనుకరితవి, స్వతంత్రముగాఁ బ్రయుక్తములు గాని వానినే యనఁగా నపదములనే సంగ్రహించు నని గమనింపఁదగియున్నది. (చూ. బా.సూ.)

## కరణసహార్థములు :

సంస్కృతమునఁ గరణసహార్థములు రెంటఁ దృతీయ సామాన్యముగా నగుచుండఁగాఁ దెలుఁగునందలి విశేషమును గూర్చి తెలుపుచు బా.వి. 'తెలుఁగునందు తోడ కేవలము సహార్థకము. చేత కేవలము కరణార్థకము. కరణార్థమందు చేతతోడలు రెండును నుపయుక్తము లవుచున్నవి' యన్నది. కరణార్థమందుఁ జేతతోడలు రెండును నుపయుక్తము లగుటను జెప్పినప్పు డంతకుముందు తోడ కేవలము సహార్థకమన నేల? చేతతోడలు (తృతీయ) కరణార్థమున సమానముగ నైనను సహార్థమునఁ దోడయే కాని చేత ప్రత్యయము రాదని సంస్కృతముతోఁ గలభేదమును జూపుట బా.వి. అభిప్రాయముగా నర్థము చేసికొనవలె. "కాని కోలతోడ ఖండించె ననఁగా కోలతోఁ గూడినవాఁడై ఖండించె ననుసహార్థ మున్నను దానిని గూడ కరణార్థమె యనుట పరిపాటి యైనది" (217) అన్నది బా.వి. అనఁగాఁ దోడను గరణార్థమునఁ జెప్ప నక్కఱలే దని భావమా? కోలచేత ఖండించె, కోలతోడ ఖండించె ననువాని కర్థమున భేదము లేదు. కోలచేత ఖండించె ననుచోఁ గూడ కోలతోడఁ గూడినవాఁడై ఖండించె నని తోడతో సమానముగా సహార్థ మున్నది. కాని దానిని కరణార్థ మనుట పరిపాటి యైన దన్న చేత గూడఁ గరణార్థమందే కాక సహార్థమునందు నవుచున్న దనుటకు వీలు గల్గుచున్నది.

కోలతోడ ఖండించె ననుచో సహార్థము నసహజమే యనవచ్చు. కోలతోడ ఖండించె నన (కోలచేత ఖండించె ననుచో వలె) ఖండించుటకుఁ గోల సాధనము చేసికొనుట యుద్దేశము కాని కోలతోడఁ గూడినవాఁడయ్యె ననుట కాదు గద. కోలయుఁ గత్తియు

కలిగియుండి ఖండించుటకుఁ గత్తి నుపయోగించిన కత్తితో నఱికె నందుమా? లేక కత్తైన నేమి కోల యైన నేమి! ఖండించినవాఁడు రెండింటితోఁడఁ గూడియున్నాఁడు గదా యని యొకసారి కోలతోఁడఁ గూర్చె నందుమా? సహార్థ మిట సముచితముగా సరిపడదు కానఁ గరణముగాఁ జెప్పుట సముచిత మగుటచేతనే య ట్లనుట పరిపాటి యైన దని గ్రహింపఁదగు.

**తోపాటు - తోఁబాటు:**

'తోడు + పాటు తోపాటు (ఈపదమును తోఁబాటు అని పండితులు కూడ వ్రాయుట విచార్యము'(515) అన్నది తె.వ్యా.వి. ఇది యిట్లని నిశ్చయింపఁదగినదిగాఁ గానరాదు. తోడుశబ్దముపై పడు అనుప్రయుక్తమై తోడుపడు అను యేర్పడినశబ్దపల్లవ మొకటి యున్నది. దానినుండి తోడుపాటు అనుకృదంతరూప మేర్పడును. అట తోడుపడు తోపాటు అనురీతి రూపాంతరములు లేవు. ఇక్కడి తోపా టన్నదాని నట్లు విభాగించిన (తోడు + పాటు) తోపాటు అని మాత్రమే కావలె. ఈయర్థమునఁ దోడ్పాటు తోడుపా టను రీతి రూపాంతరములు లేవు.

తోడుశబ్దమునకు పాటుశబ్దముతో నీయది సమాస మనియు తోడ్పడు అనుశబ్దముకంటె నిది భిన్న మగుమార్గములో నేర్పడిన దనియుఁ జెప్పవచ్చును. రామునితోపాటు, అతనితోపాటు ఇత్యాదులు మఱల షష్ఠీతత్పురుషసమాసము లనవలెను. రామునియొక్క తోపాటు అతనియొక్క తోపాటు అని యిది యెంతవఱకు సముచిత మన్నది నిర్ణయింపఁజాలము. పయిఁగా నీ 'తోపాటు' అనుసమాసము (మఱల షష్ఠీతత్పురుషమునం దుత్తరపద మయియే యుండునుగాన) వే ఱొకదానితో సమసింపక విడిగాఁ బ్రయోగింపఁబడుట లేదు.

అట్లే సమాసమునఁ బూర్వావయవముగా నుంటయు లేదు. పాటునకు పాట్లు ఇత్యాదిగా నీ 'తోపాటు' అనుదానిపై నితర విభక్తివచనములును గానరావు ఇట్టిది లింగ విభక్తివచనశూన్య మగుట నవ్యయ మనవలసియుండును.

రామునితో పాటు అనుచో రామునితోఁ గలిసి యని యర్థము ఇట్టిప్రయోగస్థితిఁ బట్టి చూడఁగా నియుక్తి తృతీయాస్థానమున ప్రయోగింపఁబడునదే కాని స్వాతంత్ర్య మగుపడదు గా దని గుర్తింప నవకాశ మేర్పడుచున్నది. తోడుత అనుదానివలె 'తోపాటు' అనునది (విభక్త్యర్థాభిధాయకశబ్ద మనియో) తోడవిభక్తికి మారుగా నవ్వు నదిగా గుర్తించుట యొకమార్గము. కొఱకర్థమునఁ గోసము కోసరము అనువానివలెనె తోడ ద్రుతప్రకృతిక మైనను తత్స్థానమున (లేక తదర్థమున) నవ్వు 'తోపాటు' ద్రుతాంతము గా నుండవచ్చును. అపుడు దీనిని తోడు + పా టనురీతిగా విభాగింపవలసినయక్కఱ లేదు.

నిజమునకు రామునితోడ అనుదానికంటె రామునితోపాటు అనుటలో సహార్థమున దార్ఢ్యము గోచరించుచున్న దనవచ్చు. రామునితో అనుతృతీయాంతముపైఁ బాటన ప్రయుక్త మైన దందుమా? (అర్థవిశేషము) అట్టియెడల రామునితోఁ బాటనియే యుండును. తోపాటనియుండుటయే విశేష మగును. కాని యప్పుడున నిది తోశబ్దముపై మాత్రమే చేరు ననవలసియుండును. రామునితోడఁ బాటనురీతివి లేమి తోడపైఁ జేరు నన వీలు లేదు గదా.

ఇంతకును తోఁబాటు, లేదా తోపాటు అనువానిలో నొక్కటిగా నిర్ణయించుటకుఁ దగినప్రయోగప్రామాణ్యము లేకుంటయు నీవాదమునకుఁ గొంతహేతు వైనది. శ.ర. దీని నవ్యయ మన్నది. పనివలెనె యిది ప్రత్యేకముగాఁ బ్రయుక్త మగుట లేదు. కాని

ప్రయోగమునందు భేదము గలదు. వచ్చిర దేని యనురీతిగా తోపాటన్నది (షష్ఠ్యంతముతో) వ్యవహితమై యుండుట గానరాదు. సూ.ని. వివరణలోఁ జూపి తోడుశబ్దమునుండి యేర్పడిన ట్లూహించినది అవ్యయమన్న శ.ర.మతమున నిట్టివ్యుత్పత్తి యూహింపరాదు. అది యే యుచితము. చారిత్రకదృక్పథముతో కోలకును కోల+కు అని విభాగించినట్లే తోపాటును తోడుపాటు అని విభాగింతురుగాక. అది శబ్దశాస్త్రమున సమన్వయింపదు. ఇంకను తోపాటు కొంత విశిష్టము. ఏమైనను సూ.ని. తోపాటన్నది సహార్థకమనియు, తోడుత - అను నర్థముగల్గిన దనియుఁ జెప్పు టుచితముగా నున్నది. తోడుతనె ఇతరార్థములందు తోపాటు లేదు. కోలతోడఁ గూలనేసె అనుచో కోలతోడుతఁ గూల నేసె అని యుండవచ్చు కోలతోపాటు గూలనేసె అనుట యుండదు గదా. కాఁగా తోపాటన్నది తోడ ప్రత్యయార్థకమై 'తోడుత' వంటిదిగా గ్రహింపవచ్చును. అర్థమునందలి యీషద్భేద మవివక్షితముగా నుపేక్షింపవలసియుండు నప్పుడు.

దీనికి శ.ర. చూపిన ప్రయోగమునే సూ.ని. ఇచ్చినది. ప్రాచీన కావ్యములందుఁ గానరామియుఁ బిదపను బ్రచురము గామియు గమనార్హము. నేఁ డీశబ్దము వ్యవహారమున బ్రాచుర్యము వహించినది.

**ఉపయోగము - తృతీయావలను :**

ఉపయోగంబునం దాఖ్యాతకుం దోడనర్థకం బగు ననియె సూరి. ఇట వలన గల దని వ్యా.సం.స., చేత గూడఁ గల దని ప్రౌ.వ్యా.వి. స్పష్టము చేసినవి. తె.వ్యా.వి. ఇంకను "ఉపయోగంబున దాఖ్యాతకు తృతీయ ప్రాయికంబుగా" నగు. ప్రాయిక మనుటవలన నితర వర్ణకము నగు నని గ్రహించునది. అని బాలవ్యాకరణమును సవరింపవలసియున్నట్లు పేర్కొన్నది. (975) ఇది యుచిత మేమో

యనిపించుచున్నది. తోడవర్ణకం బగు నన్నసూరి నాందీపనివలన నని యర్థ మని యర్థము చేయుచో వలనవర్ణకమును జూపెను. వలన అగుట నాతఁ డుద్దేశించెనా? దానిని ప్రత్యేకముగా నిట నగు నని చెప్ప నక్కఱ లేదు. అపాయభయేత్యాదిసూత్రమునందలిగ్రహణశబ్దము ననుసరించి వలన వచ్చును గదా. వలన అట్లు సిద్ధించు నన్న 'చేత వర్ణకంబు హేతుకరణంబులకు గ్రహ్యాదియోగజం బగుపంచమికిని జెప్పెను. కావునఁ జేతప్రత్యయము రాఁగలదు. అయ్యు 'తోడ వర్ణకంబు నగు' నని సముచ్చయార్థకము నేని జూపిన బాగుండెడి ననిపించు.

**అందు - ఉండి :**

వలన కాదేశంబు లగుద్వితీయాసప్తములమీఁదియుండికి లోపంబు బహుళంబుగా నగు నన్నప్రౌఢవ్యాకర్త అందుమీఁదియుండికి మాత్రము లోప ముండ దని బహుళగ్రహణమును సమర్థించెను (995) అనుటలో తె.వ్యా.వి. బ.సీ.అభిప్రాయము నంగీకరించినది. (ఈ యప్రవృత్తిసూత్రము వ్యవస్థితవిభాషచే సాధించుకొనఁదగియుండ బహుళగ్రహణ మేల యనకుండుట బాగే.) కాని యది సరి కాదు. నాయందు ధనము గొని పొమ్ము - ఇత్యాదిగా నందుపయి యుండికి లోప మగుటను (స.సా.సం. ననుసరించి) వ్యాఖ్యలవారు స్పష్టము చేసిరి. (వ్యా.సం.స.)

**నిర్ధారణము - కంటె :**

'అన్యులు నీకంటె నధికులు గాకుండు నట్లు గాఁగ' నని యన్యశబ్దప్రయోగ మొకటి కలదు (987) అన్నది తె.వ్యా.వి. ఇట్లనుటలో నీకంటె ననుచోటికంటె నన్యార్థముతో యోగమువలనఁ గల్గిన దని యభిప్రాయము స్పష్టము. కాని నిజమునకు నీకంటె

సధికులు గాకుండునట్లు అనుచో సధికార్థముతోడియోగమువలననె కంటె ఐన దనుట యొప్పును. ఇంకను తె.వ్యా.వి. 'అన్యశబ్దవిరహితముగను నన్నయప్రయోగ మొండు కల' (౮౪౬) దని నాకంటె సధికుం డయినశత్రుత్రియుండు లేఁ డనునది చూపినది (౮౪౪) ఇట నన్య (ఆది?) యోగము లేకయె కంటె వచ్చిన దని యభిప్రాయమా! (లేక యది యధ్యాహార్య మనియో) కాని అధికార్థముతోడియోగమువలన నె, అన్యులు నీకంటె సధికులు ననుచోటవలెనె కంటె ఐన దని గుర్తింప వలసియున్నది.

## క్రి య లు - ప ట్టి :

షట్టివర్ణకంబు హేతువు లగుగుణక్రియల కగు నన్నసూరి "క్రియలలో భావార్థమునకే యుదాహరణ మొసఁగెను. భావార్థకముపై నెట్టివిభక్తి యైనఁ జేరవచ్చు నని ద్వి. ఆ. వచించెను. అందుకే చి.సూ.ని సవరించుచు ప్రౌ.వ్యాకర్త కొన్నియెడల హేతువుకం దన్నంతక్రియలమీఁదను బట్టివర్ణకము విభాష నగు నని (౪౪౨) చెప్పినట్లు తె.వ్యా.వి. పేర్కొన్నది. అనఁగా భావార్థకముపైఁ బట్టి తప్ప నేవిభక్తియుఁ జేర దని సూరి చెప్పె నని తె.వ్యా.వి. అభిప్రాయమా? అది సరి కాదు. కర్తృవ్యర్థములందు ద్వితీయాదులును సామాన్యముగనే యువుచున్నవి. హేత్వర్థమున గుణములతో పాటు క్రియలకుమాత్రమే షట్టీకలదు గాని సిటఁ గ్రియలను వేఱుగాఁ జెప్పెను గాని భావార్థకము పైని బట్టిమాత్రమే యగు నని సూరి చెప్పలేదే. భావార్థకాంతము కృదంత ప్రాతిపదిక మగుటఁ ద్రిరూపవిభక్తుల నన్నింటి నందు టాగ్నుయార్థముల సహజమె.

ప్రౌ.వ్యా.కర్త అన్నంతక్రియలపైఁ బట్టిని జెప్పుట బాల.కు సవరణము గాదు. పూరణ మనఁ దగు. అన్నంతక్రియ లవి యవ్యయ

ములు గాన వానిపయి నేవిభక్తియు నిలువ వీలు లేదు గదా. కాఁగా నీ బా.ల.సూత్రము ననుసరించి షష్ఠియును నిల్వదు. అవ్యయమే యైనను బట్టి యొక్కటియు నిల్చుట విశేషము. దానినే ప్రౌఢ. సూత్రించె.

## విశేషణలింగవిభక్తివచనాలు :

విశేష్యంబునకుంబోలె విశేషణంబులకు లింగవిభక్తివచనంబు లగు ననుసూత్రమున కాధారము చింతామణిలో లే దని తె.వ్యా.వి. భావించినది. అందువలననే కాంబోలు బా.వి.లో దీనికి చిం. మూలము చూపలేదు. కాని చింతామణిలో సర్వవిభక్తిస్సంస్కృతతుల్యా యనుసూత్రము ననుసరించి యీయంశము గ్రహింపఁదగును. ఇంకను తె.వ్యా.వి.వలెనె బా.వి. కూడ 'ఇది కేవలము సంస్కృతానుకరణముగ నున్నది. ఇట్లు నియమించుకొని దీని కపవాదములను గల్పించుట చిత్రము. (281) భాషాస్వభావమున కనుకూలము గాదు (282) అన్నది. చింతామణి సైతము 'ఉభయవిధ మనుమాతేనామ్, ఏకత్వం భేదకే గతే బహువచనానాం' యనియు, వి.వి. విశేష్యమాత్రే స్త్రీతా స్యాత్ - ఇత్యాదిగను పేర్కొన్నది. వీనిం బట్టి సర్వవిభక్తిస్సంస్కృతతుల్యా యనుదాని ననుసరించి తెలుఁగు నను విశేష్యమునకువలెనె విశేషణములకు లింగవిభక్తివచనము లగుట యుద్దేశింపఁబడినట్లు స్పష్టముగా గుర్తింపవచ్చును. ఎట్లైనను బా.వి.లో విశేష్యంబునకుంబోలె నని చెప్పి బహుళములనే యపవాదములు గల్పింపవలసిన యవసర మేర్పడినది గాన నిది కేవలము సంస్కృతానుకరణమె కాని తెలుఁగుభాష కొప్పదు గాన నాసూత్రము చెప్పకుండ వలసిన దని బా.వి. అభిప్రాయము. ఈసూత్రము లేకున్న నపవాద

ములు నక్కర లేదు గాన నాసూత్రములను జెప్ప నక్కర లేదు. (చిం., వి.వి.లో నెట్లో.) అను బా.వి. అభిప్రాయము ననుసరించి దీనిని జెప్పకుండు నందము.

ఈ సామాన్యాపవాదసూత్రములచేఁ దెలియఁబడుచున్న యంశములు దెలియు టెట్లు? తెలుఁగునందు విశేషణములలింగ విభక్తివచనములు యథేష్టముగా నుండఁదగునా? ఆయావిశేషములు దెలియఁజేయవలయు నన్న విశేష్యలింగవిభక్తివచనము లే విశేషణముల కగు నని ముందుగాఁ జెప్పవలసినదే. అట్లు చెప్పకయు గ్రహింపవలయు నన్న విశేషణములలింగవిభక్తివచనములు యథా ప్రయోగముగ నుండు ననవలె. అట్లయినచోఁ బ్రయోగానుసారము గా నద్దానిలక్షణమును నిరూపించుట యుక్తమగును కాదా? కాఁగా విశేషణముయొక్క లింగవిభక్తివచనములను గూర్చి యున లేమియుఁ జెప్పకున్న నావిషయములు స్పష్టపడుట యసంభవము కావున నీసూత్రమును దీని కపవాదములును జెప్పుట ప్రయోజనవంతమె కావునఁ జెప్పుటలో వింత లేదు.

విశేష్యముయొక్క లింగవిభక్తివచనాలు విశేషణాల కెక్కడను నుండనిపక్షమున నీవిధానము కేవలము సంస్కృతానుకరణమె కాని తెలుఁగుభాషకు విరుద్ధ మనవచ్చును. ఈలక్షణమునకు సూరి చూపినలక్ష్యములు తెలుఁగుభాష కసహజములా?

'మహాతీతరంబు లగుస్త్రీలింగంబులవిశేషణంబులు క్లీబతుల్యంబులు విభాష నగు' నని సూరి చెప్పె. అదియు దీని కపవాదమె. ఇట్టిచోట్ల బా.వి. సంస్కృతానుసారముగా స్త్రీలింగములోను తెలుఁగు ననుసరించి అమహత్త్వములోను నుండు ననురీతిగా వివరించుట స్థలాంతరమునఁ గానవచ్చు. ఇది యెట్టిది? విశేష్యంబునకుంబోలె నని

చెప్పనప్పుడు సంస్కృతానుసారముగా స్త్రీలింగ మగుట (పైసూత్రమునఁ గ్లీబతుల్యతయే గదా విధేయాంశము.) యెట్లు? అనుక్తమన్యశబ్దానుశాసనవత్తని సంస్కృతవ్యాకరణము ననుసరించి గ్రహింపవలెనా! చెప్పిన దక్కర లే దని చెప్పలేదు గాన నన్యవ్యాకరణము నుండి గ్రహింపవలె నన నేల?

విశేష్యంబునకుంబోలె ననుసూత్రమునకు బా.వి. ఒకనవర ణము ప్రతిపాదించినది. 'సుగుణాభిరామునియందు, రామునియందు నాకు భక్తి మిన్న యనుట యెట్లెట్టుగా నుండును. అందుచే సూత్రమున బహుళమును జేర్చిన కొన్నింటికిఁ బ్రవృత్తిగాఁ జెప్పఁదగు' (232) నన్నది. అట్లే యని సూత్రమున బహుళపదమును జేర్చుదము. దానివలనఁ గొన్నింటికిఁ బ్రవృత్తి యని చెప్పఁదగు నన్నది బా.వి. అనఁగాఁ దా నుదాహరించినస్థలమునఁ బ్రవృత్తి యని యభిప్రాయమా? అయిన విశేష్యవిభక్తియే విశేషణమునకు నిత్యముగా వచ్చి యెట్టెట్టుగా నుండు నన్నరూపమె నిత్యముగా నుండవలసియుండును. కొన్నింటికిఁ బ్రవృత్తి యనఁ జెక్కుంట నప్రవృత్తి యనియుఁ దా నుదాహరించినస్థలమున నప్రవృత్తియనియుఁ జెప్పుట బా.వి. అభిప్రాయము కావచ్చు. అయిన విశేష్యవిభక్తి విశేషణమునకు రాదు. మఱి యేవిభక్తి వచ్చును? సుగుణాభిరాముఁడు రామునియం దని యుంట యిష్ట మనుకొన్నఁ బ్రథమ రావలె. అప్రవృత్తి యన్న మాత్రమునఁ బ్రథమ రాదు గదా. సప్తమి రాకుంటమాత్రమే సిద్ధించును. ఇంక నన్యకార్యముగా సప్తమికి బదులు ప్రథమ యైన వనవలె. విశేష్యలింగవిభక్తివచనములు లేకున్న నేదో యొకలింగము, విభక్తి, వచనము తప్పవు. అవి యసలు లేకుండ నుండవు గదా. అనఁగా నిట నప్రవృత్తి యుండదు. అట నెల్లయెడల నన్యకార్యమె

ప్రవృత్తి లేదా యన్యకార్యము. విభాష యనఁదగినస్థలములందు నయితము పక్షాంతరమున నన్యకార్యమునే యూహింపవలె. పయి నన్యకార్యముగనె బా.వి. ఉద్దేశించిన నాయంశము స్పష్టముగనే చెప్పియుండెడి దనవచ్చు. అప్రవృత్తి యనుకొన్న నదియుఁ బొరపాటె. ఇట్టియెడల విశేషణమునకుఁ బ్రథమ యిష్ట మగుచో సూత్రమున బహుళశబ్దము చేర్చి దానివలన నన్యకార్యముగాఁ బ్రథమను సాధించుటకంటె విశేషణంబు ద్వితీయాదులకుఁ బ్రథమ చూపట్టుటను జెప్పుచో నది సూటిగను స్పష్టముగను నుండును. ప్రౌఢవ్యాకర్త యాపనియే చేసెను.

కాఁగా నింతకును సూత్రమున బహుళపదము చేర్పుట యనవసరము. సూరిసూత్రము యథాతథముగనే గ్రాహ్యము.

**మువర్ణకాంతము - ముకారాంతము :**

స్త్రీసమంబు లగువిశేషణంబులందు మువర్ణకాంతవిశేషణంబు లయి బహువచనంబున కేకవచనంబు బహుళంబుగా నగు ననులక్షణమునుగూర్చి బా.వి. 'ఆక్షేప మొకటి' యిట్లు చేర్కొన్నది. 'బహువచన మన్నపుడు మువర్ణకాంత మనరాదు. ఏకవచన మన్నపుడు మువర్ణకాంత మగును. ముకారాంత మన్న సరిపోయెడిది. (287) ముకారాంత మన్న సరిపోవుచో న ట్లనుటకంటె ముగంత మనుట యొప్పును. కాని ముకారాంత మనుట సరిపోవు టెట్లు? ముకారము అంత మందుఁ గలది ముకారాంత మని యర్థము. ఇష్టములు అన్నది ముకారాంత మనుట కెట ముకార మంతమున నున్నదా? బహువచనాంతము కదా. కావున ముకారాంత మనుటయు సరిపోదు. (ముగంత మనుటయుఁ జాలదు.) ఇట మువర్ణ మాగమమే కాని ప్రత్యయము గా దనునభిప్రాయముతో ముకారాంత మన్న సరిపోవు

నని బా.వి. తలంచిన ట్లున్నది. కాని యదియు నంతయుందు లేకుంట గమనింపవలసియున్నది.

మాటలు పెక్కేల ఇట 'పెక్కు' అను ప్రాతిపదికము స్త్రీసమము. మాట లనువిశేష్యమున కనుగుణముగా నియ్యది బహుత్వము నందుండి బహువచనము నందుచున్నది. దానికి బదులుగా నేకవచనము (ము) చేరి స్త్రీసమము గాన లోపింపఁ 'పెక్కు' అనియే యున్నది. అనఁగాఁ 'పెక్కులు' అని బహువచనాంతము చేసి బహువచన (లువర్ణక)మున నేకవచనము చేయుట లేదు. షష్ఠికిఁ బ్రథమ (సుగుణాభిరాముఁడు - రామునకు) యనుకృతి విశిష్టస్థలములందుఁ షష్ఠి ద్విత్ర్యంతరూపములందుఁ గూడ విభక్తికిఁ బ్రథమ చేయఁబడుచున్నదా? అట్లే యిట బహువచనమున నేకవచన మనుచోఁ గూడ. కాఁగా సూత్రమందలి స్త్రీసమశబ్దము స్త్రీసమములైన ప్రాతిపదికలనే తెలుపుట స్పష్టము.

అదే విధముగా 'మువర్ణకాంతము' అనునది సయితము ప్రాతిపదికమునే తెలుపును. అయిన నింతకుముందు స్త్రీసమ మన్నట్లుగా నిటఁ గ్లీబసమ మనుకృతిఁ జెప్పుటకు వీలు లేదు. అంత యైన యింగ్లనుకృతి యాదృచ్ఛికస్థలములందే కాదు శిష్టమైనపదార్థముల, అనుకృతి సంస్కృతసమములస్థలమున నిది గలదు. అమహత్తులు, క్లీబములు, క్లీబసమములు ననుమూఁడింటిని వేర్వేఱ చెప్పవలె. అంతకంటెను నివి మూఁడును బ్రథమైకవచనమున మువర్ణకాంతము లగుట సమానము కావున మువర్ణకాంతము లని చెప్పి యిమ్మూఁడింటిని సంగ్రహించుటలో లాఘవము కలిమి సూరి యట్లు చెప్పె నని గ్రహింపఁదగును.

మువర్ణక మంతమందుఁ గలది మువర్ణకాంతము. మువర్ణకము ప్రథమైకవచనమందే గదా యుండెడి. కావున మువర్ణకాంత మనఁగఁ బ్రథమైకవచనమందు మువర్ణక మంతమందుఁ గలిగినశబ్దము మని యర్థము.

మువర్ణకాంతవిశేషణంబుల కనగాఁ బ్రథమైకవచనమందు మువర్ణక మంతమందుఁ గలది యగువిశేషణశబ్దము-అనగా నమహత్తు క్లీబము-క్లీబసమము నైనశబ్ద మని యర్థము. అట్లే విశేషణప్రాతిపదిక మునను విశేష్యము ననుసరించి బహువచనము గా దాని కేకవచన మీసూత్రి ముచే నగును. ఇష్ట మగుపదార్థములు - పదార్థము లను విశేష్యము ననుసరించి 'ఇష్ట' అను విశేషణశబ్దమునకు బహువచనము వచ్చును. ఇట్లు ఇష్టశబ్దముపై బహువచనమునకు నీసూత్రముచే నేకవచన మును ఇష్ట మగు ... అని యుండు. కానిచో నిష్టశబ్దముపై బహువచనమే చేరి యిష్టములు - అని యగు.

## పంచమికి ద్వితీయ:

మైత్రుండు గృహమునుండి వెడలెను అనుపంచమికిమాఱుగా ద్వితీయ వచ్చెను (234) అను శా.వి.వచన మసంగతము. గృహము నుండి అనుచో ద్వితీయయే కాని పంచమి లేదు. ఉండిశబ్దము పరం బగునపుడు వలనకు ద్వితీయాసప్తములు ప్రాయికంబుగ నగు అని యిట ద్వితీయ యైనది. పంచమి కై సంతమాత్రమున నిచ్చటి ద్వితీయ పంచమి కాదు. గృహమును వెడలెను అనుచోటమాత్రము ద్వితీయ పంచమి కై నదే గద. గృహము వెడలెను అనుచోట ద్వితీయ పంచమి కై నట్లు నిరూపించునపుడు పంచమ్యంతరూపమును గృహమువలన వెడలె నని చూపవలె. సూరి 'గృహమునుండి యని యర్థ' మనుటలో అర్థము వివరించుటయే యుద్దేశము. కా దన్న ద్వితీయకు ద్వితీయ యేల? ఉండిశబ్దపరముగాఁ జెప్పఁదగియుండు.

## తృతీయకు - ద్వితీయ:

జనంబు తృతీయాసప్తములకుఁ జెప్పఁబడినద్వితీయ యుసంత ములకు బహువచనమందే యగు నని సూరి చెప్పెను. ఇట బా.వి.

'(అ)న్' అని నద్వితీయ శబ్దస్వరూపమునకుఁ జేరిన జలంబన్, బాణంబన్ - అని యగును. అట్లు గాక ఆగమముతోఁ జేరిన శబ్దస్వరూపము వికృతము కాదు. (235) అన్నది. జలంబుల+(అ)న్, బాణంబుల + (అ)న్ అని యిది లడాగమముతోఁ జేరిన దనియు శబ్దస్వరూప మవికృతి మైన దనియు బా.వి. అభిప్రాయము నెన్నవలెను. ఈవివరణము చారిత్రికదృక్పథముతోఁ జేయఁబడిన దేమో. (తె.వ్యా.వి. 958) శబ్దశాస్త్రమునకు మాత్ర మనుగుణము గాదు. వ్యాకరణము ననుసరించి ద్వితీయ యున్న 'ను' వర్ణమే కాని (అ)న్ - కాదు. కోలన్, లంకన్ - అనుచో నువర్ణమునకు ముం దత్వ మున్నను నయ్యది ప్రాతిపదికిఁ జెందినదే కాని ద్వితీయకుఁ జెందినది గాదు. బాణంబులన్ - లడాగమమునందలి దత్వము. కావున శబ్దస్వరూపమునకుఁ జేరిన జలంబన్ అని యగు ననుట నిరాధారము. జలంబును జలంబున్ అనియే యగును.

శబ్దస్వరూపమునకుఁ జేరిన జలంబన్ అని కావలె ననియు నాగమస్వరూపమునకుఁ జేరిన శబ్ద మవికృత మగు ననుటయు శబ్దశాస్త్రానుగుణము కాదు. జలంబులన్ అనుచో (ద్వితీయావిభక్తికే లడాగమ మయినది కాని లట్టునకు ద్వితీయ చేరలేదు గదా) ల-అను నది యాగమమే. కాని యట్లే జలంబు + న్-అనుచోఁ గూడ ముగాగమమె గదా యున్నది. ఇటఁ బ్రాతిపదిక జల - అనునదే యని స్పష్టమే. ఇఁక ముగాగమము ప్రాతిపదికకైన దనియు, లడాగమము విభక్తి కైన దనియు భేదమును గుర్తించుచో నువర్ణమే ద్వితీయ యవుటయు నేల గ్రహింపరాదు? తృతీయాసప్తములందుఁ గాక కర్మ యగుట ననుసరించి సహజముగనె ద్వితీయ యైనచో జలంబన్ బాణంబన్ అనియే యుండునా?

పరిణామము రెండుపాళ్లు గల్గినచో నర్థబోధ కవరోధము గల్గు ననియే శాస్త్రి మీనియను మేర్పఱచియుండు (744) నన్నది. అయ్యు బా.వి. 'ఇల్లు వెడలె అనుచో నపాదానార్థమునం దయినవలనకు నచ్చినద్వితీయకుఁ బ్రథమ యవు' నని (సహజద్వితీయకు మాత్రమే కాక) గుర్తించుట సముచితముగా నున్నది.

ఇంకను తె.వ్యా.వి. తృతీయాసప్తముల కైనద్వితీయకుఁ బ్రథమ రా దనుసూరివివరణమునుగూర్చి 'వ్యవస్థితవిభాషచేతనే యేర్పఱుప నగునీచోట బహుళసంజ్ఞ సార్థకత యెట్లో తెలియ'(944) దన్నది. విభాష యనియే ప్రయోగింపఁదగు నని యభిప్రాయ మన్న మాట. విభాషకుఁ బ్రవృత్త్యప్రవృత్తులు వ్యవస్థ చేసికొనవచ్చు. కాఁగాఁ బ్రవృత్త్యప్రవృత్తివిభాష లున్నచోట విభాషయే చాలు. ఇంక బహుళ మనవలసిన దెక్కడ? అన్యకార్య మున్నపుడే యన్నమాట. "నాల్గింటిలో నేమూఁడింటి నైన నిరూపింపఁగల్గినపుడే దీని నుపయోగించు టుచిత' (50) మని బా.వి. ఒకచో నేర్కొన్నది. కాని అన్యకార్యము తప్ప మిగిలినమూఁటికైన విభాషయే చాలును గదా. కాని ప్రవృత్త్యాదులు నాల్గింట నేవేని రెండుస్థితులు మాత్రమే యున్నను 'బహుళ' విధానము సార్థకమె యని చరిత్రానుగుణమువ్యాక లోపవిధానము మొదలగులక్షణములు నిరూపించుచున్నవి.

## అన్ని గుఱ్ఱములకు:

'అన్ని - సర్వనామము. ముందు ప్రయోగము. కాన విశేషణము' (238) అన్నది బా.వి. దీనివలన ముందు ప్రయోగింపఁబడినకారణముగా నన్ని యన్నది విశేషణ మనునభిప్రాయము గల్గు. కాని ముందు ప్రయోగింపఁబడినది విశేషణమని (తరువాతి

ప్రయోగింపఁబడినది విశేష్య మని) నిర్ణయింప వీలు లేదని యీ సూత్రముచేతనే స్పష్టము. విశేష్యము ముందు ప్రయోగింపఁ బడినచో అదియు ప్రథమాంతము వికల్పముగా నగు నని (౨౭౮) బా.వి. పిదపఁ జెప్పినది.

సర్వనామసంఖ్యాభిధాన ... అనునీసూత్రమున 'సంఖ్యాభిధానములు సర్వనామములే యైన వేఱుగాఁ జేర్కొనుట సంస్కృతమున సంఖ్యలు సర్వనామములు గామిచేత నని (బా.వి.) చేర్కొను టుచితము. కాని యీపిదప ననుబంధములో 'సర్వనామవిశేషణములకు - అన్ని గుఱ్ఱములకు, సంఖ్యాభిధానవిశేషణములకు - రెండు గుఱ్ఱముల కని యిచ్చినది. (43౭) సంఖ్యాసందర్భమున సంస్కృత సంఖ్యావాచకమును జూపుట యొప్పును - లేకున్న 'రెండు' సర్వనామము కాదేమో యని యనుమానము కల్గవచ్చును గదా.

విశేషణషష్ఠి - ప్రథమ :

'బహూనాం కేషాంచి ద్విశేషణంబుల షష్ఠికిం బ్రథమ విభాష నగు' ననువిధానమునుగూర్చి బా.వి. 'విశేషణానాం - విశేషణంబుల - అను బహువచనసారస్యముచే షష్ఠికే కాక ద్వితీయాదివిభక్తులకును బ్రథమ రావచ్చు' (2౮9) నన్నది. ద్వితీయాదివిభక్తులకుఁ బ్రథమ యగు ననుటర్థము సిద్ధించుటకు విశేషణశబ్దము యొక్క బహువచన ముప యోగించునా? అట్టియర్థము సిద్ధింపవలె నన్న షష్ఠిశబ్దమునకే బహువచన ముండవలయు నేమో. కర్మధారయంబులందు మువర్ణకంబున కనుచోఁ గర్మధారయేతరసమాసములం దైనను మువర్ణకమునకే గాని యితరములకుఁ బుంపు లవుట లేదు. కర్మధారయంబులం దుత్తునకు- టుగాగమ మన్నస్థలమున నుద్భిన్నాచ్ఛలకు టుగాగమమును బా.వి. చూపినను నది కర్మధారయంబులం దన్నప్పటిబహువచనముచే నైన

దని పేర్కొనలేదు. ఇట మాత్రము 'విశేషణంబుల' అన్నప్పటి బహువచనముచే షష్ఠీతత్సములకుఁ ప్రథమ యగు నన వీలు గల్గునా ?

విశేషణములు-ప్రథమ :

క.సం.వి. ననుసరించి (బా.వి. 241) కాంబోలును బా.వి. 'సముచ్చయము గాని అన్వక్రియ గాని లేకుండ విశేషణములు ప్రథమ లోను విశేష్య మితరవిభక్తులందునుగూడ నుండవచ్చును. ఆద్యుఁ డప్రమేయుఁడు హరిని గొలుతు' (240) అన్నది. విశేష్య మితర విభక్తులం దున్నప్పటికిని విశేషణము ప్రథమయందుఁ గూడ నుండ వచ్చు నని చెప్పుట బా.వి. ఉద్దేశముగా గుర్తింపవచ్చును. సముచ్చయము గాని అన్వక్రియ గాని లేకుండ అనుటలో భవత్యర్థకము లేకున్నను సముచ్చయ మున్నచో విశేషణమునకుఁ ప్రథమ యగుట లక్షణసిద్ధ మైనసాధారణాంశ మన్నట్లు బా.వి. ఉద్దేశముగాఁ దేలు చున్నది. కాని ఆద్యుఁ డప్రమేయుఁడును హరి గొలుతు ననుటయు బాల.చే నసాధ్యము. అయిన దాని ప్రయోగంబు లేనిచో అనుసూత్రము పై బా.వి. అర్థమును సాధింపఁజాలదు. కార. 20. సూత్రముచే సన్నిహితవిశేషణమునకు భవత్యర్థకము బహుళముగా ననుప్రయుక్త మగును. అనుప్రయుక్తి మైనపక్షలోనే విశేషణమునకు ప్రథమ వచ్చును. కావున బా.వి.లో 'సముచ్చయము గాని' అనువివరణ మసంగతము. ఇంక భవత్యర్థవ్యవహితము గాకున్నను ప్రథమ వచ్చునా? అందుకు బాల లో వీలు లేదు. అట్లు చెప్పినక.సం.వి. చూపిన-భక్తిగుణనయమానచిత్తుఁ డగజాధిపకీర్తి అనునది విశేషణషష్ఠికిఁ ప్రథమ యైనతావు. పార్థివ ప్రాగ్రసరుండు ధర్మసుతుఁడన్న' వంటిది. ఏమైన బా.వి. చూపిన

ఆద్యుఁ డప్రమేయుఁడు హరిని గొలుతు అన్నది సాధారణముగా సాధువు గాదు. ఒక్కొక్కచో విశేషణంబు ద్వితీయాదులకుఁ బ్రథము చూపట్టెడి నన్న ప్రౌఢ. కవిప్రయోగదృష్టమైనతావులు గ్రహించుట కవకాశము కల్పించునదే కాని సాధారణముగా ద్వితీయాదులకుఁ బ్రథమ విధించునది గాదు.

**రాముఁడు వచ్చుట:**

ఇక్కడ బా.వి. రామునియొక్క వచ్చుట షష్ఠికి మాఱు ప్రథమ వచ్చి వచ్చుధాతువునకుఁ గర్త యగుచున్నది (242), (తె.వ్యా.వి. 483) అన్నది

ఇది యసంగతము. సూరి 'భావార్థకాదియోగంబునఁ గర్తకుం బ్రథమ యగు' నని సూత్రింపఁగా షష్ఠికిఁ బ్రథమ వచ్చు ననుట యెట్లు?" చేతవర్ణకంబు కర్త కగు' ననుసూత్రముచేఁ గర్తృవాచకమునకుఁ 'జేత' రావలసియుండఁగా భావార్థకాదియోగమునం దాచేతను బాధించి యీసూత్రముచేఁ బ్రథమ యగు నని చెప్పవలసియున్నది. పైఁగా బా.వి. షష్ఠికి మాఱుగాఁ బ్రథమ వచ్చి వచ్చుధాతువునకు కర్త యగుచున్న దనుట సరి కాదు. దీనివలన షష్ఠికిఁ బ్రథమ యైనప్పుడే రాముఁడు కర్త యగు ననునర్థము గల్గును. వచ్చుధాతువునకు రాముఁడు కర్త యగుటకును షష్ఠీవిభక్తికిని (ప్రథమ) సంబంధ మేమి? సూరి ప్రథమ మాత్రమె విధించెను. బాల.లో. (సూత్రాంధ్రమున షష్ఠియుఁ జెప్పె.) అందుకే ప్రౌఢ వ్యాకర్త 'ధాతుజవిశేషణభావార్థకపూర్వవ్యవహితావ్యవహితకర్తృపదప్రథమకు షష్ఠి బహుళంబుగా నగు' నని సూత్రించెను. బా.వి. వివరణము ననుసరించిన షష్ఠికిఁ బ్రథమ సూరిసూత్రముచే రాఁగా

నాప్రథమకుఁ బ్రౌఢ.సూత్రముచే షష్ఠి బహువచనముగా నైన దనవలెను. ఏది యే మైన సూరి యిట షష్ఠికిఁ బ్రథమ యవు నని చెప్పలేదు. ముదట షష్ఠి యవుటకే బాల. ననుసరించి యవకాశము లేదు. తె.వ్యా.వి. (252) లో షష్ఠికిఁ బ్రథమ వచ్చుటగా సమన్వయింపఁ బడ లేదు. అయ్యది జేతవిభక్తికి మాఱుగనె ప్రథమ యైనట్లు చెప్ప వలసియున్నది.

దాన :

అదిశబ్దంబునకు వును లు పరంబుల గునపుడును సంబోధనము నను దాన యనునాదేశ మగు నని సూరి పేర్కొనె. ఇట బా.వి. అది చిన్నది నీవు చిన్న (అ) ది వు-నీవు చిన్నదానవు (నేను చిన్న దానను (244) అని చూపినది. అదిలో అకారము స్వప్రధానము చేసి చూపుట సరి గాదు. చిన్న + అది + వు - అనియే చూపి 'అది'కి దానాదేశము చేయవలె. దానాదేశవిధానము ననుసరించియే యల్లోపము లే దని గుర్తింపవచ్చును. వును (నము)లు అంతాగమములు ప్రాయికమనుటచే నిట నాగమము నియతమని గ్రహింపఁ దగును. నీవు చిన్నది యని యుండదు గదా.

ఇం కొకవిశేషమును బా.వి. ఇట్లు పేర్కొన్నది. "ఇతర విభక్తులు చెప్పునపుడును అదికి దానాదేశము కల్గును. చిన్నదానిని పిలిచెను. చిన్నదానితో మాట్లాడెను మున్నగునవి." (244) అనఁగా సూరి పేర్కొన్నస్థలములందలి ప్రథమయందే గాక ద్వితీయాదులందును నికార్యము గల దన్నమాట. అది సూరి చెప్పకుంట యొకలోపమనియు బా.వి. అభిప్రాయమై యుండవచ్చు. కాని బా.వి. చిన్న దానిని చిన్నదానితో నన్నపు డున్నది దానాదేశ మనుట యసంగతము. దానయే యైనఁ జిన్నదానను జిన్నదానతో నని యుత్వ

ముండవలెఁ గాని దానిని దానితో నని యిట్లు యెట్లు? ఔప విభక్తికము గాదు గదా. ఇది 'దాన' కాదు. ఇటఁ దచ్ఛబ్దముతో సంబంధార్థమున సమాస మైనది. ఆసమాసము ప్రథమాంత మైనప్పు డుమహత్త్వమున 'నది' అనురూపమున నుండు నుత్తరపద మగు తచ్ఛబ్దము. ద్వితీయాదివిభక్తులం దాతచ్ఛబ్దము 'అది' యని యుండదు గదా. కాఁగా దానాదేశము సంగతి తెలుపుటఁ గాని ద్వితీయాది విభక్తిస్థలమున 'అది' యని చూపుటయే పొరపాటు. తచ్ఛబ్ద మమహ దర్థమున ద్వితీయాదివిభక్తులలో దానిని దానిచేత దానికొఱకు నిత్యాది రూపములందు. చిన్నదానిని ఇత్యాదులం దున్నది ద్వితీయాద్యంత మగుతచ్ఛబ్దరూపమే కాని అది యుండుటయు దానికి దానాదేశ మగుటయుఁ గాదు. కాఁగా సూరి యిట్టిస్థలముల 'దాన'ను జెప్ప కుంట యెంతయు నుచితము.

## వాక్యము - పదప్రయోగక్రమము :

ఏకవాక్యమునం దొకానొక్కెడ నొక్క సర్వపదంబులు క్రమనిరపేక్షంబుగం బ్రయోగింపం జను నను విధానము బా.వి.కు నచ్చలేదు. "మంచిబాలుఁ డితఁడు మంచి యితఁడు బాలుఁ డన నచ్చునా? మంచి యేని వంటిది కాదు గదా. చల్లని గాలి వీచెను. చల్లని వీచెను గాలి యననగునా? ఈసూత్ర మేల రచింపఁబడెను? ఇట్టివి సకృత్తుగా నుండునే కాని సాధారణముగా నుండవు" (246) అన్నది. సకృత్తుగా నైన నస లుండును గాన సూత్రము చెప్పనే యక్కర లేదనరాదు. అట్లయ్యు నీయవి యసాధారణ మనియుఁ గానఁబము నిర్ణయింపరాదు. అందుకేయి బా.వి రెం డుదాహరణము లిచ్చినది. చల్లనిగాలి వీచె ననుచో చల్లని వీచె గాలి యనరా దంట. అనవచ్చు నని సూత్రము చెప్పుచున్నదా? చల్లనిగాలి యన్నది

సమాసము గదా. నిగాగము మీయంశము నింకను స్పష్టము చేయుచున్నది. (నిక్కు లేకున్నను నిది సమాస మనుట స్పష్టమే) సమాసమేకపదము గదా. చల్లనిగాలి యనుకీతిసమాసమునందుఁ బూర్వోత్తర పదములను వేఱు చేయు టెట్లు! ఇట్టిక్రమనిరపేక్షత సంస్కృతమునందుఁ గల దని బా.వి. పేర్కొన్నది. సంస్కృతమున నైనను రాజ పురుష ఆగతః అనుచో రాజ ఆగతః పురుషః, పురుష ఆగతో రాజా, ఇత్యాదిగా నుండునా? రాజపురుష ఆగతః, ఆగతో రాజపురుషః అని క్రమనిరపేక్షముగాఁ బ్రయోగింపవచ్చును. అట్లే చల్లనిగాలి వీచె ననుచోఁ గూడ చల్లనిగాలి, వీచెను అన్నవి రెండే పదములు. వీచెను జల్లనిగాలి యనియు ననవచ్చును. అట్లె యింతకు ముందు చూపిన మంచిబాలుఁ డితడు — అనుచో మంచిబాలుఁ డన్నది సమాసమే. ఇటను సమాసమునం బూర్వోత్తరపదములను వేఱు చేయుటకు వీలు లేదు. మంచిబాలుఁ డితఁ డనుచో ఇతఁడు మంచిబాలుఁ డనియు ననవచ్చు నంటియు, బా.వి. విమర్శించినతీరు సరి గాదు. కాన లక్షణ మేలకో స్పష్టమే.

క్రమాపేక్ష గలయేనిప్రభృతులలో బా.వి. పొందును (248) జూపినది. ప్రౌఢవ్యాకర్త చతుర్థికి విధించెను. దీనికిఁ బదముగాఁ ప్రయోగము లేదు. (స్వతంత్రముగాఁ బ్రయోగింపఁబడక) అపద మైన దీని నేనిప్రభృతులలోఁ జేర్పరాదు. కన్న వల్ల మున్నగువానివంటిదే యిదియు.

—*—

# సమాసపరిచ్ఛేదము

## సిద్ధసమాసములు :

సంస్కృతములోనే సమాసముగా నేర్పడి (యాసమాసము మొత్తము తెలుఁగునఁ బ్రాతిపదికముగా) నవి సిద్ధసమాసములు. వీనిలక్షణములను తెలుఁగువ్యాకరణములు చాలవఱకుఁ బేర్కొన లేదు. దీనింగూర్చి బా.వి. 'తెలుఁగువ్యాకరణమును సమగ్ర మొనర్చు కొనవలయు నన్న ఆలక్షణములు తగుమేరకు సంగ్రహించుకొనవలయు. కాని సూరి యట్టిప్రయత్నమును జేయక...(249) యని యొక లోపమే యున్నట్లుగాఁ బేర్కొన్నది. సాధ్యమిశ్రాచ్ఛికసమాసముల యెడనే 'తత్పురుషాదులకు లక్షణంబు ప్రాయికంబుగా సంస్కృతోక్తంబ యగు' నని చెప్పఁబడుట గమనార్హము. సిద్ధసమాసముల యెడ సమాసమును నాయాసంధ్యాదులను సంస్కృతమునందే సంస్కృతలక్షణానుగుణముగ సిద్ధించుచున్నవి. తెలుఁగువ్యాకరణమున దానికిఁ బ్రసక్తి పెట్టుకొనకుంటయే యుక్తము. రాజపురుష-యన్నది సిద్ధసమాసము. కాఁగా నాసమాసమె తెలుఁగునఁ బ్రాతిపదిక మగు. ఇది యెట్లేర్పడినదో వివరించుట యనవసర మన్న రామాదికృదంతములును, భార్గవాదితద్ధితాంతములును, వాక్ - మున్నగు హలంతశబ్దములును-మున్నగునవియు నెట్లేర్పడునో చెప్పుట యవసరము కాదా? సంస్కృతమందలియాయాసంధికార్యములను దెలుఁగునఁ జెప్పవలె. సంస్కృతప్రాతిపదికము (మొ॥) తెలుఁగున నెట్లు నని చెప్పినప్పుడు సంస్కృతమున నాప్రాతిపదిక (మొ॥) ఎట్లేర్పడు నన్నదానితోఁ దెలుఁగువ్యాకరణమునకు సంబంధము లేదనుటయే యుక్తము. ఇట్లే ప్రాకృతములయెడను. తెలుఁగువ్యాకరణాధ్యయనమునఁ గొంతవఱకు

సంస్కృతముపై నాధారపడుట గలదు. టిత్త్వైకిత్త్వాదుల ప్రయోజనాదులు దెలుఁగునఁ జెప్పఁబడినవా? ఇంకను నది యవసర మన్నఁ (దెలుఁగులక్షణసమగ్రతకు) గావచ్చు నేమో కాని యిది మాత్రము కా దనక తప్పదు. కా కున్న సంస్కృతవ్యాకరణమందలిసంజ్ఞాది పరిచ్ఛేదములలక్షణము దెలుఁగున ననువదింపవలయు కావున సిద్ధసమాసముల ప్రక్రియను జెప్పఁబూని తెలుఁగువ్యాకరణస్వభావమును గుర్తింపలేనట్లుగాఁ జేయుటకంటె సముచితముగా నట్టిది చెప్పకుంటయే యొప్పు నని గ్రహింపఁదగు. స్పష్టతకయి వ్యాఖ్యానము లట్టి పని చేయఁదగు.

శ్రీ.వి. భాషాభేదమునుబట్టి సమాసములను విభజించుచుఁ దటాకప్రటుదక మనుకీర్తితత్సమసమాసములను గూడ సంస్కృత సమాసములుగాఁ జేర్కొనుట (430) సరి గాదు. సాంస్కృతికము లనుసారివ్యవహారమై (సిద్ధ) సాధ్యములకు సరిపడియున్నది.

ఇంకను సంస్కృతసమాసము లను బ్రస్తావించుచు – పద్మము వంటిముఖము ముఖపద్మమే కాని పద్మముఖము కా దనుచు పద్మ మొక్క ముఖము పద్మముఖ మగు ననియు చరణకమల మనుదానిని కమల చరణ మన్న కమలమొక్క చరణ మగు ననియుఁ (256) జేర్కొనుట విచారింపను. పద్మమొక్క, కమలమొక్క యని చేర్కొనుచో సయ్యాని సాధ్యము లగును. ఇట్టిసాధ్యసమాసములు సంస్కృతమందలిసమాస మె ట్లగును? సంస్కృతమం దైన పద్మముఖము కమలాచరణము నని యుండవలె. కాఁగా సిద్ధియిం భేదముతో నైనను పద్మముఖకమలచరణసమాసములు సంస్కృతమున నేర్పడ వని గ్రహింపవలసియున్నది.

(38)

## మ గ పి ల్ల లు :

‘మగపిల్ల లనుచో కర్మధారయ మగును, ద్వంద్వసమాసమునఁ బూర్వపదము ప్రాయికముగా స్త్రీసమము కావలయు నన్నది (251) బా.వి. కర్మధారయమునందుఁ బూర్వపదము స్త్రీసమము కావలయు నట్లుంచి యసలు మగపిల్ల లనుసమాసము కుదురదు. మగవారైనపిల్లలు, లేక మగలైనపిల్ల లని యుండవలె. కర్మధారయంబు త్రికస్త్రీసమముగంతధాతుజవిశేషణపూర్వపదంబయి యుండవలె. కానఁ గర్మధారయమునఁ బూర్వపదము డుమంత మగుటకు వీలు లేదు. ‘సంస్కృతతుల్యము డుమంతము నగుబల్లిదుండు మల్లుండు అనుకొని సమాస మేర్పడదు.’ (257) ఇక్కడ బా.వి. సంస్కృతతుల్యత్వమును ప్రస్తావించుట యనవసరము. దీనివలనఁ గర్మధారయమునఁ బూర్వపదము డుమంతము కారాదన్న సంస్కృతతుల్యమైనడుమంతమే కారాదనియు (సంస్కృతతుల్యేతర) అచ్ఛిక (సంస్కృత?) డుమంతము కావచ్చుననియు భావించుట కవకాశము గల్గును. ఒకవేళ నట్టియుద్దేశముతోనె యిట మగపిల్లలు అనుచోఁ బూర్వపదము దేశ్య మగుడుమంతము గానఁ గర్మధారయసమాసము సిద్ధించు నని యెంచిన నది పొరపాటే. ఇది సూత్రోక్తమైన త్రికస్త్రీసమముగంతధాతుజవిశేషణములలో నెందును జేరదు గదా. కవిప్రయుక్తమై గాననయిన నిక్కాలాదులలోఁ జేర్చుకొనవలసినదే.

## ఆ వ్య యీ భా వ ము :

సమాసములను విభజించుచు నందుఁ బూర్వపదార్థప్రధానములను జేర్కొనుచు బా.వి. “పెడతల, క్రేఁగన్నుల, నడురేయి మున్నగునవి యిట్టివిగా ఆంధ్రభాషాభూషణము. (111 ప) ఇట్టివానిని

జిన్నయసూరి పేర్కొనలేదు. వీనికే యవ్యయీభావసమాసము లని సంస్కృతమున వ్యవహారము (432) అన్నది. పెడతలాదు లవ్యయీభావసమాసము లని పూర్వపదార్థప్రధానము లని బా.వి. అభిప్రాయము. పైని జూపినయూడిట తల, కన్నులు, రేయి, యన్నవి విశేష్యాలు. విశేషణమునకు విశేష్యముతో సమాన మగుట నివి కర్మధారయము లగుదు సూరిచే నిరూపింపఁబడినవే యగుచున్నవి. క్రింద + కాలు క్రీఁగా లనువంటిదే క్రేవ + కన్నులు క్రేఁగన్ను లన్నదియు పెడ, క్రేవ, నడుము శబ్దము లవ్యయములా? ఇందుత్తరపద మగువిశేష్యమునర్థమె ప్రధానము గావున వీనిని బూర్వపదార్థప్రధానము లనుట విచార్యము. (బా.వి. 255) సూరి తెలుఁగున నవ్యయీభావసమాసములు లే వనెను. (ఆం.శ.శా.)

## ధాతుజవిశేషణములు-తచ్ఛబ్దానుప్రయోగము :

ధాతుజవిశేషణంబులకు విభక్తి వివక్షించునపుడు తచ్ఛబ్దం బనుప్రయుక్తం బగు ననుటను వివరించుచు బా.వి. 'వాఁడు, అది అనుసర్వనామములను క్రియాజన్యవిశేషణమున కనుప్రయుక్తము గావించినచో అది విభక్త్యంత మగును' (260) అన్నది. వాఁడు అది చేరు ననుట సరి కాదు. విభక్తి వివక్షింపఁగాఁ దచ్ఛబ్ద మగునాశబ్దమే యనుప్రయుక్త మగు. మహదమహత్త్వముల ననుసరించి యాశబ్దమె పైనున్నవిభక్తి కనుగుణముగా వాఁడు అది ఇత్యాదిగాఁ బ్రథమ యం వగును. ధా.వి.లపై ద్వితీయాదివిభక్తులను వివక్షింపఁగా ననుప్రయుక్తమైనఆశబ్దము పైనిద్వితీయాదులతోఁ దదంత మయి వానిని దానిని ఇత్యాదిగా రూపము లందును. వాఁడు - అది అనునవే చేరిన ద్వితీయాదులలో వచ్చినవానిని ఇత్యాదిగా (260) నగుట యసం

శబ్దము నుదాహరింపకుంట గమనార్హము. అట్టిప్రయోగము లొండు రెండు గానవచ్చు. (శ్రీం.శా.)

నిగాగమము :

నల్లాదు లదంతములు. చక్క చిక్క ఇత్యాదు లదంతము లయినను నిగాగమము తప్పక ప్రవర్తిల్లను అన్నది. బా.వి. అనఁగా అదంతము గానిచో నిగాగమము తప్పక ప్రవర్తిల్లుటలో విశేషము లేదా? నిగాగమము విధింపబడినవన్నియు లదంతము లని బా.వి. చెప్పెనే కదా.

'చిన్నవాఁడు పెద్దవాఁడు దొడ్డవాఁడు ఇత్యాదులం దప్రవృత్తి.' అన్నది బా.వి. వీనికి నిగాగము మసలు లేదు. సూత్రము నల్లాదులకుఁ గదా నిగాగమము చెప్పుచున్నది. నల్లాదులలో చిన్న ఇత్యాదులను సూరి చేర్చెనా? ఆకృతిగణ మైనమాత్రమున నెల్ల శబ్దములను జేర్ప నవసర మేమి? అట్లు చేయుచో నల్లాదు లని యొక గణము నేర్పఱుప నేల? విశేషణముల కెల్ల సామాన్యముగనె చెప్పవచ్చునె. కాఁగా ప్రయోగములందు వేనికి నిగాగమము లేదో యాశబ్దములు నల్లాదులలోఁ జేర్పనేరాదు. నల్లాదులలోఁ జేరకున్న వానికి నిగాగమము ప్రాప్తింపదు. కావున అట అప్రవృత్తి యను ప్రశ్నయే లేదు. కాఁగా నొకకార్యము సాధారణముగఁ గాక నొకగణమునకు బహుళముగా విధించినసందర్భమున నట అప్రవృత్తి యుండవచ్చును. చక్కాదులకు మువర్ణకలోపము బహుళము. వనాదులకు లేదు గాన నప్రవృత్తి యనుట యొప్పును. గతమో చిన్న ఇత్యాదుల నిగాగమమున కప్రవృత్తి యనుటయు నట్లు.

**మూఁడు డు (జ్) లోపము :**

సమానాధికరణం బగునుత్తరపదంబు పరం బగునప్పుడు మూఁడుశబ్దముడువర్ణంబునకు లోపంబును మీఁదిహల్లునకు ద్విత్వంబు

ర్ణకము గా ననుట యొప్పును. మూఁడులో డువర్ణము శబ్దావయవమె కాని ప్రత్యయము గాదు గావున డుమ్వర్ణకము గానేరదు. కాని ఖండ బిందుపూర్వకమైనయాడువర్ణమును డుమ్వర్ణ మనుటమాత్రము భ్రాంతి కానేరదు. డుమ్వర్ణ మన్నమాత్రమునఁ బ్రథమైకవచన మగుప్రత్యయమే యని చెప్పవలసినయవసర మేమి? (అట్లు చెప్పవలె ననుకొన్నఁ దప్ప డుమ్వర్ణ మనరా దనుటకు నాధార మేదియు లేదు. కుజ్, వజ్, ఇత్యాదుల నితరస్థలములందును జకారము నిత్తుగాఁ జేర్చునే కద. జిహ్వమునకుఁ బ్రయోజనము బిందుపూర్వక మగుట. అనఁగా నిట డుమ్వర్ణ మనఁగా బిందుపూర్వకడువర్ణము. దానికి లోప మనుటలో దోష మేమి? ఇట ఖండమే యున్నది గాన దానితోడిడువర్ణమే లోపించు. కాన డుమ్వర్ణకమునకు లోప మని చెప్పుపాఠమే సమంజసము.

## మిశ్రద్విగువు-ఏకవచనము :

సూరి ద్విగువున కేకవచనంబు ప్రాయికంబుగా నగు మిశ్రంబునకుఁ గా వనఁగా బా.వి. మిశ్రద్విగు వేకవచనాంతము కా దని సూరి పేర్కొన్నను సద్దిక్కు ముల్లోకము వంటివి లేక పోలేదు. అందుచేతనే ప్రకృతివివేకకర్త 'అన్యత్రాపిక్వచిద్భవే త్తని సవరించుకొనెను. (266) అన్నది. ఇట్టిప్రయోగములకై వి.వి.ని కాక ప్రౌఢ.ను స్మరించిన బాగుండెడిది. (తె.వ్యా.వి. 878) అన్యత్రాపి క్వచిద్భవే త్తను దానికి మిశ్రద్విగువున కేకవచన మగుట గా నహోబలాదులు వ్యాఖ్యానింపలేదు. కూడుచీర ఇత్యాదిగా ద్వంద్వమున నేకవచనమును జెప్పు నదిగా నెన్నిరి. అదియే యుక్తము. కాలుసేయి యనుకీతిస్థలముల సంస్కృతానుసారముగనె యేకవచనము సిద్ధించుచుండ 'అన్యత్రాపి' యని యేకవచనము చెప్పుట కూరగాయిత్యాదుల కని యహోబలు నభిప్రాయ మంతియ కాని తె.వ్యా.వి. చెప్పుచున్నట్లు 'కూడుచీర

వంటివే సాధువు' (893 అని కాదు. ఇంక నిట ద్విగోరమిశ్రేతాయాం ప్రాయ ఏకత్వ మిష్యతే యన్న వి.వి. అంతటితో నాగక మిశ్రే తాయాం బహుత్వం స్యా త్తని స్పష్టము చేసినది. అట్టి వి.వి. అస్యత్రాపి క్వచిద్భవే త్తని యూనెంటనే మిశ్రద్విగువున కేకవచనా చెప్పె ననుట యుచితము గాదు. అట్టిచో మిశ్రితాయాం బహుత్వం స్యా త్తని మఱి యొకసారి చెప్పుట కేవలము వ్యర్థ మగునటె. కావున వి.వి. మిశ్రద్విగువున కేకవచనము చెప్పె ననుట యంగీకార్యము కాదు. ఏకవచనాంతద్విగువులను తె.వ్యా.వి. సమాహారద్విగువు లని (౨౪౮ పు॥) వ్యవహరించుట విచార్యము. (మా. త్రి. శే.)

**తా మ ర పా కు :**

ఆం.భా.చ. నన్నపార్యుడు కొండసూరంబికి తామరపాకు అనువానిని (అత్తునకు సంధి బహుళముగా నగు ననుచోటి బహుళ శబ్దముచే) నన్యకార్య మయినందులకు లక్ష్యములుగాఁ జెప్పెది. అది సరి గా దని తె.వ్యా.వి. చెప్పు టుచితము. ప్రౌఢవ్యాకర్త ౦మ గాగమము లనెను. 'ఉపము మున్నగునవి యాగమము లను కొనుట భ్రాంతిమూల (428) మని తె.వ్యా.వి. పేర్కొన్నది (మా. త్రి. శే.) తామరపాకునుగూర్చి తె.వ్యా.వి. 'తామరము అనునది యొకప్పు డుండి యుండవచ్చును. లేదా తమలపు వంటిపదసాదృశ్యమున నేర్పడి యుండును. ఇచట 'పు' ఆగమ మనుకొన్న వే - వేఁప, పాము - పాఁప వంటిరూపము లవలె తామరప + ఆకు - తామరపాకు అని యేర్పడియుండు (428) నన్నది. తామరము అనుశబ్దము గల పనుటను తె.వ్యా.వి. ఎట్టియాధారమును జూపలేదు. తామరము అనుశబ్దము సంస్కృతమున నేకోశమును జూపియుండలేదు. వరుసగా తామరకెంపు, తామరమాలి తామరతూఁపు మొదలైన సమాసములనుబట్టి తామర ప్రసూనమే యని గ్రహించుట కవకాశ మేర్పడుచున్నది.

తామర మని యుండవచ్చు ననుటయు తములము శబ్ద సామ్యముచే తామరపా కని యేర్పడియుండవచ్చు ననుటయుఁ జారిత్రికమార్గములో నొప్పిన నొప్పవచ్చు. కాని శబ్దశాస్త్రసంప్రదాయమున నట్లు నిరూపించుటకు వీలు లేదు. మువర్ణమునకు సమాసమునఁ బుంపు లవును. పుంపుల కచ్చు పర మైన టుగాగమము నిత్య మని సూరి తలఁచెను. టుగభావమును గలదు. ఇటఁ గూడఁ దములపా కను దానితో తములపు టాకు (రాధికా 1-79) అనియుఁ గలదు. కాని తామరపా కనుచోఁ దామరపు టా కని యున్నదా? ఇతరసమాసముల మువర్ణచిహ్నమే కానరాదు. ఏ మైనను దామర మనుశబ్దముండవలెఁ గదా. కేవలము సామ్యమువలననే యేర్పడినను దానిని శబ్దశాస్త్రము ప్రత్యేకముగాఁ జెప్పవలసియే యున్నది. (కావున పుగాగమము చెప్పుట యొప్పును.) ఇది వ్యా.సం.స. గూడ గుర్తించి యుండవచ్చు. అందువలననే వేఁప, పాఁప-వంటిరూపాలవలె తామరప + ఆకు తామరపా కని యేర్పడియుండు ననుచు పుగాగను మనుటకన్న పవర్ణ మనుట యొప్పి నన్నది. కాని వేఁపాకుతో తామరపాకునకు సాదృశ్యము లేదు. వేము - వేఁప, పాము, పాఁప, యనురీతిగా నైన దన్న నట మువర్ణమునకు పవర్ణ మైనది. తామరము అనుశబ్దమే లేనపుడు మువర్ణమునకుఁ బవర్ణము చెప్పుట కవకాశము లేదు గదా. కాఁగాఁ బవర్ణము నాగమముగాఁ జెప్పవలె-తామరకుఁ బవర్ణ మాగమము కాఁగా తామరప + ఆకు అని యుండ నత్వసంధి చేయవలె. తామరపయాకు అనురీతిరూపము లేదు గావున నత్వసంధిని జెప్పు సూత్రమందలిబహుళపదముచేఁ బ్రవృత్తి యసవలెను. ఇంతకంటెఁ బగాగమముగాఁ గాక పుగాగమముగా విధించుటలోనే లాఘవ మున్న దనుట స్పష్టమే కద. ఆగమము చేయక తప్పనపుడు పవర్ణమునే

యేల? పకారమునే చేయనవుఁ గదా. మువర్ణమే యన్నను పుంపులుఁగాఁ గాక పవర్ణముగాఁ జెప్పుట విశేషమే. అదియు నాకుశబ్దపరకత్వము నందే గదా. అట్టియెడలఁ దామరపాకనురీతిరూప మొక్కటి యుద్దిష్ట మైయుండఁగా బుగాగమ మనుటయే యెంతయు నుచితము గానఁ ప్రౌఢ.విధాన ముచితిమె. సూరి యితరవ్యాకరణముల నిట్లు చెప్పె.

సాదృశ్యమున కైనను వేఁప, పాఁప-యనువానిని జూపుట యుక్తముగా లేదు. మువర్ణ మున్నను 'ప'వర్ణము వచ్చుటకుఁ గనుమ్రావాదులను జూపఁదగును. వేముప్రభృతులకు వచ్చునది పవర్ణము గదా. వేఁప, పాఁప-యని యటఁ బవర్ణమునకు ముందుబిందు వుండును. ఇటఁ దామరఁపాకు, తామరంపా కనురీతిని బిందు వుండదు గదా.

సరసపువచనము :

దీనింగూర్చి బా.వి. సరసము + వచనము ఇట 'ము'సమాస మేర్పడునప్పటివిభక్తి కాదు. సంస్కృతశబ్దము తెనుఁగునఁ బ్రవేశించు నపుడు చేరినవిభక్తి. అందుచే దీనికి లోపము లేదు. 'పు' ఆదేశము కాఁగా సరసపువచనము (272) అన్నది. సమాస మేర్పడునప్పటి విభక్తి యన నేమో వివరింపవలసియున్నది. రామునియొక్క అన్న ప్పటివిభక్తికంటె (ఇదిసమాసమున లోపించుచునే యున్నది గదా) సరసము అన్నప్పటిభేద మేమి? మువిభక్తి లోపింపకుంటకు? ఏ మైనను సంస్కృతశబ్దము తెనుఁగులోఁ బ్రవేశించునపుడు చేరిన విభక్తి యగుటచేత లోపము కా దనుట యసంగతము. సరసపు వచన మనుచో మువర్ణకము లోపింపకపోవుటకు బా.వి. చూపిన కారణము సరి యైనది కాదు. మువర్ణకము విభక్తి యవుటచే (మువర్ణకమునకు విధించుకార్యము ముగాగమమునకు నగును గావున

నాగమ మైనదియు) సమాసవిభక్తి కనుస్వాత్రముచే లోపింప వల సియే యున్నది. లోపము రా దనుటకు వీలు లేదు. చుట్టజిక మనుచో వృత్తిని విభక్తిలోప మన్నది (277) బా.వి. అది సంస్కృతసమము గాదు గాన లోపించినదా ? సంస్కృతసమ మైన లోపింప దనుటకు నితర మైన లోపించు ననుటకు నాధారము చూపవలసియున్నది.

కర్మధారయంబునందు మువర్ణకంబునకుం బుంపు లగు ననుచో మువర్ణకమునకుఁ బుంపులు విధించినసామర్థ్యము ననుసరించి 'ము' లోపింపక పుంపుల నందు నని గ్రహింపవలెను. 'ము' లోపించిన పుంపు విధానము వ్యర్థ మగును గదా. కావుననే కర్మధారయములో మువర్ణక మల్లె యుండదు. (అచ్చతెల్పు ఇత్యాదుల లోపము విశేష మగుట స్పష్టమే.)

## ముక్కంటి :

'మూఁడు + కన్నులు ముక్కన్నులు 'న్నులు'కు ఔపవిభక్తిక మగుటివర్ణము సమాసాంతకార్యముగా రాగా ముక్కటి (198) ముక్కంటి' (269) అను బా.వి.వివరణము సంగతము గాదు. 'న్నులు' అను మొత్తమునకు టివర్ణము వచ్చు ననుట ప్రమాదము. 'లు'వర్ణము చేరిన నది పదమె యగును. ముక్కన్ను అనుసమాసప్రాతిపదికమున 'న్ను'వర్ణమునకె సమాసాంతకార్యము కాఁగా ముక్కంటి అనుప్రాతి పదికపై ఆయావిభక్తులు చేరును.

'ముక్కంటి' అనుచోట టివర్ణ మౌపవిభక్తిక మగున దనుటయు సరి కాదు. సూరి సమాసాంతకార్య మనెనె కాని ఔప విభక్తికప్రసక్తి తేలేదు. 'ఔపవిభక్తికవద న్నవిధయశ్చ' అని చింతా మణి చెప్పినది. కాని బా.వి. 'క్వచిద న్తిమవర్ణస్య సమాసాంతత్వ మిష్యతే' యనువి.వి.కారికను మూలముగాఁ జూపినది కాని చిం.

లక్షణము నీయలేదు వి.వి. కారికలోఁ గూడ ఔపవిభక్తికము ప్రసక్తి లేదు.

ఇ ట్లీటివర్ణ మౌపవిభక్తికము గాదు గావున బా.వి. పదాద్యం బగు అనుఅచ్చు. 33. సూత్రముచే దీనికి ముందు పూర్ణబిందు వగు ననుటయు నసంగతము. కాఁగా ముక్కన్ను అనుసమాసమున 'న్ను' వర్ణమునకు 'ంటి' అన్నది సమాసాంతకార్యముగా వచ్చిన దని గుర్తింపవలయును.

పోఁడి - బోఁడి :

బహువ్రీహిని స్త్రీవాచ్యం బగుచో నుపమానంబుమీఁది మేనునకు బోఁడియగు నని సూత్రము. సూరి బోఁడినే యాదేశించె నని పేర్కొన్న బా.వి. ఆప్రక్రియ నంగీకరించుటలోఁ గొన్నియవరోధములు ప్రస్తావించినది.

'పోఁడికి పోఁణి యనురూపాంతరముతో' నిట్టి సమాసము లున్నట్లు సూ.ని. చూపినది. ఇట్టిది సూరిపద్ధతిని సాధ్యపడదు. (బా.వి. 270, తె.వ్యా.వి. 903) ఎందుకు సాధ్యపడదు! అడంగ్వాదులకు ణకారం బనుచో సూరి పోఁడిశబ్దముమాత్రమే చూపెననియా? అది నియతగణము గాదు గదా. అలరుబోఁడీత్యాదుల నందుఁ జేర్చిన ణాదేశము వచ్చుట కవరోధ మేమి! బోఁడి నందుఁ జేర్పకుంట యొకయాధారము కాదు. బోఁడి యుపదము గాన సూరి దాని నటఁ జూపఁడు. ఒకవేళ 'పోఁడి'నే యాదేశించినను అడంగ్వాదులలోఁ జూపినపోఁడినిబట్టి ణాదేశ మగు నని భావించుట (తె.వ్యా.వి. 904) పొరపాటు. అదిష్ట మగుపోఁడి (యుపదము) ప్రసిద్ధపోఁడిశబ్దముకంటె భిన్నము గదా. ఇంక నట నలరుబోఁడి యనురీతిసమాసములనే చూపవలె. చూపకున్నను గ్రహించుట కవకాశము కలిమి స్పష్టము.

ఉత్తరపదమున కిట్లు ఆదేశము చేయుట, సంస్కృతవ్యాకరణములందు లేకుంట (278) యొక్కయవరోధము గాదు. తెనుఁగున జరుగుకార్యముల కెల్ల సంస్కృతమునఁ బోలిక యుండవలయు నని నియమ మేమి? న్రుగుగాగమాదిసంధికార్యములు సంస్కృతమున లేవని తెలుఁగున నుండరా దనఁదగునా? సంస్కృతమున నేయేవానికిఁ గర్మధారయాదిసమాసము లేర్పడుచున్నవో తెలుఁగున నట్టివాని కెల్లఁ జెల్లుచున్నదా? 'ప్రక్రియార్థము పశబ్దము నైనను దేని కైనను వ్యాకర్త విధింపఁగలఁ' డని బా.వి. (270) పేర్కొనుట యుచితముగా నున్నది.

పోఁడితోనే సమన్వయించుచు (ఇంతకుముందు బా.వి. ణాదేశమునే ప్రస్తావించినది కాన ణాదేశమునకె యైనఁ బోఁడితో సమన్వయించుట యనవసర మని స్పష్టము.) "నుగాగమము నంతట విధించి కొన్నచో బిందుసమస్య తీఱును" (270) అన్నది బా.వి. కాని యప్పుడే బిందుసమస్య క్రొత్తగా నేర్పడు నని గ్రహింపవలసి యున్నది. ననంబోఁడి విరింబోడి యనురీతి నుదంతేతరములపైఁ బూర్ణబిందు వున్నదా? (తె.వ్యా.వి. 902) అలరుంబోఁడి యిత్యాదిగా నుదంతములపయిమాత్రమె బిందువు ప్రసిద్ధముగా నుంట యిట గమనార్హము. పూర్ణబిందువు లేనపుడు ననఁబోఁడి యనురీతిగా ఖండబిందు వుండ తీఱవలయు ననుటకు నాధారము లే దనవచ్చును. ఖండబిందువు లేమి యొకసమస్యయే కాదు. ఎల్లెడల నుగాగమమును జెప్పుచో 'ననఁబోఁడి' యనుదానితో ననంబోఁడి యనురీతివానిని సాధారణముగాఁ గల్పించుట యట్టిబిందువు ప్రయోగములం గానరాకుంట సమస్య కాదా? (తీయంబోఁడి చూ. త్రి. శే.)

'బహువ్రీహిసమాసములు తెలుఁగునం దల్పము లని పేర్కొన్నతానే సౌకుమార్యమున కెన్నియుపసమానములు భాషలోఁ

గలవో యన్నింటితో తామరతంపరగా బహువ్రీహిసమాసములు కావించుట కవకాశ మేర్పఱచుట స్వభావవిరుద్ధ మనిపించు' (270) నని యింకొక వైరుధ్యము చూపినది బా.వి. అనఁగాఁ బోఁడిలో సమాసము చేసినను నది బహువ్రీహియే కా దని యభిప్రాయము. బహుశః ఈయభిప్రాయముతోనే కా.చూ. పువ్వుఁబోఁడి తలిరుఁబోఁడి బహువ్రీహిసమాసము లనుటను (9-152) సబబు కా దని బా.వి. (258) తలఁచియుండవలె. (మచ్చెకంటియు బహువ్రీహియె. ప్రాయిక మనుట నిటఁ గ్లిబసమము గ్రహింపఁదగు.) కాఁగా నలయిఁబోఁడి యున్నది యుపమానపూర్వపదకర్మధారయ మన్నమాట ప్రౌఢ వ్యాకర్తయొక్క యీయభిప్రాయమును ప్రౌఢవ్యాకరణఘంటాపథము సముచితముగాఁ దిరస్కరించినది. తె.వ్యా.వి. కూడ పోఁడిని గ్రహించి సంప్రదాయానుసారము పూవువంటి యొప్పుకల దని యర్థము చెప్పుకొనవగు (903) నన్నది.

ఒకానొకం డన్నాఁడు కాఁబట్టి బహువ్రీహు లత్యల్పములే కాని తామరతంపరగా నుండరా దన్నది తె.వ్యా.వి. (904) తామరతంపరగా నుంట విశేషమే. ఒకానొకఁ డన్నాఁడు కాఁబట్టి యెన్నినటి కుంట స్వభావానుగుణ మగును? వజ్రాలు ఇత్యాదిరూపసాధనములో 'ఒకానొకచో' నన్నాఁడు. కాఁగా ఒకానొకశబ్దము ఈ సమాసములు బహువ్రీహు లగుటకు బాధకము గాఁజాల దని గుర్తింపఁదగును.

కాఁగా నీబహువ్రీహిసమాసముల మేనుసకు బోఁడి నాదేశించుట యిట్లు తిరస్కరింపఁదగదు.

—*—

# తద్ధితపరిచ్ఛేదము

## తద్ధితములు :

సుబంతములకు భావాద్యర్థములందు విహితమైన ప్రత్యయము తద్ధితప్రత్యయ మని స్పష్టము చేసిన బా.వి. 'ఇట్టి ప్రత్యయము లేయే ప్రాతిపదికముల కేయేయర్థములందు చేరునో నిరూపించుపరిచ్ఛేద మిది' (276) యనుట యొప్పదు. నామ్నః కవర్ణక స్స్వార్థ త్రనురీతిగా స్వార్థమునందుఁ జెప్పఁబడినవి మాత్రమే ప్రాతిపదికములపయిఁ జేరును గాని యితరము లట్లు కాదు. మతకము-మతకరి, రాముని (యొక్క) తనము మోకాలి (యొక్క) బంటి మొద లగునవి.

## విభాష :

ఇట విశేషం బుత్సర్గంబునకు విభాషను బాధకం బగు ననుసూత్రమందలివిభాష శబ్దమునకు వ్యవస్థ చేసికొనవలె నన్నది బా.వి. దానియవసరమును నిరూపించుచు 'చుట్టతనము పేరుతనము, అగ్గలతనము ఒమ్మ్రితనము మొద లగురూపములు వినరా' (279) వనుట విచార్యము. అగ్గలతన మని యుండదు. కాని యంతమాత్రమున దానికిఁ దనప్రత్యయము రా దని చెప్పరాదు. సూరియే పిదప అగ్గలపుఁదన మన్ని యుదాహరించెను. అది బా.వి. పట్టించుకొన్నట్లు లేదు. తనవర్ణకపరకత్వమున సంధి 35 సూ.చే జ్ఞాపితము అవు నని తోఁచుచున్నది. అందుకే చుట్టపుఁదన మనుచోఁ బుంపు లవును. అగ్గలంపుఁదన మని సూరి చూపినతీరునదే చుట్టపుఁదన మన్నదియు. ఏమైన నగ్గలతనము, చుట్టతన మని మాత్ర ముండదు. కాని తనప్రత్యయము మాత్ర మగును.

అది యట్లుండఁగా సూరి యిట 'ఆికాదులు రానిపక్షమందుఁ దనప్రత్యయం బన్నింటి కగు'నని యన్నింటిని జేర్చినాట గమనార్హము. పేరు ఇత్యాద్యులకు తనప్రత్యయము రా దని సూరి భావించినయెడల నన్నింటి కనుట పొసఁగు టెట్లు? కొన్నింటి కనక పోఁగా నన్నింటి కనుటచేఁ దనప్రత్యయము భావార్థమునం దన్నిశబ్దములకు నవుటయే సూరిమతముగా గ్రహింపవలసియున్నట్లు స్పష్టము. అవసరమునుబట్టి యితరస్థలములందుఁ గావలసినవిభావ కాయర్థము వ్యవస్థచేసికొనవచ్చును.

## మగఁటిమ్యాదులు :

ఇటఁ బ్రత్యయములను నిరూపించుచు బా.వి. (కోడంట్రము) అంట్రము, అంట్రికము (కోడంట్రికము) ఇకము (కోమలికము) కారము (చెలికారము) అనురీతిగా మువర్ణముతోఁ జూపినది. (449) కాని యీము ప్రథమైకవచనము. తన, ఆిక అనురీతిగనె (అ)ంట్ర - (అ)ంట్రిక, ఇక అనురీతిగాఁ జూపఁదగును. ఆచ్ఛికము లివ్వానికిఁ గ్లిబసమత్వముచే మువర్ణకము రాఁగలగు గదా.

## గుబ్బెతాదులు :

యువతివిటీరజస్వలలు గుబ్బెత మిండత ముట్టుతలు నాఁబడుదు రని సూరి నిపతింపఁగా తె.వ్యా.వి. 'గుబ్బ + ఎత ముట్టు + త, మిండ + త అనురీతివిభాగ ముండఁగా బి.సూ. ఈసూత్రమును నిపతించు టేలకో తెలియ' (857) దన్నది. తవర్ణకము స్త్ర్యర్థమునం దైనను వంతకు ముందు కులవాచకమునకు విహితము. కులవాచకములు గాకున్నను నీశబ్దములపై తవర్ణ మగుట వి:తు. ణము. ఇందు కయినను వీనిని వేఱుగా సూత్రింపక తప్పదు గదా.

వీనిని గుణవాచకములకు భిన్నములుగా తె.వ్యా.వి. కూడఁ జూపినది. (439)

మిండ (ప్రాయము) కలది మిండత (284) అని బా.వి. అర్థము చేసినది. మిండలు (విటులు) గలది మిండత అని విటీశబ్దానువాదముగా గ్రహింపఁదగును. ప్రాయము గలవారెల్లరు మిండతలు గారు గదా.

ఆఁడి - అ :

వగాదులకు బహువచనాంతంబులకు మత్వర్థమునందు స్త్రీత్వముచే నాఁడియుఁ బుంస్త్వమున నావర్ణకమును 22,23 సూత్రములచే సూరి ప్రత్యేకముగా విధించెను. వీనిని గలిపి యొకేసూత్రముగా 'వగాదులకు బహువచనాంతములకు స్త్రీపురుషవాచకంబు లగునపుడు మత్వర్థంబునం దాయాఁడి వర్ణకంబు లగు, లేక ఆఁడివర్ణకము లగు' (అ + ఆఁడి) అని చెప్పఁదగు నన్నది బా.వి. (285) స్త్రీపురుషవాచకంబు లగునపు డనుటకంటె 'స్త్రీత్వపుంస్త్వముల' ననవచ్చు. ఏమైనను రెండుసూత్రములుగాఁ జెప్పుటలోఁ దప్పు లేదు గాని రెండే సూత్రముగాఁ జెప్పిన లాఘవము గల్గుమాట నిజమే. కాక త్రియ వర్ణకంబులు పుంస్త్వస్త్రీత్వముల నని సూరి చెప్పియే యుండెను గదా.

కాని కలిపి చెప్పఁదలచిన నెట్లు చెప్పవలెను? అ-ఆఁడి అనువానికి సవర్ణదీర్ఘసంధి చేసిన 'నాఁడి' యని యగును. ఆఁడివర్ణకము లను నమచో నిటుఁ బుంస్త్వమున నగు నని యేది? స్త్రీత్వమున నేది? ఇందలి రెండు ప్రత్యయము లేవి యను నంశమున సందిగ్ధత తప్పదు. సూత్రలక్షణములలో నసందిగ్ధత యొకటి.

అయిన మగాదిసూత్రవివరణములో 'ఈకాప్రత్యయాంతము' లనుచో 'ఆ'ను అట్లు కూర్పలేదా యనవచ్చును. (అది సూత్రము గాక వివరణమె యైనను) కూర్పలే దని సమాధానింప నద్ద మేమి? మగాది యాకృతిగణ మగుటంజేసి సూరి వానిలోఁ జేర్చిచూపకున్నను ఆప్రత్యయాంతంబు మగాదిగణంబు (కాప్రత్యయాంతంబునకు-మగాది గణగణనంబునం జేసి - యనుదానికి ఆప్రత్యయాంతంబు మగాదిగణం బనుదానికి నీవచ్ఛేదము స్ఫురించు. అదే కాప్రత్యయము గణింపఁ బడినట్లు నాప్రత్యయము గణింపఁదగినట్లు - ఇది ప్రబలమైనయుక్తికాకు గాకపోవచ్చును ఇట్టిస్ఫూర్తి మాత్రము గల దనవచ్చు.) అనుటంజేసి మగాదులలోఁ జేర్చుకొనఁదగునే కద. (తె.వ్యా.వి. 856) కావున సూరియే యట నస్పష్టముగా గణించె ననుట యంగీకరింపఁదగినదిగాఁ దోఁచుట లేదు. ఏ మైన సూత్రమున 'నాఁడి' వర్ణకంబు లగు నని చెప్పఁదగు ననుట యుక్తము గాదు.

స్త్రీపురుషవాచకంబు లగునప్పు డాయాఁడివర్ణకంబు లగు ననుటయు సక్రమముగా లేదు. అట్ల చెప్పిన యథాక్రమముగా స్త్రీవాచక మగుచో (స్త్రీత్వమున) ఆవర్ణక మయి పుంస్త్వమున నాఁడివర్ణక మగును. ఇంక ఆవర్ణకమును మగాదులలోఁ జేర్ప నేల? మగాదులు మహాత్తులు గదా. స్త్రీత్వమునం దాప్రత్యయ మన్న నది మహాత్తు గాదు. కయిరాదులలోఁ జేర్పవలె. అపుడు ఆమె వగలాఁడు, వాఁడు వగలాఁడి యనురీతి నుండు నన్నమాట. ఇది యసంగత మనుట స్పష్టము. స్త్రీపురుషవాచకంబు లగునప్పు డనుచో నాఁడియావర్ణకము లగు ననుట యొప్పును.

ఏ మయినను స్త్రీత్వపుంస్త్వంబుల నాఁడ్యావర్ణకంబు లగు ననురీతిగఁ గాని నిం కొకతీరుగఁ గాని రెంటిని గలిపి విధించుట కవకాశ

మున దనవచ్చును. వేఱు చేసి చెప్పుట స్పష్టతకే యనవలసి యుండును. వే ఱే దేని ప్రయోజనము గల దేమో యిప్పటికి స్పష్ట మగుట లేదు.

**ఎఁడు :**

మానార్థంబున కేకత్వంబునఁ దేఁడువర్ణకం బగు నని సూరి చెప్పఁగా బా.వి. 'మానాదులు' (441) అని వివరించినది. మానార్థము కంటె నితరము లగునర్థములు గాక మాన మొద లగుశబ్దముల కని యభిప్రాయ మైయుండు. సూత్రమందలిమానశబ్ద మిట్టిది గాదు. బా.వి. పరిమాణార్థమం దని (286) మొదట వివరించియే యున్నది.



# క్రియాపరిచ్ఛేదము

## తద్ధర్మాదులు:

'ఆం. చిం. తద్ధర్మార్థక మనఁగా సూరి దానిని తద్ధర్మాదు లనెను' అను బా.వి. (292) వివరణము సరి గాదు. ఆం. చిం. తద్ధర్మార్థమును మాత్రమే నిరూపింపఁగా సూరి తచ్ఛీలాద్యర్థములను గూర్చి తద్ధర్మాదు లని ఆయర్థమున నొకలకారమును విధించెను. చిం. ఏది తద్ధర్మ మని ఎంచినదో అది సూరి మతమునను తద్ధర్మము మాత్రమే. తద్ధర్మార్థమున చిం. సాధించినరూపములు తద్ధర్మార్థకములు మాత్రమే కాక తచ్ఛీలాద్యర్థకములు నగుట సూరి విశేషముగా నిరూపించెను.

తద్ధర్మ మన్నఁ జాలు ననియుఁ దద్ధర్మాదు లన నక్కఱలే దనియు బా.వి.అభిప్రాయము. 'భిన్న మగుప్రత్యయము లున్న భిన్నార్థములను కల్పింపవచ్చును. అన్నింటియందును 'ను' అనియే కదా ధాతువు చివర చేరుట. (300) మొత్తముమీఁద తద్ధర్మార్థక మనుట గౌరవముగా కనుపట్టు (301) నన్నది. ఇదే యభిప్రాయము తె.వ్యా.వి. (718) కూడఁ జెప్పుచున్నది. ఇది సమంజసము కాదు. 'వ్యాకరణము శబ్దము ప్రధానమైనది. అర్థము కాదు. (300) అన్నది బా.వి. అర్థము ప్రధానము గాకపోవచ్చును గాని యర్థముతో వ్యాకరణమున కసలే సంబంధము లే దనరాదు గదా. అన్న అను రూపము సాధింప నది స్త్రీసమ మన్న జాలు. దాని కేయేయర్థము లున్నవో వ్యాకరణము నిరూపింపఁ బని లేదు. కాని సోదరుఁ డను నర్థమున నన్నశబ్దము స్త్రీసమ మన్న నితరార్థములందే మగు నన్న సందేహము గల్గుట సహజమే కదా. అట్లే 'వండును' అనురూపము

తద్ధర్మార్థద్వంద్వములందు సమానమైయున్నది. (ఆ యా యర్థము లన్నింట 'నన్న' స్త్రీసమ మైనట్లు) కాని యా రూపమును సాధించుచోఁ తద్ధర్మార్థము నొక్కటి గ్రహించుచో (సోదరుఁ డనునర్థమున నన్న స్త్రీసమ మగుచో) నితరార్థములు దానికి వారితము లగుట లేదా? తద్ధర్మార్థమును మాత్రము గ్రహింపక 'నందును' అనురీతిరూపము సాధించుచోఁ దద్ధర్మములతో నా యితరార్థములు గ్రహింపవచ్చుఁ గాని యొకటి గ్రహింప నితరముల కవకాశము వారిత మగును. ఏయర్థమును గ్రహింపక 'అన్న' యను దానికి స్త్రీసమత్వమును జెప్పినట్లుగా 'నందును' అను రూపము సాధింప నవకాశ మున్నదా?

అంతియ కాక ప్రయోజనాపేక్షతో వ్యాకరణ మర్థమును గ్రహించుట యనర్థములను వారించుచు నవసరమై యున్నది. స్వర్గివాచి దేవసురశబ్దంబు లిత్యాదిస్థలము లట్టివి. కాఁగా నర్థముతో వ్యాకరణమునకు సంబంధము కలిమి స్పష్టమే. అర్థ మప్రధాన మని యుపేక్షించి తచ్ఛీలాదుల నేలఁ గ్రహింపవలసినదై యుండెనో తెల్పదు.

ఇఁకఁ దద్ధర్మార్థద్వంద్వములం దన్నింటఁ బ్రత్యయము సమానముగా నున్నది కావున నన్నియర్థము లొక్కటి లే దన్నది. తచ్ఛీలాద్యర్థములందును తద్ధర్మార్థమునందువలె రూపము సమానముగా నుండుటచేతనే తద్ధర్మాదు లనుటయు నన్నియర్థముల నొకేలకారమును విధించుటయు నొప్పినది. రూపభేద మున్న నిది గుదురునా? ఆశీస్సంప్రార్థనవిధులందు లొట్టగు నన్నాఁడు సూరి. ఒకేలకారము విధించునపు డిన్నియర్థము లేల? ఆశీరర్థంబున లొట్టగు నన్నఁ జాలదా? శాబ్దాదులసంగతే మన్న నర్థముతో వ్యాకరణమునకు సంబంధము లే దనియో యప్రధాన మనియో చెప్పవచ్చు. రూపవైవిధ్య మున్న భిన్నలకారములు విధించుకొనవలె. అట శాబ్దాదుల

గ్రహణ మెట్లుచితమో యిటఁ దచ్ఛీలాదులసంగ్రహణము నట్టిద. తచ్ఛీలాదులను జేర్కొనుట కేవలము గౌరవమే కాని ప్రయోజన వంతము గా దని నిర్ణయింపఁ దలఁచుచోఁ బ్రత్యయము సమానముగా నున్న దన్న దెంతమాత్రమును గారణమును గానేరదు. అది తద్ధర్మాదు లని కూర్చి యొకేలకారమును జెప్పుటలోనియౌచిత్యమును దెల్పుచు సూరిప్రణాళికయందలివైశిష్ట్యమును స్పష్టము చేయుట కుపయోగించును.

ఆదిశబ్దగ్రహణము వ్యర్థ మని నిర్ణయింపఁ దలఁచినచో నాదిశబ్దముచే నేయేయర్థములు గ్రహింపఁబడునో (సూరిప్రస్తావించినవైనను) తద్ధర్మశబ్దముచేతనే సంగ్రహింపఁబడు నని నిరూపింపవలె. నీకు శుభం బగు నని యున్నది. ఇందలి 'యగును' ఆశీరర్థక మనె సూరి. తద్ధర్మార్థమె యాశీరర్థ మని కాని లేదా యటఁ దద్ధర్మార్థమే కలదు గాన నాశీరర్థమును వేఱ చెప్ప నక్కఱ లే దనురీతిగాఁ దచ్ఛీలాద్యర్థము లెల్ల దద్ధర్మముచేతనె సంగ్రహింపఁగల్గిన నాదిశబ్దము గౌరవమె కాని ప్రయోజనము లేని దని నిశ్చయింపవచ్చును. కాని బా.వి. కాని (౩౦౦) తె.వ్యా.వి. కాని తచ్ఛీలాద్యర్థములు తద్ధర్మార్థముననే యంతర్భవించు నని చెప్పుట గానరాదు. అది యుచితము. అర్థ మప్రధాన మనువ్రాఁత ననుసరించి తచ్ఛీలాద్యర్థములు తద్ధర్మముకంటె భిన్నములే యని బా.వి. కూడ సముచితముగనె తలంచినట్లు గుర్తింపవచ్చును. అట్టియెడల నాదిశబ్ద మనవసర మనుట యసంగతము.

అయిన బా.వి. ఆపిదప 'వర్తమానార్థము ఇప్పుడు అను శబ్దమువలన తెలియుచున్నది. (మేన నిప్పుడుం బులకలు వొడమెడును) భా.వి. తేపు అనుస్వతంత్రపదమువలనఁ దెలియు (వాఁడు తేఁపు

వచ్చును.) అన్నది. (801) అనఁగా నిటఁ గ్రియ వర్తమానాద్యర్థక మగుట లేదా? ఇప్పు డనుదానిచే వ్యాపారము వర్తమానార్థమునం దున్న దని గ్రహింతేము. అపుడు ధాతువుపై వర్తమానార్థమున నేలకారము రావలెను? వర్తమానంబున లట్టగు ననఁగాఁ దద్ధర్మంబున (ఆదిపద మనవసర మన్నది గదా బా.వి.) లా ట్టగు ననుదానిచే లా ట్టిట్లు వచ్చినది. ఇపు డనుపద మున్నది గదా వర్తమానార్థము తెలియుటకు నింక లట్టు కా నక్కర లే దేలకార మైన నిబ్బంది లే దందురా? అయినయెడల లాట్టే యేల రావలె! లిట్టు రాఁగూడదా? మ ఱొకటి రారాదా?

ఇట్లే తేఁపు వచ్చును అనుచో తేఁపు అనుదాని ననుసరించి భవిష్యదర్థము దెలియుచుండఁగాఁ గ్రియాపదము భవిష్యదర్థమునం దుండవలెఁ గాన ల్రుట్టు రాక లా ట్టేల వచ్చినది? అనఁగా లాట్టు వర్తమానార్థమునను, భవిష్యదర్థమునను వచ్చుచున్న దన్నమాట. వచ్చు నని సూరి చెప్పె నది తప్పా! వాఁడు తేఁపు రాఁగలఁ డన వచ్చునే గద. ఇపుడు తేఁపు అన్నవి లేక వాఁడు వచ్చు నని పైయర్థములఁ బ్రయోగింపఁగూడదా?

తె.వ్యా.వి. కొంత చర్చించినపిమ్మట నిట్లు నిర్ణయము చేసినది. 'స్వతంత్రపదములచే కాలము బోధింపఁబడుచున్నప్పుడు క్రియాపద మేకాలమునకుఁ జెందనిత్తద్ధర్మమునం దుండును.' (724) దీనినిబట్టి వాఁడు తేఁపు వచ్చు ననుచో తేఁ పనుస్వతంత్రపదము కాలబోధక మై యున్నది కావునఁ గ్రియాపదము తద్ధర్మమునందే యుండు నన్నమాట. ఇట్లని యొకలక్షణము చేసిన లాక్షణికులు గానరారు. వ్యాఖ్యానతో విశేషప్రతిపత్తి యునవలెను. పైనిర్ణయముంబట్టి వాఁడు తేఁపు రాఁగలఁ డన్న నది దుష్టమే యగును. ఇపుడు

చుఁ గాలబోధక మగుస్వతంత్రపదము లేకున్న లాడ్రూపము ప్రయోగము వారింపఁబడుట లేదా! వాఁడు ఇప్పుడు వచ్చుచున్నాఁడు, రేపు రాఁగలఁ డనునీతిగాఁ గాలబోధక మగుస్వతంత్ర పదమునఁ దత్తల్లకారాంతప్రయోగము వారింపఁబడదా? కావున నీ తె.వ్యా.వి.వివరణము సముచితము గానేర దని గుర్తింపఁదగును.

అయిన తె.వ్యా.వి. 'అయినచో తద్ధర్మార్థకక్రియ వర్తమానభవిష్యదర్థకము (లు?) అను టెట్లు పొసఁగు'నని శంకించి 'త్రైకాలిక మగుతద్ధర్మక్రియయే యుండుపయుక్తము. దాని నితర వాచకములు పరిమిత మొనర్చుచున్న (724) దన్నది. తద్ధర్మక్రియ త్రైకాలిక మయినప్పు డితరములు దాని నెట్లు పరిమితము చేయఁ గలవు? ఒకవేళ నట్లు చేయుచో నట నాతద్ధర్మా(వ్యర్థ)ర్థకక్రియ త్రైకాలికము కాక యేదో యొకకాలమునే బోధించు నన్నమాట. అంఁగా లాడ్రూప మొక్కొక్కచో నొక్కొక (కాలమును) యర్థమును బోధించుట గల దనుట స్పష్టమే కద. (అందుకే యాయర్థములందును లాట్టు విధింపఁబడినది.) పైఁగా నింతకు ముందు చెప్పినట్లు కాలబోధకస్వతంత్రపద మున్నప్పుడే యిట్లు పరిమితము చేయుట యనుపద్ధతి చెల్లును. అది లేకున్న నెట్లు? లేకున్నఁ దద్ధర్మా(వ్యర్థ)ర్థక క్రియ యుండుటకే తె.వ్యా.వి. (బా.వి.) ననుసరించి వీలు లేక పోయినది. కాని యిట్టిప్రయోగము లున్నవి గదా. అట సందర్భము నాశ్రయించి 'పరిమితము చేసికొనవలెఁ గాఁబోలును. ఇట్టికల్పనము (ఉన్నను) కంటెఁ దత్తదర్థములను నారూపములు సాధించుట శాస్త్రీయము గదా.

భూతభవిష్యద్వర్తమానములనే తె.వ్యా.వి. ప్రస్తావించినది. 'శుభం బగును' అనుచో నాకీదర్థ మెట్లు? శుభం బను

వడి నియమించునా? ఇట్లు ప్రకరణమో మఱి యేదియో యాశ్రయింప నీశాస్త్రము ప్రయోజన మెంతవఱకో పరిశీలించి నిర్ణయింపవలె 'క్వచిద్ధర్మక్రియామాత్ర మాశ్రిత్య రత్ర ప్రయుజ్యతే' - యని వి.వి. తద్ధర్మార్థక క్రియ యాశీరర్థక మగుటను విశేషముగాఁ జెప్పెను.

తద్ధర్మార్థకములలో (తద్ధర్మాద్యర్థకములలో నని యభిప్రాయము.) సంప్రశ్నమును జేర్చుటలోనియుద్దేశము దురవగాహము. ఉండును + ఆ ఇత్యాదులలో ఆవర్ణకమె సంప్రశ్నార్థకము. ఇది యేకాలవాచి యైన క్రియాపదముపైఁ గూడఁ జేరవచ్చును. అట్లే తద్ధర్మార్థకముపైఁ జేరినది. (724) అట్లు తద్ధర్మార్థకముపైఁ జేరిన దనుటలో నది కాలవాచిక్రియాపదము గాకున్నను జేరిన దని యభిప్రాయము గావచ్చు. ఉండునా పోదునా? అనుచోట 'ఆ' వర్ణక మనుట విశేషము. అర్థవిశేషమునం దనుప్రయుక్తము లగునదానులను వర్ణకములుగాఁ జెప్పుట గానరాదు. వాని నవ్యయము లని యేని జెప్పఁదగును గాని ప్రత్యయము లనుటకు మాత్ర మాధారము లేదు.

సంప్రశ్నము నేల చేర్చె నన్న దనుమానము. చేర్పకుండఁ గాక. ఉండునా (పోదునా) యనుచో ఉండును అనుక్రియాపదము తద్ధర్మాదులలో దేనఁ జేరును కుండలు వానును అనుచోటవలెఁ దద్ధర్మ మనఁదగునా? 'పాడమెడు' ననుచోటవలె వర్తమానార్థక మనఁ దగునా? వేఱొకటి యైన నెట్లు? అటఁ గ్రియాపదము తద్ధర్మాదులలో నేయర్థమునకుఁ జెందునో నిరూపించి యట్టిదానిపై 'నా' (సంప్రశ్నమున) చేరుట విశేషము గాదు గాన సంప్రశ్నము నిందుఁ జేర్పరా దని స్పష్టము చేయఁదగును. ఉండెనా? పోయెనా, రాఁగలనా పోఁగలనా అనువానితో సామ్యముగల దేమో పరిశీలించి నిరూపింపవలసినది.

**దుష్షు :**

దిషీతరంబగు దుష్ పరం బగునపుడు అని బా.వి. సూరి సూత్రమును చూపుట ప్రమాదము. దుష్ అన్నది ప్రాతిపదిక మాత్రమే. దుష్, దుష్షు, దుష్షను (౩౦౨) ఇత్యాదిగా బా.వి. అట నట వ్యవహరించినది. వ్యాఖ్యయందు దఖ్లింపఁగా సూరి సూత్రమునకే అట్లు చూపుట సరి కాదు. ఉగాగమద్విత్వ (సులోపముతో) దుష్షు అని చూపవలెను.

**భూతము - ఇక్కు :**

భూతంబునం దిగాగమం బగు నను సూత్రమును వివరించుచు బా.వి. 'కేవలభూతార్థకధాతువులకే కాక వృత్తం బగుభావలక్షణ మందు, చేదాద్యర్థమందు ఇగాగమము ధాతువున కగు నని' (297) పేర్కొన్నది బా.వి. అనఁగా నిట 'సూరిలక్షణ' మసమగ్ర మని యభిప్రాయము గాఁబోలును. కేవలభూతార్థకధాతువులకే కాక యను టచే వృత్తం బగుభావలక్షణము, చేదర్థము మొ॥ వానిలో భూతార్థము లేదను భావము వ్యక్త మగుచున్నది. కాని కొనినన్, (రమ్ము) అనినన్ అనురీతిస్థలములందు భూతార్థ ముండనే యున్నది. (బా.వి. 314) సూత్రమున లిట్ప్రరకస్థలములందే యాగమ మని భావింప వీలు లేదు. లిట్ప్రరకత్వమున నవికి భూతంబున. దని సామాన్యముగఁ జెప్పుట నీయిగాగమము (భూతార్థమునందు) ప్రయుక్తముల నగు టయాలక్షణము చేతనే సిద్ధ మగుచున్నది. ఇట్లే క్త్వర్థమున వండిననాఁ డిత్యాది స్థలములందును. భూతంబునం దని సామాన్యముగఁ జెప్పుటచేఁ బ్రథమ పురుషైకవచనమందు నిష్క చేసినపిదపనే వండి + ఎను - వండెను అను రీతి సాధించుకొనవలసియుండును. 'ఎను ఆదేశము కాఁగా వండెను అని ప్రథమైకవచనరూపము సిద్ధించఁగా బహువచనమునందు ధాతువున

కిగాగమము చేరు' (97,298) ననె| బా.వి. ప్రథమైకవచనమం దిగాగమము రా వనుటకు లక్షణమున నెట్టియాధారమును లేదు. తె.వ్యా.వి. 'అన్ని పురుషలయందు భూతార్థక ముగు ఇప్రత్యయము చేరుచుండఁగా ప్రథమపురుషైకవచనములోఁ జేరకుండుటకు హేతు వనూహ్యమన్నది. (730) చేరు ననియే గ్రహింపవలెను. క్త్వాభూతయోః క్రియాన్త్యస్యేత్తని చిం. చెప్పినది. భూతంబునం దిగాగమం బగు నని సూరి. తె.వ్యా.వి. ఇప్రత్యయ మనుట చారిత్రకదృక్పథముతో నేమో. అన్ని పురుషలయం దనుచో నన్ని వచనములందు నని యభిప్రాయము. ప్రథమైకవచనమందు రా దన్నను బ్రథమపురుషయందే బహువచనమున నవుట యెట్లును దప్పదు గదా. వి.వి.లక్షణము కొంత విశిష్టము. ఇత్ స్యాద్భూతబహుత్వే దేశ్యే తూభయతో భవే త్తన్నది వి.వి. బా.వి. అయి + ఎను (367) అనుచో భూతప్రథమైకవచనమునందును నిక్కు చేసినది. అది యుచితము. ఎల్లెడల నట్లు చేయక తప్పదు.

**అత్వము :**

'జిత్తులు పర మగునపుడు వానికి పూర్వమందలిఉత్వ మత్వ మగును' (298) అని బా.వి. సామాన్యముగఁ జెప్పుట స్పష్టత కేమొ కాని జిత్తునకుఁ బూర్వ మున్నమాత్రమున ఉత్వమున కత్వము రాదు. ఆఉత్వము ధాతువునకుఁ జెందినది కావలెను. ధాతువునకు అనుఅధికారసూత్రము ననుసరించి ధాతువునందలిఉత్వమునకే అత్వ మగును. సూరి సూత్రము వెంటనె అట్లు స్పష్టముగా వివరించెను గూడ. (వినకువె, వినకురె మొదలగు చోట్ల జిత్తునకుఁ బూర్వమున నున్నను ఉత్వము ధాతువునందలిది కాదు. కావున అత్వము సంపదక అట్లు యన్నది. (బా. వి. 309.)

**వండెదు :**

వండెద + వు అని యుండ లాట్టువకారమునకు లోప మై 'వండెద + ఉ. వండెదు అత్వసంధిబహుళమంలో ప్రవృత్తి' (303) యన్నది బా.వి. కాని 'వు' వర్ణక మగుటచే వకారము లోపించినమాత్రమున 'ఉ' వర్ణకము గాకపోదు గదా. ఎట్లయిన నది యువర్ణ మగుట స్పష్టము. కాఁగా 'సంధ్యవగామంబులం దప్ప'నను సూత్రముచే నిట సంధి నిత్య మని గ్రహింపవలయును. అత్వసంధి సూత్రములోనిబహుళపదముచే సమర్థింపరాదు. దానిని బాధించియే యుపదాదిస్వరపరకసంధి వర్తిల్లును.

ఇట్లే వండితివి, వండితి + ఇ అనుచో మధ్యమపురుషక్రియల యం దిత్తునకు సంధి నిత్యము. కాన **వండితి.** (303) అనుటయు సరి కాదు. వండితివి అనుచో విసర్గాంతము గదా మధ్యమపురుషక్రియ. వండుచున్నాఁడు అనుచో వండుచున్నా అన్నంతవఱకు క్రియాపద మని వ్యవహరింపవచ్చునా ? వండితి + ఇ అనుచోఁ గూడ నుపదాది స్వరపరకసంధియే యై వండితి అనుమధ్యమపురుషైకవచనాంతక్రియా పదము సిద్ధించును.

**బహువచనమున నేకవచనము :**

తిర్యగ్జడంబులు వాచ్యంబు లగునప్పుడు లిఙ్లాట్టులప్రథమ బహువచనంబున నేకవచనం బగు' అనుసూత్రమును వివరించుచు బా.వి. 'బహువచనపశుపక్ష్యాదివాచకములు కర్త లగునప్పుడు భూత తద్ధర్మార్థకక్రియలబహువచనమున నేకవచన మగును" (304) అన్నది. పశుపక్ష్యాది అనుచోటియాదిశబ్దముచే జడములు గ్రహింపఁబడుట యుద్దేశము కావచ్చును. వివరణమున నాయంశము స్పష్టముగాఁ జెప్పఁదగును. సూత్రమునఁ దిర్యగ్జడము లనఁగా తిర్యక్కు లనఁగాఁ

బహుపత్యాదు లని సూరి యొకచో వివరించియుండఁగా (ఇట బా.వి. జడమున కీకార్యమును వివరింపకుండఁగా) సూత్రోక్త మయినజడము వివరణమున నుపేక్షిత మైనట్లు తోఁచును గదా.

ఇట్లే సూత్రమునఁ బ్రథమబహువచనమున కనఁగా వివరణమున బా.వి. 'భూతతద్ధర్మార్థకక్రియల - అని సామాన్యముగాఁ జెప్పుటచే మధ్యమోత్తమపురుషలయందును నీకార్యము జరుగు ననిపించును. అట్లుదాహరింపకున్నను సూత్రమునందలి 'ప్రథమ' శబ్దము నుపేక్షించుటవలన ననర్థము.

ఎదు - త :

"ఆశీర్వ్యాపసంప్రార్థనవిధులు లూట్టు. ఈయర్థములందు ...ఎదున్ తన్ వర్ణకము లాదేశ మగు" నన్నది బా.వి. విధియందును లూట్టగును. కాని విధియందైన లూట్టునకు ఎదుతలు రావు. 'విధియందు లూట్టునకు మాఱుగా' అనుసూత్ర మీయెదుతవిధానమును బాధించును. కావున మైత్రుండు చేయునది నీవు ఉండునది అనియే విధ్యర్థమున నుండును గాని మైత్రుండు చేసెదును నీవు ఉండుతను అని యెదుత లుండవు.

ఎదున్ తన్ అని పొల్లనకారము చూపుటకంటె పిదప శ్యలందుఁ జూపినట్లుగా ఎదును తను అని ద్రుతమును సువర్ణముగనె చూపఁదగును.

మతమః - మకారము :

ఎదుతల ద్రుతంబున కచ్చు పరం బగునప్పుడు మకారము బాధించుటనుగూర్చి బా.వి. 'ఇట్లు మకారాదేశము రానిచో ఈవర్ణకము లాద్యర్థమందు వచ్చు - ఎదువర్ణక మనఁ భ్రాంతి గొలుపును. మేలు

గలిగెదు ననియొ ఇక ముందు మేలు గలుగు నని యర్థము వచ్చును' (305) అన్నది. లోడర్థమునందు 'ఎదు' వర్ణకము కాదు. ప్రథమపురుషునకు సువర్ణ మాదేశము కాఁగాఁ దత్పరత్వమున ధాతువున కైన యాగమము. 'కలిగెదును' అనుచో సువర్ణమె వర్ణకము. మకారము విధింపనిచో లోట్టునకైన ఎదు గలది లోడ్రూప మని భ్రాంతి కలుగునా? అయిన ఎదుద్రుతమునకుమాత్రమె మకారము విధింపక తవర్ణకద్రుతమున కేల మకారము విధించెను? అచ్చట నింకేదైన భ్రాంతి కల్గునా! ఎదువిషయమున నైనను అచ్చరకతలోఁ గదా మకారము. హల్లు పర మైన ద్రుత మల్లే యుండును. హల్పరకతలో నీద్రుతమునకు మకారాదేశ మగుట లేదు. ఆట లోడ్రూప మని భ్రాంతి కల్గుచున్నదా? తవర్ణకవిషయమునను, 'ఎదు'నకుఁ గూడ హల్పరకతలోను లేనిభ్రాంతి అచ్చరకతయం దేల కల్గినది. వందు చున్నది వందుచున్నాఁడు ధాతుజవిశేషణములు వర్తమానార్థకక్రియా పదములు నగును. భ్రాంతి యని ఏదైన మార్పులోఁ జెప్పక పోయెనా? భ్రాంతిని వారించుటకై మకారాదేశము వచ్చుచున్న దనుట శబ్దశాస్త్రానుగుణము గాదు.

కలిగెదు ననియె అనుచో నది లోడ్రూపమే. అయిన ఇంక ముందుఁ గలుగు నని యర్థ మెట్లు? అనఁగా నిది భవిష్యదర్థమా? తద్ధర్మాదు లనరాదు. కాని లోడంతక్రియ తద్ధర్మేతర మైనతత్కాల వాచియగుపదము లేక భవిష్యదర్థక మగుచున్నది. తద్ధర్మాదులలో సూరి ఆశీరర్థమును గూడఁ జేర్కొనెను. ఆశీరర్థమునను లోట్టు వచ్చును. అనఁగా కలిగెదు ననియె నన్నలోడ్రూప మాశీరర్థకము గావచ్చును. శుభం బగును అన్నది ఆశీరర్థకముగా సూరి చూపె. శుభంబయ్యెడును అని యెడుగాగమము వచ్చిన నది యాశీరర్థకము గాక భవిష్యదర్థక మగునా! బా.వి.వివరణము సమంజసము గాదు.

## దుక్కు - అత్వము :

ఉభయప్రార్థనంబున దుగాగమంబున కత్వం బగుననుటను గూర్చి బా.వి. 'ఉభయార్థకసర్వనామముతో నన్వయించు లాట్ క్రియారూప మెట్లుండునో 22. సూ. నందుఁ జూపలేదు. ఇట్టిక్రియకుఁ జేరుదుగాగమములోని ఉత్వ మత్వ మగుట యిందు నిరూపితము.' అని నిరూపిదప ఉభయప్రార్థన మింతకుముందు పేర్కొనఁబడలేదు. దుగాగమము విధింపఁబడను లేదు. దుగాగమమున కత్వము విధించుట చేతనే దుగాగమము విధించిన ట్లైనది (307) అన్నది. ఇది పరస్పర విరుద్ధముగా నున్నది. మొదట చెప్పినదానినిబట్టి 'వందుదము' అను నుభయప్రార్థనార్థక మగుక్రియ లాడంతము. 'లాట్లుత్తమబహుపరం బగునపుడు దుగాగమం బగు' అను 22. సూ. చే, దుగాగమము చేరఁగా ఇట దాని కత్వము విధింపఁబడిన దని బా.వి. అభిప్రాయ మగుచున్నది. పిదపఁ జెప్పినదానినిబట్టి దుగాగమము విధింపబడలేదు. అనఁగా ఇది లాడంతము కాదు. రెండవవివరణమే అన లభిప్రాయ మన్న నంతకుముందు చెప్పినది ప్రమాదము. ఇది లాడంతము కాదు అయిన 22. సూ. నందుఁ జూపకున్నను అత్వము విధించు నీసూత్రము దానికి వెంటనే ఉండెడిది. లకారములను గ్రమముగాఁ జూపుచుఁ బ్రక్రియను నిర్వహించుచున్న సూరి వందువము అన్నవి లూడంతములుగానె చెప్పెననుట స్పష్టము. తద్ధర్మాదులలోఁ బ్రార్థనార్థము చేర్చిన నెట్లుండెడిదో కాని సూరి చేర్పలేదు. ఆదిపదగ్రాహ్య మంత మున్న వీలు గలదా? నత్వవిధానము లూడంతములను సాధించుసందర్భమునఁ జెప్పుటచే లూడంతమె యనుట స్పష్టము.

ఉభయార్థముతో నన్వయించులాడంతక్రియ యె ట్లుండునో ప్రత్యేకముగా నుదాహరింప నక్కర లేదు. వందుదము, మనము

క్రియకుఁ జేరు (287) నన్నది. ప్రస్తుతలక్ష్య స్థలమున 'తోఁతెంచుట కారణక్రియ యగుటచే నట దానికిఁ జేరుట నుద్దేశించియే కారణక్రియకుఁ జేరు నని తె.వ్యా.వి. చెప్పియుండవచ్చును. కాని యానంతర్యార్థములం దెల్లయెడల నిట్టి 'కారణ' సమన్వయము కుదురదు గదా. వజ్ఝలవారు "సూరి యిచ్చినయుదాహృతియందుఁ గార్యకారణభావము కుదిరినను నది సార్వత్రికము కాదు. అంబుజమిత్రుఁ డంబుధలవాంతరితుఁ డగుడుం దదీయతేజంబు జగజ్జనంబులకు శక్యమె కప్పఁగ నని (ఆది. 7-221) పేర్కొని గు.ప్ర., పేటికాభిప్రాయములను దిరస్కరించిరి. (వ్యా.సం.న. 1463) పై ప్రాంతలో తె.వ్యా.వి. గు.ప్ర. పేటికల ననుసరించిన దేమో. బా.వి.లో తె.వ్యా.వి. అభిప్రాయము విడచికొనుట మేలె.

## శత్రర్థచువర్ణము-క్రియాన్వయము:

చువర్ణకంబు దుగ్రాంతంబు క్రియాన్వయంబైన శత్రర్థంబునందగు' ననుచోఁ గ్రియాన్వయ మనుట యనవసర మని బా.వి. క్త్వార్థకక్రియలలో నుఙ్యంతక్రియలలోను క్రియాన్వయ మిట్లే చేకూరును గదా. చూచి చూడను-పోయెను, పోఁగలఁడు, పోవుచున్నాఁడు. అట్టిచో నొకశత్రర్థమునందే క్రియాన్వయమును జెప్పనేల! (315) యున్నది. క్రియాన్వయమునుగూర్చి వ్యా.సం.న. స్పష్టము చేసినది. చూడక బోయె ననుచో నసమాపకక్రియలకుఁ గర్త యగుభావంబునందు నుఙి యయినట్లు సూరియే స్పష్టము చేసెను. చూచిపోయెను అనుచో చూచి యనునది పోయె ననుదానితో నన్వయించు ననుట విచార్యము. చూచుచుం బోయె ననుచో శత్రర్థ మన్వయించునట్లుగా చూచిపోయె ననుచో చూచి యున్నది భూతాద్యర్థముల నెది యేని బోయె ననుదానితో నన్వయించుచున్నదా? విన్న చూసి పోయాఁడా

ఎప్పుడైనా చూసి పోతుంటాడా' యనురీతిగా వ్యవహారమునందును గలఈచోట 'చూచిపోవు' అన్నది శబ్దపల్లవ మని గ్రహింపవచ్చును.

క్రియాన్వయ మనుటలో విశేషము గ. దని తె.వ్యా.వి. (772) అభిప్రాయపడినది కాని యట 'చిన్నయసూరి శత్రర్థమందలి చున్ వర్ణక మని యుపయోగించి కొంత తికమకపడె నన్నది' (773) తికమక చున్వర్ణక మనుటలోనా? యది శత్రర్థక మనుటలోనా? తికమక లక్షణమున లే దని గ్రహింపవలెను.

బా.వి. 'దీనిని సంధి. 2. సూ.నందు శత్రర్థచువర్ణ మనెను కాని అది వర్ణకమె. అని వర్ణకము వర్ణ మనరా దనుకొనుట సరి కాదు. (బా.వి. 109.)

కలిగెడు వాఁడు :

కలుగువాఁడు కలవాఁ డనుచో ఎడి, ఎడువర్ణకములకు లోపము బాహుళకముచే నిత్యము, అనఁగా కలిగెడు కలిగెడి అను రూపములు లేవు (316) అను బా.వి. వివరణము సరి కాదు. కలుగున కర్త్రర్థమునను ఎడియెడులకులోపము నిత్యము. తద్భిన్న మైన యర్థమునందు ఎడియెడులకులోపము రాకుండవచ్చును. కలిగెడు వాఁడు, కలిగెడి వాఁడు అనురీతిగా పుట్టుమొదలగుఅర్థములందు రూపము లుండవచ్చును. అట్టివి లే వనుట యొప్పదు.

ఇత్వము - ఇయడాగమము :

'చింతామణి లఘ్వేకాక్షరపూర్వక్రియా న్నిమనాగ్ని యో భవే దిద్వా' యని ధాతువున క్త్వాము చెప్పఁగా సూరి గురువిరహితంబు లయి యనుసూత్రముచే ఇందుగొన్ని క్రియల కిట్లు చెప్పెను. దీనింగూర్చి బా.వి. 'ధాతువున క్త్వాము చేరిన అపదాద

స్వరసంధిచే ఘటి + ఇంచు ఘటించు అగును. ఘటియించు కాదు. (౩౨౧) అన్నది. చిగురు + కయిదు వనుచో బాల.లో 'సమాసంబుల నుదంతంబు లగుస్త్రీసమంబుల - అనుసూత్రముచే నుగాగమ మగును. అది ద్రుతము. ఆదానికి సమాసంబునయందు ద్రుతంబునకు లోపం బగు అనుసూత్రముచే లోప మగుచున్నదా? లోప మగుచో విధానము వ్యర్థ మగును గావున విధానసామర్థ్యముచే లోపింప లేదు గదా. అదే విధముగా ఘటి + ఇంచు అనుచోఁ జం. చెప్పిన యిత్వము చేయఁగా సంధి యైన ఘటించు అని యగును. ఇత్వము చెప్ప కున్నను (వికల్పము గాన రానిపక్షమునను) ఘటించు అనియే యగును. మఱి యిత్వవిధానము వ్యర్థము గాదా? ఇత్వవిధానసామర్థ్యముచేతనే యీయిత్తునకు సంధి లే దనియుఁ దన్మూలమున బరస్వరమునకు యశ్రుతి గలిగి ఘటియించు అని యగు ననియు గ్రహింపఁదగును. సూరి ఇయుడాగమమున లాఘవప్రయోజనము సిద్ధించినది. అంతియ కాని చిం.చే ఇష్టరూపము కానేర దని తలఁపరాదు.

ఇట సూరి చెప్పిన వక్రమునుగూర్చి బా.వి. ఇట్లన్నది. "ఎపబఓలువక్రములు. ఇందు ధాతువులకు భూతార్థమందు ఎను లోని యొత్వము మాత్రమే పర మగును. (౩21) భూతార్థమునందు ఎను లోని యొత్వము మాత్రమే పర మగు నన్న నొప్పును. కాని యీ(క్రియా.50) సూత్రము నందలివక్రశబ్దమునకుఁ బ్రయోజనము 'ఎనులోని యొత్వము మాత్రమే' యని తెలుపుట నది యసంగతము. 'నగియెను' అని యైనట్లే నగియెడు, నగియెడి అని తద్ధర్మార్థమునందు ధాతువునకు వచ్చు నెడు గెడిగాగమములందలిదియు నగియెడువాఁడిత్యాదిగాఁ దృవర్థకార్థము నందు వచ్చు నెడి యొడుప్రత్యయములందలిదియు నగునెత్వమునకును ఇయుడాగమము గలదు. (క్రమ్మరియెడు ఇత్యాదిగా నన్నయాదులు

ప్రయోగించిరి. ఇది విశేషము.) ఇట్లే పడియెదను మొ॥ ఇకార వక్రంబు (క్రి.సూ. ౬౪) అనుచో వక్రశబ్దమునకు సూరి చూపినలక్ష్యములు గమనింపదగు. అంతరంగ మనఁగా నల్పనిమిత్తక మను బా.వి. అభిప్రాయము విచార్యము.

ఉంచు :

చువర్ణకంబు పరం బగునపు డన్వాదుల కుత్వలోపం బేని నుస్థానంబున బిందు వేని విభాష నగు నని సూరి. ఇట బా.వి. ఇట్లు బిందువు నాదేశించుట లేఖనమునకు సంబంధించినవిషయము. వ్యాకరణపరిధిలోనిది కాదు. (౩౨౫) అన్నది. అనఁగా నుత్వలోపము మాత్రమే చెప్పినఁ జాలును. బిందువు విధించు టనవసర మని యభిప్రాయము. ఇది చారిత్రికదృష్టితోఁ జేసినవివరణము గావచ్చును. (అది యట్లు గాని సిద్ధధాతువులు చారిత్రికముగా వాలంతము లని మొదలుగాఁ బరువాతఁ జేసిన వివరణము ననుసరించి యుత్వలోపమును జెప్పుటయు ననవసర మై యుత్వము చేరుటయే చెప్పవలయుట వ్యాకరణపరిధిలోనికి వచ్చు చేను నేమో యనిపించును.

ఉన్నాఁడు :

ఉన్నశబ్దంబు పరం బగునపు డుండు ధాతువునకు లోపం బగు ననుసూత్రము ననుసరించుచు బా.వి. 'ఉండుధాతువునకు లట్టు పరమగునపుడు ఉన్న యగును. ద్వితీయము లగు నాన్ పర మగునపుడు ఉన్నానుబంధమునకు ద్విత్వము కల్గును' - (౩౨౬) అన్నది. దీనిబట్టి ఉండు + లట్ అని యుండ నీసూత్రముచే ఉండుధాతువునకు ఉన్న యున్నది (యాదేశముగా) వచ్చు నని యభిప్రాయపడినట్లు స్పష్టమగుచున్నది. ఉండుధాతువునకు ఉన్న ఆదేశ మైన దన్నపుడు ఉన్నానుబంధమునకు ద్విత్వము నను నను దీని ననుబంధముగాఁ జేర్చ్యానుట యెట్లో తెలియకున్నది.

'ఉన్న యగు' ననుచో ఉన్న యనుబంధముగా నగు నని యభిప్రాయమా? (ఇక్కడ బా.వి. ఉన్నానుబంధ మగు గాత్రిశవ్యాఖ్య నూపపన్నంటయు గమనార్హము.) అట్లే యగుచో ఉన్నానుబంధమునకు దీర్ఘమును జెప్పుటకు ముందున్న పదము కాఁగా ను డుధాతువు లోపించు నని (సూత్రము చెప్పునదే యిది) వివరింపవలెనే. ముద్రణముపొరపాటునఁ బోయిన దేమో.

అట్లనుకొనుటకు వీలు లేకుండఁ బిదపఁ 'లిట్టు గాని ల్యట్టు గాని లాట్టు గాని పర మగునపు డిట్టియాదేశము కలుగదు' (326) అన్నది బా.వి. అస లిట నాదేశ మేది? ఉన్న యనుబంధ మయి యుండు లోపించు ననియే పూర్వవాక్యమున భావించియున్న నీవాక్యమున కిటఁ బ్రసక్తియే లేదు. ఉదంతంబునకు లట్టు పరం బగునపుడే గదా యున్నానుబంధ మగును. కాన నది లిట్టు ల్యట్టు లాట్టు (ఇతర కారము లెవి యేని) పర మైన రానిమాట నిజమే కాని అది యనుబంధము కాని యాదేశము కాదు గదా ఇట నాదేశప్రస్తావనమునుబట్టి యీసూత్రముచే నుండుధాతువున కున్న యాదేశ మగు నని బా.వి. భావించె ననుట కవకాశము గల్గుచున్నది. (అట్లు గాక యున్నానుబంధమే యాదేశ మన్నను పొరపాటే కాని యనుబంధమునే బా.వి. యిట నుద్దేశించిన దనుట కాధారము గానరాదు.

ఉన్నవాఁడు :

సూరి యీసూత్రముకిడనె యున్నవాఁ డనియుఁ జూపెను. కీని వివరించుచు బా.వి. 'ఉన్నవాఁడు-తృవర్ణకార్థము 44 ఉన్నాఁడు (117) అన్నది. (326) అనఁగా నున్నవాఁ డన్నది తద్ధర్మార్థకవిశేషణ మన్నమాట. అది యసంగతము. 44 సూత్రము తృవర్ణకార్థమునం బడిరాదు వన్నియలను జెప్పుచున్నది. (కాని ఉన్నను జెప్పుట

లేదు. అది పరము గాఁగా నుండుధాతువు లోపించె ననుటకు) దాని ననుసరించి యున్న పరకత లేమి నుండుధాతు వట్ల యుండు. ఉండెడువాఁడు, ఉండెడివాఁడు (ఉండువాఁడు) అనియె యగును గాని యున్నవాఁ డని కాదు. ఉన్నవాఁ డన్నది తద్ధర్మార్థకము గాదు. ఇది భవచ్ఛత్రర్థకము. 'ఉన్న కలజీ నవర్ణకంబులు భవద్భావిశత్రృక్త వదర్థంబులం దగు ననుట 46 సూత్రముచే నున్న ప్రత్యయ మగును. ఉన్నశబ్ద మనుసామాన్యనిర్దేశముచేఁ బ్రత్యయానుబంధములు రెం డును గ్రహింపఁబడు ననియుఁ గావున నున్నప్రత్యయము పర మైనను నుండుధాతువు లోపించు నని సూరి సూత్రాభిప్రాయము స్పష్టమె. ఉన్నవాఁడు, ఉన్నాఁడు అనునది బా.వి. 117 సూత్రముచే నవు నన్నది. ఉన్నకలజీనవర్ణకంబులమీఁది అనునాసూత్రమునుబట్టి యైన నిది త్రర్థకముగా నని గుర్తింప దాయె.

ఉన్నశబ్ద మనుటలో నభిప్రాయ మట్లు వివరింపకుంటం జేసియు నీసూత్రముచే నుండుధాతువున కున్నాదేశము గల్గు నని బా.వి. ఎంచిన దేమో యనిపించు. అట్లయ్యెఁ బూర్వవర్ణకార్థమున నున్నాదేశ మగుట యెట్లో వివరింపకపోవుట విచార్యమే. సూత్రము నర్థము విషయమున భ్రాంతిపడుట కవకాశము లేదు. బా.వి. సూత్రమును సరిగా గనుసింపకపోవుటయే పొరపాటునకుఁ గారణ మనవచ్చును.

## కొండు :

కో + డుక్ అనియుండ మజ్ఝు పరం బగునపుడు దీర్ఘంబునకు హ్రస్వం బగు ననుసూత్రముచే హ్రస్వము రాఁగా, కొ + డుక్ అని యగును. ఇట బా.వి. 'ఆదిహ్రస్వము పైనున్నఖండబిందు వుండును. అది పూర్ణబిందు వగును' ఇట్లు కొండు అనురూపము సిద్ధించును (సూ.4) (కొనుఁడు - కోఁడు, కోఁడు, కొఁడు, కొండు అని యింతకు ముందు

చూపినవి) అన్నది. దీనినిబట్టి యిట ఖండమునకుఁ బూర్ణము వచ్చు నని యభిప్రాయ మగుచున్నది. కాని యది యసంగతము. కో + డు (క్) అని యుండ డు(జ్ఞు) జిత్తు గావున దుపర్ణము బిందుపూర్వకము గావలె. బిందుసామాన్యవిధానము చేత ఖండబిందువును రావలసి యుండ అఁటఇఁక సూత్రముచే ఖండబిందువు వారింపఁబడినది. కావునఁ బూర్ణబిందువే వచ్చును. అంతే కాని ఖండము చేసి అది యుండనాదు గాన దానికిఁ బూర్ణము వచ్చు ననుట సక్రమము గాదు.

## వర్తిలు :

సూరి రంజాదులపైని నబిందుక మగునించుక్ కారమునకు ద్విరుక్తలకారము విధించియుండెను. ఇట బా.వి. 'తత్రోభయో ర్భవే దేకో లకార ఇతి కేచన - వాటిలి వర్తిలు భాసిలు మున్నగునవి అక్కటాదులజడ్డకు లోపంబు విభాష నగు, అనుసూత్రమునకు చూపిన పెక్కుమాటలలో నిట్టిదానిని గూడ చూపిన బా గుండెడి (336) (తె.వ్యా.వి. 459) దన్నది. అక్కటాదు లన్నియు నాచ్ఛిక శబ్దములే. ద్విరుక్తలకార మగునని సంస్కృతధాతువులే యధికము గను నేమో. వానియందు జడ్డలోపము చేయుట కాసూత్ర మెట్లుపయోగించును? అక్కటాదులలో సంస్కృతసమములను జేర్చు నుద్దేశము సూరికే యున్న యెడల మునుపు యిత్యాదుల నందుఁ జేర్చెడివాఁడు. వానికి ద్విరుక్తి విభాషను విధింపవలసినయవసర ముండెడిది గాదు గదా. ఆచ్ఛికములకే యన నున్నను నచో్చ నాయా ఉదాహరణము లాచ్ఛికములకే చెందినవి.

## రంజించు :

ఇంచుక్ ప్రేరణార్థమునందు ఆదేశ మైనది. కావున ఇంచలి బిందుపూర్వకచకారమునకు ద్విత్వలకారాదేశము కల్గదు (47 ఠ)

అన్నది బా.వి. ఇంచుక్కగు నని యుంచుకున్న ప్రేరణమునందును గిత్త్వయినవ్యాగమముగనే చెప్పెను గదా. సంస్కృతంబున కంగలాదుల కించుక్కగు ననుచో నించుక్క ఆగమ మైన నిట నట్లే యుంచుక్కన నాదేశ మగు టెట్లు! ఇంచుక్క ఆదేశ మగుటవలన ద్విత్వ లకారము రా దన్న నాగమముగా నచ్చిన నగునా? అయిన నిది నిజమున కాగమమే కావున ద్విత్వలకారము రాకతప్పదు. 'రంజాదులయించుక్ప్రకారంబున కప్రేరణంబున ద్విరుక్తలకారం బగు' నని సూరి విస్పష్టముగా నప్రేరణంబున నని చెప్పెనే. కావునఁ బ్రేరణార్థమునం దాగమమె యైనను ద్విరుక్తలకారము రానేరదు. బా.వి. వివరణమార్గము ననుసరించి యిది యాదేశ మనియుఁ దన్మూలమున ద్విరుక్తలకారము రా దనియుఁ జెప్పుచో సూత్రమునందు 'అప్రేరణంబున' ననుట వ్యర్థమే కదా. అయినను ప్రేరణమునను నించుక్క ఆగమ మగుటను గుర్తింపవలెను.

రంజాదులకుఁ బ్రేరణరూపములు కేవలధాతువునుండియో (యనఁగా స్వార్థమునందించుక్క చేయకయే యని యర్థము) సాధింపవచ్చు నని గ్రహింపనగు (338) నని బా.వి. తెలుపుట చారిత్రక దృష్టితోఁ గావచ్చును.

వచింపించు, పచింపించు లట్లు రంజింపించు రంజిల్లించు అను రీతి రూపములు రంజాదులకుఁ గల వన్నది (338) బా.వి. ఇట్టి రూపము లసాధువులు, అట్టి ప్రయోగములు ప్రసక్తించిన బా గుండెడిది. కేవలము కల వన్న నెట్లు?

## అనిపించు

'అను + ఇంచు. అనుపు (78) + ఇంచు (70) అనుపించు (85) అనిపించు (339) అని బా.వి. పుగాగమము చేయక

ముందె ఇంచుక్కును చూపియు పిదప పుగాగమానంతరము ఇంచు క్కుగుసూత్రమును నిర్దేశించినది. అంతకుముందుఁ గూడ 78 చే పుగాగమును. 70 చే ఇంచుగాగమమునకు ప్రాప్తి. (339) అని ఇంచుక్కునకు ముందె పుగాగమమును ప్రస్తావించినది. 78 సూత్రమందలిబహుళ శబ్దముచే చుగాగమమున కప్రవృత్తి. కాఁగా సర్వంబునకుం బ్రేరణాంబునం దించు క్కుగు అను 70. సూ.చే ఇంచుక్కు రాఁగా ఇప్పుడిం చుక్పరకత గలదు గావున అన్వాదుల కించుక్కు పరం బగునప్పుడు పుగాగమం బగు-అను 78 సూ.చే పుగాగమ మగును. కావున అను - 70. అను + ఇంచు, 78. అనుపు + ఇంచు అనురీతిని ఇంచుగాగమ సూత్రమును బుగాగమమునకుముందే ప్రస్తావింపవలెను.

ఇట్లే బా.వి. మాను-మానుపు + ఇంచు-మానిపించు-అని చూపుటలోను ప్రమాదపడినట్లు తోఁచును. కాకున్న మానుచు, మానిపించు, మానించు అనువానితోపాటు మానుపు చూపవలెఁ గదా. మానిపించు మానించు అనువానిఁ జూపిన బా.వి. మానునకు పుగాగమము విభాష యని చెప్పనక్కరయా. 78. సూత్రము నిట స్మరింపనే లేదు. పువర్ణకము ప్రేరణార్థకము. అది వేఱు గదా.

**ఇ-చుక్పుక్పుక్కులు :**

సూరి వీని నాగమము లనుటంగూర్చి బా.వి. ఇట్లు నిర్ణయించినది. 'నిజమునకు ప్రేరణార్థమునందు వచ్చుఇంచు, చు, పులు ప్రత్యయములే. ప్రత్యయముపై ప్రత్యయము చేరరా దనుఆగ్రహము కలవా రగుటచే కానోపు వీనిని ఆగమములుగా వ్యాకర్తలు నిరూపించిరి. ఆధునికు లొకేయర్థమందు ఒకటిరెండుప్రత్యయములు చేరిన పునరుక్తప్రత్యయము లందురు. (346 481) ప్రత్యయముపైఁ బ్రత్యయము చేరరా దని సామాన్యముగాఁ జెప్పరాదు. వండితివి

అనుచో తివర్ణము వర్ణకమె. 'వి' వర్ణకమె. చింతామణిలో వండుదుపు అనుచో దుపువర్ణములు ప్రత్యయములే. ప్రత్యయముపైఁ బ్రత్యయ మనుచో నొకయర్థమున నొకప్రత్యయము రావలెను నదే యర్థమున నా ప్రత్యయముపై నింకొకటి రాదని యభిప్రాయము గావలెను. ఆధునికులమతమున (ఒకటి ?) రెండైన పునరుక్తప్రత్యయము లగు ననుటలో నాయభిప్రాయము స్పష్టము. అయినఁ జారిత్రకులదృష్టి కంటె లాక్షణికులసంప్రదాయము భిన్నము గాన నట్లు చెప్పక తప్పదు.

అన్నంతక్రియ చేయు యోగమునఁ బ్రేరణార్థక మవుటను ప్రౌఢవ్యాకరణము చెప్పినది. దీనిని జిన్నయసూరి నిరూపింపలే దన్నది బా.వి. (469) సూరి బాలవ్యాకరణమునం దీయంశము చెప్పలేదు. కాని యాంతకుముందటివ్యాకరణములలో నింతకంటెను విశేషముగా స్పష్టము చేసెను. ణ్యర్థంబునం దుమర్థంబుతోఁ జేయు క్రియ వాడంబడు. చను ప్రభృతులకు నిత్యంబు (ఆం.శ.శా క్రియా 76.శ.ల.సం. 4-113-114) చనునకుఁ (చను) బ్రేరణమునం దిం చన్చ చ్చుకుల నేదియు రాదు చనఁజేయు అనవలసినదే. ఈవిశేషము సూరి స్పష్టము చేసె.

**చెఱుపు - పఱుచు :**

చెడునకుం జుక్కాగాగమంబులును డాకలఘురేఫంబు నగు, పడునకుం జుక్కయు డాకలఘురేఫంబు నగు నను81,82సూత్రములను 'చెడుపడులకు చుక్కాగాగమంబులును డాకలఘురేఫం బగు' నని యొకేసూత్రముగానే రచింపవచ్చు నన్నది బా.వి. (345) 'అలఘురేఫంబును' అనుచోటిచార్థకమును బా.వి. తొలఁగించినది. ఉండుట యుచితము. అది తొలఁగింపవలె ననుట తదుద్దిష్టమును గాక పోవచ్చును.

ఇంక నీ రెంటిని గలుపుటకు వీలు లేదు. చెడునకుఁ జుక్కలు రెండును వచ్చుచుండఁ బడునకుఁ జుక్కొక్కటియే గదా యవునది? బా.వి. సంస్కరణము ననుసరించి చెడుతోపాటు పడునకును బుగాగమము నియతము రావలె నటు సనుమాన మున్నదా? పడునకుఁ జుక్కొక్కటే యవుటకు బా.వి. సంస్కరణములో నవకాశమే లేదు గదా. పడునకుఁ బుగాగమము లే దని గుర్తించిన దీనిని గలిపి యొకేసూత్రముగాఁ జెప్పవచ్చు నని (చెప్పిన లాఘవము గల్గు నని) యభిప్రాయపడెడిది కా దనవచ్చును.

**ప్రేరణేంచుక్పరకపత్వము :**

ప్రేరణేంచుక్కు పరం బగునపుడు పకారంబు చకారంబున కగు ననుసూత్రము పత్వము నిత్యముగనే చెప్పుచుండ హెచ్చునకు లేమి మెచ్చునకు వైభాషిక మగుట సూరి వివరించె. దీని నుద్దేశించి బా.వి. ఇట బహుళసంజ్ఞ గాని తెలుచు అని గాని యేల యుపయోగింపలేదో (349) యన్నది. పత్వము దాదాపు నియతముగనే యగుచున్నది. మెచ్చునకుం దప్ప మఱి యెచ్చటను వైభాషిక మగుట సూరిసమ్మతము గాదు. కావున బహుళ మనకుంట యుక్తమే. కాని తెలుచనియు ననలేదు. ఇతరత్ర నెల్లయెడల నీపత్వము నిత్యమే కానీ యొండు రెంటికై తెలుచన నేల? యని యెంచెనా? కాని యిట్టిదె యనఁదగిన 89. సూత్రమునందుఁ బ్రాయికశబ్దము నుపయోగించెనే?

**పిలవఁడు :**

పిలుచు + లజీ = పిలవఁడు పిలవరు పిలవదు పిలవవు మున్నగునవి. (349) అను బా.వి. వివరణమునఁ బిలవఁడు ఇత్యాదిగా లకారముపై అత్వ ముండుట ప్రామాదికము. లజీ జీ త్తయినను

నది ఉవర్ణమునకుఁ బరముగా లేదు. కావున నం ధత్వము రాదు. పిదప బా.వి. 'పిలువఁడు' ఇత్యాదిగాఁ జూపుటచే (350) పైని అనేకస్థలములం దున్నను అత్వ మచ్చుపొరపా టనుకొందము.

**ఆ యె ను :**

అగుపోవులకడ్రూపాల కిద్వక్రంబులు పరంబు లగునపుడు యకారం బగు ననుసూత్రమును వివరించుచు బా.వి. 'అగునకు ఇత్తు, పోవునకు ఇద్వక్రములు పర మగునపుడు కడ్రూపాలకు యకార మాదేశ మగును' (357) అన్నది. సూరి యిటుఁ జూపినలక్ష్యములనుబట్టి బా.వి. ఇట్లు పొరపడిన దేమో కాని యది సరి కాదు. ఇద్వక్రములు పర మగునప్పు డనుచుండ నగున కిత్తు పర మగునప్పుడే యగు ననుటెట్లు? యథాక్రమముగ నన్వయించుచో అగున కిత్తు పర మగునపుడే యగును గాని యానుసను బోవునకు వక్రము పర మగునపుడు మాత్రమే కావలె. కాని బా.వి. పోవున కిద్వక్రములు పర మవునప్పు డగు నని రెంటిని జేర్కొన్న దేమి? అట్టియన్వయము వివక్షితము గానపుడు పోవునకువలె నగునకు నయితే మిద్వక్రముల నేపి పర మైన రావలెను. వక్రపరకతాయో యసంభవ మైనఁ వప్పుఁ దత్పర కిత్వమున యకారప్రాప్తికి లక్షణమునం దవకాశము స్పష్టము. వక్రపరకత గలదు. అప్పు డగు'గు'నకు యకారము వచ్చు ననియే సూరి యభిప్రాయము గమనార్హము.

అగునకు వక్రంబు గూడుచో దీర్ఘం బగు ననుసూత్రము నొద్ద బా.వి. 'అగు + ఎను – ఆయెను' (357) అన్నది. వక్రపరకతలో దీర్ఘము నిటుఁ బ్రారంభించుటచేఁ బైసూత్రము కడ్రూపాయికి యకారమును వక్రపరకతలోఁ జెప్ప దని యెంచిన దేమో బా.వి. కాని అగు+ఎను అనుచో దీర్ఘము దేనికిఁ జేయవలె? దీర్ఘము

స్వరమునకు. అంత్యస్వరమునకు. అగా యెను అని కావలదా? అగు+ ఎను ఆయెను గావలె నన్న అగునకు సర్వంబునకు 'ఆ' కావలె. ఇచ్చునకు సర్వంబున కీయగు నన్నట్లుగా నిచట సర్వంబున కా అన్నాఁడా? ఇచ్చునకు దీర్ఘం బగు నన్న నట సరిపోవునా? అగునకు మొత్తమునకే దీర్ఘము చేయవలె నన్న నెట్టిది? ఆదీర్ఘమా? ఊదీర్ఘమా? ఆ యగు నని స్పష్టముగా నిర్ణయింపవలదా? అట్లయ్యె ఆ + ఎను అనుచో నపదాదిస్వరపరకసంధి తప్పదు. 'ఎను' అనియె మిగులును. కాన దీర్ఘ (ఆ) విధానసామర్థ్యముచే సంధి రాదనవలె. వక్రంబు గూడుచో నన్నాఁడు సూరి. సంధి చేయకున్న కూడిక యెట్లు? వక్రంబు పరం బగునప్పు డన లేదే.

ఏమైనను బా.వి. వివరణానుసారముగా సూరిలక్షణములచే ఆయెను అనురీతి రూపము లయ్యెడునవకాశము లే దని మాత్రము గుర్తింపవలసియున్నది.

కాని బా.వి పిదప అయి + ఎను (267) అని భూతార్థమునఁ బ్రథమపురుషైకవచనమున నిగాగమము చేసి యకారము చేసినది. ఇట నిత్వరకత యున్నది గాన యకార మైన దని బా.వి. ప్రస్తుతవివరణమున కనుగుణముగ సమన్వయింపవచ్చు. కాని అగు+ ఎదు(ను)ఎడి(ని), అనురీతిగా నుండఁగాఁ దద్ధర్మార్థమున (తృవర్ణకార్థక పరకతలోను) నిగాగమము రాదు గదా. ఆయెడును, అయ్యెడిని, అయ్యెడివాఁ డిత్యాదుల యకార మెట్లు?

వక్రము పర మగునప్పుడు పోవునందువలె అగుధాతువునను దుదిద్రావాయికి యకారము రాఁగా అయ్+ఎడును అని యగును. అ+యెడును అనురీతిగా నగుధాతువు వక్రముతోఁ గూడునపుడు దీర్ఘ మగును. దీర్ఘము స్వరమునకే గదా. అగు అనునది అయ్ అను

రూపము నందుఁగా నం దున్న స్వర మత్తే గావున దానికే దీర్ఘ మగును. ఆయెడను అని యగును. కావున అగుపోవులు రెంటికిని దద్విక్రమములు రెంట నేది పర మైనను (పుగుః కు) యకార మగు నని గ్రహింపఁదగును.

వక్రపరకతలోఁ దానిద్రావాయికి నగుటయే కాక (యావ క్రముతోఁ గూడికవలన) దీర్ఘ మగుట యనువిశేషమును గలదు. (యకారముతో) దీర్ఘము నగుస్థలమున నుదాహరించుచు యకారము విధించుస్థలమున వక్రపరక మగునగుధాతువును జూపలేదు. అంతమాత్ర మున వక్రపరకతలో నగు 'గు' నకు యకారము లే దని తలఁపరాదు.

## అయి - ఐ, అవు - ఔ :

అచ్చికంబులం దంయువులకు వక్రతమంబులు బహుళంబుగా నగు నని సూత్రము. ఇట బా.వి. 'వక్రతమము లగు ఐఔలు సంధ్య క్షరములు. అనేకా(ల్లు)లు గా పరిగణింపఁబడి అనేకాల్ శిత్ సర్వస్య- అయికి-ఐ అవునకు-ఔ-ఆదేశ మొనర్చెను. ఇవి యనేకాల్ గాకున్న ఐఔలు ధాతువుయొక్క అంతమునఁ జేరవలసియుండు (౨౫౯)నన్నది. ఐఔలు అనేకాల్లు లను టెట్లు? 'ఐఔచ్' అనుమాహేశ్వరసూత్రము ననుసరించి యల్పత్వావ్యవహారమున గ్రహింపఁబడి యల్లు లవుచున్నవి. అనఁగా ఐ, అనునదియు ఔ అనునదియు నేకాల్లులే.

సర్వాదేశ మని చెప్పకున్న ధాతువునంతమునందుఁ జేర వలయు ననుటయుఁ బొసఁగదు. అంతమునందుఁ జేరు ననఁగా నాగమ మనిపించు నవకాశ మున్నను నంత్య మగువర్ణమున కాదేశ మగు నని యభిప్రాయము గావలె. అయినను ధాతువునంతమం దనుట పొసఁ గదు. అయిదు ఐదు అయి యనునది ధాతు వగునా? అయిదు ఇత్యాది సూరియుదాహృతు లేమి కావలె? 'క్రియావివ యేతరప్రస్తా

వనము' బా.వి. కూడ స్పష్టము చేసె. అయి-ఐ-అన్నవి ఇంతకు ముందే యుదాహరించినను (బా.వి. ౬59) యవి సిద్ధించున దీసూత్రము చేతనె. అట్టియపుడు ధాతువుచివర రావలె ననుటెట్లు?

ఇయఁకు నామాంతంబున కేత్వం బనుచో 'ఇయ'కు నెత్వ మయినది. ఇట 'నయి యవు' అను భాగములు ఆచ్ఛికశబ్దములం దంతే మందే కాక యెట నున్నను ఐఔలు రావలె. కావున ధాతువులు ప్రాతిపదికలందే కాదు, పదములను గల్గును. అయి-ఐ. కావుననిట నామాంతమున కనలేను. అయ్యు ఆచ్ఛికశబ్దములందు అయి అవు అను భాగము లెచ్చట నున్న నట నాభాగమునకు ఐఔ లగును.

**వండుచున్నా వయిననీవు :**

వ్యా.సం.స. అభిప్రాయమును బరామర్శించుచు తె.వ్యా.వి. 'బా.వ్యా. క్రియ 13.14,15 లచే సాధిత మగువండుచున్నాఁడు మున్నగునవి సమాపకక్రియ లనియు. నివి విశేషణము లగు ననియు వ్యా.సం.స. అన్నది. వజ్ఝలవారిపంక్తులను తె.వ్యా.వి. సరిగా గమనించినట్లు లేదు. అట 'నియ్యవి' యనఁగా క్రియా 13,14,15 సూత్రములచే సాధింపఁబడిన వని వజ్ఝలవారియభిప్రాయము గాదు. ఉన్న కలనవర్ణకంబులమీఁదితచ్ఛబ్దవకారలోపము చెప్పినసూత్రమును వ్యాఖ్యానించుచు వజ్ఝలవారు వండుచున్నాఁ డనుకీతివాని నీవాక్యమునకు ముందు సాధించిరి. ఆక్రమమునుబట్టి యట 'నియ్యవి' యనఁగా క్రియా 117 చే సాధింపఁబడిన వండుచున్నాఁడు ఇత్యాదు లని యర్థము. అవి విశేషణము లనియు 13,14,15 లచే సాధింపఁబడినవి (వండుచున్నాఁ డనియే యగును గదా.) నవి సమాపకక్రియ లనియు నావాక్యముల కర్థము స్పష్టమే. కావున వజ్ఝలవారు సమాపకక్రియలను విశేషణము లన్నా రనుట పొసఁగదు.

ఇంకను తె. వ్యా వి. క్రియను విశేషణ మన్నఁ గల్గునిబ్బందిని ప్రస్తావించుచు 'ధన్యుఁడ వయిననీవు అన్నట్లు వండుచున్నా వయిన నీవు అనరాదు. కావున తచ్ఛబ్దవకారలోపరూపములు క్రియ లనుటయే యుచిత (765) మనుట సరిగా లేదు. ధన్యుఁడ వయిననీ వను దానిసామ్యము ననుసరించి వండుచున్నా వయిననీ వని కాక వండు చున్నావ వయిననీ వని కావలసియుండును. ఒకవర్ణ మంట యచ్చుపొరపాటున పి లున్నది.

తె.వ్యా.వి. తచ్ఛబ్దవకారలోపరూపములు క్రియ లనుట కుదురదు. క్రియారూపము లయిన 'వండుచున్నాఁ' డనుకీలినాని ప్రక్రియలోఁ దచ్ఛబ్ద (వకారము) ప్రసక్తియే లేదు. తచ్ఛబ్దవకారము లోపించుట గల వండుచున్నాఁ డిత్యాదులు విశేషణము లనవలయునే కాని, క్రియ లనుట నొప్పదు. తచ్ఛబ్దవకారలోపరూపములను ప్రస్తావించుటచే నవి విశేషణము లనుట యుచిత మని (సుబంతములు) తె.వ్యా.వి. చెప్పవలసి యున్నది.

## శబ్దపల్లవము :

ఇందలిరెం డవయవములకుఁ బూర్వోత్తరపదము లను (369) శా.వి.వ్యవహార ముచితముగా లేదు. కూరుచుండు కైకొను ఇత్యాదు లలో ఉండు, కొనుఅనుకీలిధాతువు లుత్తరపదము లన్నది. ఇతరస్థలము లిట్లు. ధాతువులను బదము లనుట యయుక్తము. పయిఁగా నుత్తరపదము పూర్వపద మనుకీలివ్యవహార మింకను విచార్యము. చొరఁబడు అగుడెంచు ఇత్యాదులు శబ్దపల్లవములు గా వనుటయు (363) నిట్లు.

## లృట్టునకు లిట్టు :

చేదర్థయోగంబున లృట్టునకు లిట్టగు ననె సూరి. ఇట బా.వి. 'రాఁగలఁ డా' యనుభవిష్యదర్థముతో నన్వయించి భూతార్థక రూపమును బొందె నన్నది. (370) అంతవఱ కుచితమే. భూతార్థక రూప మనుటచే శబ్దము లిడంత మైనను నర్థము భూతమునకుఁ జెంది నది గా దనునవకాశ మున్నది. కాని యాపిదప 'ఇట్లే రాఁగలఁడు అనుభవిష్యదర్థకక్రియ ఏని అనునవ్యయముతోఁ గలిసి వచ్చెను అని భూతార్థక మాయెను (370) అనుట సరిగా లేదు. భవిష్యదర్థమున లృట్టగును. ఈసూత్రముచే నాలృట్టునకు లిట్టు వచ్చె. లృట్స్థానిక మగులిట్టు లృడర్థకమె యగును గదా. అనఁగా ఆఋషీశ్వరుండు వచ్చెనా ఫలించుఁ గార్యముల్' అనుచో వచ్చెను (ఆ) అన్నది లిడంత మగురూపము. కాని భూతార్థకము మాత్రము గాదు. రాఁగలఁ డేని యనురీతిగా భవిష్యదర్థకమె. అర్థమును భూతమునందే యున్న లృట్టునకు లిట్టు విధింప నేల? అన లట్లు చెప్పుటకు ముందు భూతార్థ మున లృట్టెట్లగును? కా దన్న లృట్స్థానమున వచ్చినలిట్టు లృడర్థ కమే కాక లిడర్థక మగుట యెట్లు? లంకం గలకలంబు పుట్టె ననుచో సప్తమి కైనద్వితీయ సప్తమ్యర్థకము గాక కర్మార్థక మగునా? భూతార్థక మనుట సరి కాదు. భూతార్థకరూప మనుటకంటెఁ గూడ లిడంతరూప మనుట యొప్పును.

—*—

# కృదంతపరిచ్ఛేదము

'అన్యే చ బహవో దేశ్యాః వర్ణకా' యనువి.వి. కారిక ప్రకరణానుగుణముగాఁ దద్ధితములను జెప్పినది ఇటుఁ గృదంతముల నహో-చేర్చుకొనుటయు సూరి కృదంతనిరూపణమున కీకారిక యాధారముగాఁగొనుటయు నుచితమే. (బా.వి. 382, తె.వ్యా.వి. 851)

## అ ప్పా దు లు :

అప్పాదులకు నజీ యను అనుచో సూరి చూపినఅప్పాదులలో 'ఇంపలిధాతువులకు (పిచుతప్ప) స్వాతంత్ర్యము కానవచ్చుట లేదు (391) అని అప్ప మన్న, దీవ, పాట అని ధాతువులు కల్పించుకొనవలెనా? (391) యని బా.వి. అనుమానించినది. ఈయుద్దేశముతోనే కావచ్చు తె.వ్యా.వి. దీవన గడన వీనిని తద్ధితాంతము లన నగును. నా.ఆం. అన్లైంచిన దన్నది. (849) తద్ధితము నవర్ణకమా? అయిన దీవ, గడ అనుశబ్దములపైఁ జేరినదా? ఆశబ్దములు విభక్త్యంతము లై దీవ దీవను ఇత్యాదిగా నున్నవా? భావార్థమున నల్లన ఇత్యాదు లయినట్లుగా దీవన ఇత్యాదు లగు ననుటకు దీవ అనురీతి శబ్దము లున్నవా? దీవించు అనురీతిధాతువుల ననుసరించి వీనిని గృదంతములుగాఁ జెప్పుటయు యుచితము. ఇవి యాచ్ఛికము లైన ధాతువులే. సంస్కృతమున కంగలాదుల కించు క్కగు ననుసూత్రిమున సూరి యంగలాద్యాచ్ఛికధాతువులకు (స్వార్థమున నించుక్క చెప్పుచు) సూరి 'అప్ప' అన్నది చూపెను. కాన నది యాచ్ఛిక ధాతు వగుట స్పష్టమే. ఇట్టివే మన్నాదు లని గ్రహింపఁదగును. 'ఆవులించు లోనగువాని' కనుచో నించుక్కతో నిర్దేశించి యప్పాదుల కనుచో నించుక్క లేక నిర్దేశించినసామర్థ్యము ననుసరించి వీనికి స్వార్థ

మునం దగునించుక్క చేరకయె కృత్తు చేరు నని గ్రహింపఁదగును. అంగలాదులలోనియప్పాదులు నామధాతువు లన్నది బా.వి. (344) అందలికోప మట్టిదే. అప్ప పల్ల ఒప్ప అన్నవి నామధాతువు లనుట కట్టివానినుబంతరూపము లెవియేఁ జూపిన బా గుండెడిది. అప్ప అప్ప చేత ఇత్యాదు లున్నవా?

నజి జీత్తు గావున ధాతువున కత్వమును (అన్య మగుట) చకారమునకు వకారము నగును. కాన పీవు అని కల్పింపవలె ననుటయు సరి గాదు.

చూ డ్కి :

ఇకి కోర్వాదుల కగు నన్నసూరి యట 'చూడు చూచున కగు-చూడికి' యని చూపెను. దీనింగూర్చి బా.వి. 'చూచుధాతువు లూణ్మధ్యమపురుషక్రియారూపము చూడుము. ము లోపింపఁగా చూడు + ఇకి చూడికి' (392) యన్నది. ఇది యెంతయు నసంగత మైనప్రక్రియ. దుష్ఛిన్న మైనకృత్తు 'చూడుము' అనుతిఙంతముపైఁ జేరె ననుట సంప్రదాయమునకే కాక యీసూత్రవివరణములకును విరుద్ధము. ము లోపించిన దనుట కాధార మేమి? ములోప మెవరు చెప్పిరి. పైఁగా నచ్ఛరకతచే నీస్వార్థమందలిమువర్ణము లోపించుటకే పీలు లేదే. చూచుధాతువుపై 'ఇకి కోర్వాదుల కగు' నని ఇకి రాఁగా చూచు + ఇకి అని యుండును. ఈయికి ముత్తు గామింజేసి యేతత్పరకత్వమున చూచునకుఁ జూడు పూర్వోక్తవిధానముచే సిద్ధింపదు. కావుననే సూరి యిట విశేషముగాఁ 'జూడు చూచున కగు' నని చెప్పెను. ఈవివరణము ననుసరించియే చూచునకుఁ జూడు రాఁగా చూడు + ఇకి చూడికి యని యగును. అని సూరిప్రక్రియ గ్రహించుట యుచిత మై యుండఁగా లూణ్మధ్యమపురుషరూపమును

దెచ్చి ప్రక్రియను నడుపు టెలకో యర్థము గాదు. తూను తూగున కగు, వచ్చునకు రా అనుచో నాయూయచ్చులతోఁ గూడినవాల్లులు చేరుటను బా వి. ప్రస్తావించినది. (౩౮౬) ఇది యట్టిది గాదా?

గుర్తుంచుకొనుటకై కృత్ప్రత్యయములనే అకారాది క్రమములలో రచించిన బాగుండెడి దని బా.వి. ఆలోచనము విశేషమె.

**చావు - నోవు :**

'వ్రస్ఫకంబు మహ్వాదుల కగు నని వృవర్ణకము రాఁగా, చచ్చు+వు, చావు+వు అని కాఁగా 'ఇటం గృత్యాగతపవేములు పరంబు లగు నప్పుడు కగచయువలకు లోపం బగు' నని ఆదేశమందలి 'వు' లోపించి చా+వు, చావు ఇట్లే నోవు అగు నని బా.వి. (౩౯౩) ప్రక్రియను జూపినది. కాని యాదేశము చేయవలసివచ్చుట ప్రక్రియాగౌరవమే యనక తప్పదు చాక వావక యనురీతిగా నిచ్చుట నొకప్పుడును నాదేశమయిన చావులో వువర్ణము నిల్చియుండుట లేదు గదా.

అస లిటుఁ జావు అను నాదేశ మెట్లు? లాఁతిచో నహితము కాదేశాదులు కానంబడియెడి నను దాని ననుసరించి రావలయును, అట్టి యెడల నాదేశముగా వచ్చునది 'చావు' అని కాక చా (నో) అనియే గ్రహింపవచ్చును గదా. చావునోవులు చచ్చునొచ్చుల కగు ననుచోఁ జావునోవులనే విధించెను గావున లాఁతిచో ననుసూత్రముచే నవు నది నయితే మదియే కావలె నని నియమమా? లాఁతిచో ను సూత్రమునొద్ద సూరి కావు (అగు) తను, కావు (అగు)ట, అనియుఁ జూపె. ఇట నగుధాతువునకుఁ గావు అన్నది యాదేశ మనుట స్పష్టము. అంతకుముం దగున కనుకనులకు, అగువచ్చుచొచ్చు చూచులకు ననుసూత్రముల నగునకుఁ 'గా' యన్నదే యాదేశముగా విహితము. (క్రియా 77 లో కావించు అని కావాదేశము కలదు.

కాని యటఁ జెక్కుడెఱంగు లన్నాఁడే కాని యం దాయుయియాదేశములను విధింపలేదు గదా.) అనవృదును అనుచో ననున కవృగా గమమో (వృజిమో) యనవ్వాదేశమో యనవలె. కాఁగాఁ గాదేశాదు లన్నప్పటియాదిశబ్దముచేత సూత్రము లయినవే కాక ప్రయోగానుగుణముగాఁ దదితరములును గ్రహింప నవకాశము కల్పింపఁబడినది. కావున నింతకుముందు చావునోవులే విధింపఁబడిన నిట ననియే రావలె నని లేదు. తద్భిన్నములు గావచ్చు చా, నో, అనునవే యైన నందము. వులోపప్రసక్తి యుండదు 'వు' ఉన్నను లోపించుట కవకాశ మున్నదే కాని చానోలనే యాదేశములుగా గుర్తించుచో లోపప్రక్రియతోఁ బని లేమి లాఘవము గలదు గదా.

(కాయు-కాయ-కాసెను అనునది లాక్షణికము. (పూలు) పూచినవి. లాక్షణికము. కాచెను, పూసినవి యనుట లక్షణవిరుద్ధము. బా.వి. ౬౭౩)

గీఱ్వాదులు:

సూరి యిట్లనుటం గూర్చి బా.వి. 'అలఘురేఫములోని అచ్చు లోపించి మీఁదిహల్లుతోఁ గూడిన లఘురేఫం బగుట గీఱ్వాదులలో పాటింపఁబడలేదు, కారణము శబ్దస్వరూపము నిలుపుటకే. సూత్రములలో అతీతభాషాలక్షణములు పాటింపఁబడును (౬౬4) అన్నది. కాని యీసమన్వయము సరి గాదు. మాఱ్వాదులు, ఆఱ్వాదులు ఇత్యాదిగా నిట నెల్ల శకటరేఫ మల్లు యున్నది. గీఱు అనుశబ్దము సంస్కృతములోని కనుకరింపఁబడి ఆదిశబ్దముతో సమాసము చేయఁగా సంస్కృత మగుట సంస్కృతసంధికార్యమె రావలెఁ గాన యణాదేశ మయి గీఱ్వాది యని యైనది. అలఘురేఫము లుప్తాచ్క మగుచో లఘురేఫ మగుట తెలుఁగులక్షణము. సంస్కృత

రూపమధ్యమున (ననఁగా నిట సిద్ధసమాసమునఁ) దెలుగులక్షణమును బ్రవర్తింపఁజేయువలె నన్న నయ్యది విశేషముగాఁ జెప్పవలె. మన ఆనంద మనుచో యడాగమ మేల రాలే దనుప్రశ్న మున్నదా! కావున నిట్టియెడల లఘురేఫము చేయకుంటయే లక్షణానుగుణ మని గ్రహింపఁదగు. బా.వి. సామాన్యముగా సూత్రముల నిట్లతీతభాషా లక్షణము పాటింపఁబడు ననుట యుచితము గాదు. ఎట నే నట్లుండుఁ గాక. అతీతభాషాలక్షణము సూత్రములకు సామాన్య మనుట యెట్లు? సూరిసూత్రముల నెటనే నున్న దేమో కాని యీసూత్రమున మాత్ర మాయతీతలక్షణము లే దని గుర్తింపఁదగును.

**అల్లుడు :**

అల్లుఁడు - మహద్వాచకము - డుఙ్, అల్లుడు-అమహత్తు డువర్ణకము. (౩౮౫) అను బా.వి వివరణము 'కొండగుర్తుగాఁ' జెప్పఁబడినది గావచ్చు. అల్లుఁడు అనుచో అల్లు నామము, కాఁగా అల్లుడు అనుచో అల్లు ధాతువు. నామ మైన అల్లు ఎప్పుడును మహత్తే. కృదంత మగు అల్లుడు ఎప్పుడు నమహత్తె. అల్లు అనుశబ్దము మహత్తయిన డుఙ్తో అల్లుఁ డనియు నమహత్తయిన డువర్ణకముతో అల్లు డనియు నగు నని తలఁపరాదు.

**రాపిడి :**

'రాచు - రాపుడు రాపిడి అని వాడుక' (బా.వి. ౩౮౫) దీనింబట్టి రాపుడు అనుశబ్దమె రాపిడి యై వాడుకయం దున్న దని బా.వి. అభిప్రాయ మనిపించు. కాని రాచు ధాతువునకు పువర్ణకంబు మాయ్యాదుల కగు నని పువర్ణకము రాఁగా రాపు అని కాఁగా దానిపైఁ దద్ధిత మగు 'ఇడి' ప్రత్యయ మై రాపిడి యని యైనట్లు ప్రౌఢ. నిరూపించె.

—*—

